# ప్రపంచ చరిత్ర

## 12వ తరగతి

కె. బి. కె. వి. ప్రసాద్, బి. ఏ., బి. ఇడి.




కవిరాజ పబ్లిషర్సు

తెనాలి :: సికింద్రాబాదు

కాపీరైటు]     1959     [వెల : రు 3-00

# విషయసూచిక

## మొదటి భాగము



## రెండవ భాగము

## మూడవ భాగము

నేర్పరుపబడియున్నవి. నగర మధ్యభాగమున పెద్ద స్నానఘట్ట ముండెడిది. మొహెంజొదారోలోని స్నానఘట్టము 180 అడుగుల పొడవు, 108 అడుగుల వెడల్పు, 8 అడుగుల ఎత్తు గోడలు కల్గి చూపరులకు విశ్రాంతి కల్గించుచున్నది. వీనివలన వీరు శరీర శుభ్రతకు తీసికొనిన శ్రద్ధ ఎట్టిదో విశదమగును. వీరు గృహనిర్మాణమునకు పచ్చిఇటికలు, కాల్చిన ఇటికల నుపయోగించెడివారు. పట్టణములు క్రమపద్ధతిలో నొక పథకము ననుసరించి కట్టబడెడివి. సింధు ప్రజలు పట్టణ జీవితమును గడపుచు, సకల ఐశ్వర్యములతో తుల తూగుచు సౌఖ్యమయజీవితమును గడిపిరని చెప్పవచ్చును. క్రీ. పూ. 2000 ప్రాంతమున సింధు ప్రాంతము ఆర్యతెగల దండయాత్రలకు లోనై అచటి పట్టణములు నాశనమయ్యెను.

## చైనా

యాంగ్‌ట్సికియాంగ్ నదీలోయ నాగరికత :— యాంగ్‌ట్సీ నదీ ప్రాంతమైన చైనాగూడ ప్రాచీన నాగరికత గల ప్రదేశముగ పేరొందియున్నది. చైనా సారవంతమైన ప్రదేశము. తూర్పున పసిఫిక్ మహాసముద్రము, మిగత దిక్కులందు ఎత్తైన పర్వత వరుసలు, నిర్జల ఎడారులు ఈ దేశమునకు సహజ హద్దులై యున్నవి. హూణులు, ఇతర మోటుతెగలవారి దండయాత్రల నుండి రక్షించుకొనుటకై చైనాచక్రవర్తులు కట్టించిన మహాకుడ్యము Great wall of China) చీనాదేశ నాగరికత అభివృద్ధి నొందుటకు తోహద మయ్యెను. వీరి నాగరికత ప్రాచీన యుగమునకు నవీన యుగమునకు మార్పు చెందకుండుటకును ఈ సహజ సరిహద్దులే ముఖ్యకారణముగ చెప్పవచ్చును. బౌద్ధమత ప్రవేశముతో భారత, చైనా దేశముల మధ్య సంబంధబాంధవ్యము లేర్పడి ఒండొరుల నాగరికతాభివృద్ధికి తోడ్పడెను.

చైనావారు మంగోలుజాతి లక్షణములు కలవారు. వీ రెచ్చట నుండి వచ్చి యాంగ్‌ట్సి నదీతీరమున స్థిరనివాస మేర్పరచుకొనిరో చెప్పుట కష్టము. క్రీ. పూ. 2852 నుండి 2738 వరకు పాలించిన ఫూసి (Fu Hsi) చీనా మొదటి చక్రవర్తి యని చెప్పబడుచున్నాడు.

ఇతడు తన ప్రజలకు చేపలు పట్టుట, ఆలమందలను కాయుట, అక్షరములను వ్రాయుట నేర్పెనట. తరువాతి చక్రవర్తియగు షెన్ నుంగ్ (Shen Nung) వ్యవసాయమును నేర్పెను. ఈ వంశ చక్రవర్తుల పరిపాలనలో చీనావారు తమ నాగరికతాభివృద్ధి గావించుకొనినట్లు చెప్పుకొందురు. క్రీ. పూ. 2205 నుండి 1766 వరకు సియా (Hsia) రాజవంశము పరిపాలించెను. ఈ వంశమును త్రోసిరాజని షాంగ్ వంశము (Shang) క్రీ. పూ. 1766 నుండి 1122 వరకు పరిపాలించెను. ఈ వంశ పరిపాలన అంతమగు నప్పటికి చీనావారు చక్కని సాంఘిక వ్యవస్థను, ఆదర్శప్రాయమైన ధర్మ సూత్రములను, సౌఖ్యమయ జీవితమున కవసరమగు సకల విద్యలను నేర్చియుండిరనుట నిక్కము. రాతితో నిర్మింపబడిన కొడవళ్ళు, నాగళ్ళతోపాటు రాగి, కంచులతో జేసిన ఆయుధములు, పనిముట్లు వాడుచుండెడివారు.

వువాంగ్ (Wue wang) అను ప్రజ్ఞాశాలి క్రీ. పూ. 1122 లో చౌ (Chow) వంశస్థాపకుడై తన అసాధారణ ప్రతిభతో దేశమున అనేక సంస్కరణలను జేసెను. విద్యావ్యాప్తికై పాఠశాలల స్థాపించెను. వయోవృద్ధుల రక్షణకు తగిన యేర్పాట్లు గావించెను. ఈ వంశపు కడపటిరాజు లసమర్థులగుటచే దేశము చిన్నాభిన్నమై అనేక వేల చిన్నచిన్న భూస్వామిక మండలము లేర్పడెను. తుదకు క్రీ. పూ. 256 లో చిన్ వంశీకుడగు షిహ్వాంగ్ టి (Shih Huang Ti) చీనా నంతను ఏకముజేసి చక్రవర్తి బిరుదమును ధరించెను. ఇతని పది సంవత్సరముల పరిపాలనాకాలములోనే అనేక సంస్కరణలు గావించి సమర్థుడని పేర్గాంచెను. మహాకుడ్య నిర్మాణమును పూర్తి గావిం హూణుల దండయాత్రల నరికట్టెను. భూస్వాముల అధికారము నంతమొందించెను. ఇతడు మహాతత్వవేత్తయగు కన్ ఫ్యూషియస్ రచించిన గ్రంథములను తగులబెట్టించి సనాతన మతధర్మముల పున రుద్ధరణకు పాటుబడెనని చెప్పబడుచున్నది. తన వంశనామమైన చిన్ శబ్దమును దేశనామముగ జేసెను. నాటినుండియె ఇది చీన యని పిలువబడుచున్నది.

క్రీ. పూ. 202 లో ఒక సామాన్య రైతు కుటుంబమునకు చెందిన లియోషాంగ్ (Liu Pang) హాన్ వంశమును స్థాపించెను.

ఈ వంశరాజులలో నొకడు భారతదేశము నేలిన కుషాను వంశీయుల నుండి కప్పము వసూలు జేసెను. వీరి కాలముననే బౌద్ధమతము చైనాయందు ప్రవేశపెట్టబడినది. మధ్యఆసియా, ఇండియా, రోమను సామ్రాజ్యములతో వర్తక వ్యాపారములు ప్రారంభింపబడెను. సాహిత్యము, లలితకళలు వికాసము చెందెను.

హాన్ వంశపాలన క్రీ. శ. 200 ప్రాంతమున అంతరించెను. పిదప రెండు శతాబ్దముల కాలము దేశమున ఏకచ్ఛత్రాధిపత్యము లేక అరాచకమయ్యెను. రాజ్యము మూడు భాగములయ్యెను. ఉత్తర ప్రాంతమున వై (Wei) వంశము, మధ్య చైనాను యూ (Wu) వంశము, దక్షిణచైనాను షూ (Shu) వంశము సుమారు నాలుగు శతాబ్దముల కాలము పరిపాలించెను. వీరు ఒండొరులతో కలహించుచుండెడి వారు. వీరి బలహీనత నాధారముగ జేసికొని అనేక అనాగరిక తెగలు ఉత్తర చైనాపై దండయాత్రలు జరిపి అట స్థిరనివాస మేర్పరచుకొనెను. దేశ మిట్లు అరాచకముగ నున్నను బౌద్ధమతము చైనాలో ప్రముఖ స్థాన మేర్పరచుకొనెను. అనేక మఠములు స్థాపింపబడెను. చీనా యాత్రికులు భారతదేశములోని బౌద్ధపుణ్యక్షేత్రములను దర్శింప వచ్చిరి. వీరిలో ఫాహియాన్ ముఖ్యుడు. ఈ యుగమున చీనా సాహిత్యకళలయందు బౌద్ధమత ప్రభావము మిక్కిలి ప్రస్ఫుటముగ కనబడుచున్నది. క్రీ. శ. 589 నుండి 618 వరకు పాలించిన షూ వంశమువారు చీనాయందు మరల ఏకచ్ఛత్రాధిపత్యము నెలకొల్పిరి. ఈ వంశ అనంతరము వచ్చిన టాంగ్ (T'ang) వంశపాలనా ప్రారంభముతో చీనాచరిత్రయందు ప్రాచీనయుగాంత మైనదని చెప్పవచ్చును.

చౌ, చిన్ వంశముల పాలనాకాలమునందు చీనాదేశమున లోవ్‌జూ (Laotse), కన్‌ఫ్యూషియస్ (Confusiees) అను మహాజ్ఞానులుద యించిరి. లోవ్‌జూ టోఇజము (Toism) ను ప్రబోధించెను. మానవుని నీతివర్తనమే ముఖ్యమని చాటెను. కన్‌ఫ్యూషియస్ రాజనీతి, న్యాయవర్తనము, పెద్దలయెడ గౌరవభావము మొదలగు అంశము లను గూర్చి ప్రచారము గావించెను. ఇతడు ప్రాచీన చీనావాఙ్మయ గ్రంథములను ప్రోగుజేసి సంపుటీకరించెను.

చీనావారు వ్యావసాయికులు. నీటిపారుదల వసతులను కల్పించుకొని వ్యవసాయము నభివృద్ధి చేసికొనిరి. హాన్ వంశ రాజుల కాలమున తేయాకు కనిపెట్టబడెను. చీనావారికి తేనీరు ముఖ్యపానీయము. బంగారము, వెండి, ఇనుము, కంచులతో వస్తువులను తయారుజేయుటయందు గొప్ప నైపుణ్యమును సంపాదించిరి. పట్టు ఉత్పత్తియందు, పట్టు వస్త్రముల నేతయందు చీనావారు గుత్తాధికారులనవచ్చును. చీనా ఎగుమతులలో పట్టు ముఖ్యస్థాన మాక్రమించి యుండెడిది. చీనాంబరములు యూరపు రాజ్యములకును సంపబడుచుండెడివి. రోమనులు చైనాను 'సిరికా' (Silk Country) అని పిలచెడివారు.

చీనావారి లిపియందు ఉచ్చారణకుగాక భావమునకు ప్రాధాన్యత యొసగబడెను. ప్రతి అక్షరము యొక్క భావమును స్ఫురింపజేయును. ఈ లిపి నాటికి నేటికి మార్పుజెందక అట్లే నిలచియున్నది. ఈ లిపి క్రీ. పూ. 1000 నాటికే సంపూర్ణత్వము నొందెను. ముద్రణను ప్రప్రథమమున కనుగొనినవారు చైనాదేశీయులు. పట్టుకాగితమును తయారుజేసి చెక్కలపై అక్షరములను చెక్కి రంగులలో ముంచి అద్దెడివారు. నౌకాయానమునకు మహోపకారిగ నున్న దిక్సూచియు చీనావారి మేధాసంపత్తికి చిహ్నమె! అతిప్రాచీన కాలమునందే వీరు తుపాకిమందును కనిపెట్టిరి. దీనిని వీరు శత్రుమారణమునకుగాక వేడుకసమయములందు బాణాసంచాగా నుపయోగించెడివారు. చీనావారు ఖగోళశాస్త్రమున పాండిత్యము గడించి చంద్రమాన సౌరమాన పంచాంగములను కనిపెట్టిరి.

చీనావారి నిర్మాణశక్తికి చీనా మహాకుడ్యము ప్రబల నిదర్శనముగ నున్నది. ఇది 2000 మైళ్ళ పొడవు, 22 అడుగుల ఎత్తు 20 అడుగుల మందము కలిగియున్నది. ప్రతి నూరుగజముల కొక 40 అడుగుల బురుజు నిర్మింపబడెను. ఈజిప్టు పిరమిడ్లవలెనె చీనా మహాకుడ్యము ప్రపంచ వింతలలో నొకటిగ నున్నది. వీరి మృణ్మయ, పింగాణీపాత్రలు, విగ్రహములు గొప్ప పనితనమున జూపుచున్నవి. రాజుల, ధనికుల గోరీలలో ఇట్టి మనోహర శిలములు, వస్తువు లెన్నియో బయల్పడెను.

# 3. సముద్రతీర నాగరికతలు

## సి రి యా

ఫినీషియనులు:— ఉత్తరసిరియాయందు మధ్యధరా సముద్ర తీరమునకు పర్వతప్రదేశమునకు మధ్యనున్న సన్నని తీరమైదానమున ఫినీషియనులను నొక సెమిటిక్ తెగవారు స్థిరనివాస మేర్పరచుకొనిరి. వీరు అనేక నగరరాజ్యములను స్థాపించిరి. ఇందు టైర్, బిబ్లాస్, సిడన్, ఉగరిత్ రాజ్యములు ముఖ్యమైనవి. వీరు సముద్రయానము నందు నిపుణులు. క్రీ. పూ. 2600 నాటికే వీరి ఓడలు రేవులు ప్రఖ్యాతి నొందియుండెను. ఫినీషియనులు సామ్రాజ్య నిర్మాణము నందుగాక వర్తక వ్యాపారములందు తమదృష్టిని కేంద్రీకరించి ధన సంపన్నులైయుండెడివారు. వీరి వర్తకపు ఓడలు మధ్యధరా సముద్ర తీరప్రాంతములకేగాక పిల్లర్స్ ఆఫ్ హెర్క్యులస్ (జిబ్రాల్టరు జల సంధి)ను దాటి ఫ్రాన్సు, బ్రిటన్‌లకును పోవుచుండెడివట. ఉగరిత్ పట్టణవాసులు సముద్రముపైనేగాక భూమార్గమున గూడ వర్తకము చేయుచుండెడివారు. ఇండియా, మెసపొటేమియా, చైనా దేశ సరకులు ఫినీషియాను చేరుచుండెడివి. వీరు రాగి, తగరము, బంగారము మొదలగు ముడిసరకులను దిగుమతి జేసికొని కొయ్య సామగ్రి, లోహపనిముట్లు, టిరియన్ పర్పుల్ అను ఎఱ్ఱని రంగు అద్దిన వస్త్రములు, గాజు, మృణ్మయ పాత్రలు ఎగుమతి చేయుచుండెడివారు. వీరు అనేక ప్రదేశములలో వలసలు, వర్తక కేంద్రములు నెలకొల్పిరి. వీనిలో క్రీ.పూ. 846 ప్రాంతమున నిర్మింప బడిన కార్తేజ్ నగరము ముఖ్యమైనది.

ఫినీషియనులు వర్తకులుగనే గాక ప్రాచీన నాగరికతా ప్రచారకులుగ, (Missionaries of ancient civilisation) గూడ పేర్గాంచిరి. ఈజిప్టు, మెసపొటేమియాలలోని నాగరికతాంశములను ఫినీషి యనులు అనాగరికమైయున్న పశ్చిమ రాజ్యములకు వ్యాపింపజేసిరి.

ఫినీషియనులు తమ అక్షరమాలను (Alphabet) వలన చరితార్థులైరి. ఈజిప్షియనుల బొమ్మల లిపి, సుమేరియనుల క్యూనియ

ఫారమ్ లిపి ఆధారముగ ఫినీషియను లొక క్రొత్తలిపిని సృష్టించిరి. ఇందు 22 అక్షరములు గలవు. ఇవి స్వర ప్రధానములు. ఈ అక్షరములను వ్రాయుట కడుసులభము. ఈ అక్షర మానమును గ్రీకులు అనుకరించి అందు కొన్ని అచ్చులను కలిపిరి. గ్రీకులనుండి రోమనులు పిదప ఇతర యూరోపియను రాజ్యములవారు ఈ లిపినే అనుసరించిరి. యూరోపియను లిపులకు ఫినీషియనుల లిపి మాతృక యైనది. కాని 1924 లో బిబ్లాస్ నగర పరిశోధనల ఫలితముగ ఈ లిపి ఫినీషియనులు కనిపెట్టినది కాదని వీరికంటె ప్రాచీనులైన మరియొక తెగవారిలిపిని వీరు కొన్ని స్వల్ప మార్పులతో అనుకరించిరనియు తెలియవచ్చినది. మతవిషయములందు ఫినీషియనులు ఈజిప్షియను, సుమేరియనుల ననుకరించిరి. వీరి దేవతలలో ఎల్ (El) బాల్ (Baal) ముఖ్యులు.

## పాలస్తీనా

హీబ్రూలు :— హీబ్రూల చరిత్ర తెలిసికొనుటకు ఓల్డ్ టెస్టమెంట్ (Old Testament) ముఖ్య ఆధారముగ నున్నది. అందు హీబ్రూల ఆదిమపురుషుడు అబ్రహామ్ అని వ్రాయబడియున్నది. వీరు ఉర్ నుండి ఈజిప్టు చేరినట్లును అచట ఫారోలు వీరిని బానిసలుగ జేసినట్లును మోజెస్ వీరిని బానిసత్వమునుండి విముక్తి గావించినట్లును చెప్పబడియున్నది. ఈజిప్టునుండి బయలుదేరిన హీబ్రూలు మోజెస్ నాయకత్వమున నలుబదేండ్లు అరణ్యవాసము జేసి నానా ప్రదేశములందు తిరుగాడి పంద్రెడు తెగలుగ చీలి తుదకు పాలస్తీనా చేరినట్లు తెలియుచున్నది. వీరు పొరుగు రాజ్యములవారైన ఫిలిస్టైనుల (Philistines) తోడను, ఫినీషియనులతోడను నిరంతరము యుద్ధముల చేసియుండిరి.

హీబ్రూలు కేనన్ (పాలస్తీనా)నకు వచ్చినప్పటినుండియె వారి చరిత్ర ప్రారంభమైనదని చెప్పవచ్చును. క్రీ. పూ. 11 వ శతాబ్దమందు హీబ్రూలలోని పంద్రెండు తెగలవారు సాల్ అను రాజు పాలనలో ఏకమైరి. ఇతడు క్రీ. పూ. 1095 నుండి 1056 వరకు

పరిపాలించెను. 1056 నుండి 1017 వరకు పరిపాలించిన డేవిడ్ హీబ్రూరాజ్యమును ఎఱ్ఱసముద్రమునుండి యూఫ్రటీస్ వరకు వ్యాపింపజేసెను. జెరూసలెమ్‌ను రాజధానిగ జేసికొనెను. వాని కుమారుడగు సాలమన్ పరిపాలనాకాలమున హీబ్రూరాజ్య మత్యంత వైభవము నొందెను. జెరూసలెమ్‌లోని ఆలయనిర్మాణము నకు భారతదేశ కలప ఉపయోగింపబడెనని తెలియుచున్నది. కాని సాలమన్ పరిపాలనలో ప్రజలపై పన్నులభార మధికముగ నుండెడిది. సాలమన్ కుమారుని పరిపాలనయందు దేశమున అంతఃకలహ మేర్పడి ఇశ్రాయిల్ (Isreal) జూడా (Judah) అను రెండుభాగము లయ్యెను. క్రీ. పూ. 722 లో అసిరియనులు రాజధానియగు సమరియాను కొల్లగొట్టి ఇశ్రయిల్ నాక్రమించిరి. క్రీ. పూ. 586 లో బాబిలోనియా పాలకుడగు నెబుకడ్‌నజర్ జెరూసలెమ్‌ను నాశన మొనర్చి జూడా రాజ్యము నాక్రమించెను. హీబ్రూలను బానిసలుగా జేసి బాబిలోనియాకు తెచ్చెను.

పారశీక రాజగు సైరస్ బాబిలోనియాను జయించి బానిస లుగ నున్న హీబ్రూలను విముక్తులుగ జేసి పంపివేసెను. వారు పాలస్తీనాకు తిరిగివచ్చి తమఆలయములను బాగుచేసికొని వివిధ తెగలవారు తమలోని భేదములను మరచి ఏకమైరి. నాటినుండి వీరు యూదులు (Jews) అని పిలువబడసాగిరి.

అలెగ్జాండరు పారశీక చక్రవర్తి నోడించుటతో యూదులు గ్రీకురాజ్యపౌరులైరి. పిదప ఈజిప్టు నేలిన టాలమీలపాలన ననుభ వించిరి. తదుపరి క్రీ. పూ. 63 లో రోమను సేనానియగు పాంపే జెరూసలెమ్‌ను మూడునెలలు ముట్టడిజరిపి ఆక్రమించగల్గెను. యూదులు రోమనుసామ్రాజ్యమున వివిధభాగములకు వలసబోయిరి.

యూదులు వైజ్ఞానిక రంగమునగాని, రాజకీయ రంగమున గాని ప్రఖ్యాతి నొందియుండలేదు. కాని మతవిషయములందు వారు ప్రపంచమున కొక నూతన మార్గమును జూపిరి. నాటి ఇతర తెగల వలెనె వీరును అనేక దేవతలను పూజించెడివారు. మోజెస్ యూదు లకు ఏకేశ్వరోపాసన (Monotheism) ను ప్రబోధించెను. ఈ సృష్టి

కంతకు మూలవిరాట్టగు భగవంతు డొక్కడే ననియు, అతడు స్వర్గ ధామమునందుండి భూతలమందున్న తనబిడ్డలను ప్రేమతో పాలించు చున్నాడనియు యూదుల నమ్మకము. సినాయి పర్వతశిఖరముపై జెహోవా మోజెస్ నకు ప్రసాదించిన దేవుని పది యాజ్ఞలు (The Ten Commandments) యూదులకు ముఖ్య ధర్మసూత్రములు. ఈధర్మసూత్రములే క్రైస్తవమతమునకును మూలసూత్రములైనవి. యూదులు తాము దేవుని ప్రియతమ పుత్రుల (Chosen people) మనియు పవిత్రభూమి (Chosen Land) యగు పాలస్తీనాకు తనను తప్పక జేర్చుననియు నమ్మకము.

## ఆసియామైనరు

**హిట్టైటులు:—** ప్రస్తుత టర్కీరాజ్యమున క్రీ. పూ. 2000 సంవత్సరముల క్రితము లువియనులను నొక తెగవారు నివసించు చుండెడివారు. క్రీ. పూ. 1900 లో హిట్టైటులను ఆర్య తెగ లువియనులను పారద్రోలి ఆ ప్రాంతము నాక్రమించిరి. వీరు అసిరియ నులను పశ్చిమమునకు రాకుండ ఆపగల్గిన వీరులు. క్రీ. పూ. 1600 ప్రాంతమున హిట్టైటులు మహోన్నత దశయందుండిరి. క్రీ. పూ. 1200 నుండి ఉత్తరప్రాంత పర్వతవాసు లనేకులు దండయాత్రలు జరిపి హిట్టైటురాజ్యము నంత మొందించిరి.

హిట్టైటు నాగరికతయందు ఈజిప్టు, మెసపొటేమియాల నాగరి కతా ప్రభావము కనబడుచున్నది. వీరు వాస్తు, శిల్పములందు క్రొత్తదనమును కనబర్చిరి. వీరిరాజులు ప్రభువర్గపు సలహాలను పాటించి పరిపాలించెడివారు. రాణి ఎక్కువ అధికారమును కలిగి యుండెడిది. సింహారూఢయైన శక్తిదేవత (Sun-Goddess) ముఖ్య దేవతగ నుండెడిది. వీరు బొమ్మల లిపిని క్యూనియఫారమ్ లిపిని వాడియున్నట్లు తెలియుచున్నది. వీరి భాష యింకను పూర్తిగ పరిశోధింపబడలేదు.

హిట్టైట్లు ప్రాచ్యరాజ్యముల నాగరికతను ఈజియన్ దీవులు, వా రాజ్యముల కందజేయుటలో ప్రముఖపాత్ర వహించిరి. తమ దేశ ఘులోని ఇనుప గనులనుండి ఇనుమును వెలికిదీసి ఆయుధములు

తయారుజేసిరి. కంచు ఆయుధముల కంటె ఇనుప ఆయుధములు శ్రేష్ఠమైనవని చాటిరి. వీరు చక్కని సివిల్, క్రిమినల్ న్యాయసూత్రములను కలిగియుండెడివారు. మరణశిక్షలు చాల అరుదుగనుండి సమకాలికమైన బాబిలోనియను, అసిరియను శిక్షాస్మృతుల కంటె మిన్న యనిపించుకొనెను.

లిడియనులు :— హిటైటు సామ్రాజ్య పతనానంతరము ఆసియామైనరునందు లిడియాయను రాజ్యము స్థాపింపబడెను. దీనికి సార్డిస్ రాజధాని. పారశీకరాజగు సిరస్, లిడియనురాజగు క్రోసస్ (Croesus) నోడించి ఈ రాజ్యము నంతమొందించెను. లిడియనులు గొప్పవర్తకులు. వీరు బంగారు, వెండి నాణెములను, క్రమమైన తూనిక, కొలతపద్ధతులను ప్రవేశపెట్టియుండిరి.

## ఈజియన్ సముద్ర దీవులు

మినోవన్ నాగరికత :—ఈజియన్ సముద్రముననున్న క్రీట్ ద్వీపము ప్రాక్పశ్చిమ దేశములకు అనుసంధానముకుదిర్చి నాగరికతా వ్యాప్తికి దోహదమొనర్చెను. మినాస్ అనురాజు ఈదీవిని పాలించి యుండుటచే ఇచటి నాగరికత మినోవన్ నాగరికతయని పేర్కొనబడుచున్నది. క్రీ. పూ. 3000 నుండి 1400 సంవత్సరములవరకు ఈదీవి గొప్పనాగరికతా కేంద్రమై వెలసెను. క్రీట్‌వాసులకు ఈజిప్షియనులకు వర్తకవ్యాపార సంబంధము లెక్కువగానున్నట్లు ఈజిప్టులో లిఖితపూర్వకమైన ఆధారములు దొరకినవి. మినోవనులును బొమ్మల లిపినే వాడియుండిరి.

వి మినోవనులు క్రీ. పూ. 3000 నాటికే శిలాయుగము నధిగమించి లోహాయుగమున ప్రవేశించిరని చెప్పవచ్చును. వీరి చరిత్రను మూడు ముఖ్యభాగములుగ విభజించియున్నారు. క్రీ. పూ. 2200 వరకు వీరిచరిత్ర మినోవన్ నాగరికతా ప్రథమదశగ చిత్రింపబడినది. ఈ కాలమున ప్రజలు చిన్నచిన్న గృహములను నిర్మించుకొని గ్రామజీవనమును గడుపుచుండెడివారు. రాగి, కంచు, బంగారము వాడుకలోనికి వచ్చియుండెను. మృణ్మయపాత్రలను వర్ణచిత్రములతో అలంకరించెడివారు. విదేశవర్తకము విరివిగా సాగుచుండెడిది.

క్రీ. పూ. 2200 నుండి 1600 వరకు మినోవన్ నాగరికతా మధ్యదశగా వర్ణింపబడినది. ఈ కాలమునకు క్రీట్ ద్వీపమున ఉత్తరతీరమున నాసస్, దక్షిణతీరమున ఫీస్టస్ నగరములు వెలసెను. ఈజిప్టు, క్రీట్ సంబంధములు హెచ్చెను. రాజాంతఃపుర గోడలపై వర్ణచిత్రములు గీయబడెను. చిత్రములు వాస్తవికతను ప్రదర్శించెను. కుమ్మరి సారె (Potter's wheel) ప్రవేశపెట్టబడెను.

క్రీ. పూ. 1600 నుండి 1400 వరకు మినోవన్ నాగరికతా చరమదశగా పేర్కొనబడుచున్నది. భూకంపములవలన శిథిలమైన నగరములు పునర్నిర్మింపబడెను. వీని గోడలపై ప్రజల దైనందిన కార్యక్రమములు, ఆటలు, వేడుకలు, రాజుల విజయములు, మతవిషయములు, దేవతల చిత్రములు అతిమనోహరముగ చిత్రింపబడెను. అందు స్త్రీలును వృషభక్రీడ (Bull-fight) యందుత్సాహము జూపెడివారని తెలియుచున్నది.

మినోవనులు సింహారూఢమైన శక్తిదేవత (Mother goddess)ను పూజించెడివారు. నాగరాణి (Snake goddess) గూడ ఎక్కువగ కొలువబడెడిది. వీరికి ఎద్దు పవిత్ర జంతువు. ఎద్దు కొమ్ములు పవిత్ర చిహ్నములు.

క్రీ. పూ. 1400 ప్రాంతమున గ్రీసు నడిగడ్డనుండి మైసీనియనులు దండెత్తి వచ్చి మినోవను రాజ్యము నాక్రమించిరి. మినోవనులు సామ్రాజ్య నిర్మాతలుగగాక వర్తకులుగ ప్రసిద్ధికెక్కిరి. నాసస్ నగరము మధ్యధరా సముద్రవర్తకమార్గ కేంద్రమగుటయె అందులకు ముఖ్యకారణము.

మైసీనియన్ నాగరికత:— ఇది మినోవను గ్రీకు నాగరికతలకు అనుసంధానము కలిగించుచున్నది. మైసీనియనులు మినోవనుల నాగరికత నభివృద్ధి గావించి గ్రీకుల కందించిరి. నౌకాయానమున దిట్టలై దూరదూర ప్రదేశములతో వర్తకము సాగించిరి. వీరి అలంకరణలయందు, గృహోపకరణములకు బంగారము నెక్కువగ నుపయోగించి గొప్పపనితనమును ప్రదర్శించిరి. క్రీ. పూ. 1100 నాటికి మైసీనియన్ రాజ్యము డోరియన్ జాతివారి కైవశమయ్యెను.

## అ ధ్యా య ము 2

# ప్రాచీన భారతీయ మతములు

## 1. వైదిక మతము

ఆర్యులు :— ఇండో - యూరోపియను జాతికి చెందిన యొక తెగవారు హిందూకుష్ పర్వతములను దాటి క్రీ. పూ. 3000 ప్రాంతమున భారత దేశమును ప్రవేశించిరి. వీరు ప్రథమమున సప్తసింధు లోయలో వలసలేర్పరచుకొనిరి. అచటి దేశీయుల నోడించి తరిమి వేసిరి. పిదప కురుక్షేత్రము వరకు నాక్రమించి దానిని బ్రహ్మావర్త మని పిలచిరి. గంగాయమునల మధ్యభాగము నాక్రమించి బ్రహ్మర్షి దేశమని పేరిడిరి. ప్రయాగవరకు తమరాజ్యమును పెంచి దానిని మధ్యదేశ మనిరి. తుదకు హిమాలయములనుండి దక్షిణమున వింధ్య పర్వతముల వరకు, పూర్వ సముద్రమునుండి పశ్చిమ సముద్రము వరకు గల రాజ్యమును తమ కైవసము జేసికొనిరి. అది ఆర్యావర్త మనుపేర ప్రసిద్ధికెక్కెను. వీరు అనేక చిన్న చిన్న రాజ్యములను స్థాపించి పరిపాలింపసాగిరి. ఈ ఆర్య రాజ్యములందు నిరంతరము యుద్ధములు జరుగుచుండెడివి. వీరొండొరులతో కలహించుటేగాక ద్రావిడులతో గూడ పోరాడుచుండెడివారు.

వేదకాలము :—ఆర్యుల రాజకీయ, సాంఘిక, మతవిషయము లను తెలిసికొనుటకు వేదములు, ఇతిహాసములు ముఖ్యఆధార గ్రంథములు. వేదములు నాలుగు - ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము. ఇందు ఋగ్వేదము అతిప్రాచీనమైనది. క్రీ. పూ. 3000 నాడు వ్రాయబడినది. ఇందు 1017 ఋక్కులు (ప్రార్థనలు) గలవు. యజుర్వేదమునందు యజ్ఞయాగాది క్రతువులకు సంబంధించిన నిబంధనలు గలవు. సామవేదము దేవతాస్తోత్రములను, అథర్వణవేదము ప్రపంచసుఖములను పొందుట కవసరమగు కర్మలను తెలుపుచున్నవి. ఈ గ్రంథములు సంస్కృతభాషలో లిఖింపబడినవి.

ఆర్యులు ప్రకృతిదేవతలైన సూర్యుడు, చంద్రుడు, ఇంద్రుడు, వరుణుడు, అగ్ని మొదలగువారిని పూజించెడివారు. వారికి ప్రీతి కల్గించి ప్రసన్నులను గావించుకొనుటకై మంత్రములద్వారా ప్రార్థించి, యజ్ఞము లొనరించి బలులను సమర్పించెడివారు. సోమ, సురలను మత్తు పానీయములను త్రాగెడివారు.

ఋగ్వేదకాలమునకు ఆర్యులు గ్రామీణ జీవితమును గడుపుచు పశుకాపరులుగ, వ్యావసాయికులుగ నుండెడివారు. ఆర్యసంఘము నందు కులవిభాగమేర్పడి యుండెనుగాని అంతకఠినముగ నుండెడిది గాదు. ఒకవర్ణమునుండి మరియొక వర్ణమునకు మారుటయు జరుగు చుండెడిది.

యజుర్వేదకాలమునకు ప్రకృతి పూజల ప్రాముఖ్యత తగ్గి యజ్ఞయాగాది క్రతువులు హెచ్చెను. వీనిని చేయించుటకు అనుభవ శాలురైన పూజారులు బయలుదేరిరి. సంఘమున బ్రాహ్మణుల ఆధిక్యత హెచ్చెను. యజ్ఞములను చేయించు బ్రాహ్మణులకు, చేయు క్షత్రియులకు సంఘర్షణ ఏర్పడెను. ఇది వశిష్ఠ విశ్వామిత్రుల కలహముగ రూపొందించబడినదని నమ్మబడుచున్నది. కాని తుదకు బ్రాహ్మణ వర్గమె విజయము గాంచెను. ఈ కాలమునకు ఆర్య ద్రావిడ సంపర్కముచే ద్రావిడ సంప్రదాయమైన సర్పపూజ ఆర్య మతమున ప్రవేశించెను.

ఇతిహాసకాలము :— రామాయణ, మహాభారతముల ముఖ్య ఇతిహాసములు. రామాయణమందు ఆర్యద్రావిడ యుద్ధము మహాభారతమందు ఆర్యరాజ్యముల మధ్య కలహము వర్ణించబడినది ఇవి చారిత్రక గ్రంథములుగగాక ధర్మసూత్ర సంపుటములు ప్రఖ్యాతిగాంచెను. ఇందు వైదిక మతధర్మములు సులభపద్ధతులలో బోధింపబడినవి. ఈ కాలమునకు ఆర్యులలో ప్రకృతిశక్తుల పూజ పూర్తిగపోయి, యజ్ఞములు ముఖ్యస్థాన మాక్రమించెను. రాజులకు రాజసూయ, అశ్వమేధాదియాగములు ముఖ్యధర్మము లయ్యెను. బ్రాహ్మణ ఆధిక్యత హెచ్చెను. సంఘమున వర్ణవిభేదము కఠినతర మయ్యెను. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరు లను త్రిమూర్తులు వెలసి[నవి]

ఆర్యులు ప్రాపంచిక సుఖములపైనేగాక ఆధ్యాత్మిక చింతనపై దృష్టిని మరల్చిరి. కర్మ సిద్ధాంతము ప్రచారమయ్యెను. ఉపనిషత్తులు రచింపబడెను. వేదముల నర్థము చేసికొనుటకు ఛందస్సు, వ్యాకరణము మొదలగు షడంగములు వ్రాయబడెను. సమాజమునం దనేక కట్టుబాటు లేర్పడి శ్రౌత, గృహ్యా, ధర్మసూత్రములు రచింపబడెను. సృష్టి, ఆత్మ, పరమాత్మలను గూర్చి మీమాంస, చర్చలు జరిగెను. ఈ చర్చలలో స్త్రీలును పాల్గొనుచుండెడివారు. విశ్వవర, అపల, గార్గి, మైత్రేయి మొదలగువారు కొన్ని స్తోత్రములను లిఖించియుండిరి.

సృష్టి కంతయు మూలకారకు డొక్కడే. అతడే పరమాత్మ. అతని అంశమే మానవునిలోని ఆత్మ. ఆత్మ పరమాత్మను జేరుటే మోక్షము. మానవశరీరమున కేగాని ఆత్మకు చావులేదు. మానవుడు తన పాపపుణ్య ఫలితముల ననుసరించి అనేక జన్మముల నెత్తుచుండును. జన్మ రాహిత్యమే మోక్షము. అట్టి జన్మరాహిత్యమును పొందుటకు జ్ఞాన, వైరాగ్య, భక్తి మార్గములే అనుసరింపదగినవి.

## 2. బౌద్ధమతము

క్రీ. పూ. 6 వ శతాబ్ద భారతదేశము :—క్రీ.పూ. 6 వ శతాబ్దమునకు ఆర్యులు ఆర్యావర్తమునంతయు నాక్రమించుటేగాక వింధ్య పర్వతములను దాటి దక్షిణాపథమును ప్రవేశించి అచటి రాజ్యములలో తమ మతమును వ్యాపింపజేయసాగిరి. ఆర్యావర్తమున పదియారు జనపదములు (రాజ్యము) ఏర్పడియుండెను. రాజులు వంశ పారంపర్యహక్కును కల్గియుండెడివారు. వీరు తరచు ఇతర రాజ్యములపై అధికార ప్రాబల్యము నొందుటకు యుద్ధములు చేయుచుండెడివారు. సంఘమున వర్ణవ్యవస్థ బాగుగ నాటుకొనిపోయెను. చతుర్వర్ణములేగాక పంచములు, బానిసలుగూడ నుండెడివారు. వ్యవసాయము, వర్తకము, పరిశ్రమలు వృద్ధిపొందెనుగాని మతవిషయములందు ప్రజలలో తీవ్రఅసంతృప్తి బయలుదేరెను. యజ్ఞయాగాది క్రతువులు చేసినవారికే ముక్తి కలుగుననియు అవిచేయుటకు, చేయించుటకు బ్రాహ్మణులే అర్హులనియు తక్కినవారు మోక్షమును పొందుటకు అనర్హులనియు ప్రచారము గావింపబడెను. రాజ్యపాలకులైన క్షత్రియు

లకును ప్రాధాన్యత తగ్గిపోయెను. శౌర్యధనులైన క్షత్రియులకిది సహింపరాని దయ్యెను. నిత్యజీవితమంతయు వ్యయప్రయాసలతో కూడిన మతకర్మలతో నిండిపోవుటచే సామాన్యప్రజలు మనోవేదన నొందిరి. యజ్ఞయాగాదులు వారి ఆధ్యాత్మిక చింతనకు అసంతృప్తి కలిగించెను. మతమునందు మార్పు నభిలషించిరి. ఇట్టి స్థితిలో ప్రజలకు అందుబాటులోనుండు మోక్షమార్గమును ప్రచారము చేయుటకు బౌద్ధ, జైన మతములు బయలుదేరెను.

బౌద్ధమతమును స్థాపించిన గౌతముడు (క్రీ. శ. 563-483) క్షత్రియుడు. ఇతడు గంగానదికి ఉత్తరతీరమునగల కపిలవస్తుపురమును పాలించుచున్న శాక్యరాజయిన శుద్ధోదనుని కుమారుడు. సంసార సుఖములందే లోటులేకపోయినను 26 వ యేటనే విరాగియై రాజ్యమును, భార్యాపుత్రులనువీడి తోటి మానవుల కష్టములబాపుటకు మార్గమ...ను వెదకుచు బయలుదేరెను. తుదకు గయవద్ద నొక బోధివృక్షచ్ఛాయలో తదేక ధ్యాననిమగ్నుడై జ్ఞానమును పొందెను. జ్ఞానముపొంది గౌతముడు బుద్ధుడయ్యెను. అతడు జూపిన మార్గమె బౌద్ధధర్మము.

బౌద్ధమతము:— ప్రపంచమంతయు దుఃఖమయము. ఆ ...మునకు కోరికలే మూలకారణము. కోరికలను జయించిన దు... లుండవు. ఈ జన్మమున మనము చేయు పాపపుణ్యములే మా... సుఖదుఃఖములకు కారణములు. మనోవాక్కాయ కర్మల పవి... కల్గి అష్టాంగమార్గము నవలంబించిన మానవుడు జన్మరాహిత... నొందును. జన్మరాహిత్యమే మోక్షము. మోక్షమునకు అ... కులములవారు అర్హులు. యజ్ఞయాగాది బాహ్యకర్మ లవసర లేదు. అహింసయే పరమధర్మము. భూతదయ, న్యాయశీలము, పె... యెడ గౌరవభావము, సత్యతత్పరత, పరోపకారపారీణత క... యుండిన చాలునని బుద్ధుడు బోధించెను.

బుద్ధుడు తన మతమును తొలుత వారణాసియందు సారనా... మున బోధించెను. పిదప కోసల, మగధ రాజ్యములందు పర్యటి... ప్రభువులకు ప్రజలకు ధర్మబోధ గావించెను. సామాన్యప్రజల... రాజులు తండోపతండములుగ బౌద్ధ ధర్మమును స్వీకరించిరి. మగధేశుడైన బింబిసారుడును బౌద్ధమతమును స్వీకరించెను. బుద్ధుడు

శిష్యుల నెందరనో ప్రచారకులుగ దేశ నలుమూలలకు ధర్మప్రచారము జరుపుటకు పంపెను.

బుద్ధుని నిర్వాణానంతరము రాజగృహమున ప్రథమ బౌద్ధ సమావేశము జరిగినది. రెండు శతాబ్దముల తరువాత వైశాలిలో ద్వితీయ సమావేశము జరుపబడెను. ఈ సమావేశములలో బౌద్ధమత ప్రచారమున కనువగు విధానములు చర్చించబడెను. క్రీ. పూ. 250 ప్రాంతమున 'తిస్స మొగ్గలి పుత్తు' అధ్యక్షతన పాటలీపుత్రమున తృతీయ బౌద్ధసంఘ సమావేశ మేర్పరుపబడెను. ఈ సమావేశమున బుద్ధుని బోధనలు త్రిపిటకమను గ్రంథముగ క్రోడీకరింపబడెను. ఇందు వినయ పిటకము, సుత్త, అభిదమ్మ అను మూడు భాగములు గలవు. అశోకుడు బౌద్ధమతమును స్వీకరించి ఆ మతవ్యాప్తికి మిగుల కృషి జేసెను. బౌద్ధమత సూత్రములను స్తంభములపైన శిలాఫలకముల పైన చెక్కించి దేశ నలుమూలల నాటించెను. బౌద్ధమతము భారత దేశ మంతటను వ్యాపించెను. కాని ప్రజాబాహుళ్యమున మానసిక ఏకాగ్రత అలవడలేదు. అందులకు దేవతామూర్తు లవసరమయ్యెను. నాగార్జున పండితుడు బౌద్ధమతమున విగ్రహారాధన ప్రవేశపెట్టెను. బుద్ధుడు దైవస్వరూపి యయ్యెను. జాతకకథలు విశేషప్రచారమునకు వచ్చెను. బౌద్ధమతమున మహాయాన, హీనయానశాఖ లేర్పడెను. మహాయానులు బుద్ధుని భగవంతుని అవతారముగ జేసి పూజించిరి. కనిష్కుడు, హర్షుడు మొదలగు రాజులును మహాయానమునే ఆదరించిరి. ఈ మార్పుతో హిందూమతమునకు బౌద్ధమతమునకు భేదము తగ్గిపోయెను. తుదకిది హిందూమతశాఖగా నేర్పడెను. భగవంతుని దశ అవతారములలో బుద్ధు డొక అవతారముగ పరిగణింపబడెను. బౌద్ధమత జన్మభూమియైన భారతదేశమున ఈ మతము క్షీణించినను టిబెట్టు, సింహళము, బర్మా, సయాం, చైనా, జపాను మొదలగు దేశములలో బాగుగా వ్యాప్తిచెందినది. బౌద్ధులకు భారతదేశము పుణ్యభూమి. లుంబినివనము, బుద్ధగయ, సారనాథ్, కుశినగరము, శ్రావస్తి, సంకాశ్య, రాజగృహము, వైశాలి, సాంచి, అజంతా, నలందా, నాగార్జునకొండ, అమరావతి మొదలగు పుణ్యక్షేత్రములను దర్శించుటకు ఏటేటా వేలకొలది బౌద్ధయాత్రికులు వచ్చుచుందురు.

# 3. జైనమతము

జైనమత సంస్థాపకుడైన వర్ధమానుడు (క్రీ. శ. 540-468) గౌతమబుద్ధుని సమకాలికుడు. వైశాలి నగర రాకుమారుడు. తన 29 వ యేట సర్వమును త్యజించి 12 ఏండ్లు ఘోరతపమాచరించి మోక్షమార్గమును కనుగొనెను. నాటి మతము నెదిరించి, గొప్ప విజయమును సాధించి నూతనధర్మము నాచరించినవాడు గాన మహా వీరుడనియు, కామక్రోధాది అరిషడ్వర్గములను జయించెను గాన జినుడనియు పేర్గాంచెను. అతని సిద్ధాంతములే జైనమతమను పేర ప్రసిద్ధికెక్కెను.

జైనమతము:— మానవునియందలి సద్గుణ సముదాయము కంటె ఇతర దైవములేడని జైనుల నమ్మకము. మహావీరుడు సత్ప్రవర్తనమే జన్మసాఫల్య మార్గమనియు, జాతి, కులవిచక్షణ లేక మోక్షమున కందరు అర్హులేననియు, త్రికరణశుద్ధి, జ్ఞానము, సత్ప్రవర్తన, సౌశీల్యము మున్నగు సద్గుణము లున్నయెడల మోక్షము సిద్ధించుననియు తెల్పెను. వేదములు ప్రమాణ గ్రంథములు గావనియు యజ్ఞయాగాది క్రతువులు నిష్ఫలములనియు, అహింస, సత్యము పలుకుట, పరులసొమ్మున కాసింపకుండుట, స్వంత ఆస్తి లేకుండుట పవిత్రజీవనము గడుపుట ముఖ్యమనియు చాటెను.

పార్శ్వనాథుడను తీర్థంకరుని బోధనలనే వర్ధమానుడు విపులీకరించి బోధించెననియు, ఇతడును నొకతీర్థంకరుడనియు చెప్పబడుచున్న[ది].

కాల క్రమమున జైనమతమునందును విగ్రహారాధన ప్రవే[శించె]ను. క్రీ. పూ. 80 ప్రాంతమున నీ మతము దిగంబరులు, శ్వేతాం[]బరులను రెండు శాఖలుగ చీలిపోయెను. బౌద్ధమతమువలె జై[న]మతము విదేశములకు వ్యాపింపలేదు. కాని దక్షిణ హిందూస్థా[న]మున బాగుగ వ్యాపించినది. జైనపండితులు తమిళ, కన్నడభాషా వృద్ధికి మిగులతోడ్పడిరి. కాని జైనమతము శైవ, వైష్ణవ మతము[ల] పోటీకి నిలువలేక క్రమక్రమముగ క్షీణించిపోయెను. రాజస్థాన్‌లో ఆబూ శిఖరాలయము, బంగాళమున ప్రసన్ననాథ ఆలయము మైసూరునందు శ్రావణ బెల్గోలాలోని గోమటేశ్వర ఆలయము జైనుల ముఖ్య పుణ్యక్షేత్రములుగా నున్నవి.

అధ్యాయము 3

# ప్రాచీన హైందవ రాజవంశములు

## 1. మౌర్యవంశము

**మగధ ప్రాముఖ్యత :—** ప్రస్తుత బీహారురాష్ట్రమున నున్న పాట్నా, గయ జిల్లాలు పూర్వము మగధరాజ్యముగ నుండెడివి. ఇతిహాసకాలమున దీనిని బృహద్రథుడు, జరాసంధుడు పరిపాలించినట్లు చెప్పబడుచున్నది. క్రీ. పూ. 6 వ శతాబ్దమునకిది శిశునాగవంశీయుల పాలనలోనికి పోయెను. బింబిసారుడు కోసల, వైశాలి రాజ్యాధిపతులతో సంబంధబాంధవ్యములను నెలకొల్పియు, కాశిరాజు కుమార్తెను పెండ్లాడియు, అంగరాజ్యాధీశు నోడించియు మగధను ప్రముఖరాజ్యముగ జేసెను. ఇతని రాజధాని రాజగృహము. వాని కుమారుడగు అజాతశత్రువు కాశి, విదేహరాజుల నోడించి తన ప్రాబల్యమును గంగానదినుండి హిమాలయములవరకు వ్యాపింప జేసెను. వాని కుమారుడగు ఉదయనుడు గంగ, శోణనదుల సంగమస్థలమందు పాటలీపుత్రనగరమును నిర్మించి రాజధానినటకు మార్చెను. కడపటి శిశునాగవంశీయునిజంపి మహాపద్మనందుడు మగధనాక్రమించి నందవంశమునకు మూలపురుషు డయ్యెను. నందరాజులను నిర్మూలముగావించి చంద్రగుప్తమౌర్యుడు మౌర్యవంశమును స్థాపించెను. మౌర్యవంశచరిత్రకు కౌటిల్యుని అర్థశాస్త్రము, మెగస్తనీసు వ్రాసిన 'ఇండికా', విశాఖదత్తుడు లిఖించిన ముద్రారాక్షసమను నాటకము, అశోకుని శిలాశాసనములు ముఖ్యాధారములుగ నున్నవి.

**చంద్రగుప్త మౌర్యుడు (క్రీ. పూ. 324 - 300) :—** చంద్రగుప్త మౌర్యుడు మహాపద్మనందునకు మురయను శూద్ర స్త్రీవలన జన్మించెననియు, మురవలననె యితని వంశమున్కు మౌర్యవంశమని పేరువచ్చెననియు చెప్పుచుందురు. ఇతడు కాశ్మీరమున క్షత్రియ తెగకు చెందినవాడగుటచే వీనివంశము మౌ బౌద్ధభిక్షువు లనియు మరియొక వాదముగలదు. జిప్తు, సిరిన్,

కౌటిల్యుడ (చాణుక్యుడు) ను బ్రాహ్మణుడు నందులచే పరాభవింపబడి నందవంశ నిర్మూలమునకు చంద్రగుప్తుని ప్రోత్సహించె నని తెలియుచున్నది. చంద్రగుప్తుడు పర్వతరాజు సహాయముతో కొంత సైన్యమును ప్రోగుజేసికొని క్రీ. పూ. 324 లో మగధపై దండెత్తి నందుల నోడించి సింహాసన మాక్రమించెను. ఇతడు యవనరాజగు అలెగ్జాండరు సహాయమును కోరెననియు, అతడు స్వదేశమునకు పయనమగుటచే చంద్రగుప్తునకు సహాయము చేయలేదనియు నొకకథ చెప్పబడుచున్నది. మగధ నాక్రమించిన చంద్రగుప్తుడు చుట్టుపట్ల రాజుల నోడించి గంగా సింధుమైదాన మంతటిని వశపరచుకొనెను. అలెగ్జాండరు ప్రతినిధులను తరిమివేసి పంజాబు నాక్రమించెను. సిరియా పాలకుడుగనున్న సెల్యూకస్ క్రీ. పూ. 305 లో చంద్రగుప్తునిపై దండెత్తివచ్చి ఓడిపోయెను. కాబూలు, కాందహార్, హీరట్, బెలూచిస్థాన్ రాష్ట్రములనేగాక తన కుమార్తెయగు హెలెన్ను చంద్రగుప్తునకిచ్చి వివాహము గావించెను. మెగస్తనీస్ అను గ్రీకు రాయబారిని పాటలీపుత్రమునకు బంపెను. చంద్రగుప్తుడు సెల్యూకస్నకు 500 ఏనుగులను బహుమానముగ పంపి గౌరవించెను. మెగస్తనీసు తాను జూచిన విషయముల నన్నింటిని 'ఇండికా' యను గ్రంథమున పొందుపరచెను. కౌటిల్యుడు ప్రధానమంత్రిగ నుండి రాజ్యపరిపాలనా వ్యవస్థను నియమబద్ధము చేసెను. పరిపాలనా విధానమును నిర్ణయించుచు అర్థశాస్త్రమను గ్రంథమును వ్రాసెను. ఉత్తర హిందూస్థానము నేకచ్ఛత్రాధిపత్యముగ నేలిన మొదటి చక్రవర్తిగ చంద్రగుప్త మౌర్యుడు చరిత్రప్రసిద్ధిగాంచెను.

బిందుసారుడు (క్రీ.పూ. 300-273):— చంద్రగుప్తుని మరణానంతరము వాని కుమారుడగు బిందుసారుడు మగధరాజ్యాధిపతి యయ్యెను. ఇతడు గొప్పపరాక్రమశాలి. వింధ్యపర్వతముల దక్షిణ భాగమును మగధసామ్రాజ్యమున జేర్చెను. ఇతని ఆస్థానము ఆబూ శిఖరాలశోకముల రాయబారు లుండెడివారు.

మైసూరునందు ...డు (క్రీ. పూ. 273-232) :— సోదరుల నోడించి జైనుల ముఖ్య... పూ. 269 ప్రాంతమున పట్టాభిషిక్తుడైనట్లు చెప్పబడు

చున్నది. ఇతడు తండ్రి తాతలవలెనే రాజ్యవ్యాప్తికై కృషి చేసెను. క్రీ. పూ. 261 లో కళింగపై దండెత్తి ఆక్రమించెను. కాని కళింగయుద్ధ రక్తపాతము, జననష్టము గాంచి విరక్తుడయ్యెను. శత్రువులు దండెత్తినప్పుడు రాజ్యరక్షణార్థమై తప్ప, రాజ్యవ్యాప్తికి కత్తిబూననని ప్రతిజ్ఞ జేసెను. బౌద్ధమతమును స్వీకరించి ప్రజాక్షేమమునకై పాటుబడెను. కళింగయుద్ధ ఘట్టము ప్రపంచ చరిత్రయందొక అపూర్వ సంఘటనము.

**ధర్మపరిపాలనము :—** అశోకుడు తనరాజ్యమును నాలుగు మండలములుగ విభజించి మండలాధిపతుల నేర్పరచెను. బాటసారుల కుపయోగముగ దేశము నలుమూలలకు బాటలువేయించి బాటకిరుప్రక్కల చెట్లను నాటించెను. ప్రజలలో దానధర్మములను ప్రోత్సహించి ప్రేమ, దయ, గురుభక్తి, పరమతసహనము మున్నగు సద్గుణములను బోధించెను. సత్రములు, వైద్యశాలలు, పాఠశాలలు నెలకొల్పెను. పశువులకును ప్రత్యేకవైద్యశాలలను కట్టించెను. ఔషధముల కవసరమగు ఓషధులను తోటలలో నాటించెడివాడు. ప్రజలలో ధర్మబోధగావించుటకై ధర్మమహామాత్యులను ఉద్యోగులను నియమించెను. మండలాధిపతులు తమ తమ మండలములలో సంచారము జేసి ప్రజల కష్టసుఖములను తెలిసికొనవలెననియు, వారిని ధర్మమార్గాను సరణులుగ జేయవలెననియు శాసించెను. ప్రజలాచరింపవలసిన ధర్మసూత్రములను, అధికారులాచరింప వలసిన ధర్మములను శిలలపై చెక్కించి దేశనలుమూలల నాటించెను. ఈశాసనములను ఆయా ప్రాంతీయ భాషలలో చెక్కించి సామాన్య ప్రజలకును బోధపడునట్లుజేసెను. ఇతడనేక స్తూపములను, ఆరామములను, విహారములను కట్టించెను. వీనిలో సాంచి, సారనాథ్, బార్హత్ స్తూపములు ముఖ్యమైనవి. బౌద్ధులకేగాక జైనులకును కొన్ని గుహాలయములు నిర్మించి తన పరమత సహనమును చాటెను. బౌద్ధపుణ్యక్షేత్రముల నన్నింటిని దర్శించెను. నేపాళమున లలితపురమును, కాశ్మీరమున శ్రీనగరమును కట్టించెను. బౌద్ధమత ప్రచారమునకై బౌద్ధభిక్షువులను భారతదేశమున వివిధభాగములకేగాక సిరియా, ఈజిప్టు, సిరిన్,


అశోక సామ్రాజ్యము
క్రీ.పూ. 250
సరిహద్దు
శిలాశాసనములు
స్థంభశాసనములు
సింధు
తోప్ర
కల్సి
మీరట్
ఇంద్రప్రస్తము
మధుర
నిగ్లీవ
కపిలవస్తు
బైరాట్
పాటలీపుత్రము
మగధ
రూపనాథ్
సాంచి
సురాష్ట్ర
తామ్రలిప్తి
పుళింద
సోపర
పిటినిక
కళింగ
ఆంధ్ర
మాస్కి
సిద్ధపుర
సతియపుత్ర
నెల్లూరు
చోళ
పాండ్య

మెసిడోనియా, ఎపిరస్ మొదలగు దూర దేశములకు పంపించెను. తనకుమారుడగు మహేంద్రుని, కుమార్తెయగు సంఘమిత్రను మత ప్రచారమునకై సింహళమునకు పంపెను.

అశోకుని ఘనత :— కత్తిబలమున గాక ధర్మబలమున మహాసామ్రాజ్యమును పాలించిన శాంతమూర్తి అశోకుడు. ధర్మ ప్రభుత్వమును స్థాపించి ధర్మమును నాలుగు పాదములందు నడిపిన ధర్మమూర్తి. శ్రేయోరాజ్యమును స్థాపించి మత సహనమును చాటిన మొదటి చక్రవర్తి. 'దేవానాంప్రియ, ప్రియదర్శిరాజ' అని శిలాశాసనములపై చెక్కించుకొని సార్థకనామధేయుడై బౌద్ధధర్మ మును విశ్వవ్యాప్త మొనరించెను. వేనకువేల రాజులలో అశోకుని పేరు ధ్రువతారగ వెల్గొందుచున్నది. క్రీ. పూ. 232 లో అశోకుడు నిర్యాణము చెందినను అతని ధర్మచక్రము భారతజాతికి రాజధర్మ ప్రబోధితముగను, అతని చరిత్ర ప్రపంచ ప్రజలకు నీతి బోధకముగను నిలచియున్నవి.

అశోకుని తరువాత మౌర్యసామ్రాజ్య ప్రతిభ క్షీణించినది. కడపటి మౌర్య చక్రవర్తియగు బృహద్రథుని మౌర్య సేనాధిపతి యగు పుష్యమిత్రుడు తుదముట్టించి క్రీ. పూ. 187 లో మగధ సింహాసన మెక్కెను.

మౌర్యుల పరిపాలన :— రాజు దైవాంశసంభూతుడు గాడు. ప్రజాక్షేమమే పరమార్థముగ నెంచి ప్రజలను కన్నబిడ్డల వలె పాలించు పిత. రాజు సర్వాధికారియైనను మంత్రి పరిషత్తు సలహాలను పాటించవలసియుండెడిది. 'ప్రజల కిష్టమైనది మంచిపని యని గ్రహింపవలెనే గాని తన కిష్టమైనది ప్రజలకు ప్రీతికరమౌనని తలంచరా'దని అర్థశాస్త్రమున వక్కాణింపబడెను.

రాజు రాజ్యమున ముఖ్య న్యాయాధికారి. సర్వసైన్యా ధ్యక్షుడు. ప్రథమ ప్రజాసేవకుడు. ఇతడు శాసనములు, ధర్మనియ మములు చేయుచు క్రింది యుద్యోగులకు, ప్రజలకు కర్తవ్యమును బోధింపవలయును. గూఢచారుల వలన రాజ్యమున జరుగు సకల

విషయములను ఎప్పటికప్పుడు తెలిసికొనుచు అప్రమత్తుడై మెలగవలెను. రాజునకు సలహానిచ్చు మంత్రి పరిషత్తునందు 18 మంది సభ్యులుండెడివారు. వీరిలో మంత్రి, పురోహితుడు, యువరాజు, సేనాని ముఖ్యులు. మహామాత్యులు, అమాత్యులు పరిపాలనా వ్యవహారములను నిర్వహించెడివారు. ప్రతిశాఖకు అధ్యక్షుడను నొక యుద్యోగి యుండెడివాడు.

రాజ్యమును కొన్ని మండలములుగ విభజించి వానికి రాజవంశీకులను రాజప్రతినిధులుగ నియమించెడివారు. మండలమును కొన్ని జనపదములుగను, ప్రదేశములుగను విభజించి వానికి రజుకులు, ప్రాదేశికులను ఉద్యోగులను నియమించెడివారు. గ్రామమునకు గ్రామణి, కొన్ని గ్రామములపై గోపుడు, కొందరు గోపులపై స్థానికుడు అధికారులు. గ్రామణి గ్రామపంచాయతీ సలహాలను పాటించెడివాడు. నగరపాలనకు మహామాత్యుడు లేక నాగరకుడు అను యుద్యోగి యుండెడివాడు.

రాజధానియైన పాటలీపుత్రము 9 మైళ్ళ పొడవు, 2 మైళ్ళ వెడల్పు కలిగి యుండెడిది. ఈ పట్టణము చుట్టును 64 ద్వారములు, 570 బురుజులు గల కోట యుండెడిది. ఈ కోట దారువులతో నిర్మింపబడినది. కోట చుట్టును కందకము త్రవ్వబడియుండెడిది. రాజభవనము కూడ కొయ్యలతోనె నిర్మింపబడి యుండెడిది. స్తంభముల చుట్టును బంగారు రేకులు కప్పబడి యుండెడివి. ఈ నగరము 30 సభ్యులుగల యొక సంఘముచే పాలింపబడెడిది. ఇది ఆరు పంచాయతీలుగ విభజింపబడియుండెడిది. మొదటి పంచాయతీవారు పరిశ్రమలను గూర్చి, రెండవ పంచాయతీవారు విదేశయాత్రికుల సౌకర్యములను గూర్చి, మూడవ పంచాయతీవారు పట్టణ జనన మరణ లెక్కలను గూర్చి, నాల్గవ పంచాయతీవారు వర్తక వ్యాపారములు, కొలతలు, తూనికలను గూర్చి, అయిదవ పంచాయతీవారు ఉత్పాదిత వస్తువుల నాణ్యమునుగూర్చి, ఆరవ పంచాయతీవారు పన్నుల వసూళ్ళను గూర్చి శ్రద్ధ వహించెడివారు.

మౌర్యరాజులు ప్రజలకు న్యాయము గూర్చుటకు ఏ సమయ మందైనను సిద్ధముగా నుండెడివారు. నేరస్థులకు కఠినశిక్షలు విధింప బడుచుండెడివి. జనపదములందు అచ్చటి ఉన్నతోద్యోగులే న్యాయాధికారులుగ నుండెడివారు.

మౌర్యులు చతురంగబలమును కలిగియుండెడివారు. చంద్ర గుప్తునకు 6 లక్షల కాల్బలము, 36 వేల ఆశ్వికదళము, 8 వేల గజములు, 8 వేల రథము లుండెడివి. గజమునకు నల్గురు, రథము నకు ముగ్గురు సైనికులుండెడివారు. ఈ సైనిక విషయములను జూచు యుద్ధ కార్యాలయ సంఘము 30 సభ్యులను గల్గి ఆరుపంచాయతీలుగ విభజింపబడి యుండెడిది. యుద్ధసమయమున గాయపడినవారికి శుశ్రూష చేయుటకు పరిచారికలు, చికిత్సచేయుటకు వైద్యులు ఉండెడివారు. అశోకుడు యుద్ధములను మానినను సైన్యమును మాత్రము ఎల్లవేళల సిద్ధముగ నుంచెడివాడు. రేవుల భద్రతకు, అపాయములో నున్న నౌకల రక్షణకు ప్రత్యేక సిబ్బందియుండెడిది.

ప్రభుత్వమునకు భూమిశిస్తు ముఖ్యఆదాయము. 'భాగ' అను పేర పంటలో ఆరవవంతు వసూలుచేయబడెడిది. ప్రభుత్వభూముల నుండి 'బలి' యను అదనపు పన్నుగూడ వసూలుజేసెడివారు. శుల్క మను వర్తకపుపన్ను, మద్యముపై పన్ను, జూదగృహములు, నృత్య వాటికలపై పన్ను, జరిమానాలు ఇతర ప్రభుత్వఆదాయములు. రేవు లందు రేవుపన్ను వసూలుచేయబడెడిది. సమాహర్త్రి, సన్నిధాత్రి అను ఉన్నతోద్యోగులు ప్రభుత్వ ఆదాయవ్యయములను జూచు చుండెడివారు.

మౌర్యులపాలనలో ప్రజలు సంతృప్తులైయుండిరి. భూమి సార వంతమైనదగుటచేతను, ప్రభుత్వము తగిన నీటిపారుదల సౌకర్యము లను కలిగించుట వలనను పంటలు పుష్కలముగ పండుచుండెడివి. ఉత్సవ సమయములందు తప్ప ప్రజలు మద్యమును ముట్టెడివారు కారు. దొంగతనము లేదు. న్యాయస్థానములకు పోనవసరముండెడిది గాదు. వ్యవసాయముతోపాటు పరిశ్రమలును అభివృద్ధిగాంచి యుండెను. ప్రజలు అందమైన వస్తువులను, ఆభరణములను జరీపని

చేసిన సన్నని నూలు, పట్టువస్త్రములను కాంక్షించెడివారు. సామాన్య ప్రజలును విలువైన రత్నములు, వజ్రములు ధరించుచుండెడివారు. వర్తకము, పరిశ్రమల శ్రేణులద్వారా నిర్వహింపబడు చుండెడివి. మౌర్యసామ్రాజ్యమునకు ఈజిప్టు, గ్రీస్, సిరియాలకు వర్తక సంబంధము లుండెడివి.

## 2. ఆంధ్రులు

ఆంధ్రులు :— ఆంధ్రజాతి అతి ప్రాచీనమైనది. కృష్ణా - గోదావరి నదుల మధ్య ప్రదేశమును ఆంధ్రులు పాలించిరని రామాయణమువలన తెలియుచున్నది. మహాభారతయుద్ధమున ఆంధ్రులు పాల్గొనినట్లు నిదర్శనములు గలవు. మౌర్యులకు పూర్వమె ఆంధ్రులు గొప్ప నాగరికత కలవారై యుండెడివారు. మెసపొటేమియా, గ్రీస్, రోమ్, ఈజిప్టు, పర్షియా, చీనాలతో భూ, జలమార్గముల వర్తక వ్యాపారములు నడిపెడివారు. రోమ్ నగరమునకు ఆంధ్రులు తమ రాయబారినంపిరి. ఆంధ్రులనుండి కొనిన ఏనుగులను సిరియా దేశీయులు యుద్ధములం దుపయోగించెడివారు. మౌర్యుల కాలమున ఆంధ్రరాజ్యము గొప్ప నగరములతో, కోటలతో విలసిల్లుచుండెడిది. మౌర్యుల తరువాత ఆంధ్రులదే పెద్ద సైనికబలమని చెప్పనగును. వీరి సేనలో లక్షకాల్బలము, రెండువేల ఆశ్వికదళము, వేయి గజబలముండెడిది. మగధ తరువాత ఆంధ్రరాజ్యమే పేర్కొనదగియున్నదని మెగస్తనీస్ ప్రశంసించెను.

ఆంధ్రులకు మూలపురుషుడు ఆంధ్ర విష్ణువు. వీనిని ఆంధ్రదేవుడనియు పిలతురు. కృష్ణానదీ తీరమున శ్రీకాకుళమునందు ఆంధ్ర విష్ణువు దేవాలయము గలదు. అశోకుని పరిపాలనా కాలమునకు ఆంధ్రులు మౌర్యుల సామంతులుగ నుండిరి. అశోకుని తరువాతి రాజులు బలహీనులగుటచే ఆంధ్రులు స్వాతంత్ర్యమును ప్రకటించిరి. సాతవాహన వంశీయుడగు శ్రీముఖుడు స్వతంత్ర ఆంధ్రరాజ్యమునకు పాలకుడయ్యెను. ఇతడు శ్రీకాకుళమును రాజధానిగ జేసికొని పాలించెను. మత్స్యపురాణము వలన 30 మంది సాతవాహనరాజులు

ఆంధ్రను పాలించినట్లు తెలియుచున్నది. రెండవ రాజైన కృష్ణుడు నాసిక్ ప్రాంతమును జయించి రాజ్యమును పశ్చిమ తీరమువరకు పెంచెను. మూడవ రాజగు సాతకర్ణి మాళ్వను జయించెను. కళింగ రాజు నోడించెను. రాజధానిని ధాన్యకటకమునకు మార్చెను. ప్రతిష్ఠాన పురమును రెండవ రాజధానిగ జేసికొనెను.

ఆంధ్రసామ్రాజ్యము

కుంతలసాతకర్ణి యను ఆంధ్రరాజు కణ్వావంశీయుడగు సుశర్మను వధించి మగధ నాక్రమించెను. ఆంధ్రరాజ్యము సామ్రాజ్యమయ్యెను.

17 వ రాజగు హాలుడు గొప్ప భాషాపోషకుడు. ఇతని కాలముననే ప్రాకృతభాషలో గాథాసప్తశతి, పైశాచికభాషలో బృహత్కథ వ్రాయబడినవి.

శాతవాహన రాజులలో 23 వ వాడగు గౌతమీపుత్ర శాతకర్ణి ఘనుడు. ఇతడు విదేశీయులైన శక, పల్లవ, యవనులను ఓడించి మాళ్వ, గుజరాతు, కథియవారులను ఆంధ్రసామ్రాజ్యమున జేర్చెను. ఇతని రాజ్యము గంగానదినుండి దక్షిణమున కంచివరకు వ్యాపించి యుండెడిది. నాశిక్ శాసనము ఇతని విజయ, పరాక్రమములను చాటుచున్నది.

గౌతమీపుత్రుని కుమారుడగు రెండవ పులిమావి రాజ్యమున పశ్చిమ భాగమును పోగొట్టుకొనెను. 27 వ రాజగు గౌతమీపుత్ర యజ్ఞశ్రీ శకుల నోడించి కోల్పోయిన రాజ్యభాగమును సంపాదించెను. ఇతడు వెండినాణెములను ముద్రింపించెను. యజ్ఞశ్రీ తరువాతి రాజులు బలహీనులగుటచే సామంతులుగనున్న పల్లవులు స్వతంత్రులైరి. క్రీ. శ. 225 నకు శాతవాహనరాజ్య మంతరించెను.

ఆంధ్రుల పరిపాలన:— శాతవాహనులు తమ సామ్రాజ్యమును రాష్ట్రములుగ విభజించి రాజవంశీకులను మహాభోజులు, మహారథులను ఉద్యోగులుగ నియమించెడివారు. సంఘమున వృత్తినిబట్టి కులవిభాగము లేర్పడెను. మొదటివర్గమున మహారథులు, మహాభోజులు, మహాసేనాపతులు; రెండవవర్గమున అమాత్యులు, మహామాత్యులు మొదలగు ఉన్నతోద్యోగులు పెద్ద పెద్ద వర్తకులు, శ్రేణుల అధ్యక్షు లుండెడివారు. వైద్యులు, స్వర్ణకారులు, వ్యవసాయకులు మూడవవర్గమందు; వడ్రంగి, కమ్మరి, కుమ్మరి, బెస్త మొదలగు వృత్తులవారు చివరి వర్గమందుండెడివారు. సంఘమున స్త్రీ అధిక గౌరవమును పొందుచుండెడిది.

శాతవాహనుల పాలనలో దేశము సర్వసౌఖ్యములతో తులతూగుచుండెడిది. బంగారు, వెండి నాణెములు చలామణిలో నుండెడివి. శ్రేణులను పారిశ్రామిక సంఘములు పరిశ్రమల అభి

వృద్ధికి మిక్కిలి దోహదమయ్యెను. భరుకచ్ఛము, మోటుపల్లి ముఖ్య రేవులుగ నుండెడివి. సన్నని నూలుబట్టలు, రత్నములు, ముత్యములు, ఆభరణములు, నగిషీ వస్తువులు నాటి ఆంధ్రుల ముఖ్య వ్యాపార వస్తువులు. వీరు కాంబోడియా, మలయా, జావా, బలి, సిలిబిస్, ఫిలిప్పైన్ దీవులలో వలస లేర్పరచుకొని ఆంధ్ర సంస్కృతిని వ్యాపింప జేసిరి.

సాతవాహనులు వైదిక మతస్థులైనను బౌద్ధమతము నాదరించిరి. వీరి కాలమున బౌద్ధమతము ఆంధ్రదేశమంతటను వ్యాపించెను. సాతవాహనులు బౌద్ధభిక్షువులకొరకనేక ఆరామములను నిర్మించిరి. వారి కనేక విరాళముల నిచ్చిరి. ఆంధ్రుల శిల్పకళకు అమరావతి, నాగార్జునకొండ, కర్లి, నాశిక్ లలోని శిల్పములే ప్రబల నిదర్శనములు. సాంచీ స్తూపమునకు శిల్పకళాన్వితములైన నాలుగు ద్వారములను కట్టించి సాతవాహనులు తమ శిల్పకళాభిమానమును చాటిరి.

## 3. కుషానులు

**కుషానువంశము :—** పశ్చిమ చైనాప్రాంతపు దేశదిమ్మరులైన తెగలలో యూ-చి (చంద్రవంశీయులు) తెగ యొకటి. వీరు క్రీ. పూ. 165 ప్రాంతమున ఆక్సస్, బాక్ట్రియా లోయలలో స్థిర నివాసము లేర్పరచుకొని అయిదు రాజ్యములను స్థాపించిరి. వీనిలో 'మంకుల' పాలకులు కుషానులు. కుజలకర కడ్ ఫైసీస్ (క్రీ. శ. 15-64) అను రాజు ఇతర తెగల నోడించి బాక్ట్రియా రాజ్యమంతయు తన అధికారము క్రిందికి దెచ్చెను. ఇతడు హిందూకుష్ పర్వతములను దాటి సింధునదికి పశ్చిమముగనున్న రాజ్యమంతయు నాక్రమించి 'మహారాజాధిరాజ', 'సత్యధర్మస్థిత' బిరుదములను ధరించెను. ఇతడు హైందవ ధర్మమును స్వీకరించెనని తెలియుచున్నది. వాని కుమారుడగు వెమాకడ్ ఫైసిస్ సింధునదినిదాటి తక్షశిల, పంజాబుల నాక్రమించి కుషాను రాజ్యమును మధురానగరము వరకు విస్తరింపజేసెను. శకరాజులైన పశ్చిమ సాత్రాపులు వీనికి సామంతులుగ నున్నట్లు తెలియుచున్నది. ఇతని నాణెములనుబట్టి భారతీయులకు రోము

సామ్రాజ్యముతో విశేషముగ వర్తక వ్యాపారములు జరుగుచున్నట్లు గ్రహింపబడినది. కడ్ఫైసిస్ రోమను చక్రవర్తియగు ట్రోజన్ ఆస్థానమునకు రాయబారిని పంపియుండెను. ఇతడు చీనా సేనానిచే నోడింపబడి కప్పము కట్టుట కంగీకరించెను.

కనిష్కుడు (క్రీ. శ. 78-120) :— కుషానులలో కనిష్కుడు సుప్రసిద్ధుడు. ఇతని పరిపాలనా కాలమును గూర్చి చరిత్రకారులలో భేదాభిప్రాయము లున్నవి. శాలివాహన శకము (క్రీ. శ. 78 లో) ఈతనివలననే ప్రారంభింపబడెనని కొందరి అభిప్రాయము. కనిష్కునకు గాంధార దేశమునందలి పురుషపురము (పెషావరు) రాజధాని. ఇతనిని గాంధార చక్రవర్తియని పిలుచుటయు కలదు. ఇతడు గొప్ప వీరుడు. పార్థియనుల నోడించెను. చీనా చక్రవర్తికి సామంతరాజ్యముగనున్న ఖోటాన్, యార్కండ్, ఖాష్గర్ల నాక్రమించెను. చీనా చక్రవర్తికి చెల్లించు కప్పమును నిలిపివేయుటేగాక చీనాలో నొక రాష్ట్రపాలకుని వద్ద కప్పము వసూలుజేసెను. ఇతని రాజ్యమున గాంధారము, కాశ్మీరము, పంజాబు, పాటలీపుత్రము వరకు గల గంగా మైదానము, సింధునదీ ఉత్తరప్రాంతము, దక్షిణమున మాళ్వవరకు గల రాజ్యముండెను.

కనిష్కుడు బౌద్ధమతమును స్వీకరించి ఆ మతవ్యాప్తికై విశేషముగ కృషిజేసి రెండవ అశోకుడను పేర్గాంచెను. ఇతని కాలమునకు బౌద్ధమతమున మహాయాన, హీనయాన శాఖలేర్పడి యుండెను. మహాయానము ఆంధ్రదేశమున ప్రారంభమై ఉత్తర హిందూస్థానమునకు వ్యాపించెను. పార్శ్వుడను బౌద్ధాచార్యుని ప్రోత్సాహముతో కనిష్కుడు కాశ్మీరమున కుండలవనమందు బౌద్ధుల మహాపరిషత్తు నేర్పాటుజేసి రెండు శాఖలను సమన్వయము జేయ ప్రయత్నించెను. ఈ సభలకు వసుమిత్రుడు అధ్యక్షుడుగను, అశ్వఘోషుడు ఉపాధ్యక్షుడుగ నుండిరి. నాగార్జునుడు గూడ ఈ సభలలో పాల్గొనెనని తెలియుచున్నది. తుదకు మహాయాన మతమె సర్వజన సమ్మతమైనది. ఈ పండిత పరిషత్తు బౌద్ధతత్వ సర్వస్వమనదగిన

'మహావిభాష' యను గ్రంథమును క్రోడీకరించెను. చీనా పండితులు దీనిని చీనాభాషలోని కనువదించిరి.

కనిష్కుడు మహాయానము నవలంబించినను ఇతర మతములను ద్వేషించలేదు. ఇతడు జొరాష్ట్రియను, గ్రీకు, హిందూ దేవతలను గూడ పూజించెడివాడు. కశ్యప మతంగుడను బౌద్ధసన్యాసిని మధ్యఆసియా, చీనాలకు పంపి అచట బౌద్ధమతమును ప్రవేశ పెట్టెను. పురుషపురమునందు 400 అడుగుల ఎత్తుగల పదమూడు అంతస్తుల గోపురమును నిర్మించి అందు బుద్ధదేవుని అవశేషముల నుంచెను. బౌద్ధ ధర్మసూత్రములకు వ్యాఖ్యానములను వ్రాయించి వానిని తామ్రఫలకములపై చెక్కించి భద్రపరచెను. కాశ్మీరమున కనిష్కపురమను నగరమును నిర్మించెను. ఇతని కాలపు శిల్పము గాంధార శిల్పమను పేర ప్రసిద్ధికెక్కెను. ఇది హైందవ, గ్రీకు, రోమను శిల్పకళల మిశ్రమము.

కనిష్కుడు కవి, పండిత పోషకుడు. వసుమిత్రుడు, అశ్వఘోషుడు, పార్శ్వుడు, నాగార్జునుడు, చరకుడు నాటి ప్రసిద్ధపురుషులు. అశ్వఘోషుడు గొప్పవిద్వాంసుడు. సంగీతనిధి, బుద్ధచరితము, సూత్రాలంకారము ఇతని ప్రసిద్ధగ్రంథములు. నాగార్జునుడు బౌద్ధ మత గ్రంథములకు భాష్యము వ్రాసెను. ఇతడు గొప్ప శాస్త్రజ్ఞుడు. చరకుడు ఆయుర్వేదమున అందెవేసినచేయి. చరకసంహితమను వైద్యగ్రంథమును రచించెను. కనిష్కుని కాలమున భారతదేశ వర్తక వ్యాపారము లినుమడించెను.

**తరువాతి రాజులు :—** కనిష్కుని తరువాత హువిష్కుడు, వాసిష్కుడు, రెండవ కనిష్కుడు, వాసుదేవుడు, మూడవ కనిష్కుడు, రెండవ వాసుదేవుడు మొదలయిన రాజులు పాలించిరి. హువిష్కుడు కాశ్మీరమున నొక పట్టణమును, మధురలో నొక బౌద్ధ ఆరామమును నిర్మించెను. వాసుదేవుడు వైదిక మతాచార పరాయణుడయ్యెనని అతని నామము, అతని కాలపు నాణెములు సూచించుచున్నవి. మూడవ శతాబ్దప్రారంభమునుండి కుషాను రాజ్యము క్షీణింప మొదలిడి కొలది కాలములోనె అంతరించెను.

# 4. గుప్త యుగము

గుప్తులు :— కుషానురాజ్య పతనానంతరము భారతదేశ చరిత్ర రెండు శతాబ్దముల కాలము మేఘాచ్ఛాదిత మయ్యెను. దేశ మనేక చిన్నచిన్న రాజ్యములుగ చీలిపోయెను. గుప్తులు భారత దేశమున ఏకచ్ఛత్రాధిపత్యమును సాధించి, మహాసామ్రాజ్య నిర్మాతలై భారతదేశమున కొక స్వర్ణయుగమును ప్రసాదించిరి. గుప్తులకు శ్రీగుప్తుడు మూలపురుషుడు. ఇతడు మగధప్రాంతమున నొక చిన్న రాజ్యమును పాలించుచుండెడివాడు. ఈ వంశమున మూడవ శతాబ్దాంతమున ఘటోత్కచుడను రాజు పాలించెను. వాని కుమారుడే చంద్రగుప్తుడు.

చంద్రగుప్తుడు (క్రీ. శ. 320-330) :— చంద్రగుప్తుడు లిచ్ఛవీవంశ సంజాతయగు కుమారదేవిని వివాహమాడుటతో అధిక బలసంపన్నుడై మగధ, కోసల రాజ్యములను సంపాదించి గుప్త సామ్రాజ్య స్థాపకుడయ్యెను. ఇతడు మహారాజాధిరాజ బిరుదాంకితుడు. ఇతని నాణెములపై భార్యయగు కుమారదేవి ప్రతిమయు చెక్కియుండుట యొక విశేషము.

సముద్రగుప్తుడు (క్రీ. శ. 330 - 375) :— చంద్రగుప్తుడు భుజబల సంపన్నుడు, అవక్రమ పరాక్రమవంతుడు, తన ద్వితీయ పుత్రుడు నగు సముద్రగుప్తుని తన తరువాతి రాజుగ నియమించెను. సముద్రగుప్తుడు సింహాసన మధిష్ఠించి తన స్థానమును సుస్థిరపరచుకొని విజయయాత్రకై బయల్వెడలెను. తొమ్మిదిమంది ఉత్తర హిందూస్థానరాజుల నోడించి వారి రాజ్యములను గుప్తసామ్రాజ్యమున జేర్చెను. అందు నాగసేనుడు, గణపతినాగుడు నాగవంశీకులు. సమాతాత, కామరూప, నేపాళ, దావక, కర్త్రిపురములను సరిహద్దు రాష్ట్రపాలకులు సముద్రగుప్తుని సార్వభౌమత్వ మంగీకరించి కప్పములు గట్టిరి. తొమ్మిది ఆటవిక తెగలు దాసోహమనిరి. వాయవ్య ప్రాంతమున నున్న శకులు, హూణులు ఈరాజాధిరాజునకు దోసిలొగ్గిరి. ఆర్యావర్తమున విజయుడైన సముద్రగుప్తుడు దక్షిణ

దిగ్విజయ యాత్రకై బయలుదేరెను. దక్షిణాధీశుడగు మహేంద్రుని, మహాకాంతార పాలకుడగు వ్యాఘ్రరాజును, కళింగభూపతియగు మంతరాజును, పిష్టపురాధీశుడగు మహేంద్రభూపతిని, గిరికొత్తూర ప్రభువగు స్వామిదత్తును, ఏరండపల్లి నేలుచున్న దమనుని, వేంగిదేశ రాజగు హస్తివర్మనుని, పాలకరాజగు ఉగ్రసేనుని, అవముక్తనేలు శీలరాజును, దేవరాష్ట్ర పాలకుడగు కుబేరుని, పల్లవరాజగు విష్ణుగోపుని జయించి పాటలీపుత్రమును చేరెను. తనదిగ్విజయ చిహ్నముగ అశ్వమేధయాగమును జేసి, ప్రత్యేక బంగారునాణెములను ముద్రింపించెను. వానిపై రాజాధిరాజ, అప్రతిహత యోధానుయోధ బిరుదములను చెక్కించెను. ఈతని ప్రతిభనువిని సింహళరాజగు మేఘవర్ణుడు విలువైన కానుకలుపంపి గౌరవించెను. బుద్ధగయలో నొక బౌద్ధారామము కట్టుకొన ననుమతిబడసెను. మలయా, ఇండో-చైనాలలోని భారతీయ వలసరాజ్యములవారును సముద్రగుప్తుని గొప్ప చక్రవర్తిగ గుర్తించి కానుకలంపిరి.

సముద్రగుప్తుడు గొప్ప విద్వాంసుడు, కవి, గానకళా విశారదుడు. వీణ వాయించుచున్నట్లు నాణెములపై ముద్రింపించెను. ఇతడు కవిరాజ బిరుదాంకితుడు. మత సహనము కలవాడు. వసుబంధుడను బౌద్ధపండితుని మంత్రిగా నియమించుకొనెను. ఇతనిని 'హైందవ నెపోలియన్'గా స్మిత్ పండితుడు వర్ణించియున్నాడు.

**చంద్రగుప్త విక్రమాదిత్యుడు (క్రీ. శ. 375 - 413) :—** సోదరుడగు రామగుప్తుని వధించి చంద్రగుప్తుడు మగధాధీశుడయ్యెను. ఇతడు తండ్రి, తాతలవలెనే గొప్ప పరాక్రమవంతుడు. తన పరాక్రమమును సూచించుటకు నాణెములపై విల్లు, అంబులను ముద్రింపించెను. మాళవ, సౌరాష్ట్ర, ఘూర్జర రాజ్యములను జయించి విదేశీయులగు పశ్చిమ క్షాత్రవుల పాలన నంతరింపజేసెను. ఉజ్జయినిని తన రెండవ రాజధానిగ జేసికొనెను. ఇతడు తన రాజ్య క్షేమము నాలోచించి తాను నాగవంశ రాకుమార్తెను పెండ్లాడెను. తన కుమార్తె యగు ప్రభావతీదేవిని వాకాటక రాజగు రుద్రసేనున కిచ్చి పరిణయము గావించి రెండు రాజ్యముల మైత్రిని పెంపొందించెను.

చంద్రగుప్తుడు విక్రమాంకుడు, విక్రమాదిత్యుడు, సింహ విక్రముడు, సాహసాంకుడను బిరుదులను ధరించెను. ఇతని పరిపాలనా కాలము స్వర్ణయుగమని ప్రసిద్ధికెక్కెను. ఇందులకు హిందూమతోద్ధ




రణము, సాహిత్య కళాపోషణము, వాణిజ్యవిస్తరణము, శిల్పకళాభివృద్ధి ముఖ్య చిహ్నములై వెలసెను. చంద్రగుప్తుని ఆస్థానమున నవరత్నములను పండితులుండెడివారు. కాళిదాసు కవిశ్రేష్ఠుడు.

ధన్వంతరి వైద్యశాస్త్ర పారంగతుడు. క్షపణకుడు ముహూర్త శాస్త్ర వేత్త. అమరసింహుడు శబ్దశాస్త్రకోవిదుడు. శంఖుడు శిల్పకళానిధి. భేతాళభట్టు మంత్రవాది. వరాహమిహిరుడు జ్యోతిశ్శాస్త్ర విశారదుడు. ఘటకర్పరుడు భూగర్భశాస్త్రజ్ఞుడు. వరరుచి ప్రాకృత భాషానుశాసనుడు. విక్రమార్కుని పోషణమున సంస్కృతభాష వికాసము నొందెను. ఇతని పరిపాలనా కాలమున ఫాహియాన్ అను చీనా బౌద్ధ యాత్రికుడు మన దేశమునకు వచ్చెను. ఇతడు క్రీ. శ. 405 నుండి 411 వరకు భారతదేశమున వివిధ భాగములందు పర్యటించి తామ్రలిప్తినుండి సముద్ర మార్గమున సింహళముచేరి అటనుండి జావామీదుగ స్వదేశమును చేరెను.

చంద్రగుప్తుని మరణానంతరము కుమారగుప్తుడు సింహాసన మధిష్ఠించెను. ఇతని కాలమున మనదేశమునకు ఘోరవిపత్తు సంభవించెను. మధ్యఆసియానుండి దేశద్రిమ్మరులైన హూణులను నొక తెగవారు దండయాత్రలను ప్రారంభించిరి. యువరాజగు స్కందగుప్తుడు హూణులను పారద్రోలెను. కాని వీరి దండయాత్రలు నానాటికి అధికమై గుప్తసామ్రాజ్యము పతనమాయెను. సామంతులు స్వతంత్రులైరి. రాజ్యము విచ్ఛిన్నమయ్యెను. క్రీ. శ. 550 వరకు గుప్తవంశీకులు చిన్నరాజ్యము నేలిరి. తుదకు మహావైభవ మనుభవించిన గుప్తసామ్రాజ్యము కాలగర్భమున కలిసిపోయి మరల హైందవదేశమున కారుమేఘము లావరించెను.

గుప్తులపరిపాలన :— మగధ సామ్రాజ్యలక్ష్మి గుప్తరాజుల బలదర్పములపై నాధారపడి మహావైభవము ననుభవించెను. రెండు శతాబ్దముల కాలము ఆర్యావర్తము ఏకచ్ఛత్రాధిపత్యము నొందినది. గుప్తసామ్రాజ్యము కూలిపోయినను గుప్తరాజులు వెల్గించిన విజ్ఞాన జ్యోతి వెల్గొందుచునేయున్నది. వారి పాలనలో ప్రజలు విదేశ దండయాత్రల భయము లేక సుఖజీవనమును సాగించిరి. వర్తక వ్యాపారము లినుమడించెను. చైనా, జపాన్, బర్మా, సయాం, కాంభోడియా మొదలగు దేశములకు హిందూ సంస్కృతి వ్యాపించినది.

జావా, బలిద్వీపములందు వలస లేర్పడినవి. పాడిపంటలకు కొదువలేక ప్రజలు సిరిసంపదలతో తులదూగిరి.

గుప్తుల కాలమున హైందవమతము పునరుద్ధరింపబడెను. గుప్తరాజులు వైష్ణవ మతావలంబులు. అయినను శైవ దేవాలయములను కట్టించి, బౌద్ధుల నాదరించి, పరమత సహనమును ప్రదర్శించిరి. బుద్ధగయ, కపిలవస్తు, కుశి నగరములు నిర్మానుష్యము లయ్యెనని ఫాహియాన్ వ్రాసియుండెను. దీనివలన బౌద్ధమతము క్షీణించుచున్నదని తెలియగలదు. ఈ మత క్షీణతకు బ్రాహ్మణుల అత్యాచారములు, రాజుల అనాదరణ, మతవైషమ్యములు కారణములుగావు. హిందూమతమునందును బౌద్ధమత సూత్రములను ప్రవేశపెట్టి ఆకర్షణీయముగ చేయుటచే బౌద్ధమత మనుగడకు తావు లేకుండబోయెను.

గుప్తయుగమున ప్రాకృత భాషకు ప్రాధాన్యత తగ్గి సంస్కృత భాష ఉచ్చస్థితినందెను. కాళిదాసాది మహాకవులు కావ్యములు, నాటకములు ప్రవేశపెట్టిరి. కుమారసంభవము, రఘువంశము, శాకుంతలము, మాళవికాగ్నిమిత్రము మొదలగునవి కాళిదాసుని ప్రసిద్ధ గ్రంథములు. విశాఖదత్తుడు మౌర్యచరిత్రను ముద్రారాక్షస నాటకమున ప్రతిబింబించెను. శూద్రకుని మృచ్ఛకటికము విశేష జనాదరణ నొందెను. సముద్రగుప్తుని ఆస్థానమున హరిసేనుడు దివ్యరత్నమై ప్రకాశించెను. కుమారగుప్తుని కాలమున నలందా విశ్వవిద్యాలయము స్థాపింపబడెను. గుప్తయుగముననే పురాణములు తిరిగి వ్రాయబడెను. మనుధర్మశాస్త్రము క్రోడీకరింపబడెను. పంచతంత్ర మను నీతిగ్రంథము వెలసెను. వ్యాకరణమున వరరుచి ప్రతిభజూపెను. గణిత, జ్యోతిష శాస్త్రములు వృద్ధిపొందెను. ఆర్యభట్టు, వరాహమిహిరుడు, బ్రహ్మగుప్తుడు శాస్త్రాభివృద్ధికి నిరుపమానమగు సేవ జేసిరి. వీరి సిద్ధాంతములపై యవనశాస్త్రజ్ఞుల ప్రభావము హెచ్చుగ కన్పట్టుచున్నది. ఆనాడు ఉజ్జయినీ నగరమునుండియె రేఖాంశ గణనము జరుగుచుండెడిదట. చరకుడు, సుశ్రుతుడు వ్రాసిన వైద్య

గ్రంథములను సంగ్రహపరచి వాగ్భట్టు అను శాస్త్రజ్ఞుడు అష్టాంగ సంగ్రహమను గొప్ప వైద్యగ్రంథమును రచించెను.

గుప్తయుగమున కళలు సర్వతోముఖాభివృద్ధి గాంచెను. సంగీతమున సముద్రగుప్తుడు గొప్ప విద్వాంసుడు. నృత్యకళయందు గల ఆదరణకు నాటి శిల్పముల వివిధ భంగిమలే ప్రబల నిదర్శనములు. శిల్ప చిత్రలేఖన విద్య లీ యుగమున వన్నెకెక్కెను. అజంతా చైత్య విహారములు, వానియందుండు చిత్రలేఖనములు జగత్ప్రసిద్ధములు. ఇచటి చిత్తరువులు ఆనాటి ప్రజల సాంఘిక జీవనమునకు రూపకల్పనములు. ఆనాటి నాణెములు గొప్ప పనితనమును జూపుచున్నవి. వానిపై రోమను నాణె సాంప్రదాయముల ప్రభావము గమనార్హము. ఢిల్లీలోని పోత యినుప స్తంభము, నలందాలోని బుద్ధభగవానుని తామ్ర విగ్రహము గుప్తకాలపు భారీపరిశ్రమలకు ఉదాహరణములు.

ఆనాటి ప్రజలును ప్రశంసార్హులే! వారు దాన తత్పరులనియు, అగ్రహారికుడను అధికారి దానధర్మములకు సంబంధించిన వ్యవహారములను జూచుచుండెడివాడనియు, పాటలీపుత్రమున పురజనులచే నిర్మింపబడిన ఉచిత వైద్యశాల కలదనియు అట్టి వైద్యశాలను ప్రపంచమున మరెచ్చటను కానబోమనియు ఫాహియాన్ ప్రశంసించెను. ప్రభువులును ప్రజా స్వాతంత్ర్యమునకు భంగము కలిగించెడివారు కారు. దొంగతనము, మోసము ప్రజలలో కానరావనియు, అహింస పరమధర్మముగ ఆచరింపబడెడి దనియు, విదేశీయులు ఎట్టి ఆటంకము లేకుండనే కాలము గడుపవచ్చుననియు, అనుమతి పత్రములు లేకుండనే ఏ ప్రాంతమునకైనను పోవచ్చుననియు, గుప్తులు ప్రేమ-సహకారములతో పరిపాలన చేసిరనియు ఫాహియాన్ వర్ణించెను. గుప్తుల శిక్షాస్మృతి బహు ఉదారముగ నుండెడిది. కొరడా దెబ్బలు, ఉరిశిక్ష లేవనియు, రాజద్రోహులకు మాత్రము కుడిచేయి నరకించెడివారనియు మిగత నేరములకు జరిమానాలు విధింపబడెడివనియు ఫాహియాన్ వ్రాసియుండెను. ఇన్ని విధముల ఉచ్ఛస్థితినంది, ఆదర్శప్రాయముగు పరిపాలన కలిగియుండిన గుప్తయుగమును స్వర్ణయుగమనుట యెంతయు సమంజసముగ నున్నదిగదా!

# 5. వర్ధనులు

ప్రభాకర వర్ధనుడు :— శ్వేతహూణులను పలుమారెదిరించి పారద్రోలిన హైందవ రాజులలో ప్రభాకరవర్ధనుడు ముఖ్యుడు. ఇతడు వర్ధనవంశీయుడు. ఈ వంశమునకు పుష్పభూతి మూలపురుషుడు. ప్రభాకరవర్ధనుడు గుప్తవంశీకుల దౌహిత్రుడు. స్థానేశ్వరమును రాజధానిగ జేసికొని చిన్నరాజ్యమును పాలించెను. వీనికి రాజ్యవర్ధనుడు, హర్షవర్ధనుడు అను కుమారులు, రాజ్యశ్రీ యను కుమార్తెయు గలరు. కన్యాకుబ్జను నేలు గృహవర్మ రాజ్యశ్రీని వివాహమాడెను. ప్రభాకరవర్ధనుని మరణానంతరము క్రీ. శ. 604లో రాజ్యవర్ధనుడు సింహాసన మెక్కెను. కాని మాళ్వరాజగు దేవగుప్తుడు గృహవర్మను జంపి రాజ్యశ్రీని చెరగొనిపోయెనని వార్త వచ్చెను. రాజ్యవర్ధనుడు దేవగుప్తు నోడించి చంపెను. కాని వాని మిత్రుడగు శశాంకుడను గౌడరాజు రాజ్యవర్ధనుని విందునకని పిలిచి మాయోపాయమున చంపించెను. రాజ్యశ్రీ చెరనుండి తప్పించుకొని వింధ్యారణ్యములకు పారిపోయెను.

శ్రీహర్షుడు (క్రీ. శ. 606-647):— రాజ్యవర్ధనుని మరణము పదునారేడుల బాలుడగు హర్షునకు పిడుగుపాటయ్యెను. శత్రునాశనము జేసి అన్నగారి ఆత్మకు శాంతికలిగింతునని ప్రతినబూనెను. వింధ్యారణ్యములలో చితి బేర్చుకొని మరణింపనున్న సోదరిని ఓదార్చి తెచ్చెను. కామరూప దేశాధీశుడగు భాస్కరవర్మతో మైత్రి గావించుకొని శశాంకుని పీచమడంచెను.

శ్రీ హర్షుడు ఉత్తర హిందూస్థానమున ఏకచ్ఛత్రాధిపత్యము సాధింపనెంచెను. సోదరితరపున కన్యాకుబ్జ రాజ్యపాలనా భారమును స్వీకరించి రాజధాని నటకు మార్చెను. ఆరేండ్లు నిరంతర యుద్ధములందు గడిపి మాళ్వ, సౌరాష్ట్ర మాదిగాగల రాజ్యములను జయించి పంజాబు, ఘూర్జరరాష్ట్రములుతప్ప మిగత ఉత్తరహిందూస్థాన రాజ్యము నంతయు తనపాలనలోనికి తెచ్చెను. నేపాళ, కామరూప రాజులు హర్షునకు సామంతులుగ నుండ నిచ్ఛగించిరి. హర్షుడు

సముద్రగుప్తునివలె దక్షిణ దిగ్విజయయాత్రకై బయల్వెడలెను గాని చాళుక్యరాజగు రెండవపులకేశిచే నోడి తన ప్రయత్నమును విరమించుకొనెను. హర్షుని సామ్రాజ్యము ఉత్తరమున హిమాలయముల నుండి దక్షిణమున నర్మదానది వరకును, పశ్చిమమున వలభినుండి తూర్పున గంజాము వరకును విస్తరించెను.

హర్షుని పరిపాలన :— హూణుల దండయాత్రా ఫలితముగ భారతావనియందేర్పడిన అరాచకమును తొలగించి శాంతి భద్రతలను నెలకొల్పిన కీర్తి హర్షునకు దక్కినది. హర్షుని పరిపాలనా కాలమున హ్యూయాన్ సాంగ్ అను చీనాయాత్రికుడు మన దేశమునకు వచ్చెను. ఇతడు గొప్ప బౌద్ధపండితుడు. బుద్ధదేవుని జన్మభూమియైన భారతదేశమును దర్శింపవలెనని అనేక కష్టములకోర్చి పశ్చిమ చైనా నుండి సమర్ఖండుమీదుగ క్రీ. శ. 630 లో గాంధార దేశమును చేరెను. ఇతడు 15 సంవత్సరములు భారతదేశమున వివిధక్షేత్రములు దర్శించి క్రీ. శ. 645 లో పామీరుమీదుగ చీనా చేరెను. ఇతని రచనలు హర్షుని పరిపాలనకు ముఖ్యప్రమాణములు. హర్షుడు స్వయముగా ప్రజల కష్టసుఖములను తెలిసికొనుటకై మారువేషమున దేశమంతటను సంచరించెడివాడనియు, తన మంత్రులకు, సామంతులకు ఆదర్శప్రాయుడుగ నుండెడివాడని హ్యూయాన్ సాంగ్ ప్రశంసించెను. పరిపాలనలో రాజునకు మంత్రివర్గము సహాయపడుచుండెడిది. మహాసంధి విగ్రహాధికారియను ప్రధానోద్యోగి యుండెడివాడు. హర్షునకు ధార్మికచింతన హెచ్చు. ఉచిత వైద్యశాలలు, విద్యాలయములు, వసతి గృహములు పెక్కు నెలకొల్పబడెను. పంటలో ఆరవవంతు పన్నుగా వసూలు చేయబడెడిది. ప్రభుత్వోద్యోగులకు జీతములకు బదులు భూములివ్వబడెడివి. ప్రతి రాష్ట్రమునందు జరుగు మంచి చెడులను వ్రాసి భద్రపరచుటకై కొందరుద్యోగు లుండెడివారని హ్యూయాన్ సాంగ్ వ్రాసియుండెను.

హర్షుడు బౌద్ధమతాభిమాని అయినను పరమత సహనము కలవాడు. సూర్యుడు, శివుడు, మొదలగు దేవతలను గూడ పూజించెడివాడు. హర్షుని వితరణము సాటిలేనిది. ఇతడు ప్రయాగలో ఐదేండ్ల కొకసారి యొక సభచేసి తన ఖజానాలోని ధనమునంతయు దానము చేసెడివాడు. కన్యాకుబ్జమున జరిగిన మతసభకు ఆహ్వానింపబడినట్లు హ్యూయాన్ సాంగ్ వ్రాసికొనెను. ఆ సభకు బౌద్ధపండితులే గాక, హిందూ జైన పండితులు, సామంతరాజులు హాజరైరట. అచటినుండి హర్షుడు ప్రయాగ చేరి సర్వస్వదానము చేసెనట. ఆ వుత్సవమున బౌద్ధ

దేవుని బంగారు విగ్రహమును ఊరేగించి హర్షుడు స్వయముగ శ్వేత ఛత్రమును పట్టెనట.

హర్ష సామ్రాజ్యమున ప్రజలు మత వైషమ్యములు లేక ఏకోదరులవలె నుండెడివారని హ్యూయాన్ సాంగ్ ప్రశంసించెను. గుప్త యుగమునకన్న శిక్షాస్మృతి కఠినముగ నుండెడిది. దొంగతనము, దారిదోపిడీలు హెచ్చుగా నుండెడివని హ్యూయాన్ సాంగ్ వ్రాసెను. పాటలీపుత్రము శిథిలావస్థలో నున్నను, రాజధానియగు కన్యాకుబ్జము రమ్యహర్మ్యములతో, మనోహర వనములతో, నిర్మల జలపూరితము లగు తటాకములతో కనులపండువుగ నుండెడిదని చీనా యాత్రికుడు వర్ణించెను.

శ్రీహర్షుడు కవి. భాషాపోషకుడు. నలందా విశ్వవిద్యాలయమునకు విశేషముగ భూములను దానమిచ్చి తన విద్యాభిమానమును చాటెను. వివిధ ప్రాంతీయులైన పదివేలమంది విద్యార్థులతో, పదునైదు వందలమంది ఆచార్యులతో నలందా విశ్వవిద్యాలయము కళకళలాడుచుండెడిది. హర్షుడు ప్రియదర్శిక, నాగానందము, రత్నావళి యను నాటకములను రచించెను. ఇతని ఆస్థానమున నున్న బాణ భట్టారకుడు గొప్ప పండితుడు. హర్ష చరిత్రము, కాదంబరి ఇతని ప్రసిద్ధగ్రంథములు.

# అ ధ్యా య ము 4

# గ్రీ కు యు గ ము

## 1. ప్రా చీ న గ్రీ కు చ రి త్ర

గ్రీకుల దండయాత్ర :— క్రీ. పూ. 15 వ శతాబ్దమున కాస్పియన్ సముద్రప్రాంతమునుండియో లేక మధ్య ఆసియా స్టెప్పీ ప్రాంతమునుండియో యొక ఆర్య తెగ పశ్చిమముగా ప్రయాణము చేసి గ్రీసు దేశమును చేరెను. నాటికి వారు దేశద్రిమ్మరులుగను, పశు కాపరులుగ నుండెడివారు. రాతి ఆయుధముల నుపయోగించెడివారు. మినోనియనులనుండి వీరు నాగరికతను నేర్చుకొనిరి. వ్యవసాయము చేయనేర్చిరి. ఓడల నిర్మించి నౌకాయానమును మొదలిడిరి. తుదకు మినోనియనుల నోడించి వారి పట్టణముల నాక్రమించిరి. ఏజియన్ సముద్ర ద్వీపములలో తమ అధికారమును ప్రతిష్ఠించి ఆసియామైనరు వరకు పురోగమించిరి. ఈ విజృంభణమునందె ట్రోయ్ నగరమును ముట్టడించి నాశనమొనరించి యుండవచ్చును. ఈ యుదంతమె హోమరు మహాకవి కల్పిత ఇతిహాసమగు ఇలియడ్ (Iliad) నకు కథావస్తు వయ్యెను. ఇతిహాసయుగ గ్రీకు చరిత్రకు ఇలియడ్, ఒడెస్సీలు ముఖ్య ఆధారములుగ నున్నవి. గ్రీసు దేశము నాక్రమించిన గ్రీకులలో అనేక తెగలవా రుండిరి. కాని వీరందరు ఆ కాలమున హెలెన్స్ (Hellens) అని పిలువబడెడివారు.

గ్రీకు చరిత్రపై భౌగోళికాంశముల ప్రభావము :— గ్రీసు పర్వతమయమైన దేశము. దట్టమైన అడవులుగాని, చిక్కని పచ్చిక మైదానములుగాని లేవు. ఇచటి పర్వత వరుసలు దేశమును అనేక సహజ విభాగములుగ జేసి నగర రాజ్యస్థాపనకు అనుకూలమయ్యెను. ఈ రాజ్యములవారు ఒకరితో నొకరు సంబంధము లేక ప్రతి రాజ్యము నకు ప్రత్యేక చట్టములను, రాజ్యాంగ విధానమును, సైన్యమును ఏర్పరచుకొనుచుండెడివారు. గ్రీసు ఏడ్రియాటిక్, మధ్యధరా,

ఏజియన్ సముద్రములచే చుట్టబడియున్న ద్వీపకల్పము. తీరరేఖ అనేక ప్రదేశములందు చీలి చక్కని రేవు లేర్పడెను. దేశము నిస్సారమగుటచే గ్రీకులకు సముద్రమే శరణ్యమయ్యెను. వర్తక వ్యాపారములే జీవనోపాధులయ్యెను. ఏజియన్ సముద్రమున వారధులవలె నేర్పడియున్న చిన్నచిన్న దీవులు గ్రీసునకు, భాగ్యవంతమైన తూర్పు రాజ్యములకు సంబంధము కల్పించుచున్నవి.

గ్రీకు వలసలు :— వలస రాజ్యస్థాపనయందు, వర్తక వ్యాపారములయందు గ్రీకులకు ఫినీషియనులు ముఖ్య ప్రత్యర్థులైరి. కాని వారు గ్రీకుల ధాటికి నిలువలేక కార్థేజ్‌ను కేంద్రముగ జేసికొని తమ కార్యకలాపములను పశ్చిమ మధ్యధరా సముద్రమునకు పరిమితము జేసికొనిరి. గ్రీకులు క్రీ. పూ. 600 సంవత్సరమునకు మధ్యధరా సముద్రతీరము పొడవున అనేక వలసలను స్థాపించిరి. పిరనీస్ పర్వతములనుండి కాకసస్ పర్వతములవరకు దక్షిణ రష్యా నుండి ఉత్తర ఆఫ్రికావరకు గల మండలమున గ్రీసు నడిగడ్డగాక సుమారు నూటయేబది ప్రత్యేక రాజ్యము లేర్పడెను. ఈ గ్రీకు మండలము హెల్లాస్ (Hellas) అని పిలువబడెడిది. ఈ వలసలలో మెసిలియా (మార్సెయిల్స్) సిరక్యూజ్ (సిసిలీ) మాగ్నగ్రీసియా (దక్షిణ ఇటలీ) బైజాంటమ్ (కాన్‌స్టాంటి నోపిల్) ముఖ్యమైనవి.

నగరరాజ్యములు :— పర్వతములు, సముద్రములు గ్రీకు ప్రపంచమును అనేక విభాగములుగ జేసియుండుటచే అనేక నగర రాజ్యములు వెలసెను. వీనికి రాజకీయ ఐక్యత లేకపోయినను గ్రీకులలో జాతీయభావము సాటిలేనిది. వివిధ రాజ్యములవారు తాము ఒకే జాతివారమని నమ్మెడివారు. జూస్ (Zeus) అపాలో (Apollo) ఎథీనా (Athena) వీరి ముఖ్యదేవతలు. ఈ దేవతలకు ఒలింపస్ శిఖరము నివాసభూమి యని తలచెడివారు. డెల్ఫివద్ద చెప్పబడు అపాలో జోస్యము (Oracle) నందు గ్రీకులందరకు ఎనలేని నమ్మకముండెడిది. గ్రీకు సాహిత్యము, కళలు పురాణ పురుషుల చరిత్రలు గ్రీకులలో ఏకీభావమును కలుగజేయుచుండెడివి. నాలుగేండ్ల కొకసారి ఒలింపియా యందు జరుపబడు క్రీడా విన్యాసములు వారి

ఐకమత్యమును జాతీయభావమును పెంపొందించుటలో ప్రముఖపాత్ర వహించుచుండెడివి. ఇచటి ఆటల పోటీలలో పాల్గొని పవిత్ర ఆలివ్ తోరణమును బహుమతిగ పొందుట ప్రతి గ్రీకు పౌరుని జీవితాశయముగ నుండెడిది. ఇట్లు గ్రీకుజాతియందు భిన్నత్వములో ఏకత్వము కనిపించుచున్నది.

గ్రీకు నగరరాజ్య నిర్మాణమున నొక ప్రత్యేకత కనబడు చున్నది. నగర మధ్యభాగమున పర్వతముపై ఆ నగరాధి దేవతను ప్రతిష్ఠించి ఆలయములను నిర్మించి దానిచుట్టును బలమైన కోటను కట్టెడివారు. దీనిని అక్రోపొలిస్ (Acropolis) అని పిలచెడివారు. ఆపదసమయములందు ఆ రాజ్యవాసులందరకు ఆ కోటయే రక్షణ స్థానముగ నుండెడిది.

గ్రీకు సంఘమున మూడు ముఖ్య తరగతులు కనబడుచున్నవి. రాజ్యపాలన, యుద్ధములందు పాల్గొను పౌరులు (Citizens) ప్రథమ వర్గముగ నుండెడివారు. వర్తక వ్యాపారములు, ఇతర వృత్తులందు పాల్గొనువారు మధ్యతరగతిగ నేర్పడిరి. వీరికి ఓటు హక్కు లేదు. ఆయా ప్రదేశముల పూర్వ నివాసులు, గ్రీకులలోని అధమ వంశీకులు బానిసలుగ నుండెడివారు. బానిసలు పౌరులకు వూడిగము చేయుచు పట్టణ సౌభాగ్యమునకు, పౌరుల సౌఖ్యజీవితమునకు పాటుబడు చుండెడివారు. స్త్రీలకు, విదేశీయులకు ఓటుహక్కు వుండెడిదికాదు.

గ్రీకులు స్వాతంత్ర్యప్రియులు. కావున వారి నగరరాజ్యపాలన అనేక మార్పులకు లోనగుచుండెడిది. ప్రతి రాజ్యమున కొక రాజుం డెడివాడు. గ్రీకుల ఐతిహాసికయుగమున ఈ రాజులందరొక చక్రవర్తి పలుకుబడికి లోబడియున్నట్లు ఇలియడ్ వలన తెలియుచున్నది. కాని ఈ సార్వభౌమత్వము ఐచ్ఛికమైనదిగ కన్పట్టుచున్నది. ఈరాజులకు పెద్దలసభ (Council of Elders), పౌరుల సాధారణసభ (General Assembly of Citizens) పరిపాలనా వ్యవహారములలో తోడ్పడు చుండెడివి. కాని ఈ రాచరిక ప్రభుత్వము క్రీ. పూ. 8 వ శతాబ్దమునకు దైవాంశసంభూతులమని చెప్పుకొను ధనికవర్గ హస్తగతమయ్యెను.

ఇట్టి ప్రభుత్వము ప్రభువర్గప్రభుత్వము (Aristocracy) అని పిలువబడినది. కాని ఈ ప్రభువర్గమువారు స్వలాభాపేక్షులై వ్యవహరించుటచే స్వల్ప జనాధిపత్య ప్రభుత్వము (Oligarchy) ఏర్పడినది. కాని వీరును ప్రజల నణచుటకు ప్రయత్నించుటచే దేశమున విప్లవవాతావరణ మేర్పడి నిరంకుశ ప్రభుత్వము (Tyrany) నకు దారితీసెను. గ్రీకు నియంత (Tyrant) యందు అధికారము కేంద్రీకృతమైయున్నను ప్రజాక్షేమమునకే పాటుబడెడివాడు. నియంతృత్వ ప్రభుత్వము తుదకు ప్రజాస్వామిక ప్రభుత్వమునకు తావిచ్చినది. ఏథెన్స్ ప్రజాస్వామిక ప్రభుత్వ విధానమునకు, స్పార్టా స్వల్పజనాధిపత్య ప్రభుత్వమునకు ప్రతిబింబములై నిలచెను.

స్పార్టా :— డోరియన్ గ్రీకులు గ్రీసు ద్వీపకల్ప దక్షిణ భాగము నాక్రమించిరి. వీరి నా కాలమున లెకిడమోనియసులని పిలచెడివారు. వారి రాజ్యము లెకోనియా (Laconia) యైనది. ఇందుద్భవించిన నగర రాజ్యమె స్పార్టా (Sparta). గ్రీసు దేశము సాధించిన రాజకీయాభ్యుదయములో స్పార్టా స్థానము విలక్షణమైనది. ప్రచండులైన భూస్వామ్య, ధనికవర్గములకు, అసంతృప్తులైయున్న సామాన్య ప్రజావర్గములకుగల నిరంతర స్పర్ధలు స్పార్టను పౌరుల నొక వీరజాతిగ రూపొందించెను. వారి చట్టములు కఠినతరములుగ చేయబడెను. స్పార్టా యొక్క సైనిక శిబిరముగ మార్చబడెను. ప్రతిపౌరుడు బాల్యమునుండి సైనిక శిక్షణ పొందవలసియుండెడిది. బలహీనులుగ నున్న పసికూనలను పౌరసభ ఆజ్ఞానుసారము పర్వత శిఖరములపై విడచిపెట్టుచుండెడివారు. ఏడు సంవత్సరముల ప్రాయుడైన ప్రతిబాలుడు విధిగ వ్యాయామ శిబిరములకు పంపబడెడివాడు. బాలికలకును వ్యాయామము ముఖ్యవిధి. భుజబల సంపన్నులగు బిడ్డల జననమునకు మాతృదేవియు దృఢకాయిరాలై యుండవలెనని స్పార్టనుల నమ్మకము.

స్పార్టనులు దేహదారుఢ్యమునకు, పశుబలమునకు ప్రాధాన్యత నిచ్చుటచే కళామయ జీవితము లుప్తమైపోయినది. శాస్త్ర విజ్ఞానము

వెంపొందుటకుగాని, నర్తక వ్యాపారము లినుమడించుటకుగాని, నూతన విషయ పరిశోధనకుగాని అవకాశము లేకుండపోయెను. అయి నను గ్రీసు దేశమున వీరత్వమునకు స్పార్టనులు ప్రథమస్థాన మాక్ర మించిరి. స్వల్పజనాధిపత్య ప్రభుత్వమునే నమ్మి ప్రజాస్వామికవాదు లైన ఎథీనియనులతో స్పర్ధకలిగి యుండెడివారు.

ఏథెన్స్:—సాహిత్యము, శిల్పకళలు, శాస్త్రవిజ్ఞాన వేదాంత చర్చలు, వ్యక్తిస్వాతంత్ర్యములం దభిరుచిగల గ్రీకులకు ఎథీనియనులు మార్గదర్శకులైరి. ఎటికా (Attica) రాజ్య కేంద్రము ఏథెన్స్ (Athens) నగరము. ఎథీనా (Athena) ఈ రాజ్య రక్షిత దేవత. ఏథెన్స్ రాజ్య ప్రభుత్వము రాచరికమునుండి వివిధ పరిణామములనంది ప్రజాస్వామికమైనది. ఇతిహాసిక యుగమున థీసియస్ (Theseus) వంటి రాజన్యుల పాలనమున నుండెడిది. క్రీ. పూ. ఏడవ శతాబ్ద మున తొమ్మిదిమంది సభ్యులు గల స్వల్పజనాధిపత్య ప్రభుత్వమును పొందినది. పిదప సైలాన్ (Cylon) నియంతృత్వ ప్రభుత్వమును నెలకొల్ప యత్నించి విఫలుడయ్యెను. డ్రేకో అను నతడు ఒక శిక్షాస్మృతి నేర్పాటుజేసి విప్లవము నరికట్టెను. క్రీ. పూ. 594 లో ఆర్కన్ (Archon) పదవి నలంకరించిన సోలన్ (Solon) ప్రజ్ఞాశాలి, తన సంస్కరణలద్వారా ఏథెన్సునందు ప్రజాస్వామిక ప్రభుత్వము నకు బీజముల నాటెను. మానవులను తనఖాపెట్టి అప్పులు పుచ్చు కొను పద్ధతికి స్వస్తి చెప్పెను. అట్టి ఋణములను రద్దుచేసెను. ఎక్లీషియా (Ecclesia) అను ప్రజాసభ నేర్పాటుజేసెను. హీలియా (Heliaea) యను న్యాయసభను నిర్మించెను. అనేక ఆర్థిక సంస్కరణ లను ప్రవేశపెట్టి వివిధ వృత్తులవారిని ఏథెన్సునకు ఆకర్షించెను. కాని సోలన్ సంస్కరణలు బీదల దుస్థితిని పూర్తిగ తొలగించలేకపోయెను. స్వతంత్రులైన బానిసలకు భూవసతిగాని, వ్యాపారులకు, చేతిపనివారికి రాజకీయ హక్కులుగాని లభించలేదు.

క్రీ. పూ. 561 లో పిజిస్ట్రాటజ్ ఏథెన్సునకు నియంతయై నగరాభ్యుదయమునకు పాటుబడెను. అనేక ఆలయములను, భవన ములను కట్టించెను. వ్యవసాయము నభివృద్ధిజేసెను. వాని తరువాత

నియంతలు ఎథీనియనుల మన్నన లందలేకపోయిరి. హిపార్కస్ ప్రజలచే చంపబడెను. హిపియజ్ పారశీకమునకు పారిపోయెను. క్రీ. పూ. 508 లో క్లీస్తినెజ్ (Cleisthenes) ఏథెన్సునందు ప్రజాస్వామిక ప్రభుత్వము నేర్పాటు జేసెను. ఎటికాను డెమిస్ (Demes) లను విభాగములు జేసెను. బానిసలకు, విదేశీయులకు ఎన్నిక హక్కు లభించునట్లు జేసెను. సోలన్ ఏర్పరచిన సభలోని సభ్యుల సంఖ్య 500 కు పెంచి వివిధ డెమిస్‌లకు ప్రాతినిధ్యమిచ్చెను. తానేర్పరచిన ప్రజాస్వామిక ప్రభుత్వ రక్షణకై ఆస్ట్రాసిజమ్ (Ostracism) అను పద్ధతి నేర్పరచెను. దీనివలన ఏ సభ్యునకైనను ప్రజాసభయందు 6000 ఓట్లు వ్యతిరేకముగ వచ్చిన వానిని పదిసంవత్సరముల వరకు దేశ బహిష్కారము గావింతురు.

## 2. గ్రీకులు - పారశీకులు

పారశీక విజృంభణ :— క్రీ. పూ. 4000 ప్రాంతమున ఎలమైట్లు అను నొక తెగవారు ఇరాన్ నైరుతి భాగమున స్థిరనివాస మేర్పరచుకొనిరి. వీరు మెసపొటేమియాలోని బాబిలోనియను, అసీరియనులతోను, 'భారత దేశములోని ద్రావిడులతోను సంబంధములను కలిగియుండెడివారు. వీరు నిర్మించిన పట్టణములలో అవాన్ (Awan) సూసా (Susa) ముఖ్యమైనవి. అక్కడ్ పాలకుడగు సార్గన్ ఈలమ్ (Elam) నాక్రమించెను. పిదప హమ్మురాబి ఈ రాజ్యముపై సార్వభౌమత్వమును పొందెను. వాని తరువాత కెస్సైట్లు ఈ రాజ్యము నాక్రమించిరి. క్రీ. పూ. 12 వ శతాబ్దమున ఎలమైట్లు స్వాతంత్ర్యమును సంపాదించి బాబిలోనియాను గూడ పాలించిరి. కాని ఉత్తర ఇరాన్‌నందు మిడియనులు, పారశీకులు బలవంతులై ఈలమ్‌ను కబళింప సిద్ధపడిరి.

ఆర్య కుటుంబములోని కొందరు కాస్పియన్ సముద్ర ప్రాంతము నుండి క్రీ. పూ. 3000 ప్రాంతమున ఇరాన్‌నకు వలసవచ్చిరి. వీరిని చారిత్రకులు ఇండో-ఇరానియనులని పిలచుచున్నారు. వీరు మీడియా (Media) పర్షియా (Persia) అను రెండు రాజ్యములను

స్థాపించిరి. మిడియనులకు ఎక్బటానా (Ecbatana) రాజధాని. మీడియా సామ్రాజ్యమునకు పునాది వేసినవాడు సయాగ్జరిజ్ (Cyaxares). ఇతడు క్రీ. పూ. 633 - 593 మధ్య మీడియాను పాలించి బాబిలోనియనులతో కలసి అసీరియనుల రాజధాని యైన నినెవెను నాశన మొనరించెను (క్రీ. పూ. 613). వాని కుమారుడైన ఆస్టియాగెజ్ (Astyages) ను క్రీ. పూ. 550 లో పారశీక రాజైన సైరస్ (Cyrus) ఓడించి మీడియాను పర్షియాతో కలిపివేసెను. సైరస్ లిడియా పాలకుడగు క్రోసస్‌ను కెపడోసియా వద్ద నోడించి సార్డిన్‌ను పట్టుకొనెను. ఆసియా మైనరులోని అయోని యన్ గ్రీకురాజ్యములును సైరస్ పాదాక్రాంతము లయ్యెను. క్రీ. పూ. 539 లో బాబిలాన్ పట్టణమును వశపరచుకొనెను. దీనితో సైరస్ సిరియా, పాలస్తీనాలకు ప్రభువయ్యెను. సైరస్ మరణానంత రము వాని కుమారుడగు కాంబిసెస్ (Cambyses) పారశీక సామ్రాట్టయ్యెను. ఇతడు క్రీ. పూ. 525 లో ఈజిప్టు నాక్రమించెను. కాని ఇతడు ఈజిప్టునుండి తిరిగి వచ్చునప్పటికే రాజ్య మన్యాక్రాంత మయ్యెను. కాంబిసెస్ ఆత్మహత్య చేసికొని మరణించెను. క్రీ. పూ. 521 లో డరయస్ (Darius I) పారశీక సింహాసన మధిష్ఠించెను.

డరయస్ గొప్ప విజేత. పరిపాలనాదక్షుడు. సామ్రాజ్యాభివృద్ధికి అనేక సంస్కరణలను ప్రవేశపెట్టెను. అనేక రోడ్లను వేయించెను. నాణెములను ముద్రింపించెను. భారత దేశముపై దండయాత్ర నడిపి పంజాబు నాక్రమించెను. తన రాజ్యమును సత్రపిలను ఇరువది రాష్ట్రములుగ జేసెను. వానికి సాత్రాపులను పరిపాలకులను నియమించెను. ఇతడు రవాణా సౌకర్యముల నేర్పరచి యుండుటచే వివిధ ప్రదేశములనుండియు రాజధానికి వార్త లెప్పటి కప్పుడు జేరుచుండెడివి. ఇతడేర్పరచిన తపాలు విధానమును పటిష్ఠమైనది. నైలునదినుండి ఎఱ్ఱసముద్రము వరకు కాలువ త్రవ్వించి మధ్యధరా ఎఱ్ఱసముద్రములకు సంబంధమును కలుగజేసెను. సూసా, పెర్సిపొలిస్, ఎక్బటానా, బాబిలాన్ నగరములను రాజధానులుగ జేసికొనెను. సూసా నగరమున గొప్ప రాజప్రాసాదమును నిర్మిం

చెను. పెర్సిపొలిస్ నగరమును దివ్యభవనములతో నలంకరించెను. ఇతడు జొరాస్టరు (Zoraster) అనుయాయి. ఇతని పరిపాలనా కాలమున పారశీక సామ్రాజ్యము మహోన్నత దశ నొందెను.




పారశీక సామ్రాజ్యము

**గ్రీకు - పారశీక సంఘర్షణ :—** డరయస్ సిథియనులపై దండయాత్ర నడుపుచున్న సమయమున అయోనియను గ్రీకులు అరిస్టాగొరజ్ (Aristagoras) నాయకత్వమున తిరుగుబాటు గావించిరి. ఇతడు పారశీకుల నెదిరించుటకు ఇతర గ్రీకు రాజ్యముల సహాయమర్థించెను. స్పార్టా సైనిక సహాయమంప నిరాకరించెను. ఏథెన్సు, ఎరిట్రియా నగరవాసులు అరిస్టాగొరజ్‌నకు సహాయముగా కొంత సైన్యము నంపిరి. ఈ సైనిక సహాయముతో నతడు సార్డిస్ నగరమును తగులబెట్టెను. తిరుగుబాటుదారుల విద్రోహాచర్యలకు మండిపడి డరయస్ గ్రీకు సైన్యమును క్రీ. పూ. 494 లో లెడీ (Lade) ద్వీపసమీపమున నోడించెను. తిరుగుబాటును ప్రోత్సహించిన ఎథీనియను, ఇరిట్రియనులకు గుణపాఠము జెప్ప కృతనిశ్చయుడయ్యెను. ఇతని భోజన సమయమున "ప్రభూ! ఎథీనియనులను మరచిపోకుడీ!" యని యొక సేవకునకు ప్రతిదినము హెచ్చరిక చేయ

నాజ్ఞాపించెనట. డరయస్ నలుబదివేల సైన్యమును ఆయత్తపరచి గ్రీసుపై దండయాత్రకు పథకములను వేసెను.

క్రీ. పూ. 492 లో మార్డోనియస్ నాయకత్వమున బయల్వెడలిన పారశీకులు త్రేస్, మాసిడోనియాల నాక్రమించిరి. కాని మౌంట్ ఎథాస్ (Mount Athos) కడ పెనుతుఫానునందు చిక్కి సైన్యము సర్వనాశనమగుటచే మార్డోనియస్ తిరిగి పోవలసివచ్చెను.

కాని డరయస్ తన ఆశయసిద్ధికై క్రీ. పూ. 490 లో మరియొక దండును పంపెను. ఆసియామైనరునుండి 600 నౌకలలో పారశీక సైన్యము ఏజియన్ సముద్రమును లంఘించి ఎరిట్రియా, యూబియాల నాక్రమించెను. డేటిస్ అనువాని నాయకత్వమున కొంత సైన్యము ఏథెన్సు నగరమునకు ఇరువదినాలుగు మైళ్ళ దూరమున నున్న మరథాన్ (Marathon) నందు విడిసెను. ఎరిట్రియా ఓటమి ఎథీనియనులను కలవరపరచెను. స్పార్టనుల సహాయముకొఱకై అర్థించిరి. కాని వారు మీనమేషములను లెక్కజూడసాగిరి. తమ స్వాతంత్ర్య రక్షణకొరకై ఎథీనియనులు ప్రాణములను తృణప్రాయములుగ నెంచి శత్రువ్యూహమునందు జొచ్చుకొనిపోయిరి. ప్లాటియి నగరవాసులవలన మాత్రము కొద్దిసహాయమందినది. ఎథీనియనులు అల్పసంఖ్యాకులైనను పారశీకుల అపార సేనావాహినిని తరిమివేయగల్గిరి. అందులకు వారి కార్యదీక్ష, మాతృదేశభక్తి, స్వాతంత్ర్య పిపాస, స్థానబలిమి ముఖ్యకారణములని చెప్పవచ్చును. ఈ అఖండవిజయము ఎథీనియనుల ప్రతిష్ఠ నినుమడింపజేసెను. పారశీకుల నెదుర్కొనుటకు నౌకాబలమవసరమని గుర్తింపబడెను. ఆర్కాన్‌గనున్న థెమిస్టొకిల్స్ (Themistocles) ఏథెన్సురాజ్యమున కొకబలమైన నౌకాదళము నేర్పరచెను. రేవు పట్టణమైన పిరియస్ (Piraeus) అభివృద్ధి చేయబడెను.

మరథాన్‌వద్ద గలిగిన అపజయము పారశీకులను నిలువనీయలేదు. ప్రతీకారవాంఛతో తహతహ లాడసాగిరి. డరయస్ మరణానంతరము పారశీక గద్దె నెక్కిన జర్క్సిస్ (Xerxes) యుద్ధ సన్నాహములను చేయసాగెను. పారశీక దండయాత్రా విపత్తు

నెదుర్కొనుటకు గ్రీకులు సిద్ధపడవలసి వచ్చెను. వివిధరాజ్యముల వారు తమ తమ విభేదములను మరచి ఏకమైరి. థెమిస్టోకిల్స్, కోరింత్ (Corinth) నందొక సమావేశ మేర్పరచి గ్రీకు సైన్యములకు స్పార్టా సైన్యాధిపత్యము వహించునట్లు జేసెను.

క్రీ. పూ. 480 లో జర్క్సిస్ తన అఖండ సేనావాహినిని హెలెస్పాంటువద్ద నౌకావారధిపై సముద్రమును దాటించి గ్రీసునందు ప్రవేశించెను. వారి వెనువెంటనే పారశీక నౌకాదళము బయలు దేరెను. థెర్మాపొలై (Thermopylae) వద్ద స్పార్టారాజైన లియోనిడస్ (Leonidas) మూడువందల యోధులతో పారశీక సైన్యము నడ్డగించెను. ఈ యుద్ధ యుదంతము గ్రీసు చరిత్రలో సువర్ణాక్షరములతో లిఖించదగియున్నది. గ్రీకు సైన్యము సంపూర్ణముగ హతమైనను లియోనిడస్ సాహస పరాక్రమములు, కార్యదీక్ష కొనియాడ దగి యున్నవి.

థెర్మాపొలై నుండి పారశీక సైన్యము ఏథెన్సునకు పురోగమించెను. కాని నగరము జన శూన్యమయ్యెను. థెమిస్టోకిల్స్ నగరవాసుల నందరను పడవలలో సురక్షిత ప్రదేశమునకు జేర్చియుండెను. జర్క్సిస్ కోపమును పట్టజాలక నగరమును భూమట్టము గావించెను. కాని సాలమిస్ నౌకాయుద్ధమున పారశీక నౌకాదళము ఎథీనియన్ నౌకాదళముచే చిత్తుగా నోడింపబడెనను వార్త జర్క్సిస్‌నకు పిడుగుపాటయ్యెను. వెంటనే అతడు సార్డిస్ నగరమునకు పయనమయ్యెను.

గ్రీకు కాల్బలము పారశీకులను ప్లాటియావద్ద నోడించెను. మైకేల్ (Mycale) వద్ద పారశీక నౌకాబలము మరియొక ఘోర పరాజయమును పొందెను. దీనితో పారశీకులకు గ్రీకులను జయించు ఆశ లడుగంటెను. వారి సామ్రాజ్య పతనమునకు నాందియయ్యెను. ప్రాక్పశ్చిమ రాజ్యముల ప్రథమ సంఘర్షణలో పశ్చిమ రాజ్యముల వారికే విజయము లభించుటచే వారి ఆధిక్యతకు శంకుస్థాపన జరిగినది. గ్రీకుచరిత్రలో నూతనాధ్యాయము ప్రారంభింపబడినది.

## 3. డెలాస్ సమాఖ్య - ఎథీనియన్ సామ్రాజ్యము

డెలాస్ సమాఖ్య:— పారశీక ఓటమి వలన ఆ సామ్రాజ్య భాగములుగ నున్న గ్రీకు రాజ్యము లన్నియు స్వాతంత్ర్యము ప్రకటించుకొనెను. ఏ గ్రీకునగరరాజ్యము ఒంటరిగ బలమైన పారశీక సైన్యము నెదిరించి నిలువజాలదను సత్యము ఎల్లరకు విదితమయ్యెను. సంఘీభావము అత్యావసరమని గుర్తింపబడెను. అపొలో దేవత పవిత్రభూమియగు డెలాస్‌నందు వివిధ రాజ్య ప్రతినిధులు సమావేశమై యొక సమాఖ్య (Confederation) నేర్పరచుకొనిరి. ఈ సమాఖ్యకు బలము చేకూర్చుటకై వివిధ గ్రీకురాజ్యములు తమ శక్తికొలది ధన, సైనిక సహాయమును పంప నిశ్చయింపబడెను. ఈ సమాఖ్యపై పెత్తనము ఏథెన్సునకు లభించెను.

ఎథీనియన్ సామ్రాజ్యము:— పారశీకులచే ధ్వంస మొనరింపబడిన ఏథెన్సు నగరము పునర్నిర్మింపబడెను. నానాటికి ఏథెన్సు ప్రతిష్ఠ హెచ్చినది. సమాఖ్యకై జేర్చబడిన ధనాగారము ఎథీనియనుల వశమై యుండుటవలన గొప్ప నౌకాబలము చేకూర్చబడెను. దూరదూర దేశములందు వలసలు స్థాపింపబడెను. వర్తక వ్యాపారము లభివృద్ధి గాంచెను. గ్రీకురాజ్యములలో ఏథెన్సు బలమైన రాజ్యముగ రూపొందెను. క్రీ. పూ. 454 వ సంవత్సరము వచ్చునప్పటికి సమాఖ్యలోని సమాన ప్రతిపత్తిగల వివిధ గ్రీకురాజ్యములు ఏథెన్సు ఆధిక్యతను గుర్తించి దాని సార్వభౌమత్వమును స్వీకరింప వలసివచ్చెను. ఎథీనియన్ సామ్రాజ్య నిర్మాతగ పెరికిల్సు ఖ్యాతి గాంచెను. అతని పరిపాలనా కాలము పెరికిల్సు యుగమని పేర్గాంచెను.

పెరికిల్సు యుగము:— గ్రీకు రాజ్యాంగవేత్తలలో పెరికిల్సు ఘనుడు. ఇతడు క్రీ. పూ. 490 లో జన్మించెను. గ్రీకుల రాజకీయ రంగమున ముప్పదేండ్లు అప్రతిహతమగు అధికారమును చెలాయించెను. ఏథెన్సునగరమున ప్రముఖ వ్యక్తిగ పేర్గాంచి పారశీకయుద్ధ సమయమున తన ప్రజ్ఞను జూపెను. ఏథెన్సు ప్రజాస్వామిక ప్రభుత్వమును సంస్కరించెను. ప్రభుతోద్యోగములను ప్రతి



గ్రీసు
క్రీ.పూ.5వ. శతాబ్దము

గాంచిన విజయ మేమియు లేదు. తుద కిరుపక్షములవారు యుద్ధము నకు విసిగి నిసియాస్ కడ (Peace of Nicias) సంధి గావించుకొనిరి.

ఏథెన్సు నగరమున ఆల్సిబైడ్స్ (Alcibiades) అను నాయకుడు బయలుదేరెను. ఇతడు కడు ఉత్సాహవంతుడు. ప్రాచీన ఔన్నత్య మును సంపాదింపవలెనని సిసిలీలోని సిరాక్యూజ్‌ను ముట్టడింప ముప్పదివేల సైనికులతో నొక నౌకాదళమును పంపెను. కాని ఎథీనియనులకు విధి ప్రతికూలముగ నున్నది. సిరక్యూజ్ వద్ద ఎథీని యను లోడింపబడిరి. భూమార్గమున స్వదేశమును జేర బయలుదేరిన సైన్యము సర్వనాశనము గావింపబడెను.

ఏథెన్సు సామ్రాజ్యాధిపత్యమును ధిక్కరించిన సామంత రాజ్యములకు పారశీకుల సహాయము లభించినది. స్పార్టాయందు లిజాండర్ (Lysander) అను యోధుడు బయలుదేరెను. ఎథీనియను సేనలు హెలెస్పాంటువద్ద పూర్తిగ నోడింపబడెను. ఏథెన్సునగర గోడలు బ్రద్దలు గావింపబడెను. ఏథెన్స్‌లోని ప్రజాస్వామికమునకు స్వస్తిచెప్పబడెను. స్పార్టా ఆధిపత్యమున ఏథెన్సునందు "ఆలిగార్కి" ప్రభుత్వము నెలకొల్పబడెను.

ఏథెన్సు పతనానంతరము గ్రీకురాజ్యములపై స్పార్టా సామ్రా జ్యాధిపత్యమును సంపాదించెను. స్పార్టా క్రీ. పూ. 404 నుండి 371 వరకు అప్రతిహతమగు అధికారముతో నిరంకుశ ప్రభుత్వమును సాగించెను. కాని ఎపిమినాన్‌డస్ (Epiminondas) నాయకత్వమున తీబ్జ్ తిరుగుబాటును లేవదీసెను. ల్యూక్ట్రా యుద్ధమున తెబనులు స్పార్టనులను పూర్తిగ నోడించిరి. ఈ ఓటమితో స్పార్టను అధికా రము అధఃపతన మయ్యెను. గ్రీకురాజ్యములపై తీబ్జ్ ఆధిపత్య మెంతకాలమొ నిలువలేదు. ఎథీనియనులు, స్పార్టనులు ఏకమై తెబనులపై బడిరి. క్రీ. పూ. 362 లో మాంటినియా (Montinea) యుద్ధమున ఎపిమినాన్‌డస్ విజయముగాంచెను. కాని యుద్ధరంగమున మడిసెను. దీనితో తెబనుల అధికారము సన్నగిల్లెను. ఈ కల్లోల ములో గ్రీసు ఉత్తర ప్రాంతమున నున్న మేసిడోనియా బలసంపన్నమై గొప్ప సామ్రాజ్యమును నిర్మింపగల్గెను.

# 4. మేసిడోనియా విజృంభణ-అలెగ్జాండరు సామ్రాజ్యము

మేసిడోనియా విజృంభణ:— క్రీ. పూ. 359 నుండి 336 వరకు పాలించిన ఫిలిప్ మేసిడోనియాను గ్రీకురాజ్యములలో ప్రముఖమైనదిగ రూపొందించెను. ఇతడు గొప్ప ప్రజ్ఞాశాలి, రాజ్యతంత్ర నిపుణుడు. ఆశ్వికదళమును ప్రవేశపెట్టి యుద్ధతంత్రమున క్రొత్త అధ్యాయమును ప్రారంభించెను. తన రాజ్యమును తూర్పున ఏజియన్ సముద్రమువరకు ఉత్తరమున నల్లసముద్రమువరకు విస్తరింపజేసెను. గ్రీకురాజ్య సమాఖ్యపై ఆధిపత్యమును సంపాదింపవలెనని కాంక్షించి థెసలీ (Thessaly) నాక్రమించెను. క్రీ. పూ. 340 లో కెరోనియా యుద్ధమున ఫిలిప్‌కుమారుడగు అలెగ్జాండరు ఎథీనియన్, తీబ్జ్ సంయుక్తసేనల నోడించెను. ఈ యుద్ధములో గ్రీకుల స్వాతంత్ర్యమంతరించినది. యుద్ధానంతరము ఫిలిప్ కొరింత్ నందు గ్రీకు రాజ్యముల సమావేశ మేర్పాటు జేసెను. పర్షియాపై దండయాత్రకు ఫిలిప్‌ను సర్వసైన్యాధ్యక్షునిగ నిర్ణయించుచు వాని సార్వభౌమత్వమును హెలెనిస్టిక్ రాజ్యములన్నియు నంగీకరించెను. క్రీ. పూ. 336 లో ఫిలిప్ ఒక హంతకుని కత్తి కెరయగుటచే అలెగ్జాండరు మేసిడోనియా రాజ్యాధిపతి యయ్యెను.

అలెగ్జాండరు :— అలెగ్జాండరు ఇరువదియేండ్ల చిరుతప్రాయముననే గ్రీకు రాజ్యాధినేత యయ్యెను. ఇతడు మహాతత్వవేత్తయగు అరిస్టాటిల్‌నకు ప్రియశిష్యుడు. తండ్రియగు ఫిలిప్ ఇతనికి భావి సామ్రాట్టున కివ్వవలసిన శిక్షణ నిప్పించియుండెను. ఎపిరస్ రాకుమార్తెయగు ఒలింపియా ఇతని తల్లి. ఈమె బాలుడగు అలెగ్జాండరునకు అచిలస్, పెర్షియస్ వంటి గ్రీకువీరుల కథలను జెప్పుచు వారివలెనే గొప్ప కీర్తిని బడయుమని బోధచేయుచుండెడిది. అలెగ్జాండరు బాల్యమునుండియు తన శక్తి సామర్థ్యములను, మేధాసంపత్తిని ప్రదర్శించుచు మేసిడోనియావాసులను ఆశ్చర్య నిమగ్నుల జేయుచుండెడివాడు. 16 ఏండ్ల ప్రాయముననే కెరోనియా యుద్ధమున తన నైపుణ్యమును ప్రదర్శించి విజయము గాంచెను.

విజయయాత్ర :— అలెగ్జాండరు తన తండ్రి రాజ్యమునకే గాక అతని ఆశయములకును వారసుడయ్యెను. ప్రపంచమునంతను జయించి, హెలెనిస్టు నాగరికతను వ్యాపింపజేయవలెనను మహదాశయముతో క్రీ. పూ. 334 లో గొప్ప సైన్యముతో బయల్వెడలెను. హెలెస్పాంటును దాటి ఆసియాఖండమును ప్రవేశించెను. గ్రానికస్ (Granicus) వద్ద తన్నెదిరించిన పారశీక సైన్యమును పారద్రోలి అయోనియన్ గ్రీకు పట్టణములపై పారశీక సామ్రాజ్యాధిపత్యము నంతమొందించెను. క్రీ. పూ. 333 లో పారశీక రాజైన మూడవ డరయస్ ఆరులక్షల సైన్యముతో అలెగ్జాండరును ఇసిస్ (Issees) వద్ద డీకొనెను. కాని విజయలక్ష్మి గ్రీకు విజేతనే వరించెను. డరయసు క్రొత్త బలములను చేకూర్చుకొనుటకు రాజధానియైన సూసా నగరమునకు పారిపోయెను. అలెగ్జాండరు డరయస్‌ను వెంబడించక మధ్యధరాసముద్రమున పారశీక ప్రాబల్యము నంతమొందింపదలచెను. అందులకు పారశీక సామ్రాజ్య భాగములైయున్న సిరియా, ఈజిప్టులను లొంగదీయవలసి వచ్చెను. సిడన్, బిబ్లిస్ నగరములు గ్రీకు విజేతకు జోహారొనర్చి లొంగిపోయెను. టైరు నగరవాసులు అలెగ్జాండరును ప్రతిఘటించిరి. ప్రతిఫలముగ టైరునగరము అగ్నికి ఆహుతిచేయబడెను. అలెగ్జాండరు టైరునగరమునుండి తీరమునంటి ఈజిప్టునకు పయనము సాగించెను. మార్గమధ్యమున గాజా పాలకుడు అలెగ్జాండరు నెదిరించి శృంగభంగమును పొందెను. పారశీక ప్రభుత్వమును ద్వేషించుచున్న ఈజిప్షియనులు జగజ్జేతయగు అలెగ్జాండరునకు సుస్వాగతమిచ్చిరి. అలెగ్జాండరు ఈజిప్టునందు అలెగ్జాండ్రియా పట్టణమును నిర్మించెను. అమన్‌రా దేవాలయమును దర్శించి అచటి పూజారులచే దేవాంశసంభూతుడని ప్రశంసింపబడెను. నాటినుండి అలెగ్జాండరునకు తాను మానవాతీతుడనను భావము కలిగెననియు, అహంకారి యయ్యెననియు చెప్పబడుచున్నది.

క్రీ. పూ. 331 లో అలెగ్జాండరు మెంఫిస్ పట్టణమునుండి బయలుదేరి పాలస్తీనాగుండా పయనించి సిరియారాజ్యమును వశపరచుకొని బాబిలాన్ నగరమును ముట్టడింప పురోగమించెను. కాని


అలెగ్జాండరు విజయ యాత్ర
— దండయాత్ర మార్గము
మాసిడోనియా
పెల్లా
సెస్టాస్
గ్రీస్సు
సార్డిస్
గార్డియన్
ఫ్రిజియా
సైలీషియా
టార్సస్
ఇసస్
థాప్సకస్
సిరియా
గాజా
అమన్‌రా
మెంఫిస్
ఈజిప్టు
అర్బెలా
బాబిలాన్
ఎక్బటానా
సుసా
మిడియా
బాబిలోనియా
అరేబియా
పర్సిపొలిస్
గెడ్రోషియా
పాటాల
సాగ్డియానా
బాక్ట్రియా
కాబుల్
హైబరుకనుమ
అరఖోషియా
తక్షశిల
సింధు
GSR

డరయస్ పదిలక్షల సైన్యముతో అలెగ్జాండరును ఆర్బెలామైదానమున నెదుర్కొనెను. అలెగ్జాండరు ఆశ్విక, కాల్బలములు 47 వేలకు మించి యుండకపోయినను సుశిక్షితులై యుండుటచే సులభముగ విజయము గాంచగల్గెను. ఈ విజయముతో అలెగ్జాండరు పారశీక సామ్రాజ్యమున కంతకు అధినేత యయ్యెను. పారిపోవుచున్న డరయస్‌ను అతని భృత్యులలోనే యొకడు బాకుతో పొడిచి చంపి వేసెను. బాబిలాన్, సూసా, పెర్సిపొలిస్ నగరములు ప్రతిఘటన లేకుండనే అలెగ్జాండరునకు లొంగిపోయెను. పెర్సిపొలిస్‌నుండి ఉత్తరాభిముఖుడై ప్రయాణముచేసి ఎక్‌బటానాను చేరెను. అచటి నుండి కాస్పియన్ సముద్రతీర పర్వతవాసులను, అరఖోషియా, బాక్ట్రియా, సాగ్డియానాలను వశపరచుకొనుటలో నాలుగేండ్లుగడపి కైబరు కనుమను దాటి క్రీ. పూ. 327 లో భారతదేశమును ప్రవేశించెను.

తక్షశిల రాజైన అంభి గ్రీకు విజేతకు జోహారొనర్చి లొంగిపోయెను. అలెగ్జాండరు జీలంనది (హైడాస్పజ్) ని పడవల వంతెన సాయమున దాటెను. పురుషోత్తముడను హిందూరాజు అలెగ్జాండరు పురోగమనము నరికట్టెను. జీలంనది యొడ్డున ఇరుపక్షములకు ఘోరయుద్ధము జరిగెను. అదృష్టదేవత అలెగ్జాండరు పక్షమునే వహించెను. పురుషోత్తముని ధైర్యసాహసములకు దిగ్భ్రమ జెందిన యవనవీరుడు అతని స్నేహమును కాంక్షించెను. క్రమముగ పంజాబంతయు అలెగ్జాండరు వశమయ్యెను. అలెగ్జాండరు గంగామైదానమును జయింపదలచెను. కాని స్వదేశమునువీడి చాలకాలమగుటచే గ్రీకుసైన్యము ముందడుగువేయ నిరాకరించెను. అలెగ్జాండరు తప్పని సరియై వెనుకకుమరలెను. సింధునదిపై దక్షిణముగ ప్రయాణము సాగించి పాటాలానుండి భూమార్గమున పెర్సిపొలిస్ చేరెను. నియార్కస్ యాజమాన్యమున కొంతసైన్యము సముద్రమార్గమున పర్షియా సింధుశాఖను జేరెను.

అస్తమయము :— అలెగ్జాండరు క్రీ. పూ. 324 లో బాబిలాన్ నగరమును చేరెను. అయోనియన్ సముద్రమునుండి సింధునది

వరకు వ్యాపించియున్న తన విశాల సామ్రాజ్యమునకు మధ్యగనున్న బాబిలాన్‌ను తన రాజధానిగ జేసికొనెను. పశ్చిమ మధ్యధరా సముద్రమున ఆధిపత్యమును పొందుటకై పథకములను వేయసాగెను. కాని అతని ఈప్సితము నెరవేరకమున్నె మృత్యుదేవత అలెగ్జాండరు నావహించినది. క్రీ. పూ. 323 లో తన ముప్పదిమూడవయేట అలెగ్జాండరు ఇహలోకయాత్ర చాలించెను.

అలెగ్జాండరు శీలము :— అలెగ్జాండరు జీవితము విజయ పరంపరలతో నిండియున్నది. ముప్పదిమూడేండ్లు నిండకమున్నె అనేక యుద్ధములను జేసెను. అనేక కోటలను ముట్టడించెను. అనేక రాజ్యములను తన పాదాక్రాంతము జేసికొనెను. సుదూరప్రయాణము గావించెను. ప్రపంచమున ఇంతటి ఘనుడు, ఇంతటి విజేత లేడనుటలో అతిశయోక్తిలేదు. ఏకప్రపంచ రాజ్యస్థాపన జేయవలెననెడి మహదాశయము కొనియాడదగినది. ప్రాచ్య రాజ్యములలో గ్రీకునాగరికతను వ్యాపింపజేయవలెనని కాంక్షించెను. తన ఆశయ సిద్ధికై తాను జయించిన రాజ్యములందు అనేక నగరములను నిర్మించెను. అనేక వలసల నేర్పరచెను. ఇండియా, చైనా, జపానులలో గ్రీకునాగరికత వ్యాపించుటకీ విజేతయే మూలకారకుడని చెప్పవచ్చును. అలెగ్జాండరునకు సాహిత్య, శాస్త్ర విజ్ఞానములందు అభిమానము మెండు. భౌతిక శాస్త్రాభివృద్ధి కితడు గావించిన కృషి అపారము. తన దండయాత్రలో తనకు కనిపించిన వింత వృక్షజాతులను, జంతు, పక్షి సంతతులను, వివిధ రకములైన శిలలను పరీక్షార్థమై ఏథెన్సు నగరమున నున్న తన గురువగు అరిస్టాటిల్‌నకు పంపించెడివాడు. ఇతని దండయాత్రలవలననే పశ్చిమ రాజ్యవాసులకు ప్రపంచ విశాలత్వము కొంతవర కవగతమైనదని చెప్పవచ్చును. యూఫ్రటిస్, ఇండస్ నదులను కలుపు సముద్రమార్గాన్వేషణకు కారకుడై నూతన వర్తక మార్గావిష్కరణ గావించెను. ఇతడు స్వీయమతము, నాగరికతలందు గాఢాభిమానము కలవాడయ్యు అహంకారావేశుడు గాక సహనమును జూపెను. ప్రాక్పశ్చిమ జాతుల నేకము జేయ అంతర్వివాహములను ప్రోత్సహించెను. తాను

రెక్సానా (Rexana) యను పారశీక రాకుమారిని వివాహమాడెను. పారశీక వనితలను వివాహమాడిన గ్రీకు సైనికులను ఆదరించి, అభిమానించెను. పారశీక పద్ధతుల ననుకరించెను. కాని ఇతడు ప్రాగ్దేశముల వైభవాడంబరములకు ముగ్ధుడై ఇట్లు ప్రవర్తించెనని కొందరు చరిత్రకారు లభిప్రాయపడుచున్నారు.

అలెగ్జాండరు తాను జయించిన రాజ్యమున తన అధికారమును సుస్థిరపరచుకొనలేదు. రాజ్యపరిపాలనా విధానమునందితడు ప్రవేశ పెట్టిన సంస్కరణలు శూన్యము. పారశీక సామ్రాజ్యమున ఇతడు ఎట్టి ప్రజాసౌకర్యములను గూర్చలేదు. తాను దైవాంశసంభూతుడ నను అహంకారముతో స్నేహితులకు దూరమయ్యెను. ఇతడొక విధముగ ప్రాచీనకాలపు నెపోలియన్ యని పేర్కొనదగియున్నాడు. "అలెగ్జాండరు నెపోలియను లిద్దరును గొప్పవిజేతలు; ఇరువురును అవధులులేని ఆశాపీడితులు. ప్రపంచాధిపత్యము నిరువురును కాంక్షించిరి. ఇరువురును విజయామదిరను కడుపారగ్రోలిరి. ఇద్దరి విషయమున ఫలితము అహంకారమను మత్తు" అని డేవిస్ అను చరిత్రకారుడు వ్యాఖ్యానించి యున్నాడు.

సామ్రాజ్య పతనము:— అలెగ్జాండరు మరణానంతరము అతని సామ్రాజ్యము మూడు ముఖ్యభాగము లయ్యెను. పర్షియా, మెసపొటేమియా, సిరియా, ఆసియా మైనరునందు కొంత భాగము సెల్యూకస్ నికటర్ అధీనమయ్యెను. ఇతని సామ్రాజ్యము హెలెస్పాంటునుండి సింధునది వరకు వ్యాపించెనని చెప్పవచ్చును. దీనికి ఆంటియోక్ (Antioch) రాజధానియయ్యెను. చంద్రగుప్తమౌర్యుడు సెల్యూకస్ నోడించి పంజాబు, అరఘోషియా, గెడ్రోసియా రాజ్యములను పుచ్చుకొనెను. క్రీ. పూ. 138 లో పార్థియనులు సెల్యూకస్ వంశీయుల నోడించి మీడియా, బాబిలోనియా రాజ్యముల నాక్రమించిరి. క్రీ. పూ. 64 లో సిరియా రోమనులఆక్రమణ లోనికి పోయెను.

అలెగ్జాండరు సేనానులలో నొకడైన టాలమీ (Ptolemy) ఈజిప్టునకు పాలకుడయ్యెను. ఇతడు అలెగ్జాండ్రియాను రాజధానిగ

జేసికొనెను. ఇతని వంశీయు లీనగరమును గ్రీకు నాగరికతా కేంద్రముగ రూపొందించిరి. పెద్ద గ్రంథాలయమును నెలకొల్పిరి. మొదటి టాలమీ అలెగ్జాండ్రియాయందు నిర్మించిన దీప స్తంభము (Lighthouse) ప్రపంచమున మొట్టమొదటిదని పేర్గాంచినది. క్రీ. పూ. 30 లో ఈజిప్టును రోమను లాక్రమించుటతో టాలమీల పాలన అంతరించినది.

యూరపు ఖండముననున్న అలెగ్జాండరు సామ్రాజ్య భాగమునకు ఆంటిగోనస్ రాజయ్యెను. ఇతని వంశీకులు గ్రీసును క్రీ. పూ. 146 వరకు పాలించిరి. తుదకిది రోమన్ సామ్రాజ్య భాగమయ్యెను.

## 5. హెలెనిస్టిక్ నాగరికత

నాగరికతా వ్యాప్తి :— గ్రీకులను హెలెన్ లందురు. వారి నాగరికత హెలెనిజముగా పేర్కొనబడినది. అలెగ్జాండరునకు పూర్వము హెలెనిజము మధ్యధరాసముద్రతీర పట్టణములకు మాత్రమె వ్యాపించియుండెను. అలెగ్జాండరు ప్రపంచమంతను జయించి హెలినిజమును వ్యాపింపజేయ నెంచియుండెను. అలెగ్జాండరు మరణానంతరము ఆ కార్యక్రమమును వాని సేనానులు స్వీకరించిరి. ఆసియా రాజ్యముల పాలకుడైన సెల్యూకస్, ఈజిప్టు పాలకుడైన టాలమీ గ్రీకు నాగరికతా వ్యాప్తికి కృషి జేసిరి. ఆ రాజ్యములలో ప్రభుత్వోద్యోగములందు, సైన్యమునందు వేలకొలది గ్రీకులు నియమింపబడిరి. తూర్పురాజ్యములలో వర్తక వ్యాపారములు, వ్యవసాయమును సాగించి భాగ్యవంతులు గావలెనని అనేక గ్రీకు కుటుంబములు ఈజిప్టు, ఆసియాలకు వలసబోయెను. తూర్పు మెడిటరేనియన్ రాజ్యములలోను, ప్రాచ్యరాజ్యములలోని ముఖ్య నగరములందు గ్రీకుభాష ప్రముఖ భాష యయ్యెను.

ప్రాక్పశ్చిమముల వైవాహికముతో హెలెనిజముయొక్క స్వరూపమె మారిపోయెను. ప్రాగ్దేశముల నాగరికతా ప్రాభవము గ్రీకు నాగరికతపై ప్రసరించినది. రెండింటి సమ్మేళనముతో క్రొంగ్రొత్త నాగరికత ఏర్పడినది. దానిని హెలెనిస్టు నాగరికతగ చరిత్రకారులు

నిర్దేశించి యున్నారు. ఇది హెలెనిజమునకు భిన్నమైనదిగను, అభివృద్ధి కరమైనదిగ నున్నది గ్రీకులు చిన్నచిన్న నగరరాజ్యముల పాలనకు అలవాటుపడి యుండిరి. ప్రభుత్వ కార్యకలాపములందు నగరములోని ప్రతిపౌరుడు ప్రముఖపాత్ర వహించెడివాడు. నగరములోని పౌరులందరు సన్నిహిత సంబంధము కలవారై యుండుటకు ఆటపాటలు, ఉత్సవములు మిక్కిలి ఉపయోగకరముగ నుండెడివి. కాని హెలెనిస్టు యుగమున నగరరాజ్య స్థానమును విశాలమైన సామ్రాజ్యము లాక్రమించెను. ఇట్టి రాజ్యములలో ప్రాచీన హెలెనిజ జీవితమును గడుపుట దుష్కరమయ్యెను. ఈ యుగమున మానవుని దృక్పథము మారిపోయెను. పారశీక సామ్రాట్టుల చిరకాలార్జితమైన సువర్ణనిధి అలెగ్జాండరు హస్తగతమయ్యెను. బంగారు నాణెములు పుష్కలముగా ప్రవేశపెట్టబడెను. పరపతి సౌకర్యములు హెచ్చెను. వర్తక వ్యాపారము లినుమడించెను. నగరరాజ్య ఆర్థికవిధానము మారిపోయి, మధ్యధరాసముద్ర ప్రాంతమున నూతనమగు పెట్టుబడిదారీ విధానము ప్రవేశించెను. ఈజిప్టు, మెసపొటేమియాలందు వ్యవసాయాభివృద్ధి సాధించబడినది. ఆహార ధాన్యములు పుష్కలముగ యూరపు రాజ్యముల కెగుమతి యగుచుండెడివి.

సాహిత్యము, కళలు, తత్వశాస్త్రములందును గొప్ప మార్పు కనబడుచున్నది. హెలెనిస్టు యుగమున గ్రీకు తత్వశాస్త్రముపై ప్రాచ్యఖండముల ఆధ్యాత్మికచింతనాప్రభావము సుస్పష్టము. ఒకవంక గ్రీకులు తమ విజ్ఞాన వల్లరిని ప్రాచ్యదేశములలో ప్రవేశపెట్ట ప్రయత్నింప మరియొకవంక ప్రాగ్దేశముల విజ్ఞానము అప్రయత్నముగనే పశ్చిమ రాజ్యములలో స్థానము సంపాదించుకొనినది. పునర్జన్మ సిద్ధాంతము భారతదేశమునుండియె పశ్చిమ రాజ్యములకు వ్యాపించెనని చెప్పబడుచున్నది. అశోక చక్రవర్తి ఈజిప్టునకు బౌద్ధమత ప్రచారకుల నంపెను. బౌద్ధమత సూత్రములలోని సర్వమానవ సమానత్వభావము యవనప్రపంచమున మిక్కిలి వ్యాప్తిచెంది క్రైస్తవ మతోద్భవమునకు మూలాంకురమయ్యెను.

హెలెనిస్టుయుగమున క్రొత్తవేదాంత సూత్రములు ప్రవేశపెట్టబడెను. సినిక్కులు (Cynics) ధనమదాంధత వలన కలుగు నష్టములు, నిరాడంబర జీవితమందలి ఔన్నత్యమును ప్రబోధించిరి. బాహ్యావర్తనయందుగాక మానవుడు సత్వగుణసంపన్నుడై నిష్కల్మష హృదయుడై యుండవలెనని స్టోయికులు (Stoics) ప్రచారము గావించిరి. ఆహారపానీయములందు, ఆచార వ్యవహారములందు క్రమపద్ధతిని (Moderation) కల్గి ఆనందమయ జీవితమును గడపుటే జీవిత సాఫల్యమని ఎపిక్యూరియనులు (Epicureans) బోధించిరి.

శాస్త్ర విజ్ఞానరంగమున ఈ యుగమున సాధించిన అభివృద్ధి ప్రశంసనీయము. ప్రాగ్దేశముల శాస్త్ర విజ్ఞానమును గ్రహించి, పరిశోధనగావించి గ్రీకు శాస్త్రజ్ఞులు మత, వేదాంత నమ్మకములకు తావులేని శాస్త్రవిజ్ఞానమును రూపొందించిరి. గణితము, జ్యోతిషము, శస్త్రము, భూగోళ, ఖగోళ, శాస్త్రములందు నూతన సిద్ధాంతములు ప్రవేశపెట్టబడెను. నాటిశాస్త్రజ్ఞులలో సిరాక్యూజ్ నగరవాసియగు ఆర్కిమిడీస్ సుప్రసిద్ధుడు. ఇతడు ఆధునిక పదార్థ, భౌతిక విజ్ఞాన




ఎరటోస్థనీస్ దృక్పథమున ప్రపంచము

శాస్త్రములకు తన పరిశోధనలద్వారా బీజముల నాటెను. జంతు, వృక్షశాస్త్రములలో అరిస్టాటిల్, ఆతని శిష్యులు ఘటికులు. యూక్లిడ్ (Euclid క్రీ. పూ. 323 - 285) గణితశాస్త్రమున గొప్ప గ్రంథమును వ్రాసెను. అలెగ్జాండ్రియా నగరమున నొక ఖగోళ పరిశోధన కేంద్ర ముండెడిది. నాటి ఖగోళ శాస్త్రజ్ఞులలో హిపార్కస్ ముఖ్యుడు. భూగోళశాస్త్ర విజ్ఞానమునకు ఎరటోస్తనీస్ మూలపురుషుడు. ఇతడే అక్షాంశ, రేఖాంశములను కనిపెట్టెను. నాటి ప్రపంచమున యూరేషియా మధ్యధరా సముద్రతీర ప్రాంత మైన ఆఫ్రికా మాత్రమె పరిచితమై యుండెను.

నగర నిర్మాణమునందును హెలెనిస్టు యుగమున క్రొత్త పద్ధతులు అనుసరించబడెను. నాటి నగరములలో పెర్గమమ్, అలెగ్జాండ్రియా, రోడ్స్ నగరములు ప్రముఖ కళాకేంద్రములయ్యెను. నాటి శిల్పులు, చిత్రకారులు మూర్తి చిత్రణములో అద్భుతమైన నైపుణ్యమును ప్రదర్శించిరి.

# అ ధ్యా య ము 5

# రోమను మహాయుగము

## 1. ప్రాచీన రోము

ఇటలీలోని ప్రథమ వాసులు :— మధ్యధరాసముద్ర మధ్య భాగమున ఇటలీ ద్వీపకల్పము ఒక పాదమువలె వ్యాపించియున్నది. ఈ ద్వీపకల్పమున క్రీ. పూ. 1000 నాటికే ఇట్రస్కనులను కకేషియన్ జాతివారు 'పో' నదీమండలము నాక్రమించిరి. వీరు ఆసియా మైనరునుండి వచ్చిరనియు, క్రీట్ ద్వీపవాసుల నాగరికతను బోలిన నాగరికత గలవారనియు చెప్పబడుచున్నది. వీరు క్రమముగ దక్షిణమునకు వ్యాపించి క్రీ. పూ. అయిదవశతాబ్దమునకు మధ్య ఇటలీయందు స్థావర మేర్పరచుకొని యుండిరి. వీ రాక్రమించిన భాగము ఇట్రరియా యని పిలువబడుచున్నది. ఇటలీకి వలసవచ్చిన ఆర్య తెగలలో అంబ్రియనులు, సెబైనులు, సెమ్నైటులు, లాటినులు ముఖ్యులు. లాటినులు టైబరునదికి దక్షిణముగ నున్న సమతల మైదానము నాక్రమించిరి. ఈ భాగము లాటినమ్ అని పిలువబడినది. లాటినమ్‌నందు సుమారు ముప్పది జనపదము లుండెడివి. ఇవి యన్నియు 'లాటిన్ లీగ్' అను పేర సుసంఘటితమై యుండెడివి.




క్రీ. పూ. 5 వ శతాబ్దమున ఇటలీ

అంబ్రోసెబెలియనులు మధ్య ఇటలీ, తూర్పు తీర ప్రాంతముల నాక్ర మించిరి. క్రీ. పూ. 8 వ శతాబ్దము నుండి గ్రీకులు దక్షిణఇటలీ, తూర్పు సిసిలీలయందు వలసల నేర్పరచి ఆ భాగమును మాగ్న గ్రీసియా (పెద్దగ్రీసు) అని పిలచిరి.

రోమునగర నిర్మాణము :— ఇట్రుస్కనులకు, లాటినులకు టైబరునది సరిహద్దుగ నుండెడిది. టైబరునది ఉత్తరతీరమున ఏడు కొండలు గలవు. ఈ కొండలపై లాటినులు ఏడుజనపదములను స్థాపించిరి. కాలక్రమమున నీయేడు జనపదములు కలసిపోయి ఏడుకొండల నగరము (The City of Seven Hills) ఏర్పడినది. ఇదియె రోమునగరము. ఈ నగర నిర్మాణమునుగూర్చి అనేక పుక్కిటి పురాణములు ప్రచారములో నున్నవి. రియాసిల్వియాయను రాకుమార్తెను మార్స్ అను భగవంతుడు వివాహమాడెననియు, వారికి జన్మించిన రొములస్, రిమస్ అను కవలసోదరులు రోమునగర నిర్మాణ కర్తలనియు చెప్పబడుచున్నది. ఈ పురాణగాథ వలన ఈనగరము క్రీ. పూ. 753 లో నిర్మింపబడెనని తెలియుచున్నది. రోమునగరమును క్రీ. పూ. 753 నుండి 509 వరకు ఏడుగురు రాజులు పరిపాలించిరని ఇతిహాసముల వలన తెలియుచున్నది. ఈ రాజులకు నూర్గురు వృద్ధసభ్యులుగల సెనేటు అను సభ సలహాల నిచ్చుచుండెడిది. రోమనులు మూడు వందల తెగలు (Clans) గ విభజింపబడియుండెడివారు. ఈ తెగలకు కమీటా క్యూరియెటా (Comita Curiata) అను ప్రజాసభ ప్రాతినిధ్యము వహించుచుండెడిది.

## 2. రోములో ప్రజాసత్తాక ప్రభుత్వము

రిపబ్లిక్ స్థాపన :— టార్క్వినియస్ సుపర్బస్ అను రాజు నిరంకుశుడై ప్రజలను బాధించసాగెను. క్రీ. పూ. 510 లో ప్రజలు తిరుగుబాటును లేవదీసి రాజకుటుంబమును నగరమునుండి తరిమివేసి ప్రభుత్వాధికారమును హస్తగత మొనరించుకొనిరి. రోము ప్రజాసత్తాక రాజ్యముగ ప్రకటింపబడినది. రాజు స్థానమును ఇరువురు కాన్సల్స్ (Consuls) ఆక్రమించిరి. ఆపదసమయములందు వీరిలో

నొకరు ఆరుమాసముల వరకు సర్వాధికారములను కలిగి నియంత (Dictator) గ ప్రవర్తింపవచ్చును. కాన్సలున్ను, ప్రియేటర్లు, సెనేటర్లు మొదలగు ఉద్యోగుల నెన్నుకొనుటకు కమిటా సెంచురియేటా (Comitia Centuriata) అను నూతన ప్రజాసభ యేర్పరుపబడెను. ఇది నేరములను విచారించి శిక్షలను విధించుట, యుద్ధము, సంధి మొదలగు ముఖ్యరాజకీయ విషయములను నిర్ణయించుట, పన్నులను విధించుట మొదలగు హక్కులను కలిగియుండెడిది. తుదకీసభ విశేష ప్రాముఖ్యతను పొంది కమిటా క్యూరియేటా అధికారముల నపహరించెను. కాని కాలక్రమమున ప్రజాసభల కంటె సెనేటు మిక్కిలి బలసంపన్నమై ప్రభుత్వాధికారమును తన గుప్పిట బెట్టు కొనెను. అధికార మట్లు కేంద్రీకృతమగుటచే రోమనులు గొప్ప సామ్రాజ్య నిర్మాతలగుటకు అవకాశ మేర్పడినది.

**పెట్రీషియను ప్లెబియనుల కలహము:—** రోమునగర జన సంఖ్య నానాటికి పెరుగసాగినది. విదేశీయులు గుంపులు గుంపులుగ వచ్చి రోము నగరమున స్థిరనివాస మేర్పరచుకొనసాగిరి. తుదకు రోమునగరమున ఆదిమవాసులైన పెట్రిషియను (Petricians) ల కంటె క్రొత్తగవచ్చిన ప్లెబియను (Plebians) ల సంఖ్య హెచ్చినది. పెట్రిషి యనులు ధనవంతులైన భూస్వాములు. రాజకీయ, మత, సాంఘిక విషయములందు వీరు విశేష అధికారములను కలిగియుండెడివారు. వీరు ప్లెబియనులను హీనముగ జూచెడివారు. ప్లెబియనులకు ఉన్నత పదవు లుండెడివిగావు. వారి ధన, ప్రాణములకు ప్రభుత్వము తగిన రక్షణ కలిగించెడిదిగాదు. ప్లెబియనులతో వివాహము చట్టబద్ధము గాదు. వీనికితోడు యుద్ధసమయములందు ప్లెబియనులు విధిగ సైన్యము నందు జేరి జీతబత్తెములు లేకుండనే పాటుబడవలసి యుండెడిది. ప్లెబియనులు అప్పులపాలై తమకున్న భూములను కోల్పోవలసి వచ్చెను. తుదకు వీరు తమ ఋణములను తీర్చలేక ధనవంతులగు పెట్రిషియనులకు బానిసలుగావలసి వచ్చెను. నానాటికి రెండు వర్గ ముల మధ్య విభేదములు హెచ్చసాగెను. తుదకు క్రీ. పూ. 494లో ప్లెబియనులు రోమునగరమును విడిచిపెట్టి పోవుటకు నిశ్చయించిరి.

కాని నగరరక్షణ బాధ్యతను తమ భుజస్కంధములపై వహించుచున్న ప్లెబియనులను కోల్పోవుట కిచ్ఛగింపక పెట్రిషియనులు వారికి కొన్ని సౌకర్యములను కలిగించిరి. దానివలన ప్లెబియనులకు ట్రిబ్యూన్స (Tribunes) అను మేజిస్ట్రేటుల నెన్నుకొనుహక్కు లభించెను. కాని రెండు వర్గములమధ్య కలహము శతాబ్దములకాలము కొనసాగినది. ఈ కలహము రక్తపాత రహితమైనది. ప్లెబియనులు రాజకీయ ఆందోళనల ద్వారా పెట్రిషియనులతో సమానమైన హక్కులను సంపాదించుకొనగల్గిరి. క్రీ. పూ. 300 సంవత్సరమునకు న్యాయ, మత, సాంఘిక, రాజకీయ విషయములందు రెండు వర్గములకు సమానమైన ప్రతిపత్తి లభించెను. ఆర్థిక అసమానత్వము తొలగింపబడెను. ప్లెబియనుల అప్పులు రద్దుచేయబడెను. బానిసలు స్వతంత్రులైరి. ప్రభుత్వ భూములు ప్లెబియనులకును పంచియిచ్చిరి. ప్లెబియను పెట్రిషియనుల మధ్య వివాహములు చట్టసమ్మతములయ్యెను. తుదకు వర్గవిభేదమే మటుమాయమయ్యెను.

## 3. రోము రాజ్యవిస్తరణ

ఒకవంక దేశమున రాజకీయ హక్కులకై శాంతియుత పోరాటము జరుగుచుండ మరియొకవంక రోము తన అధికార విస్తరణ కార్యక్రమమును నిర్విఘ్నముగ కొనసాగించినది. ఈ కార్యక్రమము క్రీ. పూ. అయిదవ శతాబ్దముననే ప్రారంభింపబడినది. ప్రథమమున పొరుగు రాజ్యములపై తన అధికారమును ప్రతిష్ఠించి తుదకు మధ్యధరా ప్రపంచమునకంతకు ఆధిపత్యము వహించి మహోన్నతదశ నందినది. అలెగ్జాండరు 'ఏక ప్రపంచము-ఏక రాజ్యము'ను స్థాపించుటకై కనిన కలలను రోమనులు కార్యరూపమున బెట్టిరి. రోమనులు తామాక్రమించిన భాగములందు ఎప్పటికప్పుడే రోడ్లు, వలసలు, పటిష్ఠమైన ప్రభుత్వ విధానముల నేర్పరచి తమ అధికారమును సుస్థిరము జేసికొనెడివారు. రాజ్యవిస్తీర్ణత పెరిగినకొలది కేంద్ర ప్రభుత్వమున అవసరమైన మార్పులను జేసి పరిపాలనా వ్యవస్థను పటిష్ఠము జేసెడివారు.

**ఇటలీ ఆక్రమణ :—** రోమనులు ప్రప్రథమమున తమ దృష్టిని పొరుగు రాజ్యములపై ప్రసరింపజేసిరి. వీరు లాటినులతో మిత్రత్వ సంధిగావించుకొని క్రీ. పూ. 493 నకు లాటిన్ లీగు అధ్యక్ష స్థానము నాక్రమించిరి. సిన్ సినాటస్ అను రోమను నియంత ఎక్వియను (Acquians) ల నోడించెను. సెబైనులు, వాల్సియనులు, హెర్నిసియనులు రోము అధికారము నంగీకరింపక తప్పలేదు. క్రీ. పూ. 396 లో ఇట్రస్కనుల ముఖ్య నగరమైన వివి (Veii) రోమనుల ఆక్రమణలోనికి వచ్చుటతో రోము తన పొరుగురాజ్యముల నన్నింటిపై ఆధిపత్యము కలిగినదయ్యెను.

క్రీ. పూ. 390 లో 'గాలులు' రోముపై దండయాత్ర జరిపిరి. ఏలియా నదీతీరమున రోమనులను పూర్తిగ నోడించి రోము నగరమును తగులబెట్టిరి. కాని వారు రెండుమాసములలోనే రోమను లిచ్చిన లంచములవలననో లేక మలేరియా వ్యాధి వ్యాపించుట వలననో స్వదేశమునకు మరలిపోయిరి. రోమనులు తమ నగరమును పునర్నిర్మించుకొనిరి. తమ ఉత్తర సరిహద్దునకు రక్షణగ అనేక బలమైన కోటలను నిర్మించిరి. కాని గాలుల దండయాత్ర నాధారముగ జేసికొని ఇట్రస్కనులు, వార్సియనులు, ఎక్వియనులు, లాటినులు తలయెత్తి తిరుగుబాటులను లేవదీసిరి. రోమనులు అతి సమర్థతతో ఈ తిరుగుబాటుల నణచివేయుటేగాక లాటినమ్, దక్షిణ ఇట్రరియా, కంపేనియాలను తమ పాలనలోనికి తెచ్చిరి.

రోము దక్షిణవ్యాప్తివలన రోమనులకు సెమ్నైటులతో సంఘర్షణ కలిగెను. రోమనులు, సెమ్నైటులు ఒకేజాతివారైనను పర్వతవాసులగుటచే సెమ్నైటులు అనాగరికులుగ నుండిరి. వారి పర్వతదుర్గములే వారికి ముఖ్యబలము. క్రీ. పూ. 343 లో మొదటి సెమ్నైటు యుద్ధము ప్రారంభమైనది. సెమ్నైటులు కంపేనియాపై దాడి జరుప రోమనులు వారి నోడించి తరిమివేసిరి. 341 లో ఇరు పక్షములవారు మిత్రత్వసంధి గావించుకొనిరి.

రోమనుల యుద్ధములందు పాల్గొనుచు లాటినులు రోము విస్తరణకు సహాయపడుచుండిరి. లాటిన్ లీగ్ పై రోము ఆధిపత్యము

వహించియుండెడిది. లాటినులు రోమనులతో సమానమైన రాజకీయ హక్కులు కావలెననియు సెనేటునందు ప్రాతినిధ్యము, కాన్సలునందు ఒకస్థానము కావలెననియు పట్టుబట్టిరి. కాని రోమనులు వారి కోర్కెలను పూర్తిగ నిరాకరించిరి. ఈ నిరాకరణ యుద్ధమునకు దారితీసినది. క్రీ. పూ. 340-338 లలో జరిగిన లాటిను యుద్ధమునందు రోమనులు విజయముగాంచి లాటినులను తమ పాదాక్రాంతులుగ జేసికొనిరి. లాటిన్ లీగు రద్దుచేయబడినది. లీగులోని సభ్యరాజ్యములతో రోము ప్రత్యేకసంధులను గావించుకొని తన అధికారమును నిలబెట్టుకొనెను.

లాటిన్ యుద్ధానంతరము క్రీ. పూ. 327 లో రెండవ సెమ్నైటు యుద్ధము ప్రారంభమయ్యెను. ఈ యుద్ధము 22 సంవత్సరముల వరకు కొనసాగినది. పేలియోపొలిస్ (Palaeopolis) అను గ్రీకు వలసకడ ఇరుపక్షములకు అభిప్రాయభేదములు కలిగి ఆయుధములను బట్టిరి. సెమ్నైటులు రోమను సైన్యమును నడిపిన ఇరువురు కాన్సలులను ఓడించి సంధి కొప్పించిరి. కాని ఈ సంధికి రోమను సెనేటు అంగీకరింపకపోవుటచే యుద్ధము పునఃప్రారంభమయ్యెను. క్రీ. పూ. 314 నుండి రోమనులకు విజయావకాశములు హెచ్చెను. సెమ్నైటుల కేంద్రమైన బొవియానమ్ (Bovianum) రోమనుల హస్తగతమయ్యెను. వారికి సహాయముగ వచ్చిన ఇట్రుస్కనులు 'వాడిమోసరస్సు' (Lake Vadimo) యుద్ధమున ఓడిపోయిరి. క్రీ. పూ. 304 లో ఇరుపక్షముల వారు సంధిచేసికొనిరి.

కాని ఈ మైత్రి ఎక్కువకాలము నిలువలేదు. క్రీ. పూ. 298 లో మూడవ సెమ్నైటు యుద్ధము ప్రారంభమైనది. సెమ్నైటులు, ఇట్రుస్కనులు, అంబ్రియనులు, గాలులు కలసి రోమనులపై కత్తి దూసిరి. కాని సెంటినమ్ (Sentinum) యుద్ధమున ఘోరపరాజయమందిరి. రోమనులు తమ శత్రువుల నందరిని లొంగదీసి తమ అధికారమును సుస్థిరపరచుకొనిరి. క్రీ. పూ. 281 వ సంవత్సరమునకు ఇటలీలో ఉత్తరమున పోనదీమండలము, దక్షిణమున గ్రీకువలసలు తప్ప మిగత భాగమంతయు రోము పాలనలోనికి వచ్చెను.

ఇటలీలోని గ్రీకు వలసలలో టారెంటమ్ (Tarentem) ముఖ్యమైనది. రోమనులు టారెంటైనులతో జేసికొనిన సంధిని ధిక్కరించి టారెంటమ్ రేవునందు తమ పడవలను ప్రవేశపెట్టిరి. రోమను నౌకాదళము ధ్వంసము చేయబడుటతో గ్రీకు-రోమను యుద్ధము ప్రారంభమైనది. గ్రీకులు ఎపిరస్ (Epirus) రాజైన పైరస్ (Pyrrhus) సహాయమర్థించిరి. టారెంటైనుల ఆహ్వానమును పురస్కరించుకొని పైరస్ గొప్పదళముతో ఇటలీ చేరెను. తన గజదళ సాయముతో క్రీ. పూ. 280 లో హెరాక్లియా (Heraclea) వద్ద రోమనులను పరాజితుల జేసెను. దక్షిణ ఇటలీలోని గ్రీకులు, లుకేనియనులు, బ్రూషియనులు, సమ్నైటులు పైరస్‌తో చేరిరి. సిసిలీలోని గ్రీకులు తమను కార్తజీనియనుల బారినుండి తప్పింపుమని వేడుటచే పైరస్ సిసిలీకేగి అచట అనేకవిజయములను గాంచెను. కాని వారిని సిసిలీ నుండి పూర్తిగ తరిమివేయలేకపోయెను. క్రీ. పూ. 276 లో ఇటలీకి తిరిగివచ్చెను. కాని అతని పూర్వమిత్రులు అతనిని విడనాడిరి. బెనివెంటమ్ (Beneventem) వద్ద రోమనులచే ఓడింపబడి పైరస్ స్వదేశమునకు మరలిపోయెను. క్రీ. పూ. 272 లో టారెంటమ్ లొంగిపోవుటతో రోము దక్షిణ ఇటలీకి అధినేతయయ్యెను.

రోమనులు తాము జయించిన రాజ్యములయెడ అవలంబించిన విదేశాంగ విధానము ప్రశంసనీయము. వారు ఆ రాజ్యములను తమ రాజ్యముతో కలిపివేసెడివారుకారు. ఆయా రాజ్యముల స్వపరిపాలనాధికారమును గుర్తించి ప్రభుత్వాధికారమును వహించుచున్న వర్గముతో సన్నిహితమైన సంబంధము నేర్పరచుకొనెడివారు. ఈ రాజ్యములతో నొకవిధమైన సమాఖ్య (Confederacy) నేర్పరచెడివారు. ఆయా రాజ్యములవారు రోమనుల సామంతుల మను భావమును కలిగియుండక మిత్రులవలె నుండెడివారు. కాని రోమనులు 'విభజించిపాలించు' (Divide et Impera) అను తమ సూత్రము ననుసరించి వివిధ రాజ్యములు ఏకముగాకుండ జూచెడివారు. వారికి యుద్ధము-సంధి జేసికొను హక్కును లేకుండ జేసెడివారు. యుద్ధ సమయములందు సభ్యరాజ్యములనుండి నిర్ణీతమైన సైన్యమును

పిలిపించెడివారు. ఈ సేనకు 'రోమనుశాంతి' (The Roman Peace or Pox Romana) యే ప్రతిఫలము. రోమను అధికారమును సుస్థిర పరచుటలో రోమను వలసలు ప్రముఖపాత్ర వహించెడివి. వివిధ రాజ్యములలో వ్యాపించిన రోమనువలసలు రోము నగర సైనిక శిబిరములుగనే గాక తమ భాష, మతము, సంస్కృతులను వ్యాపింప జేసి జాతీయైక్యతను సాధించుచుండెడివి. వలసలలోని రోమనులు రోమను పౌరసత్వమును కలిగియుండెడివారు. రోమనులు ఇటలీ యంతటను చక్కని బాటలను నిర్మించి తమ సైన్యములను వివిధ ప్రదేశములకు అతి త్వరలో పంపు సౌకర్యము నేర్పరచుకొనిరి. వీని వలన సభ్యరాజ్యములలోని తిరుగుబాట్లు విజృంభింపక మున్నె అణచి వేయ వీలుగలిగెను. పరిమిత రాజకీయ సౌకర్యములు, స్థానిక స్వపరిపాలన, రోముతో సన్నిహిత సంబంధము, సభ్యరాజ్యముల మధ్య సంబంధము లేకుండ జేయుట రోమను ప్రభుత్వ విధానములోని ముఖ్యాంశములు.

ప్యూనిక్ యుద్ధములు :— ఇటలీలో రోమువలెనే ఉత్తర ఆఫ్రికాలో కార్తేజి తన అధికారవ్యాప్తి గావించియుండెను. కార్తేజి ఫినీషియనుల వలస. అనతికాలములోనే కార్తేజి ఆఫ్రికాలో సుమారు 300 నగరములను, కార్సికా, సార్డీనియా, సిసిలీలో అధికభాగ మును, దక్షిణ స్పెయినును తన అధికారములోనికి తెచ్చి వర్తక వ్యాపారముల వలన విశేషధనమును గడించుచు మధ్యధరాసముద్ర పశ్చిమభాగమునకు రాజ్ఞియయ్యెను. దక్షిణ ఇటలీ, సిసిలీలలోని గ్రీకురాజ్యముల నంతమొందించుటకు, పైరస్ దాడి నెదుర్కొనుటకు రోమనులు కార్తజీనియనులతో నెయ్యము నెరపిరి. సామ్రాజ్య నిర్మాణకార్యక్రమమున కృతకృత్యులౌరా లగుచు మధ్యధరాసముద్ర మును తన గుప్పిట బెట్టుకొనదలచిన రోమునకు కార్తేజి ఆధిక్యత కన్నెఱ్ఱ యయ్యెను. సిసిలీద్వీప ఆధిపత్యమునకై రెండు దేశములు వేచియుండెను. సిసిలీద్వీప రాజకీయములలో జోక్యము జేసికొని రెండు దేశములు కయ్యమునకు దిగెను. ఒకశతాబ్దమునకు పైగా (క్రీ. పూ. 264-146) కొనసాగిన ఈ కలహము ప్యూనిక్ యుద్ధము లుగ చరిత్రప్రసిద్ధి బడసెను.

సిరాక్యూజు రాజునకు రక్షణయను సాకుతో రోమనులు మొదటి ప్యూనిక్ యుద్ధము (క్రీ. పూ. 264-241) నకు దిగిరి. భూమిపై యుద్ధములందు రోమనులు విజయముగాంచినను కార్తజీని యనులకు వారి నౌకాబలము అండయయ్యెను. రోమనులు 120 నౌకలను నిర్మించి కార్తజీనియను నౌకాబలమును మైలే (Mylae) వద్ద ఓడించిరి. కార్తజీనియనులు క్రీ. పూ. 241 లో సంధిగావించుకొని సిసిలీపై తమ ఆధిపత్యమును వదులుకొనిరి. సిసిలీ రోమను సామ్రాజ్యభాగమయ్యెను.

కార్తజీనియనులు అంతఃకలహములలో మునిగియుండగా రోము కార్సికా, సార్డీనియాల నాక్రమించెను. గాలులను జయించి పో నదీ లోయను రోమనుసామ్రాజ్యమున జేర్చెను. కార్సికా, సార్డీనియాల నష్టమును పూడ్చుకొనుటకై కార్తజీనియనులు స్పెయిన్ నందు తమ అధికారమండలమును విస్తృతముజేయ సంకల్పించిరి. ఈ కార్యక్రమమును హామిల్కర్, హాస్డ్రుబాల్, హానిబాల్ లు పూర్తిగావించిరి. హానిబాల్ గొప్పవీరుడు. కార్యదీక్షగలవాడు. సమర్థుడగు సేనాని. పిరనీస్ పర్వతముల వరకు కార్తజీనియనుల అధికారమును వ్యాపింప జేసెను. క్రీ. పూ. 219 లో రోము మిత్ర రాజ్యమైన సాగుంటమ్ (Saguntum) ను ముట్టడించుటతో రెండవ ప్యూనిక్ యుద్ధము ప్రారంభమైనది.

రోమనులు కార్తజీనియుల నెదుర్కొనుటకై స్పెయినున కొక సైన్యమును పంపిరి. కాని హానిబాల్ యుద్ధమును ఇటలీ నడిగడ్డకే తెచ్చెను. ఇతడు తన ఏబదివేల సైన్యముతోను, గజ బలముతోను, పిరనీస్ పర్వతములను, గాలుదేశమును, ఆల్ప్సు పర్వతములను దాటి ఇటలీయందు ప్రవేశించి రోమనుల నాశ్చర్య చకితుల జేసెను. ఇతడు నాలుగు యుద్ధములలో రోమనుల నోడించెను. ఇందు క్రీ. పూ. 216 లో జరిగిన కెన్నె (Cannae) యుద్ధము ముఖ్యమైనది. ఈ యుద్ధమున రోమనుసైన్యములు సర్వ నాశన మొనరింపబడెను. రోమునకు క్లిష్టపరిస్థితి ఏర్పడెను. మేసిడోనియా రాజగు ఫిలిప్ రోముపై దండయాత్రకు సిద్ధమయ్యెను.

క్రీ. పూ. 215 లో సిసిలీలోని సిరాక్యూజ్ తిరుగుబాటుగావించెను. దక్షిణ ఇటలీలోని గ్రీకులు హాన్నిబాల్ నాహ్వానించిరి. కాని రోమనులు ధైర్యమును కోల్పోక సహనమును ప్రదర్శించి కష్టముల నెదుర్కొనిరి. గ్రీసునందొక అంతఃకలహమును బయలుదేరదీసి ఫిలిప్ దండయాత్రను తప్పించుకొనిరి. స్పెయిన్‌నందు యుద్ధమును కొనసాగించిరి. హాన్నిబాల్‌నకు సహాయముగ వచ్చుచున్న హాస్డ్రుబాల్‌ను మిటారస్ (Metaurus) నదీతీరమున ఓడించి చంపిరి. రోమను సేనానియగు స్కిపియో (Scipio) ఆఫ్రికాచేరి కార్తేజిపై బడెను. స్వదేశ రక్షణార్థమై హాన్నిబాల్ ఇటలీ వదలిపోవలసివచ్చెను. క్రీ. పూ. 202లో జామా (Zama) యుద్ధమున కార్తజీనియనులు పూర్తిగ ఓడి సంధి కియ్యకొనిరి. దీనివలన కార్తేజి ఆఫ్రికాకు వెలుపలనున్న సామ్రాజ్యభాగము నంతను రోమునకు ధారబోసెను. తన యుద్ధ నౌకలను, ఏనుగులను రోమున కిచ్చుటేగాక యుద్ధఖర్చులకై ధన రాసులను గుమ్మరింపవలసి వచ్చెను. రోమనుల అనుమతిలేకుండ యుద్ధప్రయత్నము జేయనని వాగ్దానముజేసి కార్తేజి రోమునకు సామంతరాజ్య మయ్యెను.

యుద్ధములవలన సంభవించిన నష్టమును కార్తజీనియనులు వర్తకవ్యాపారములవలన పూడ్చుకొని మరల ధనవంతులైరి. రోమనులకిది సహింపరానిదయ్యెను. కార్తేజి నాశనమైనగాని రోము వృద్ధిపొందజాలదని కేటో (Cato) మొదలగు సెనేటర్లు ప్రచారము చేయసాగిరి. రోము సమయమునకై యెదురుచూడసాగెను. కార్తేజీని యనులకు పొరుగువారైన నుమిడీయనులకు బద్ధవైరముండెడిది. నుమిడియా (Numidia) రోమునకు మిత్రరాజ్యము. నుమిడియా రాజగు మెస్సినిస్సాకు సహాయముగ రోమను సైన్యములు కార్తేజి నందు ప్రవేశించెను. క్రీ. పూ. 149 నుండి నాలుగు సంవత్సరముల కాలము పట్టణమును ముట్టడిజరిపి కార్తేజీనియనులను లొంగదీసిరి. కార్తేజిపట్టణము భూ మట్టము గావింపబడెను. కార్తేజీనియను రాజ్యము రోమను సామ్రాజ్యభాగముగ జేర్చబడెను.

**మధ్యధరా సముద్రాధిపత్యము :—** ప్యూనిక్ యుద్ధమువలన రోమునకు పశ్చిమ మధ్యధరా సముద్రమున ప్రాబల్యము లభించుటే గాక నౌకాబలము పెంపొందెను. రోము తన దృష్టిని తూర్పునకు సారించెను. క్రీ. పూ. 229 లో ఇలీరియాపై విజయము సాధించి కార్సిరా (Corcyra) అపొలోనియా (Apollonia) ఎపిడమస్ (Epidamnus) లపై ఆధిపత్యమును సంపాదించెను. మేసిడోనియా రాజగు ఫిలిప్ హాన్నిబాల్ నకు మిత్రుడగుటచే రోమనులకు విరోధి యయ్యెను. రోమనులు మేసిడోనియాను నాలుగు యుద్ధములలో నోడించి గ్రీసుపై ఆధిపత్యమును పొందిరి. గ్రీసు మేసిడోనియాలు కలసి రోమను సామ్రాజ్యమున ఏకియా (Achaea) అనుపేర నొక రాష్ట్రమయ్యెను. రోమనులు ఆసియా ఖండమున ప్రవేశించి క్రీ. పూ. 190 లో సిరియా పాలకుడగు అంటియోకస్ (Antiochus) ను మగ్నేషియా (Magnesia) యుద్ధమున ఓడించిరి. టారస్ పర్వత వరుసకు పశ్చిమముగనున్న రాజ్యమంతయు రోమను సామ్రాజ్య భాగమయ్యెను. దీనితో రోము మధ్యధరా సముద్ర రాజ్ఞియైనదని చెప్పవచ్చును.

## 4. రిపబ్లిక్ పతనము - జూలియస్ సీజరు

**గ్రేకన్ విప్లవము :—** నిరంతర యుద్ధములవలన ఇటలీలోని ప్రజల జీవితమున అనేక పరిణామములు కలిగినవి. రోమనుల సాంఘిక వ్యవస్థ పూర్తిగ మారిపోయినది. గ్రీకులతోడి సంపర్కము వలన కర్తవ్యతా పరాయణులైన రోమనులు విలాసవంతులై, ఆడంబరులైరి. సుఖలాలసత్వమున కలవాటుపడిరి. సామ్రాజ్యములోని వివిధభాగములనుండి వచ్చిపడుచున్న ధనరాసులతో రోమను ఖజానా నిండిపోయినది. రాజకీయోద్యోగులు, వర్తకులు, ధనవంతులైరి. పౌర సైనికులకు బదులు వేతనముపై పనిచేయు సైనికులు వచ్చిరి. రోమనులు తరచు యుద్ధములందు పాల్గొనుచుండుటచే వ్యవసాయము చేయువారులేక పొలములు బీళ్ళయ్యెను. కాని సిసిలీ, కార్థేజ్, ఈజిప్టులనుండి ధాన్యము దిగుమతి చేసికొనబడుచుండెడిది.

ధనవంతులగు భూస్వాముల భూములనన్నింటిని కొనివేసి బానిసలచే వ్యవసాయము చేయింపసాగిరి. సెనెటు అధికారము హెచ్చి ప్రజా సభల పలుకుబడి నశించినది. సెనెటునందు లంచగొండులు, ధనమదాంధులైన భూస్వామిక వర్గమునకు ప్రముఖస్థానము లభించినది. అవినీతి హెచ్చినది. తుదకు దేశము కలిమిగలవారు (Haves) లేనివారు (Have-nots) అను రెండు వర్గములుగ చీలిపోయెను. నానాటికి ఈ రెండు వర్గముల మధ్య వైషమ్య మభివృద్ధి జెందసాగెను. తుద కిరుపక్షములవారు ఆయుధపాణులై రక్తపాతమునకు కారకులైరి.

క్రీ. పూ. 133 లో టైబిరియస్ గ్రేకస్ అను నాతడు ట్రిబ్యూన్ పదవినొందెను. ఇతడు ప్రభుత్వ భూములకు పరిమితిని బెట్టి వ్యవసాయ సంస్కరణలకు పూనుకొనెను. ధనవంతులగు భూస్వాములు ఈ సంస్కరణలను వ్యతిరేకించి టైబిరియస్‌ను మూడు వందల అనుచరులతో సహా వధించిరి. టైబిరియస్ స్థానమును వాని సోదరుడగు కెయాస్ వహించి విప్లవాత్మకమైన సంస్కరణలను ప్రవేశ పెట్టెను. రోమను పౌరులకు ధాన్యము చవకధరలలో విక్రయింప బడవలెనని శాసించెను. రోమను పౌరసత్వ హక్కును విస్తృతము జేయ సంకల్పించెను. కాని స్వార్థపరులైన రోమను జనులు కెయాస్ సంస్కరణలను వ్యతిరేకించిరి. కెయాస్ హత్య గావింప బడెను. ఈ హత్యలతో దేశపరిస్థితి కుదుటబడలేదు. గ్రేకస్‌లను సమర్థించు పాప్యులరీస్ (Popularies) అను ప్రజాపక్షము, సెనెటర్లను బలపరచు ఆప్టిమేటులు (Optimates) అను ధనికవర్గ పక్షము యేర్పడెను.

**మారియస్ సిల్లాల కలహము** :— గ్రేకస్ సోదరుల మరణా నంతరము ప్రజాపక్షమునువహించి పోరాడినవాడు కెయాస్ మారియస్. ఇతడు యుద్ధకళాప్రవీణుడు. నుమీడియను రాజైన జుగుర్తా (Jugurtha) చేసిన తిరుగుబాటు నణచి (క్రీ. పూ. 111 - 106) రోమను వీరుడుగ ప్రఖ్యాతిగాంచెను. ఉత్తర ప్రాంతమునుండి సింబ్రి (Cimbri) ట్యూటన్ (Teutons) లను అనాగరిక తెగలు రోముపై దండయాత్ర జరిపిరి. మారియస్ వారిపై విజయముగాంచి రోమునందు ప్రముఖ

వ్యక్తిగ గుర్తింపబడెను. ప్రజాపక్షమునకు నాయకుడయ్యెను. కాన్సల్ పదవినొంది అనేక సైనిక సంస్కరణలను ప్రవేశపెట్టెను. ఈ సంస్కరణలవలన సైన్యము సేనాని చెప్పుచేతలలోనుండి రిపబ్లిక్ పతనమునకు మూలకారణమయ్యెను.

ఆ కాలమున ఇటలీ ప్రజలు మూడు ముఖ్యవర్గములుగ విభజింపబడి యుండిరి. 1. రోమను పౌరులు 2. లాటినులు 3. సోషి (Socii). సోషివర్గమునకు పౌరసత్వహక్కులు లేకపోవుటచే వారు క్రీ. పూ. 90 లో యుద్ధమునకు దిగిరి. ఇది సోషల్ యుద్ధము (Social war) లేక సాంఘిక సంగ్రామము అని పిలువబడుచున్నది. ఈ యుద్ధ ఫలితముగ తిరుగుబాటుదారులకు పౌరసత్వహక్కు లభించినది. ఈ యుద్ధమున మారియస్ తన ప్రతిష్ఠను కోల్పోయెను. ప్రభువర్గీయుడైన సిల్లా ప్రజాభిమానమును సంపాదించెను.

సాంఘిక సంగ్రామమును అదనుగా జేసికొని పాంటస్ రాజగు మిత్రిడేట్స్ (Mithridates) తిరుగుబాటుగావించి ఆసియామైనరు, మేసిడోనియా, గ్రీసుల నాక్రమించెను. సిల్లా మిత్రిడేట్స్‌పై యుద్ధమునకు పంపబడెను. నగరము విడిచి పారిపోయిన మారియస్ మరల తన బలగముతో రోమును ప్రవేశించి అయిదేండ్లు పరిపాలన గావించి, సిల్లా అనుయాయుల నణచివేసెను. తూర్పుప్రాంతమున విజయమందిన సిల్లా క్రీ. పూ. 82 లో రోమునకు తిరిగివచ్చెను. మారియస్ పక్షము నోడించి ప్రభుత్వాధికారమును పొందెను. దేశదేశములకు పారిపోయిన మారియస్ పక్షమువారిని సుమారు 5000 మందిని వెదకి వెదకి పట్టించి చంపించెను. రోమునకు నియంతయై సెనేటు అధికారము పెంపొందునట్లు క్రొత్తచట్టములను ప్రవేశపెట్టెను. కాని అవినీతి కలవాటుపడిన, చంచలబుద్ధులైన ధనికవర్గము తమకు లభించిన శాసనాధికారమును నిలుపుకొనలేకపోయిరి.

పాంపే - సీజరు:— సిల్లా మరణానంతరము వాని సహచరుడైన పాంపే రోమను రాజకీయ రంగమున ప్రముఖ వ్యక్తియయ్యెను. ఇతడును గొప్ప వీరుడు. నానాటికి రోమనులయందు వీరపూజ

అధికమయ్యెను. యుద్ధములందు అసమాన ప్రజ్ఞ జూపినవారే రోమనుల ఆదరణకు పాత్రులగుచుండిరి. సైన్యమంతయు వారి అధీనమున నుండుటయు వారి ప్రాబల్యమునకు దోహద పడసాగెను. ఈ సేనానులు నియంతృత్వమును వహించుటతో సెనేటు నామ మాత్రావశిష్టమయ్యెను. పాంపే ప్రథమమున స్పెయిన్‌నందు అనేక విజయములను సాధించి అచటి పరిస్థితులను చక్కబరచెను. పిదప మధ్యధరా సముద్రమున వర్తకనౌకలను దోచుకొనుచున్న సముద్ర దొంగల నణచివేసి రోమనుల ప్రశంసకు పాత్రుడయ్యెను. పిదప పాంపే తూర్పు ప్రాంతమున కేగి మిత్రిడేట్స్‌పై ఘనవిజయమును సాధించెను. మిత్రిడేట్స్ క్రిమియాకు పారిపోయి అచట మరణించెను. పాంపే ఆసియా మైనరునుండి బయలుదేరి సిరియా రాజ్యము నాక్ర మించి రోమను సామ్రాజ్య హద్దును యూఫ్రటిస్ నదివరకు పెంచెను.

పాంపే తూర్పుప్రాంతమున యుద్ధములలో మునిగియున్న కాలమున రోమునందు జూలియస్ సీజరు రాజకీయ ప్రాముఖ్యము సంపాదింప సాగెను. గేయస్ జూలియస్‌సీజరు క్రీ. పూ. 102 లో ఒక ధనిక కుటుంబమున జన్మించెను. ఇతడు రాజకీయములందు ప్రజాపక్షము వహించి పేర్గాంచెను. సీజరు గొప్ప వక్త. ప్రజ్ఞా వంతుడు. యుక్తిశాలి. పాంపే తూర్పు దేశములనుండి తిరిగి రాక మున్నే సెనేటు సభ్యులకు విందులు, వినోదములు గూర్చి వారి మన్న నకు పాత్రుడయ్యెను. రోములో మిక్కిలి ధనవంతుడైన క్రాసస్ (Crassus) తో స్నేహము జేసికొనెను. క్రీ. పూ. 61 లో పాంపే దిగ్విజయుడై తిరిగి వచ్చెను. పాంపే, క్రాసస్, సీజరులు కలసి ప్రథమ పాలక త్రయము (First Triumvirate) గ నేర్పడిరి. క్రీ. పూ. 59 లో సీజరు కాన్సలు పదవిని పొందెను. సీజరును గాలుదేశముపై దండయాత్రకు పంపుటకు నిశ్చయింపబడెను. సీజరు తన కుమార్తెయగు జూలియాను పాంపే కిచ్చి వివాహము గావించి రాజ కీయ సంబంధమును దృఢతరము గావించెను.

క్రీ. పూ. 58 లో సీజరు గాలుదేశముపై దండెత్తెను. ఏడు సంవత్సరములు యుద్ధములలో గడిపి రోమను సామ్రాజ్యహద్దును

బ్రిటిష్ ఛానలువరకు పెంచెను. సీజరు బ్రిటాన్నీలోని కెల్టుల నణచు చుండ పొరుగుననున్న బ్రిటన్ దీవినుండి వారికి సహాయమందు చున్నట్లు తెలిసికొని బ్రిటనులను దండింప క్రీ. పూ. 55, 54 సంవత్స రములలో రెండు దండయాత్రలను నడిపెను. ఇతడు తన అనుభవము లను కామెంటరీస్ (Commentaries) అను గ్రంథముగా రచించెను. సీజరు తన విజయములతో రోమనుల ప్రశంసలను చూరగొనసాగెను. తన పదవి కెక్కడ భంగము కలుగునోయని పాంపే భయపడసాగెను. దీనికితోడు క్రాసస్ తూర్పుదేశమున పార్థియనులతో యుద్ధము చేయుచు మరణించెను. సీజరు పాంపేలకు సన్నిహిత సంబంధము కలి గించిన జూలియాగూడ మరణించెను (క్రీ. పూ. 54). పాంపే సెనేటు సభ్యులను కూడగట్టుకొని సీజరు రూబికన్ నదినిదాటి రాగూడదను ఆంక్ష పెట్టించెను. పరిస్థితులు విషమించుచున్నవని గ్రహించి సీజరు తన సైన్యముతో రూబికన్ నదినిదాటి ఇటలీలో ప్రవేశించెను. సీజరు నెదిరించుట దుష్కరమని తలచి పాంపే గ్రీసు దేశమునకు పారిపోయెను.

సీజరు రోమునందు తన అధికారమును సుస్థిరపరచుకొని పాంపేకు సానుభూతి జూపుచున్న స్పెయిన్ పై దండయాత్ర జరిపెను. అచటి పాంపే అనుయాయుల నోడించి పాంపేను వెంటాడ తూర్పు దేశముల కేగెను. ఫార్సాలస్ (Pharsalus) యుద్ధమున పాంపే నోడిం చెను. పాంపే థేసల్లీనుండి ఈజిప్టునకు పారిపోయెను. కాని అచట టాలమీ XII ఆజ్ఞచే పాంపే హత్య గావింపబడెను.

పాంపేను వెంటాడుచు సీజరు ఈజిప్టును చేరెను. కాని అచట టాలమీ సీజరును ముట్టడించి బంధించెను. అదృష్టదేవత సీజరును వరించినది. టాలమీ హతుడయ్యెను. సీజరు రాజసోదరియగు క్లియోపాట్రాను ఈజిప్టునకు రాణిగాజేసి ఆమె సౌందర్యమునకు ముగ్ధుడై ఆమెతో కొంతకాలము గడిపెను. పిదప సిరియా తిరుగుబాటు నణచి జెలాయుద్ధమున గొప్ప విజయముగాంచెను. పాంపే అను యాయుల నందరి నోడించి క్రీ. పూ. 45 సెప్టెంబరులో రోము నగర మును చేరెను.

**సీజరు నియంతృత్వపాలన** :— క్రీ. పూ. 46 లో సీజరు పది సంవత్సరముల కాలము నియంతగనుండ అంగీకరింపబడెను. మరుసంవత్సరము అతడు జీవితాంతము నియంతగ చేయబడెను. తాను పరిపాలించిన నాలుగు సంవత్సరములలోనే అనేక సంస్కరణలను జేసి సీజరు గొప్ప పరిపాలనాదక్షుడని పేర్గాంచెను. సెనేటు సభ్యులసంఖ్య 900 వరకు పెంచెను. సెనేటునందు రాష్ట్రములకును ప్రాతినిధ్య మిచ్చెను. రాష్ట్రవాసులకు రోమనుపౌరసత్వ మిచ్చెను. రాష్ట్రముల పరిపాలనావ్యవస్థను క్రమపరచెను. ప్రతి రాష్ట్రమునకు రోమను పద్ధతిలో సెనేటు, కాన్సలుల నేర్పరచెను. అనేక ప్రజోపకరమైన పనులను కల్పించి నిరుద్యోగసమస్యను పరిష్కరించెను. నూతన వలసల నేర్పరచుటకు ప్రోత్సహించెను. పన్నులభారమును తగ్గించెను. నీటిపారుదల సౌకర్యములను కలిగించి వ్యవసాయము నభివృద్ధిపరచెను. ఈజిప్షియను విజ్ఞానము ఆధారముగ పంచాంగమును సవరించి 365¼ రోజుల సంవత్సరము నేర్పరచెను. ఇది జూలియన్ కాలెండరు (Julian Calendar) అని ప్రసిద్ధిబడసెను. (క్రీ. శ. 1582 లో పోపుగ్రిగరీ XIII ఈ పంచాంగమునందు కొలది మార్పులను జేసెను.) సీజరు రోమను న్యాయసూత్రములను క్రోడీకరించుటకు పథకమును వేసెను. రోమునందొక పెద్ద గ్రంథాలయము నేర్పరచుటకు యత్నించెను.

రోమునందు నెలకొల్పబడిన నియంతృత్వ ప్రభుత్వము కొందరికేవగింపయ్యెను. ప్రజాస్వామ్యము మంటగలసి పోవుచున్నదని బాధపడసాగిరి. ఇంతలో సీజరు కిరీటమును ధరించి చక్రవర్తిబిరుదు నొందనున్నాడను వదంతి బయలుదేరెను. ప్రజాసత్తాక ప్రభుత్వమునందు సంపూర్ణ విశ్వాసముగల బ్రూటస్ నకు, సీజరు అధికారమునుజూచి అసూయాగ్రస్తుడైన కాషియస్ తోడయ్యెను. సీజరుపై కుట్రపన్నబడెను. క్రీ. పూ. 40 మార్చి 15 న సీజరు సెనేటుసభలో కుట్రదారులచే హత్యగావింపబడెను.

**ద్వితీయ పాలకత్రయము** :— సీజరుహత్య యొక్క అంతఃకలహమునకు దారితీసినది. 13 సంవత్సరముల వరకు దేశమున అరాచక పరిస్థితులేర్పడినవి. రిపబ్లిక్ రక్షణకు సీజరును హత్యగావించిన

బ్రూటస్, కాషియస్‌లు అధికారమును హస్తగత మొనరించుకొన ప్రయత్నించిరి. కాని సీజరు మిత్రుడగు ఆంటొనీ ప్రజలను రెచ్చగొట్టి కుట్రదారులపై ద్వేషమును పుట్టించెను. బ్రూటస్, కాషియస్‌లు గ్రీసునకు పారిపోయిరి. ఆంటొనీ, సీజరు దత్తపుత్రుడగు ఆక్టేవియస్, లెపిడస్‌లు ద్వితీయ పాలకత్రయము (Second Triumvirate) గ నేర్పడిరి. ఫిలిప్పి (Philippi) యుద్ధమున కుట్రదారుల నోడించిరి. బ్రూటస్, కాషియస్‌లు ఆత్మహత్య గావించుకొనిరి. ఇంతటితో రోమునందు ప్రజాసత్తాక పాలన అంతరించినదని చెప్పవచ్చును.

ఫిలిప్పి యుద్ధానంతరము ఆక్టేవియస్ రోమునకు తిరిగి వచ్చెను. ఆంటొనీ పార్థియాపై దండయాత్ర నడుపుచు ఆసియామైనరున కేగెను. కాని అచట నతడు ఈజిప్టు రాణియైన క్లియోపాట్రా ఇంద్రజాలమున జిక్కి ఆమె అందమునకు దాసుడై తన కర్తవ్యమునే మరచిపోయెను.

ఆక్టేవియస్ యువకుడైనను కడు మేధావి. గొప్ప రాజకీయ తంత్రజ్ఞుడు. రోమను సామ్రాజ్యమున కేకైక నాయకుడుగావలెనని కాంక్షించిన ఆక్టేవియస్‌నకు ఆంటొనీ ప్రేమకలాపములు సదవకాశము కల్గించెను. రోమను సామ్రాజ్యమునకు అలెగ్జాండ్రియా రాజధాని కానున్నదను వదంతి ఆంటొనీని పదభ్రష్టుని గావించెను. మరల నొక అంతర్యుద్ధము ప్రారంభమయ్యెను. కాని ఆక్టియమ్ యుద్ధమున ఆంటొనీ ఓడిపోయి ఆత్మహత్య గావించుకొనెను. 'నైలునదీ నాగ రాణి' (Serpent of the Nile)యని పేర్గాంచిన జగదేక సుందరి క్లియో పాట్రా ఆక్టేవియస్‌ను తన సమ్మోహనాస్త్రముచే జయింపలేక, రోమునగర వీధులలో బందీగ త్రిప్పబడుట కిచ్చగింపక ఆత్మహత్య జేసికొనెను. ఈజిప్టునందు టాలమీల పాలన అంతరించి ఈజిప్టు రోమను సామ్రాజ్యమున అంతర్భాగమయ్యెను.

## 5. అగస్టస్ సీజరు (క్రీ. పూ. 27 - క్రీ॥ శ. 14)

చక్రవర్తిత్వము :— ఆక్టియమ్ యుద్ధానంతరము యుద్ధములు, అంతఃకలహములు, అరాచకముతో విసిగియున్న రోమనులు ఆక్టేవియస్‌ను సుస్థిర ప్రభుత్వమును స్థాపింపుమని ప్రార్థించిరి.

క్రీ. పూ. 27 లో ఆక్టేవియస్ 'అగస్టస్ సీజరు' అను బిరుదుతో రోమనుసామ్రాజ్య ప్రభుత్వాధిపత్యమును వహించెను. దూరదృష్టి కలవాడు. రాజ్యమున ప్రధానవ్యక్తియను అర్థమునిచ్చు ప్రిన్సెప్స్ (Princeps) అను బిరుదును ధరించెను. దీనినుండియె ప్రిన్స్ (Prince) అను పద ముద్భవించినది. ఇతడు విప్లవాత్మకమైన మార్పులను తలపెట్టక తన ప్రభుత్వవిధానమును ప్రాచీన రోమకప్రభుత్వ విధానమునకు ముడిపెట్టెను. కాని యుక్తిగ అధికారము లన్నియు దత్తత జేసికొని పరిపాలించెను. కావున వీనిని రోమునేలిన మొదటి చక్రవర్తిగ పేర్కొనవచ్చును. ప్రొకాన్సులేర్ ఇంపీరియమ్ (Proconsulare Imperium) వలన మిలిటరీ అధికారములు, ట్రిబ్యూనికా పొటెస్టాస్ (Tribunica Potestas) వలన సివిల్ అధికారములు అగస్టస్ స్వీకరించెను. ఇతడు మతవిషయములపై సర్వాధికారి. అగస్టస్ కాలము నుండియె రోమనులు చక్రవర్తిని దైవసముడుగ భావించి పూజింప సాగిరి.

పరిపాలన:—అగస్టస్ సెనేటు సభలోని సభ్యుల సంఖ్యను తగ్గించి ఉత్తమవంశీయులు, భాగ్యశాలురకే ఆ సభాసభ్యత్వము నేర్పాటు జేసెను. సెనేటును రోమను సామ్రాజ్యమునకు ఉన్నత న్యాయస్థానముగ జేసెను. కాని ప్రజాసభల అధికారములు అంతరించెను. రాష్ట్రముల పరిపాలనా వ్యవస్థను చక్కబరచుటకు అనేక సంస్కరణలను జేసెను. రాష్ట్రగవర్నరులకు జీతముల నేర్పాటు జేసి వారిలోని అవినీతిని రూపుమాపెను. వారిపై అజమాయిషీ నధికము జేసెను. రాష్ట్రములను ఇంపీరియల్ (సరిహద్దు) సెనటోరియల్ రాష్ట్రములుగా విభజించి పరిపాలనా వ్యవస్థను పటిష్ఠము జేసెను. రెవెన్యూ విధానమును సంస్కరించి పన్నులను సక్రమముగ వసూలు జేయుటకై సామ్రాజ్య జనాభా లెక్కలను తయారు జేయించెను.

ఇతని పరిపాలనాకాలము రోమున కొక స్వర్ణయుగమని చెప్పవచ్చును. దేశమున శాంతి సౌభాగ్యములు నెలకొల్పబడెను. అగస్టస్ సాహిత్య తత్వశాస్త్రాభివృద్ధికి పాటుబడెను. లివీ అను

చరిత్రకారుడు హోరేస్, వర్జిల్, ఓవిడ్ అను కవులు తమ ప్రసిద్ధ గ్రంథములతో లాటిన్ సాహిత్యాభివృద్ధికి ఎనలేని సేవ జేసిరి. అగస్టస్ గొప్ప భవన నిర్మాత. ఇటుకలతో నిర్మింపబడిన రోమ్‌ను పాలరాతి పట్టణముగ మార్చివేసితినని అగస్టస్ సగర్వముగ చెప్పికొనినాడు. క్రైస్తవమత ప్రవక్తయగు ఏసుక్రీస్తు ఇతని పరిపాలనా కాలముననే జన్మించుట ఈయుగ ప్రాశస్త్య మినుమడింపచేసినది.

అగస్టస్ తుదిదినములు క్లేశభరితములయ్యెను. సామ్రాజ్య ఉత్తర సాద్దులలో తిరుగుబాట్లు బయలుదేరెను. ఇతడు మూడు వివాహములు జేసికొనినను వంశాంకుర మూదయించలేదు. వారసు డెవరను ప్రశ్న ప్రజలను, ప్రభువును వేధించెను. తుద కితడు క్రీ. శ. 14 ఆగస్టు 19 న ఇహలోక యాత్ర చాలించెను. ఈ నెల లోనే అగస్టస్ అనేక విజయములను సాధించుటయు, మరణించుటయు జరుగుటచే దానికి ఆగస్టు అనుపేరు వచ్చెను. ఆగస్టుతో అగస్టస్ కీర్తి చిరస్థాయి యైనది.

## 6. చక్రవర్తుల యుగము

క్లాడియన్ చక్రవర్తులు :— అగస్టస్ మరణానంతరము అతని ఉంపుడుగత్తె కుమారుడైన టైబీరియస్ క్లాడియస్ చక్రవర్తి యయ్యెను. టైబీరియస్ క్రీ. శ. 14 నుండి 37 వరకు పరిపాలించెను. కొందరు చరిత్రకారు లితనిని క్రూరనియంత యనియు, కొందరు సమర్థుడగు పరిపాలకు డనియు చెప్పుచున్నారు. ఎట్లైనను ఇతడు ప్రజారంజకుడు కాలేకపోయెను. ఇతని తరువాతి పాలకుడగు కాలిగ్యులా (క్రీ. శ. 37 - 41) ను అతని నమ్మినబంట్లె హత్యగావించిరి. తరువాత చక్రవర్తిత్వమును బడసిన క్లాడియస్ (క్రీ. శ. 41 - 54) విద్వాంసుడు, కాని నీతిబాహ్యుడు. ఇతని పరిపాలనాకాలమునందే రోమనులు బ్రిటిష్‌ఛానలును దాటి దక్షిణబ్రిటన్ నాక్రమించిరి. క్రీ. శ. 54 లో క్లాడియస్ హత్యగావింపబడెను. క్లాడియన్ చక్రవర్తులలో కడపటి వాడైన నీరో (Nero) క్రీ. శ. 54 నుండి 68 వరకు పరిపాలించెను. నీరో నృత్య, సంగీతములం దభిరుచిగలవాడు, కాని బహు క్రూరుడు.

క్రూరత్వమునకు నీరో మారుపేరయ్యెను. ట్రోయి నగర దగ్ధసమయ మున భీభత్సమును చిత్రించు హోమరు విషాదగీతమునకు సరియైన వాతావరణమును కల్పించుటకై రోమునగరమును తగులబెట్టించి ఆ గీతముల నాలాపించి రసాస్వాదన చేసెనట. ఆ వాదును బాపుకొను టకై నగరమును తగులబెట్టిన నేరమును క్రైస్తవులపై మోపి వారికి మైనపు దుస్తులను ధరింప జేసి తగులబెట్టించెనట. రోమునగరమును పునర్నిర్మించి ధనవ్యయము గావించెను. ధనసంపాదనకై భాగ్యవంతు లను హత్యచేయించి వారి ధనమును ఖజానాలో చేర్పించెను. ఇతని అత్యాచారములకు విసిగి సెనేటు ఇతనిని ప్రజావిరోధిగ నిర్ణయించెను. సైనికులును ఇతనికి అండగా నిలువ నిరాకరించిరి. తుద కితడు ఆత్మ హత్య గావించుకొనెను.

ఫ్లావియన్ చక్రవర్తులు:— నీరో మరణానంతరము ప్రభు త్వాధికారము సేనానుల హస్తగత మయ్యెను. రాజ్య మరాచక మయ్యెను. ఫ్లావియన్ వంశస్థాపకుడైన వెస్పెసియన్ (క్రీ.శ. 69-79) అను సేనాని రోమునందు తిరిగి సుస్థిరప్రభుత్వము నేర్పరచెను. శాంతి సౌభాగ్యములు నెలకొనెను. ప్రభుత్వాదాయము వృద్ధిపొం దెను. వెస్పెసియన్ ఆడంబరత్వము, అవినీతికి స్వస్తిచెప్పి నిరాడంబర తకు ఆదర్శ పురుషుడయ్యెను. తన కుమారుడగు టిటస్ నాయకత్వ మున జెరూసలెమ్‌లోని యూదుల తిరుగుబాటు నణచెను.

వెస్పెసియన్ మరణానంతరము టిటస్ రోమను సామ్రా ట్టయ్యెను. ఇతడు రెండు సంవత్సరములే పరిపాలించినను శాంతి కాముకుడని పేర్గాంచి ప్రజల మన్ననలందెను. ఇతని కాలముననే వెసూవియస్ అగ్నిపర్వత విజృంభణమువలన హెర్క్యులేనమ్, పాంపినగరములు భూస్థాపితములయ్యెను. టిటస్ మరణానంతరము వాని సోదరుడగు డొమిషియన్ (క్రీ. శ. 81-96) రోము రాజ్యాధిపతి యయ్యెను. ఇతడు క్రూరత్వమున నీరో చక్రవర్తిని జ్ఞప్తికి తెచ్చెను. రాజాంతఃపురము కుట్రలకు నిలయమై డొమిషియన్ హత్య గావింప బడెను. ఇతని పరిపాలనా కాలమున అగ్రికోలా యను సేనాని ఇంగ్లండును పూర్తిగ జయించి రాజ్యవ్యాప్తి గావించెను.

యాంటొనైనుల యుగము (క్రీ. శ. 96-180):—
ఈ యుగమున అంతఃకలహములు, కుట్రలు, హత్యలు లేక దేశము శాంతి సౌభాగ్యములతో వర్థిల్లినది. వారసత్వ విధానము నిర్ణయింప బడినది. చక్రవర్తి సమర్థుడగు ప్రభుత్వోద్యోగిని దత్తత చేసికొని వానికి రాజ్య మప్పగించుట పరిపాటియైనది. ఈ యుగమున సాహిత్య, శిల్ప, చిత్రకళలు అభివృద్ధిగాంచినవి. జూవీనల్, టాసిటస్, ప్లినీ మొదలగు సుప్రసిద్ధ సాహిత్యవేత్తలు లాటిన్ భాషాభివృద్ధి గావించిరి. గ్రీకుల వేదాంత తత్వము రోమనుల కల వడినది. న్యాయసూత్రములు క్రోడీకరింపబడినవి.

డొమిషియన్ మరణానంతరము సెనేటు నెర్వా యను వయో వృద్ధుని చక్రవర్తిగ జేసిరి. ఇతని పరిపాలనాకాలము స్వల్పమయి నను శాంతియుతమైనది. ఇతడు ట్రాజన్‌ను తన వారసునిగ నిర్ణ యించెను. క్రీ. శ. 98 లో ట్రాజన్ సింహాసన మెక్కెను. రోమను చక్రవర్తులలో నితడు ఘనుడని చెప్పవచ్చును. ప్రజలకు పన్నుల భారమును తగ్గించెను. సెనేటుసభ మన్నన లందెను. రాష్ట్ర ప్రభుత్వముల ఆర్థికాభివృద్ధికి పాటుబడెను. రోమునగరమును ఆలయ ములు, విగ్రహములు, భవనములతో అలంకరించెను. ఇతడు గొప్ప విజేత. డాన్యూబునదిని దాటి డేసియా (Dacia) నాక్రమించెను. క్రీ. శ. 115 లో తూర్పు దేశములకు తరలిపోయి ఆర్మీనియా, అరే బియా, మెసపొటేమియాల నాక్రమించి వానిని రోమను రాష్ట్రము ముగ జేసెను. క్రీ. శ. 117 లో ట్రాజన్ మరణింపగా వాని దత్త కుమారుడు, స్పెయిన్ దేశీయుడునైన హేడ్రియన్ చక్రవర్తి యయ్యెను. ఇతడు రోముసామ్రాజ్యమును రోమనుల ఆస్తిగ భావించిన విశాల హృదయుడు. తనసామ్రాజ్యమున వివిధభాగము లకు సంచారముజేసి ప్రజల కష్టసుఖములను తెలిసికొనెడివాడు. బానిసలపై యజమానుల అధికారమును పరిమితముజేయు చట్టములను ప్రవేశపెట్టెను. అనేక భవనములను నిర్మించెను. పాలస్తీనాయందు యూదుల తిరుగుబాటు నణచుటయే ఇతని కాలమున జరిగిన ఏకైక యుద్ధము. హేడ్రియన్ తరువాత క్రీ. శ. 138 లో ఆంటోనియస్

పయస్ చక్రవర్తియయ్యెను. ఇతడు 23 సంవత్సరములు ఎట్టి దుస్సంఘటనలు లేకుండ పరిపాలించెను. బానిసల దుస్థితిని చక్కబరచెను. రోమను రాష్ట్రీయులకును రోమను పౌరసత్వహక్కు నిచ్చెను. ఇతని మరణానంతరము క్రీ. శ. 161 లో మార్కస్ ఆరిలస్ (Marcus Aurelius) సింహాసన మెక్కెను. ఇతని కాలమున రోముపతన మారంభమైనది. ఉత్తర ప్రాంతమునుండి అనాగరిక దండయాత్ర లారంభమైనవి. ఇతడు స్టోయిక్ వేదాంత తత్వమందు అభిమానముకలవాడు. పవిత్ర జీవితమును గడపవలెనని కాంక్షించెడివాడు. "నేను మార్కస్ ఆరిలస్‌గ నున్నంతవరకు రోము నా నగరము, నారాజ్యము; కాని నేను మానవుడనను భావము కలిగినప్పుడు ప్రపంచమే నారాజ్యమగును." అని చెప్పుకొనెను. ఇతడు తన జీవితమంతయు యుద్ధములందే గడుపవలసి వచ్చెను. తీరిక సమయములందు తన ఆలోచనల నొక పొత్తముగ లిఖించెను. అది మెడిటేషన్స్ (Meditations) అని పేర్కొనబడుచున్నది. రోమను మతమును, రోమను దేవతలను పరిహాసించుచు, మరియొక రాజ్యమునందు నమ్మకముగల క్రైస్తవులను దండించెను.

## 7. రోము సాధించిన విజయములు

రోమను ప్రభుత్వము:— ప్రపంచచరిత్రలో అనేక కాలములందు అనేక సామ్రాజ్యములు వెలసి కాలగర్భమున అంతర్ధానమైనవి. రోమను సామ్రాజ్య మంతమైనను రోమనులు తరువాతి తరములవారి కిచ్చిపోయిన విజ్ఞానసంపద చిరస్థాయియైనది. రోమను ప్రభుత్వవిధాన మొక ప్రత్యేక విశిష్టత కల్గియున్నది. ప్రజాసత్తాక ప్రభుత్వమును కల్గిన సామ్రాజ్యములలో రోమను సామ్రాజ్యమె ప్రప్రథమమైన దని చెప్పవచ్చును. నేటి వివిధదేశ రాజ్యాంగములపై రోమను ప్రజాసత్తాక ప్రభుత్వాంశముల ప్రభావము గమనార్హము. స్వేచ్ఛ (Liberty), ప్రజాసత్తాక ప్రభుత్వము (Republic) అను పదములు వారినుండియే గ్రహింపబడినవి. తానుజయించిన రాజ్యప్రజలకును పౌరసత్వ హక్కుల నిచ్చిన ప్రథమ సామ్రాజ్యము రోముసామ్రాజ్యమె!

రోమన్ 'లా':— న్యాయశాస్త్ర నిర్మాణమున రోమనులు అపూర్వమైన పాత్ర వహించిరి. రోమను పౌరుల ఉపయోగార్థము క్రోడీకరింపబడిన 'పండ్రెండు శాసనములు' (Twelve Tables) గృహకలహములను తీర్చుకొనుటకు, కుటుంబములోని సభ్యుల హక్కులను, బాధ్యతలను నిర్ణయించుటకు, వర్తకులు, పారిశ్రామికులు, వ్యావసాయికులు అవలంబింపదగు విధానములను స్పష్టపరచుటకు మిక్కిలి ఉపకరించెను. రిపబ్లికన్ ప్రభుత్వకాలమున ప్రీటర్లు (Praetors) అను ఉద్యోగులు న్యాయసభల నలంకరించి చట్టనిర్మాణము జేసెడివారు. చక్రవర్తిత్వ యుగమున ప్రీటరుల న్యాయసూత్రములకు సెనేటర్లు జారీచేసిన డిక్రీలు, చక్రవర్తు లొసగిన రాజాజ్ఞలు (Edicts) జోడింపబడెను. హేడ్రియన్ చక్రవర్తి న్యాయసూత్రములను పర్పెట్యువల్ ఎడిక్ట్ (Perpetuel Edict) అను గ్రంథముగ క్రోడీకరింపజేసెను. సివిల్ కేసులను విచారించుటకీ శిక్షాస్మృతి ప్రమాణముగ నుండెడిది. రోమన్ న్యాయశాస్త్రము (Roman Law) జస్టీనియన్ అను చక్రవర్తి కాలమున పూర్ణ స్వరూపము నొందెను. వివిధ న్యాయసూత్రములు క్రమమైన పద్ధతిలో నమర్చబడెను. ప్రపంచ న్యాయశాస్త్ర నిర్మాతలుగ రోమనులు ఖ్యాతిగాంచిరి.

పాగన్‌రోము:— రోమను మతవిధానము క్రమక్రమముగ మార్పుజెందెను. ప్రథమమున వీరు వనదేవతలను పూజించెడివారు. పర్వతశిఖరములు, కీకారణ్యములు, జలప్రవాహములు వారి దేవతల నివాసస్థానములు. గృహమునందు వివిధభాగముల రక్షణకు జేనస్, వెస్టా, పెనేట్స్, లేర్స్ మొదలగు వివిధ దేవతలుండెడివారు. రోము నగర రాజ్యముగ మారుటతో వారి దేవతల కార్యక్రమము గూడ మారిపోయెను. ఆకాశ దేవుడైన జూపిటర్ న్యాయమూర్తియయ్యెను. వ్యావసాయికుడైన మార్స్ యుద్ధవిశారదుడయ్యెను. గ్రీసును జయించిన పిదప గ్రీకుదేవతలు రోమను దేవతలైరి. ఇట్రూరియా దేవతయైన మినర్వా రోమన్ దైవకుటుంబమున జేర్చబడెను. అట్లే ఈజిప్టునుండి ఇసిస్ (Isis) పారశీక దేశమునుండి మైత్రా (Mithras) రోము దేశమునకు జేర్చబడిరి. క్రైస్తవ మత మావిర్భవించుటతో

రోమనులు క్రైస్తవ మతావలంబులైరి. తమ ప్రాచీన దేవతలను క్రైస్తవ మతమునందు జొప్పించిరి.

రోమనులు మతనమ్మకములకు ప్రభుత్వ కార్యకలాపములకు దగ్గర సంబంధమును కల్పించెడివారు. జోస్యుల (Auguries) అనుమతి లేకుండ రోమనులు ముఖ్యకార్యములను తలపెట్టెడివారు కారు. దండ యాత్రలకు బయలుదేరెడివారు కారు. కొన్ని పవిత్రదినములందు ప్రభుత్వ కార్యాలయములన్నియు మూసివేసి పండుగ దినములుగా నిర్దేశించెడివారు. మతవిషయములను జూచుటకు మతగురువుల సభ యుండెడిది. ఈ సభకు పాంటిఫెక్స్ మాక్సిమస్ (Pontifex Maximus) అధ్యక్షుడుగ నుండెడివాడు. చక్రవర్తిత్వయుగమున ఈ బిరుదును, బాధ్యతను చక్రవర్తి వహించెను. దీనితో చక్రవర్తికి దైవత్వము సిద్ధించి పూజింపబడెను.

సాహిత్యము :— సాహిత్యరంగమందును రోమనులు ప్రశంసనీయమైన కృషిసల్పియుండిరి. అగస్టస్ పూర్వకాలమును సిసిరోనియన్ యుగముగ పరిగణించుచున్నారు. మార్కస్ టల్లియస్ సిసిరో (క్రీ.పూ. 106-43) మహావక్త. రాజనీతి విశారదుడు. అతని రచనలు, ఉపన్యాసములు, లేఖలు లాటిన్ సాహిత్యమునకు మచ్చుతునకలు. పతనమగుచున్న రోమన్ రిపబ్లిక్‌ను సిసిరో తన సాహిత్యముతో నిలబెట్టలేకపోయెను. కాని సాహిత్య ప్రపంచమున నొక సామ్రాజ్యమును సృష్టించెను. కాటులస్ (Catulus) పద్యరచనయందు తన ప్రతిభ జూపెను. లూక్రిషియస్ (Lucretius) ఇతిహాసములను సృష్టించెను. గాలు యుద్ధముల చిత్రణలో సీజరు తన కామెంటరీస్ అను గ్రంథమున నిష్పక్షపాతమును జూపి న్యాయము గూర్చెను.

అగస్టస్ యుగము లాటిన్ సాహిత్యమున కొక స్వర్ణయుగము. వర్జిల్ తన ఏనియడ్ (Aeneid) అను గ్రంథమున రోమనుల మూలపురుషుడగు ఏనియస్ సాహసకృత్యములను కడు మనోహరముగ, ఉత్తేజపూరితముగ వర్ణించెను. వర్జిల్ సమకాలికుడైన హొరేస్ గద్యరచనయందు అసామాన్యమైన ప్రతిభజూపి అనేక గీతములను రచించెను. లివీ రోము చరిత్రను 142 గ్రంథములలో పొందుపరచెను.

ఆల్బియస్ టిబులస్, సెక్సటస్ ప్రోపర్షియస్, ఓవిడ్‌లు నాటిప్రముఖ సాహితీవేత్తలు.

అగస్టస్ తరువాత కాలము లాటిన్‌సాహిత్యమునకు రజిత యుగముగ పేర్కొనబడుచున్నది. టాసిటస్, సెనెకా, ప్లినీ, ట్రాంక్విలస్ మొదలగు సుప్రసిద్ధకవులు తమ గ్రంథములద్వారా జగద్విఖ్యాతి గాంచిరి.

కళలు :—భవన నిర్మాణమునందు, శిల్ప, చిత్రలేఖనములందు రోమనులు ఏ దేశీయులకును తీసిపోరు. ప్రాచీన రోమనుల రహదారులు ప్రపంచ విఖ్యాతిగాంచినవి. రోడ్ల నిర్మాణమునకు వీరే ప్రారంభకులని చెప్పవచ్చును. రోమనుల వాస్తవికత, గ్రీకుల ఊహాశక్తి రోమను శిల్పములందు మూర్తీభవించినది. హేడ్రియన్ చక్రవర్తికాలమున గ్రీకుల శిల్ప వాస్తుకళలు రోమనుల హస్తనైపుణ్యమున నూతనత్వమును బడసినవి. అగస్టస్ కాలమున భవననిర్మాణమునందు శిల్పమునకెక్కువ ప్రాధాన్యత ఇవ్వబడినది. పిదప బ్రహ్మాండమైన కట్టడముల యందు రోమనులు అభిరుచి చూపసాగిరి. అందులకు రోములోని ప్రేమదేవతయగు వీనస్ ఆలయమె ప్రబల తార్కాణము. పాంపే నగర శిథిలములందు కనబడుచున్న కుడ్యచిత్రములు, మృణ్మయ పాత్రలపై చిత్రించబడిన మనోహర వర్ణచిత్రములు రోమనుల చిత్ర లేఖనాభిరుచిని తెలుపుచున్నవి.

అ ధ్యా య ము 6

# క్రైస్తవమత వ్యాప్తి - రోము పతనము

## 1. క్రై స్త వ మ త ము

ఏసుక్రీస్తు :— అగస్టస్ సీజరు పరిపాలనా కాలమున జూడా యందు బెథెల్‌హామ్ గ్రామమున ఒక యూదుకుటుంబమున ఏసుక్రీస్తు జన్మించెను. ఇతడు బాల్యమునుండియు యూదుమత గురువుల సిద్ధాంతములను ఖండించుచుండెడివాడు. తన ముప్పదవయేట జెరూసలెమ్ నగరమును జేరి క్రైస్తవమత వ్యాప్తికై గడంగెను. అనతి కాలములోనె ఇతని కనేకులు శిష్యులైరి. ప్రేమ, దయాదాక్షిణ్యములు, దానతత్పరత, సౌభ్రాతృత్వము, సర్వమానవ సమానత్వము, భగవంతునియందు అచంచల విశ్వాసము క్రైస్తవమతములోని ముఖ్యసూత్రములు. మానవులందరు భగవంతుని బిడ్డలనియు, తన బిడ్డల యోగక్షేమములే భగవానుని ముఖ్య వ్యాపకమనియు, తాను దేవుని కుమారుడననియు, పతితమానవుల నుద్ధరించుటకే దేవుడు తనను పంపెననియు క్రీస్తు చెప్పుచుండెడివాడు. మానవుల నీతివర్తనమునకు క్రీస్తు అధిక ప్రాముఖ్యతనిచ్చి పేరబుల్స్ (Parables) అను కథల రూపమున సామాన్య ప్రజలకును సులభగ్రాహ్యమగునట్లు నీతులను బోధించెను. మానవునకు స్వంత ఆస్తి యుండరాదనియు, దేవుని రాజ్యమున ధనవంతులకు స్థానములేదనియు తెల్పెను. "ఇతరులు నీయెడ యెట్లు ప్రవర్తింపవలెనని కాంక్షింతువో అట్లే నీవును నీ పొరుగువారి యెడ ప్రవర్తింపుము. నీ విరోధులను ప్రేమింపుము. నిన్ను నిందించినవాని నభినందింపుము. నిన్ను ద్వేషించినవారిని భూషింపుము. నిన్ను హింసించినవానిని క్షమింపుమని భగవంతుని ప్రార్థింపుము. పరుల సొమ్ము కాసింపకుము. పశ్చాత్తాపమే పాప పరిహార మార్గము. సూర్యుడు సర్వప్రాణులకు సమానమైన వెలుగు నిచ్చుచున్నట్లె భగవంతుడును పాపులు, పుణ్యులు అను భేదము జూపక సకల జీవులను ప్రేమించును," అని క్రీస్తు బోధించెను.

దేవుని రాజ్యములోని సౌఖ్యమయ జీవితము బానిసల నెక్కువగ నాకర్షించెను. బానిసలు, కష్టజీవులు, సైనికులు తండోపతండము లుగ క్రైస్తవమతమును స్వీకరించిరి.

యూదులు తాము దేవుని ప్రియతమ పుత్రులమనియు తమ్ము ద్ధరించుటకు మెస్సయా(రక్షకుడు) జన్మించుననియు దృఢవిశ్వాసము కలిగియుండెడివారు. క్రీస్తు తమ ఆధిక్యతను ఖండించుటచే వారు క్రుద్ధులైరి. క్రీస్తే మెస్సయా యను ప్రచారము వారికి సహింపరాని దయ్యెను. రోమను సామ్రాజ్యమునకు వ్యతిరేకముగ మరియొక సామ్రాజ్య నిర్మాణమునకు క్రీస్తు పూనుకొనెననియు విప్లవమునకు ప్రోత్సహించుచున్నాడనియు వానిపై రాజద్రోహనేరమును మోపి శిలువవేయవలెనని పట్టుబట్టిరి. జూడా గవర్నరుగ నున్న పాంటి యస్ పిలేట్ క్రీస్తు నిర్దోషియని నమ్మినను యూదులను సంతృప్తి పరచుటకై క్రీస్తును జెరూసలెమ్ సమీపమున గొల్గొతా (Golgotha) వద్ద శిలువ వేయించెను. శిలువ వేసిన మూడవదినమున క్రీస్తు పునర్జీవుడై తన శిష్యులకు కర్తవ్యమును బోధించెనని చెప్పబడు చున్నది. క్రీస్తు జీవితము, బోధనలు "నూతన నిబంధనము" (New Testament) నందు పొందుపరుపబడినవి.

## 2. క్రైస్తవ మతవ్యాప్తి

ఎపొజిల్స్ :— ఏసుక్రీస్తు మరణానంతరము ముఖ్యులైన అతని పండ్రెండుగురు శిష్యులు నూతన మతమును నేల నాలుగు చెరగులందు వ్యాపింపజేయ బయలుదేరిరి. వీరు ఎపొజిల్స్ (Apostles) అని పిలువబడిరి. యూదుమత సనాతనత్వమునకు విసిగిన కొందరు యూదులు క్రైస్తవమతమును స్వీకరించిరి. సెయింట్ పీటరు అనేక ప్రదేశములలో మతబోధ గావించుచు తుదకు రోమునగరమును చేరెను. అట క్రీ. శ. 65 లో నీరో చక్రవర్తి పీటరును శిరచ్ఛేదము గావించెను. క్రైస్తవమతమునకై ప్రాణములను బలిదానము గావించి పీటరు అమరుడయ్యెను.

టార్సస్ పట్టణవాసియగు సాల్ అను యూదుడు క్రీస్తుబోధనలు ఖండించుచు డమాస్కస్‌నకు బయలు దేరెను. కాని మార్గమధ్యమున అంధుడై దేవుని పిలుపును వినెను. జెంటైల్స్ (Gentiles) అను యూదేతరులయందు క్రైస్తవమతమును వ్యాపింపజేయుమను క్రీస్తు ఆజ్ఞ నందుకొనెను. సాల్ క్రైస్తవమతమును స్వీకరించి సెంట్‌పాల్ అయ్యెను. అతని అంధత్వము మటుమాయమయ్యెను. డమాస్కస్‌లోని యూదులు పాల్‌పై దౌర్జన్యమునకు దిగిరి. పాల్ జెరూసలెమ్ చేరి అచటినుండి స్వదేశమున కేగెను. ఇతడు ఆసియామైనరునందు అనేక పట్టణములను పర్యటించెను. ఏథెన్స్, కోరింత్, ఇఫిసస్, రోమ్ మొదలగు ముఖ్యనగరములలో మత ప్రచారము గావించెను. ఇత డనేక ప్రదేశములందు క్రైస్తవ దేవాలయములను నెలకొల్పెను. ఇతడును క్రీ. శ. 65 లో రోమునగరమున శిరచ్ఛేదము గావింపబడెనని తెలియుచున్నది. సెంట్‌థామస్ అనునతడు తూర్పుదేశములలో మత ప్రచారము గావించుచు భారతదేశమునకు గూడ వచ్చెనని చెప్పబడుచున్నది.

పాగన్‌రోము క్రిష్టియన్‌రోముగ రూపొందుట :— మొదటి శతాబ్దమున క్రైస్తవమతమును యూదుమతశాఖయని తలచి రోమనుప్రభుత్వము ఈమతమును నిర్లక్ష్యము జేసెను. కాని నూతనమతము అతివేగముగ వ్యాపించినది. సామ్రాజ్యమంతటను క్రైస్తవ దేవాలయములు వెలసినవి. నానాటికి క్రైస్తవమతస్థుల సంఖ్య హెచ్చసాగినది. రోమనుచక్రవర్తులు దైవాంశసంభూతులనుటను క్రైస్తవులు శంకించిరి. రోమను దేవతల ఆరాధనను నిరశించిరి. ప్రాచీన సంప్రదాయములను నిర్లక్షించిరి. గ్లాడియేటర్ల యుద్ధములు, వన్యమృగపోరాటములు మొదలగు వినోదకార్యక్రమముల నిరసించిరి. దీనితో క్రైస్తవులు రోమనుప్రభుత్వమునకు విరోధులైరి. అంటువ్యాధులు, భూకంపములు, అగ్నిపర్వత విజృంభణములు మొదలగు దైనిక సంఘటనలకు క్రైస్తవులే కారకులని దోష మారోపింపబడెను. క్రైస్తవులు వేలసంఖ్యలో ఉరికంబముల కెక్కింపబడిరి. రోమనుచక్రవర్తులు క్రైస్తవులను హింసించుటే తమ ముఖ్య ధర్మముగ జేసి

కొనిరి. రెండవ, మూడవ శతాబ్దములలో క్రైస్తవమత నిర్మూల నమునకు తీవ్ర ప్రయత్నములు జరిగెను. డయోక్లీషియన్ చక్రవర్తి క్రైస్తవులను హింసించినవారిలో అగ్రగణ్యుడు. క్రైస్తవ దేవాలయములను పడగొట్టించి వాని ఆస్తులను లాగికొనెను. బైబిల్ మొదలగు మతగ్రంథములను నాశనము జేయించెను. క్రైస్తవుల రక్తప్రవాహములతో రోమను సామ్రాజ్యమును అరుణారుణము గావించెను. ప్రజాస్వామిక ప్రభుత్వవిధానమును తుడిచిపెట్టి నిరంకుశముగ పాలింపదలచుటయె డయోక్లీషియన్ క్రూరత్వమునకు కారణము. కాని యితడు రోమనుసామ్రాజ్యమున క్రైస్తవమతమునంత మొందింపలేకపోయెను. ఇతడు హింసించినకొలది వారిలో నూతనోత్తేజము ప్రబలినది. మతమునకై ప్రాణముల నర్పింప వేలకొలది క్రైస్తవులు ముందున కురుకసాగిరి.

క్రీ. పూ. 317 లో గేలేరియస్ అను చక్రవర్తి క్రైస్తవులకు పూజాస్వాతంత్ర్యమిచ్చి క్రైస్తవులను హింసింపరాదని ఆజ్ఞాపించెను. క్రీ. శ. 324 లో కాన్‌స్టంటైన్ చక్రవర్తి రోమనుసామ్రాజ్యమునకంతటికి అధిపతియై, క్రైస్తవులపైనున్న ఆంక్షల నన్నింటిని తొలగించెను. నాటికి క్రైస్తవమతమున మూడు ముఖ్యశాఖ లేర్పడియుండెను. అలెగ్జాండ్రియావాసియగు ఆరియస్ క్రీస్తు భగవదాంశ కలవాడైనను భగవంతునికంటె తక్కువవాడను సిద్ధాంతమును బయలుదేరదీసెను. ఇతని సిద్ధాంతము ఆరియనిజమ్ అనియు ఆ సిద్ధాంతమును నమ్మినవారు ఆరియనులనియు పిలువబడసాగిరి. సెబెలియనులు క్రీస్తు, భగవంతుడు ఒక్కడేనను ఏకత్వసిద్ధాంతమును వ్యాపింప జేసిరి. ట్రినిటేరియనులు భగవత్త్రయ సిద్ధాంతమును ప్రచారమును జేసిరి. దైవ సామ్రాజ్యపాలకుడగు తండ్రి (Father), ఏసుక్రీస్తు (Son), పవిత్ర ఆత్మ (Holy Spirit), అను మూడుస్వరూపములలో భగవంతుడు ండు నని వారు సిద్ధాంతీకరించిరి. వీరు ఒకరినొకరు దూషించుచు, హింసాకాండకు దిగుచుండెడివారు. కాన్‌స్టంటైన్ క్రీ. శ. 325 లో నికాయా (Nicaea) వద్ద నొక మతసభగావించి వారి అభిప్రాయ భేదములను రూపుమాప యత్నించెను. కడకు ట్రినిటేరియను సిద్ధాంతమె సకల

జనాదరణీయ మయ్యెను. కాన్‌స్టంటైన్ క్రైస్తవమతమును స్వీకరించి తరువాతి చక్రవర్తులకు ఆదర్శపురుషు డయ్యెను. క్రీ.శ. 390 లో థియోడోసియస్ చక్రవర్తి క్రైస్తవమతమును రాజమతముగ ప్రకటించి పాగన్ రోమును క్రైస్తవరోముగ మార్చివేసెను.

మతగురువులు:— క్రైస్తవుల సమావేశములందు అధ్యక్షుని ఓవర్ సీర్ అని పిలచెడివారు. ఇతడే బిషప్ అను బిరుదు నొందెను. వానికి సహాయకారులుగ ప్రెస్బిటర్లు (Presbyters) వుండెడివారు. క్రైస్తవమతము బహుళవ్యాప్తిగాంచుటతో క్రైస్తవసామ్రాజ్యము కొన్ని రాష్ట్రములుగ విభజింపబడెను. రోము, కాన్‌స్టాంటినోపిల్, అంటియోక్, అలెగ్జాండ్రియాలందు మెట్రోపాలిటన్ (Metropolitan) లను ఉన్నత మతాధికారు లేర్పడిరి. కాలక్రమమున క్రైస్తవమతము సామ్రాజ్యమంతయు వ్యాపించుటచే రోమనుచక్రవర్తివలె క్రైస్తవసామ్రాజ్యమునకును యొక సర్వాధికారి అవసరమయ్యెను. రోమునగరములోని బిషప్ క్రైస్తవప్రపంచమున కంతటకు అధినేతయై పోప్ (Pope) బిరుదమును గాంచెను.

## 3. రోమను సామ్రాజ్య పతనము

**తూర్పు, పశ్చిమ సామ్రాజ్యములు:—** మార్కస్ ఆరిలస్ మరణానంతరము క్రీ. శ. 180 నుండి 284 వరకు రోమనుసామ్రాజ్యమున అరాచకము ప్రబలినది. అధికారము సైనికుల హస్తగతమైనది. ఒక శతాబ్దమునందె 80 మంది చక్రవర్తులు మారిరి. వీరు బారక్ చక్రవర్తు (Barack Emperors) లని పేర్గాంచిరి. కుట్రలు, హత్యలు సర్వసాధారణ మయ్యెను. వర్తకవ్యాపారములు నశించెను. తూర్పు ప్రాంతమున పారశీక దండయాత్రలు హెచ్చెను. ఉత్తరప్రాంతముపై జర్మను అనాగరిక తెగలు దండయాత్రలను సాగించిరి. క్రీ. శ. 284 లో సింహాసనమెక్కిన డయోక్లీషియన్ దేశమున కొంతవరకు శాంతిభద్రతలను నెలకొల్పగల్గెను. ఇతడు రోమనుసామ్రాజ్య తూర్పు పశ్చిమ భాగములను వేర్వేరు సేనానుల రక్షణలో నుంచుట ఉచితమనితలచి పశ్చిమ ప్రాంతమునకు మాక్సిమి

యన్‌ను ఉపచక్రవర్తిగ నియమించెను. డయోక్లీషియన్ డొమినస్ (Dominus or Lord) అను ప్రభు బిరుదమును ధరించి రాచమర్యాదల నన్నింటిని ప్రవేశపెట్టెను. చక్రవర్తి దైవాంశ సంభూతుడని ధ్రువ పరచెను. క్రీ. శ. 313 లో చక్రవర్తిత్వమును బడసిన కాన్‌స్టంటైన్ రాజధానిని బైజాంటియమ్‌నకు మార్చి అచట కాన్‌స్టాంటినోపిల్ అను నూతన పట్టణమును నిర్మించెను.

క్రీ. శ. 379 లో రోమనుసామ్రాజ్యాధిపతియైన థియోడోసియస్ థ్రేస్, ఆసియామైనరులో కొంత భాగమును బార్బరు దండయాత్రికులైన గాతుల (Goths) కిచ్చి వారిమైత్రిని సంపాదించెను. థియోడోసియస్ మరణానంతరము వాని కుమారులు రాజ్యమును పంచుకొనిరి. ఆర్కేడియస్ తూర్పు సామ్రాజ్యమున కధిపతియై కాన్‌స్టాంటినోపిల్‌ను రాజధానిగ జేసికొనెను. హొనోరియస్ పశ్చిమరాజ్య పాలకుడై రాజధానిని రోమునుండి రవెన్నా నగరమునకు మార్చెను.

## బార్బేరియనుల దండయాత్రలు

గాతులు:— రోమనుసామ్రాజ్యముపై దండెత్తిన అనాగరికులలో గాతులు (Goths) ముఖ్యులు. వీరిని ఆస్ట్రోగాతులు (తూర్పు గాతులు), విసిగాతులు (పశ్చిమగాతులు) అను రెండు ముఖ్య వర్గములుగ విభజింపవచ్చును. క్రీ. శ. మూడవ శతాబ్దములో విసిగాతులు డేసియారాష్ట్రము నాక్రమించిరి. ఉల్ఫిలాస్ (Ulfilas) అనునతడు బైబిలును గాతిక్ భాషలోని కనువదించి గాతులలో క్రైస్తవమత వ్యాప్తికై కృషిచేసెను. క్రీ. శ. 374 లో మధ్యఆసియావాసులగు హూణులు గాతులపైబడిరి. గాతులు రోమనుల శరణు జొచ్చిరి. రోమనుచక్రవర్తి గాతులకు రోమను సామ్రాజ్యములో స్థిరనివాస మేర్పరచుకొనుటకు అనుమతి నిచ్చెను కాని రోమను ఉద్యోగులు గాతులను బానిసలుగ విక్రయింప సాగిరి. తుదకు క్రీ. శ. 378 లో గాతులు ఆడ్రియానోపిల్ యుద్ధమున రోమనుల నోడించి చక్రవర్తియైన వాలెన్స్‌ను వధించిరి. క్రీ. శ. 383 లో రోమనుచక్రవర్తియైన థియోడోసియస్ గాతులతో మైత్రి

గావించుకొనెను. వాని మరణానంతరము గాతులు మరల విజృంభించి అలరిక్ నాయకత్వమున గ్రీసుపై బడిరి. క్రీ.శ. 410 లో రోముపైబడి దోచుకొనిరి.

అలరిక్ మరణానంతరము అటాల్ఫస్ విసిగాతుల నాయకుడై దక్షిణగాల్, ఉత్తరస్పెయిన్ల నాక్రమించి నొక రాజ్యమును నెల కొల్పెను. ఈ రాజ్యము మూడు శతాబ్దముల కాలము మహోన్నత దశ నందినది.

వెండాలులు:— గాతులను పోలిన మరియొక తెగవారైన వెండాలులు గాలుదేశముగుండ స్పెయిన్ చేరి అచట నొక రాజ్యమును స్థాపించిరి. కాని విసిగాతులు వీరిని స్పెయిన్ నుండి తరిమివేసిరి. వెండాలులు ఉత్తరాఫ్రికా చేరి కార్తేజి రాజధానిగ జేసికొని పరిపాలింపసాగిరి. వెండాలు నాయకుడైన జెన్సిరిక్ గొప్పనౌకాదళమును నిర్మించి క్రీ. శ. 455 లో మధ్యధరాసముద్రమును దాటి రోముపై బడెను. రోమును సర్వనాశన మొనరించి ధనరాసులతో తిరిగిపోయెను.

హూణులు:— రోముపై దండెత్తిన వారిలో హూణులు అతి క్రూరులు. వీరు క్రీ. శ. 446 లో 'అతిల' యను వాని నాయకత్వమున తూర్పు సామ్రాజ్యముపై బడిరి. కాన్స్టాంటినోపిల్ పట్టణమును దోచుకొని జర్మనీగుండా ప్రయాణముచేసి గాలుదేశముపై బడిరి. రోమనులు, విసిగాతులు కలసి క్రీ. శ. 451 లో కాలన్స్ (Chalans) యుద్ధమున అతిల నోడించి తరిమివేసిరి. క్రీ. శ. 452 లో అతిల ఆల్పులను దాటి ఇటలీయందు ప్రవేశించెను. మార్గమధ్యమున నున్న పట్టణములను దోచుకొనుచు రోమునగరమును చేరెను. పోప్ లియో తన వాక్చాతుర్యమును ప్రదర్శించి హూణనాయకుని మనస్సు మార్చివేసెననియు, నగరమును ధ్వంసముగాకుండ కాపాడెననియు చెప్పబడుచున్నది. అతిల ఇటలీని వదలిపోయెను. అతని మరణానంతరము (క్రీ. శ. 453) హూణుల ప్రాబల్య మంతరించెను.

క్రీ. శ. 5 వ శతాబ్దమున జర్మనుజాతికి చెందిన జూటులు, ఆంగ్లులు, సాక్సనులు రోమనుసామ్రాజ్యభాగమైన ఇంగ్లండు నాక్రమించిరి. ఫ్రాంకులను మరియొక తెగవారు గాలుదేశమున జొచ్చి

యొక స్వతంత్రరాజ్యము నేర్పరచుకొనిరి. ఇటలీ ఉత్తరభాగము లాంబార్డుల వశమయ్యెను.

పశ్చిమసామ్రాజ్య అస్తమయము :— పశ్చిమ సామ్రాజ్యమున పేరునకు మాత్రము చక్రవర్తియున్నను అధికారమంతయు పెట్రీషియను (Patricians) లను జర్మను అధికారుల హస్తగతమై యుండెడిది. క్రీ. శ. 474 లో ఒరెస్టస్ (Orestes) అను పెట్రీషియన్ తనకుమారుడగు రోములస్ అగస్టులస్‌ను రోమను సింహాసన మెక్కించెను. కాని క్రీ. శ. 476 లో ఇతర పెట్రిషియనులు ఒడోసర్ (Odocer) నాయకత్వమున తిరుగుబాటుగావించి ఓరెస్టస్‌ను హతమార్చి, రోములస్‌ను రాజ్యభ్రష్టుని గావించిరి. ఒడోసర్ పశ్చిమ సామ్రాజ్య చక్రవర్తిత్వమును తూర్పుసామ్రాజ్య పాలకున కప్పగించెను. దీనితో రోమను సామ్రాజ్యము మరల ఏకఖండమయినది. రోమునగరస్థానమును కాన్‌స్టాంటినోపిల్ ఆక్రమించినది.

## బైజాంటైన్ సామ్రాజ్యము

జస్టినియన్:— పశ్చిమ సామ్రాజ్య పతనానంతరము తూర్పు సామ్రాజ్యము 10 శతాబ్దముల కాలము నిలచినది. ఈ సామ్రాజ్య చరిత్రలో జస్టీనియన్ (Justenian) పరిపాలనాకాల మొక ప్రముఖ ఘట్టము. జస్టీనియన్ ఇలీరియా నివాసి. క్రీ. శ. 527 లో తూర్పు సామ్రాజ్యాధిపతియయ్యెను. రోమను సామ్రాజ్య ఔన్నత్యమును పునఃస్థాపింప ప్రయత్నించి కొంతవరకు కృతకృత్యుడయ్యెనని చెప్పవచ్చును. నర్తకియగు థియోడోరాను వివాహమాడెను. జస్టీనియన్ గొప్పతనమునకు థియోడోరా సమయోచిత సలహాలు కొంతవరకు కారణమని చెప్పవచ్చును. బెలిసారియస్ (Belisarius), నార్సస్ (Narsas) అను సమర్థులగు సేనానులు జస్టీనియన్ అధికారమును నలుదిశల వ్యాపింపజేయుటలో మిక్కిలి తోడ్పడిరి. జస్టీనియన్ పారశీకులు, హూణులు, స్లావులు, ఆవరులతో అనేక యుద్ధములు సల్పెను. బెలిసారియస్ వెండాలుల నోడించి కార్తేజిని పట్టుకొనెను. ఉత్తర ఆఫ్రికా బైజాంటైన్ సామ్రాజ్య భాగమయ్యెను. బెలిసారియస్

ఆఫ్రికానుండి బయలుదేరి సిసిలీ నాక్రమించి, నేపుల్స్ నగరమును ధ్వంసము గావించి రోమునగరమునకు పురోగమించెను. బెలిసారియస్, నార్సస్ సేనానులు ఇటలీయందు ఆస్ట్రోగాతుల పరిపాలన నంత మొందించి జస్టీనియన్ అధికారమును ప్రతిష్ఠించిరి. ఇటలీ బైజాంటైన్ సామ్రాజ్యభాగమయ్యెను. స్పెయిన్‌నందు కొంతభాగము బైజాంటైన్ సామ్రాజ్యమున కలుపబడుటతో మధ్యధరా సముద్రాధిపత్యము గూడ లభించెను.

రోమనుసామ్రాజ్యమును పునరుద్ధరించుటకంటె రోమను న్యాయశాస్త్రమును క్రోడీకరించుటతో జస్టీనియన్ చరిత్ర ప్రసిద్ధి గాంచెను. జస్టీనియన్ మరణానంతరము బైజాంటైన్ సామ్రాజ్యము గూడ క్షీణింప మొదలిడినది.

## రోమనుసామ్రాజ్య పతనమునకు కారణములు :—

రోమనుసామ్రాజ్యము క్రీ. శ. 476 లో అంతరించెనని కొందరు చరిత్రకారుల అభిప్రాయము. కాని ఈ పతనమున కొక దండయాత్ర గాని, ఒక యుద్ధముగాని, ఒక చారిత్రక సంఘటనగాని కారణమని చెప్పజాలము. రోమనులు తమ సామ్రాజ్యము పతనమగుచున్నదని గుర్తింపలేనట్లుగ క్రమక్రమముగ క్షీణించి కాలగర్భమున కలసి పోయినది.

రోమను చక్రవర్తులు నిరంకుశులు. నిరంకుశత్వము ఏనాటికైన అంతమొందక తప్పదని చరిత్ర ఋజువుచేయుచున్నది. అందులకు రోమనుసామ్రాజ్య మొక ప్రబల నిదర్శనమైనది. రోమనుల ప్రజా స్వామిక మొక బూటకమైపోయెను. వారి వాక్స్వాతంత్ర్య మంతరించి ప్రభుచిత్త మొక శాసనమై వెలసినది. వీరపూజ ప్రబలి చక్రవర్తి దైవాంశసంభూతుడని ప్రచారమైనది.

రోమనుల సైనికవిధానము సామ్రాజ్య పతనమునకు ప్రబల కారణమైనది. రోమనులు భోగలాలసులై తమ కర్తవ్యమును మరచి పోయిరి. సైన్యమునందు అనాగరిక తెగలను జేర్చుకొనిరి. వారు రోమనుయుద్ధకళయందు ప్రవీణులై స్వజాతివారినిచేరి రోమను సామ్రాజ్యముపై దండయాత్రలను సాగించిరి.

రోమను సాంఘికవ్యవస్థలోని బానిసత్వ సిద్ధాంతము గూడ సామ్రాజ్య వినాశనమునకు హేతువైనది. సామ్రాజ్య ప్రజలలో అధికసంఖ్యాకులు బానిసలు. బానిసత్వమున క్రుస్గుచున్న ప్రజలు ప్రభుత్వమునకు సహకార సానుభూతులను జూపుట కల్ల. ప్రజా సహకారములేని ప్రభుత్వమనుగడ శూన్యము.

ఆంటొనైనుల తరువాతి చక్రవర్తులు అసమర్థులు. అసమర్థుని చేతిలో అధికార మెంతకాలమొ నిలువజాలదు. వీరిలో అధికసంఖ్యాకులు భుజబలముగల సేనానులు. పరిపాలనా దక్షతలేనివారు. సింహాసనము కొరకై వివిధసేనానులమధ్య నేర్పడిన కలహములు సామ్రాజ్య సుస్థిరతకు భంగము గలిగించెను. రాజ్యమున శాంతిభద్రతలు నశించెను. వర్తక వ్యాపారములు క్షీణించెను. సామ్రాజ్య ఆర్థిక వ్యవస్థకు స్థిరరూపము లేకుండపోయెను. ప్రజలపై పన్నులభార మధికమయ్యెను. వివిధరాష్ట్రప్రజలు రోమనుప్రభుత్వమునుండి తప్పించుకొనుటకే దారితెన్నులు చూడసాగిరి. సామ్రాజ్య పరిస్థితులను చక్కబరచు సమర్థుడగు చక్రవర్తియే కరువయ్యెను.

క్రైస్తవమత వ్యాప్తివలన ప్రజలలో ప్రభువుపై, ప్రభుత్వముపై గల విశ్వాసము తగ్గిపోయినది. చక్రవర్తిని దైవసముడుగ భావించు పాగన్‌రోము, క్రైస్తవరోముగ మారిపోయినది. క్రైస్తవమతము నణచుటలో చక్రవర్తులు పరాజయమొందిరి. ప్రజా విశ్వాసమును కోల్పోవుటతో ప్రభుత్వబలము తగ్గిపోయినది.

పతనావస్థలోనున్న సామ్రాజ్యమును కూలద్రోయుటలో అనాగరిక తెగల దండయాత్రలు తోడయ్యెను. ఈ దండయాత్రలు ఉత్తరదిశనుండి ప్రారంభమగుటతో రాజధానిపైబడుట సులభమైనది. సామ్రాజ్యమును రెండుగ చీల్చుటయు వినాశనమునకే హేతువైనది. చీలిపోయిన సామ్రాజ్యమును పడగొట్టుట దండయాత్రికులకు సులభమైనది.

# రెండవ భాగము

## అ ధ్యా య ము 7

# ఇస్లాంవ్యాప్తి - క్రూసేడ్లు

## 1. ఇ స్లాం మ తో ద్భ వ ము

మహమ్మదు :— ప్రపంచ చరిత్రలో ఏడవశతాబ్దమున ఇస్లాం. మతావిష్కరణ యొక ప్రముఖ సంఘటనము. హీబ్రూ, ఫినీషియనులవలెనె అరబ్బులును సెమెటిక్ జాతికి చెందినవారు. అరబ్బులు తాము అబ్రహామ్ కుమారుడగు ఇస్మాయిల్ సంతతికి చెందినవారమని చెప్పుకొందురు. వీరిని శారసన్ (Saracens) లనియు పేర్కొందురు. అరబ్బులు ఎడారిమధ్యమున నివాస మేర్ప రచుకొని యుండుటచే విదేశదండయాత్రలకు లోనుగాక స్వాతంత్ర్య ప్రియులై యుండెడివారు. అరబ్బులు వివిధ తెగలుగ నుండి నిరంతరము అంతఃకలహములలో మునిగియుండెడివారు. కొందరు దోపిడియె ముఖ్యవృత్తిగ కలిగియుండెడివారు. వీరిలో బహుభార్యాత్వము, మధుపానము, మూఢవిశ్వాసములు, దుర్వ్యసనములు ప్రముఖ లక్షణ ములుగ నుండెడివి. అరబ్బులలోని వివిధ తెగలవారు వివిధములైన దేవతల నారాధించుచుండెడివారు. మక్కా నగరములోని కాబా క్షేత్రమున గల నల్లనిశిల దైవదూతయగు గేబ్రియల్ స్వర్గమునుండి తెచ్చి అరబ్బుల కిచ్చెనని ప్రతీతి. మక్కానగరమున దినమున కొక దేవత నారాధించుచుండెడివారు. జంతుబలి, నరబలి సర్వ సాధారణముగ నుండెడివి. ఇట్లు మత, సాంఘిక, రాజకీయ విషయ ములందు కడు శోచనీయమైన స్థితియందున్న అరబ్బులను సంఘటిత పరచి, ఏకమతము, ఏకరాజ్యముగ రూపొందించినవాడు మహమ్మదు.

మహమ్మదు క్రీ. శ. 570 లో మక్కా నగరమున కురీష్ (Kureish) తెగకు చెందిన యొక కులీన కుటుంబమున జన్మించెను. బాల్యముననే తలిదండ్రులను కోల్పోవుటచే తాతయగు అబ్దుల్

ముతాలిబ్ పినతండ్రియగు అబుతాలిబ్ లచే ఆదరించబడెను. కాని చిఱుతప్రాయముననే జీవనోపాధిని వెదకుకొనవలసి వచ్చెను. బిడారువర్తకులతో చేరి పర్షియా, సిరియా మొదలగు దూరదేశములకు ప్రయాణము చేసి, వర్తకమునం దనుభవము గడించెను. ఖడీజా యను ధనవంతురాలగు నొక వితంతువుకడ నుద్యోగిగాచేరి ఆమె వర్తకవ్యాపారములను చక్కదిద్దుటేగాక ఆమె ప్రేమకు పాత్రుడై ఆమెను వివాహమాడ గల్గెను.

బాల్యమునుండియు మహమ్మదు ఆధ్యాత్మికచింతనగలవాడు. సిరియా, పాలస్తీనా, పర్షియా మొదలగు దేశములందు పర్యటించుటచే యూదు, క్రైస్తవ, జొరాస్ట్రియను మతసిద్ధాంతములకు సుపరిచితుడయ్యెను. మహమ్మదు మక్కాసమీపమున నొక యేకాంత ప్రదేశమునకేగి ధ్యాననిమగ్నుడై నైతికముగ, ఆధ్యాత్మికముగ పతనమైయున్న తనజాతికి తరుణోపాయమును జూపుమని భగవంతుని వేడుచుండెడివాడు. తుదకు మహమ్మదునకు ఆశయసిద్ధి కలిగినది. దైవదూతయగు గేబ్రియల్ మహమ్మదునకు జ్ఞానమార్గమును జూపెనని చెప్పబడుచున్నది. మహమ్మదు తాను కనుగొనిన నూతనమతమును అరబ్బులకు బోధించి వారిని తరింపజేసెను.

ఇస్లాం మతము :— మహమ్మదు కనుగొనిన నూతన మతమే ఇస్లాం. ఇస్లామనగా అల్లా ఆజ్ఞానువర్తులగుట యని అర్థము. మహమ్మదు విద్యాగంధము లేనివాడగుటచే వాని బోధనలను వాని శిష్యులు క్రోడీకరించి గ్రంథరూపమున వెలువరించిరి. అదియె మహమ్మదీయుల పవిత్ర గ్రంథమైన ఖురాన్. అల్లాతప్ప ఇతర దైవము లేడు. మహమ్మదే అతని ప్రవక్త (లా ఇలాహ్ ఇల్లా అల్లా, మహమ్మద్ రసూల్ అల్లా) అనునది ఇస్లాంమత మూలసూత్రము. మహమ్మదీయులు అల్లాయందు, దైవదూతలయందు, ప్రవక్తయైన మహమ్మదు నందు, పవిత్ర గ్రంథమయిన ఖురాన్‌నందు, పునర్జన్మ, భగవంతుని అంతిమతీర్పు, స్వర్గ నరకములందు అచంచల విశ్వాసము కల్గి అల్లా ఆజ్ఞలను శిరసావహించవలెనని చెప్పబడెను. విగ్రహారాధన మహాపాపమనియు భగవంతుడు నిరాకారుడనియు తెల్పబడెను. అల్లా

ఆజ్ఞానువర్తులగుట, ఖురాను నామూలాగ్రముగ పఠించుట, దినమున కయిదు పర్యాయములు నమాజుచేయుట, రామదన్ మాసము నందు పగలంతయు ఉపవసించుట, మక్కాకు తీర్థయాత్ర సల్పుట, దానధర్మములు చేయుట, జిహాద్ (పవిత్ర యుద్ధము) సల్పుట మహమ్మదీయుల ముఖ్య విధులని మహమ్మదు బోధించెను. అరబ్బుల ప్రాచీన సంప్రదాయములతో సమన్వయమునకై బహుభార్యాత్వము, బానిసత్వములను సహించెను. కాబాను కొలచుట కనుమతించెను. కాని మద్యపానాది దుర్వ్యసనములను నిషేధించెను.

## 2. ఇస్లాం మతవ్యాప్తి

**హిజరా:—** మహమ్మదునకు ఖదీజా, ఆబుబకర్, ఆలీలు ప్రథమ శిష్యులైరి. పిదప ఉమర్ ఇస్లాంమతమును స్వీకరించెను. మహమ్మదు బోధనలు మక్కావాసులకు నచ్చలేదు. వారు మహమ్మదును పిచ్చివాడుగ భావించి నిర్లక్ష్యించిరి. కాని మహమ్మదు దృఢసంకల్పముగాంచి వానిని తుదముట్టింపదలచిరి. క్రీ. శ. 622 లో మహమ్మదు మక్కానువిడచి మదీనాకు పారిపోవలసివచ్చెను. ఈ మహాప్రస్థానమునే హిజరా (Hijra) యందురు. నాటినుండియె మహమ్మదీయశక మారంభమైనది.

**ఇస్లాం రాజ్యస్థాపన:—** మక్కావాసులను ద్వేషించియున్న మదీనావాసులు మహమ్మదు నాహ్వానించిరి. ఇస్లాంమతమును స్వీకరించిరి. మహమ్మదు మదీనావాసులకు సైనికశిక్షణ నిచ్చి యొక గొప్పసైన్యమును తయారుజేసెను. జిహాద్‌నందు మరణించిన వారికి స్వర్గమున సకలసౌఖ్యములు కలుగునని బోధించుటతో మహమ్మదీయులలో మతావేశము పెల్లుబికినది. క్రీ. శ. 623 లో మహమ్మదు మక్కాపై దండయాత్ర నడిపి బదర్ యుద్ధములో మక్కావాసుల నోడించెను. అచటి ఆలయములను ధ్వంసము గావించి మక్కావాసులను మహమ్మదీయులగుట కొప్పించెను. స్వల్ప కాలములోనే ఇస్లామ్‌మతము అరేబియా యంతటను వ్యాపించినది. క్రీ. శ. 632 లో మహమ్మదు మరణించునప్పటికి అరబ్బులలో

భేదభావములు రూపుమాసి అరేబియా ఏకరాజ్యముగ రూపొందినది. అరబ్బులు మతావేశముతో ఉరకలు వేయుచు ప్రపంచమును జయింప ముందున కురుకసాగిరి.

ఖలీఫాలు:— మహమ్మదు తన వారసులను నిర్ణయింపకనే మరణించెను. మహమ్మదు మామయగు అబుబకర్ (Abu Bakar) మహమ్మదుస్థానము నాక్రమించి ఇస్లామ్‌రాజ్యమునకు ఇస్లామ్‌మతమునకు సర్వాధికారియై ఖలీఫాబిరుదు నొందెను. ఖలీఫా యనగా ప్రవక్తప్రతినిధి యని యర్థము. అబుబకర్ బైజాంటైన్ సామ్రాజ్యముపై దాడులను ప్రారంభించెను. సిరియాయందు కొంతభాగ మాక్రమింపగల్గెను. మహమ్మదీయుల బారినుండి తన రాజ్యమును రక్షించుకొనుటకై రోమన్ చక్రవర్తియైన హెరాక్లిస్ ప్రయత్నించెనుగాని రెండవ ఖలీఫాయైన ఉమర్ (Omar - క్రీ. శ. 634-644) వానిని టైబీరియస్ యుద్ధమున నోడించి పాలస్తీనా, ఫినీషియా, సిరియాల నాక్రమించెను. ఈజిప్టుపై దండయాత్ర నడిపి అలెగ్జాండ్రియాను పట్టుకొనెను. కెయిరో అను నూతనపట్టణమును నిర్మించెను. పదిసంవత్సరముల కృషిఫలితముగ పర్షియా మహమ్మదీయ సామ్రాజ్య భాగమయ్యెను. క్రీ. శ. 644 లో ఉమర్ మదీనాయందొక పారశీక బానిసచే హత్యగావింపబడెను. మూడవఖలీఫాయైన ఉస్మాన్ (Osman) సిప్రస్, అరేడస్‌ల నాక్రమించెను. బైజాంటైన్ నౌకాదళమును నాశనమొనరించి కాన్‌స్టాంటినోపిల్‌పై నౌక దండయాత్ర నడిపెను.

ఉస్మాన్ హత్యగావింపబడుటతో ఖలీఫాపదవికై స్పర్ధలు బయలుదేరెను. మహమ్మదు కుమార్తెయగు ఫాతిమా తరపున ఆమెభర్త ఆలీ (Ali) ఖలీఫాపదవినొందెను. కాని ఫాతిమా సవతితల్లియగు అయెషా (Ayesha) అందులకు అభ్యంతరపెట్టెను. ఆలీ హత్యచేయబడుటచే సింహాసనము అతని కుమారుడగు హాసన్ వశమయ్యెను. కాని హాసన్ తనపదవిని వదలుకొనుటతో సిరియా గవర్నరుగనున్న ము ఆవియా (Muavia) ఖలీఫాపదవి నొందెను.

**ఒమ్మాయెద్ ఖలీఫాలు :—** క్రీ. శ. 661 లో ముఆవియా ఖలీఫాపదవినొంది ఒమ్మాయెద్ (Ommayeds) వంశస్థాపకు డయ్యెను. ఖలీఫాపదవిని వంశపారంపర్య హక్కుగ జేసెను. రాజధానిని డమాస్కస్ నగరమునకు మార్చెను. ఈ వంశీయులు సుమారు ఒక శతాబ్ద కాలము పరిపాలించిరి. ఒమ్మాయెద్ ఖలీఫాల పాలనలో ఇస్లామ్‌మతము బహుముఖముగ విస్తృతి చెందినది. ముఆవియా కార్తెజ్ నాక్రమించుటతో ఉత్తరాఫ్రికాయంతయు మహమ్మదీయ సామ్రాజ్యమున జేరినది. వలీ I పరిపాలనాకాలమున క్రీ. శ. 711 లో అరబ్బులు తారిక్ నాయకత్వమున స్పెయిన్‌నందు ప్రవేశించిరి. వీని వలననే పిల్లర్స్ ఆఫ్ హెర్క్యులస్‌నకు జిబ్రాల్టర్ (Jable-al-Tarik) అని పేరువచ్చినది. ఆరునెలలలో స్పెయిన్ ముస్లిమ్‌రాజ్యముగ జేయ బడెను. మహమ్మదీయ నౌకాదళము సార్డీనియా నాక్రమించెను. మధ్యధరాసముద్రతీరమున కొన్ని ముఖ్యరేవులు మహమ్మదీయుల హస్తగతమయ్యెను. మహమ్మద్‌ఖాశిమ్ భారతదేశముపై దండ యాత్రనడిపి సింధురాష్ట్రము నాక్రమించెను.

స్పెయిన్ నాక్రమించిన మహమ్మదీయులు పిరనీస్ పర్వతము లనుదాటి గాలుదేశమున ప్రవేశించిరి. కాని ఫ్రాంకులు ఛార్లెస్ మార్టెల్ నాయకత్వమున క్రీ. శ. 732 లో టూర్స్ యుద్ధమున మహమ్మదీయులనోడించి తరిమివేసిరి. క్రీ. శ. 755 వ సంవత్సరము నకు గాలుదేశమున మహమ్మదీయులకు స్థానములేకుండ జేసిరి. భారతదేశముననుఅరబ్బుల పురోగమనమును రాజపుత్రు లరికట్టిరి.

వలీ మరణానంతరము ఒమ్మాయెద్ వంశీయులు 35 సంవత్స రములు మాత్రమె పరిపాలింప గల్గిరి. ఖలీఫాపదవికై జరుగు వారసత్వ యుద్ధములు వారిబలమును క్షీణింపజేసెను. ఖలీఫాల భోగ లాలసత్వమును వారి పతనమునకు కారణమైనది. అనేకతిరుగు బాట్లు బయలుదేరినవి. తుదకు క్రీ. శ. 750 లో ఒమ్మాయెద్ వంశము నంత మొందించి అబ్బాసీద్‌లు ఖలీఫాపదవి నొందిరి.

**అబ్బాసీద్ ఖలీఫాలు :—** అబ్బాసీద్ వంశమునకు అబుల్ అబ్బాస్ ఆల్‌షఫా మూలపురుషుడు. ఈ వంశపాలనాకాలము

ఇస్లామ్‌రాజ్యమున కొక స్వర్ణయుగము. అల్ మనస్సూర్ (క్రీ.శ. 754-775) తిరుగుబాట్లు నణచివైచి బైజాంటైన్ సామ్రాజ్యముపై దండయాత్ర నడిపెను. అల్ మహ్దీ సామ్రాజ్యమున రాకపోక సౌకర్యముల నినుమడింప జేసెను. కీలకస్థానములలో బలమైన కోటలను గట్టించెను. పట్టణములను, పాఠశాలలను నిర్మించెను. కళాభివృద్ధికై పాటుబడెను. అబ్బాసీద్‌లు క్రీ. శ. 762 లో రాజధానిని బాగ్దాదునకు మార్చిరి.

అబ్బాసీద్ ఖలీఫాలలో హారున్ అల్ రషీద్ (క్రీ. శ. 786 - 809) సుప్రసిద్ధుడు. అరేబియన్ నైట్స్ కథల వీరవతంసుడు. హారున్ కాన్‌స్టాంటినోపిల్‌పై దండయాత్ర నడిపి చక్రవర్తినియగు 'ఇరిని'ని లొంగదీసి సంవత్సరమునకు 70 వేల దీనారములను కప్పము గట్టుట కొప్పించెను. ఆసియామైనరు ఇస్లామ్‌రాజ్య భాగమయ్యెను. హారున్ కుమారుడగు మామున్ సిసిలీ, క్రీట్ ద్వీపములలో మహమ్మదీయుల బాలచంద్ర పతాక నెగురవేసెను.

ఇస్లామ్ సంస్కృతి :— మహమ్మదీయులు అతి స్వల్పకాలము లోనె మహాసామ్రాజ్యమును నిర్మించి మతముతోపాటు తమ సంస్కృతిని గూడ వ్యాపింపజేయుట ప్రపంచచరిత్రలో నొక అద్భుతకార్యము. ఇస్లామ్ సామ్రాజ్యము పిరనీస్ పర్వతములనుండి సింధు, హిందూకుష్‌ల వరకు వ్యాపించినది. ఇంతటి విశాలతరమైన రాజ్యమును పాలించిన రాజులు ఆకాలమున ప్రపంచమున మరి యెచ్చటను లేరని గిబన్ అను చరిత్రకారుడు ప్రశంసించెను. అరబ్బులు తాముజయించిన రాజ్యములలో ఇస్లామును ప్రవేశ పెట్టిరి. పూజా పునస్కారములకు, మతాధికారులకు, తాత్విక సిద్ధాంతములకు తావులేక, సరళమై సామాన్య ప్రజలకును సులభ గ్రాహ్యమై యుండుటవలననే ఇస్లామ్ త్వరితగతిని వ్యాప్తిజెందినదని చెప్పవచ్చును. సాంఘిక, ఆర్థిక సమానత్వ మనేకుల నాకర్షించినది. మహమ్మదీయు లందరు ఏకోదరులను భావము వారి బలము నినుమడింపజేసినది. ప్రపంచమున విగ్రహారాధకులను తుడిచిపెట్టి ప్రపంచ మంతను ఖురానుభూమిగ జేయవలెనను మతావేశము వారిని

ముందున కురుకొనట్లు జేసినది. మతయుద్ధమున వీరమరణ మొందుట స్వర్గధామమును జేపఁజేయను విశ్వాసము వారిని యుద్ధరంగమున ప్రాణములను తృణప్రాయములుగ నెంచి పోరాడునట్లు పురికొల్పినది. తాము జయించిన రాజ్యములలోని ప్రజలకు మహమ్మదీయులు మూడుమార్గములను జూపియుండిరి - ఇస్లామ్‌ను స్వీకరించుట లేక జిజియాను చెల్లించుట లేక ప్రాణము లర్పించుట. ప్రాణభీతి, ధన కాంక్ష గలవారు మహమ్మదీయ మతమును స్వీకరించిరి.

వివిధజాతులు, తెగలవారు ఇస్లామ్‌ను స్వీకరించి మహమ్మదీయులైనట్లే వివిధ దేశముల సంస్కృతీ నాగరికత లేకమై యొక ప్రత్యేక సంస్కృతిగ రూపొందినవి. ఈ సంస్కృతి అరబిక, గ్రీకు, రోమను, యూదు, పారశీక, హిందూ సంస్కృతుల సమ్మేళన మనవచ్చును. దీనిని శారసనులసంస్కృతి యని, ఇస్లామ్‌సంస్కృతి యని, అరబ్ సంస్కృతి యని పేర్కొనుచున్నారు.

అరబ్బులు భవననిర్మాణమున క్రొంగ్రొత్త పద్ధతులను ప్రవేశపెట్టిరి. గణితసూత్రములను పాటించి పచ్చికజి, వర్తులాకారములలో స్తంభములు, మినరెట్లను శిఖరములు, పద్మదళములనుబోలు ద్వారములు నిర్మించిరి. నాటి భవనములలో సెవైలిలోని అల్కజార్, గ్రనడాలోని అల్హాంబ్రా, బాగ్దాదులోని మహామసీదు, ఇస్పహాన్‌లోని జుమ్మామసీదు ముఖ్యమైనవి. అరబ్బులు వైద్యశాస్త్ర ప్రవీణులు. శస్త్రశాస్త్ర నిపుణులు. గణిత, జ్యోతిష, భౌతిక, రసాయనిక శాస్త్రములందు అరబ్బులు అభ్యుదయమును సాధించిరి. మహమ్మద్ ఇబుమూసా ఆనాటి ప్రసిద్ధ గణితశాస్త్రవేత్త. దశాంశపద్ధతి నితడే పాశ్చాత్య దేశముల కందజేసెనని చెప్పబడుచున్నది. ఆల్జీబ్రా, ట్రిగ్నామెట్రీలందు గొప్ప కృషిసల్పిరని; గణితశాస్త్రమునందు సైన్, టాంజెంట్, కో-టాంజెంట్ లను కోణములు అరబ్బుల పరిశోధన లేనని తెలియుచున్నది. లోలకసూత్రముగూడ అరబ్బుల పరిశోధనయే. అరబ్బులు వేదాంత, సాహిత్యరంగములందును వెనుకంజ వేయలేదు. "అరేబియన్ నైట్స్ కథలు" నాటి ప్రసిద్ధగ్రంథము. బస్రా, ఖుఫా, బాగ్దాద్, కెయిరో, కార్డోవాలందు విశ్వవిద్యాలయములు

స్థాపింపబడినవి. అరబ్ వేదాంతసూత్రములు ఆక్స్‌ఫర్డ్, పారిస్, ఇటలీలలోని విశ్వవిద్యాలయములకుగూడ వ్రాకినవి. రంగులద్దుట, లోహ, మృణ్మయపాత్రల జేయుటయందును అరబ్బులు సిద్ధహస్తులు. నౌకలనిర్మించి వర్తకవ్యాపారములను పెంపొందించి అరబ్బులు అపార ధనసంపన్నులైరి.

ప్రాచ్యఖండముల విజ్ఞానబీజములను పాశ్చాత్య దేశములందు వెదజల్లుటయందు, గ్రీకు వేదాంత, శాస్త్రవిజ్ఞానమును పెంపొందించి మధ్యయుగపు అంధకారమున మునిగి తమ సంస్కృతినే మరచిపోయిన యూరోపియనుల కందించుటలోను అరబ్బులు ప్రశంసార్హమైన పాత్ర వహించిరి.

ఇస్లామ్ సామ్రాజ్యమున చీలికలు:—అబ్బాసీద్ వంశ ఖలీఫాల కాలమున మత, సాంస్కృతిక రంగములందు స్వర్ణయుగ ఘనతను సాధించినను రాచకీయముగ ముస్లిమ్‌రాజ్యబలము క్షీణించినది. ఒమ్మాయెద్ వంశీకుడైన అబ్దుర్ రహమాన్ డమాస్కస్ నుండి తప్పించుకొని స్పెయిన్ చేరెను. అచటి మహమ్మదీయులు అబ్బాసీద్ ఖలీఫా ఆధిపత్యమును ధిక్కరించి స్వతంత్రులై యుండిరి. క్రీ.శ. 755 లో అబ్దుర్ రహమాన్ కార్డోవా రాజధానిగ జేసికొని స్పెయిన్ నకు అమీరయ్యెను. క్రీ. శ. 912 నుండి 961 వరకు కార్డోవా రాజ్యమును పాలించిన రెండవ అబ్దుర్ రహమాన్ ఖలీఫా బిరుదు నొందెను. ప్రవక్త కుమార్తె యగు ఫాతిమా సంతతివారు క్రీ. శ. 969 లో బాగ్దాదు ఖలీఫా ఆధిపత్యమును ధిక్కరించి ఈజిప్టునందొక స్వతంత్ర రాజ్యమును స్థాపించుకొనిరి. సిరియా, సార్డీనియా, సిసిలీలను తమ హస్తగతము గావించుకొని కెయిరో రాజధానిగ నొక కాలిఫేటును నిర్మించిరి. సామ్రాజ్య మిట్లు ఛిన్నాభిన్నమగుటేగాక ఖలీఫాపదవికై జరుగు వారసత్వయుద్ధములు అబ్బాసీద్ వంశ ఖలీఫాలబలమును క్షీణింపజేసెను. రాష్ట్రపాలకులు స్వతంత్రులైరి. ఈ అరాచకమును సాకుగ జేసికొని తురుష్కులు దండయాత్రలను ప్రారంభించిరి.

క్రీ. శ. ఆరవ శతాబ్దమునకు తురుష్కులు ఉత్తర చైనానుండి నల్లసముద్రము వరకు వ్యాపించి ఉత్తర, పశ్చిమ రాజ్యములుగ నేర్ప

రించిరి. వీరు చైనానేలిన టాంగ్ వంశ చక్రవర్తులకు సామంతులుగ నుండెడివారు. క్రీ. శ. ఏడవ శతాబ్దాంతమునకు తురుష్కులు స్వతంత్రులైరేగాని ఖలీఫాల ఆధిపత్యమునకు లొంగిపోవలసి వచ్చెను. తురుష్కులు ఇస్లామ్‌మతమును స్వీకరించి అతి సనాతనులైరి.

గజ్నవీ తురుష్కులు :— సబక్తజీన్ అను నొక తురుష్క బానిస ఖలీఫా కొలువునందు జేరి క్రమముగ ఉన్నతోద్యోగములను సంపాదించి క్రీ. శ. 962 లో ఆఫ్ఘన్‌స్థానములోని గజనీ నగరమును రాజధానిగ జేసికొని యొక స్వతంత్రరాజ్యమును స్థాపించెను. ఇతడు సమానీదులనుండి ఖొరాసాన్ (Khorasan) ను సంపాదించెను. పంజాబుపై దండయాత్రసల్పెను. మహమ్మద్ గజనీ పర్షియా నాక్రమించెను. భారతదేశముపై అనేకదండయాత్రల నడిపెను. ఇతడు గొప్ప కవి, పండిత పోషకుడు. అల్బరూని, ఫిరదౌసి నాటి సుప్రసిద్ధకవులు.

సెల్జుక్ తురుష్కులు :— మహమ్మద్ మరణానంతరము గజ్నవీ తురుష్కుల ప్రతిభ క్షీణించినది. సెల్జుక్ తురుష్కులు తుగ్రిల్ బేగ్, చకీరుల నాయకత్వమున గజ్నవీ తురుష్కుల నోడించి ఖొరాసాన్ నాక్రమించి బాగ్దాదుపై బడిరి. క్రీ. శ. 1058 లో ఖలీఫా తుగ్రిల్‌బేగ్‌ను బాగ్దాదున కాహ్వానించి రాజ్యపరిపాలనాధికార మును దత్తత జేసెను. నాటినుండి బాగ్దాదు ఖలీఫాలకు రాజ్య పరిపాలనాధికారము పోయి మతాధిపత్యము మాత్రమె నిలచినది. తుగ్రిల్‌బేగ్ సుల్తాను బిరుదు నొందెను. వాని మరణానంతరము చకీర్ కుమారుడగు ఆల్ప్ అర్స్లాన్ సుల్తానయ్యెను. ఇతడు ఆర్మీని యాను జయించెను. క్రీ. శ. 1071 లో మంజికర్ట్ (Manzikert) యుద్ధమున బైజాంటైన్ చక్రవర్తి నోడించెను. ఆసియా మైనరునందు తన అధికారమును ప్రతిష్ఠించెను. అర్స్లాన్ కుమారుడగు మాలిక్‌షా జెరూసలెమ్‌ను పట్టుకొనెను. ప్రపంచ ప్రసిద్ధిగాంచిన ఉమర్ ఖయ్యామ్ మాలిక్‌షా ఆస్థానముననే యుండెడివాడు.

అ ధ్యా య ము 8

# భారతదేశమున ఇస్లామ్ వ్యాప్తి

## 1. అరబ్బుల దండయాత్రలు

సింధు ఆక్రమణ :— అనేక శతాబ్దములనుండి అరబ్బులు భారతదేశముతో వర్తక వ్యాపారాది సంబంధమును కలిగియుండిరి. భారతదేశ సిరిసంపదలను గూర్చి అరేబియాలో కథలు జెప్పికొనెడి వారు. అరబ్బులు ఇస్లామ్ మత స్వీకరణతో మతావేశము, రాజ్య కాంక్ష హెచ్చి భారతదేశముపై దండయాత్రలను సాగించిరి. క్రీ. శ. 637 లో నొక దండు బొంబాయి ప్రాంతపు టానాపట్టణ మును దోచుకొనిపోయెను. కాని ఖలీఫాగానున్న ఉమర్ అరబ్బు లను వారించెను. క్రీ. శ. 643 లో అబ్దుల్లాబిన్ అమర్ బిన్ కాబి యను సాహసికుడు సిస్టన్, మక్రన్‌ల నాక్రమించి సింధువరకు పురోగమించెను. కాని ఖలీఫా హెచ్చరికతో మరలిపోయెను. పారశీకమున గవర్నరుగ నున్న హజాజ్ గొప్ప సామ్రాజ్యవాది. బొఖారా, ఖోజంద్, సమర్ఖండ్, ఫర్గానాలను జయించెను. భారతదేశ ముపై దండయాత్రకు విముఖుడుగ నున్న ఖలీఫా నొప్పించి క్రీ. శ. 712 లో నొక దండయాత్ర నడిపెను. సింహళమునుండి ఖలీఫాకు పంపబడుచున్న కానుకలను సింధురాష్ట్రపు సముద్రదొంగలు కొల్ల గొట్టిరను మిషతో అరబ్బులు మహమ్మద్ బిన్ ఖాశిమ్ నాయకత్వ మున దండు వెడలిరి. నాటికి మహమ్మద్ 16 ఏండ్ల యువకుడే యైనను మహావీరుడు. 6 వేల అశ్వికదళమును, 6 వేల ఒంటెల దళ మును వెంటనిడుకొని మక్రాన్, బెలూచిస్థాన్‌లమీదుగ సింధునది ముఖద్వారమున నున్న దైబాల్ (కరాచి) ను చేరెను. సింధురాజగు దహీర్ నోడించి ముల్తానువరకు పురోగమించెను. క్రీ. శ. 715 లో ఖలీఫాయైన సులైమాన్ క్రూరుడు, అసూయాపరుడు. ఖాశిమ్ విజయములకు ఈసు జెందిన కొందరు కుట్రదారులు ఖలీఫాకు కొండె ములు చెప్పిరి. ఖలీఫా ఖాశిమ్‌ను పిలిపించి శిరచ్ఛేదము గావించెను.

ఖాశిమ్ మరణముతో భారతదేశమున అరబ్బుల పురోగమనము అరికట్టబడినది. సింధురాష్ట్రమున స్థిరపడిన అరబ్బులు స్వతంత్ర రాజ్యము నేర్పరచుకొని ముల్తాన్, మన్సూరాలను రాజధానులుగ జేసికొని మూడు శతాబ్దముల కాలము పరిపాలన సాగించిరి.

**అరబ్ దండయాత్ర ఫలితములు :—** అరబ్ దండయాత్ర లకు రాజకీయమైన ప్రాముఖ్యత లేకపోయినను అరబ్ సంస్కృతీ పరిణామమునకీ దండయాత్ర మిక్కిలి దోహదపడినది. భారతీయ సంస్కృతిని గాంచి అరబ్బు లబ్బురపడిరి. భారతీయ వేదాంత, గణిత, జ్యోతిష, వైద్య, శాస్త్ర విజ్ఞానములందు, శిల్ప, చిత్రలేఖన, సంగీత కళలందు అరబ్బులు అభిరుచి జూపిరి. అరబ్బీ పండితులు సంస్కృత భాష నభ్యసించి భారతీయ గ్రంథములను పఠించి తాము సముపార్జించిన విజ్ఞానమును ఇస్లామ్ సామ్రాజ్యమునకేగాక పాశ్చాత్యదేశములకును అందజేసిరి. భారతీయ పండితులకు బాగ్దాదు దర్బారునందు విశేషఆదరణ యుండెడిది. అరబ్ దండయాత్ర ప్రాచ్య పాశ్చాత్య సంస్కృతీ సమ్మేళనమునకు దోహదకారి యయ్యెనని చెప్పవచ్చును.

## 2. తురుష్క దండయాత్రలు

**మహమ్మద్ గజనీ :—** అబ్బాసీద్ ఖలీఫాల ప్రాబల్యము క్షీణించుటతో తురుష్కులు స్వతంత్రరాజ్యములను స్థాపించిరి. గజనీని రాజధానిగ జేసికొని పాలించిన సబక్తజీన్ క్రీ. శ. 986 లో ఖైబరు కనుమగుండ భారతదేశమును ప్రవేశించి పంజాబుపై దండెత్తివచ్చి జయపాలు నోడించి పెషావరు వరకు తన రాజ్యమును పెంచెను. జయపాలుడు అవమానకరమైన సంధి కొప్పుకొనవలసివచ్చెను. కాని రెండు రాజ్యములమధ్య తరచు యుద్ధములు జరుగుచుండెడివి.

సబక్తజీన్ మరణానంతరము వాని కుమారుడగు మహమ్మదు క్రీ. శ. 998 లో గజనీ సింహాసన మధిష్ఠించెను. భారతదేశ సిరిసంపదలను గజనీకి చేరవేయుటే ఆశయముగ జేసికొని తన పరిపాలనా కాలములో (క్రీ. శ. 998 - 1030) పదిహేడుమార్లు దండెత్తివచ్చెను.

క్రీ. శ. 1001 లో జయపాలు నోడించి కప్పము గట్టుట కొప్పించెను. కాని జయపాలుడు అవమానమును భరింపలేక అగ్నిలోపడి మరణించెను. జయపాలుని కుమారుడగు ఆనందపాలుడు పొరుగు హిందూ రాజులతో కలసి క్రీ. శ. 1008 లో మహమ్మదు నెదిరించెనుగాని ఓడిపోయెను. పశ్చిమ పంజాబు గజనీరాజ్యమున జేర్చబడెను. కనోజి రాజ్యపాలకుడగు రాజ్యపాలుడు, చాందేలు వంశీయుడగు గండరాజు మహమ్మద్ ధాటికి నిలువలేకపోయిరి. మహమ్మదు హిందూరాజుల నోడించి లోబర్చుకొనుటేగాక హిందూదేవాలయములను ధ్వంసము జేయుటలో ఆసక్తిజూపెను. క్రీ. శ. 1018 లో మధురపైన, 1025 లో సోమనాధ ఆలయముపైన దాడిచేసి ధన, కనక, వస్తు, వాహనములను దోచుకొని పోయెను. మహమ్మద్ గజనీ దండయాత్రలవలన హిందూరాజుల సైనికబలము క్షీణించెను. సిరిసంపదలు తరిగిపోయెను. పంజాబు ఆక్రమణవలన మహమ్మదీయులకు గంగామైదానమును ప్రవేశించుటకు సింహద్వారమును తెరచినట్లయ్యెను.

మహమ్మద్ ఘోరీ :— మహమ్మద్ గజనీ మరణానంతరము ఆతని వంశీయుల బలము క్షీణించి గజనీరాజ్యము ఘోరీవంశీయుల వశమైనది. ఈ వంశరాజులలో ముఖ్యుడైన మహమ్మద్ ఘోరీ (మొయిజ్ ఉద్దీన్) తన అన్నయైన ఘియాజుద్దీన్ ఘోరీతో కలసి పరిపాలన సాగించెను. మహమ్మద్ ముల్తాన్ సింధురాష్ట్రముల నాక్రమించి గుజరాతుపై దాడివెడలెను. కాని అనిల్ వార్ రాజగు మూల్రాజ్ 1178 లో మహమ్మద్ ఘోరీ నోడించి తరిమివేసెను.

మహమ్మద్ ఘోరీ పెషావరు, లాహోరుల నాక్రమించి భాగ్యవంతమైన గంగామైదానముపై దృష్టి మరల్చెను. హిందూరాజులు అజ్మీరు పాలకుడగు పృథ్వీరాజు నాయకత్వమున నొక సమాఖ్యగ నేర్పడి విదేశ దండయాత్రికు నెదిరించిరి. క్రీ. శ. 1191 లో స్థానేశ్వర యుద్ధమున పృథ్వీరాజు ఘోరీ నోడించి తరిమివేసెను. కాని రాజపుత్రరాజులలోని అంతఃకలహముల నాధారముగ జేసికొని ఘోరీ మరుసంవత్సరమె దండెత్తి వచ్చి స్థానేశ్వరయుద్ధమున పృథ్వీరాజు

నోడించి సంహరించెను. క్రీ. శ. 1192 లో జరిగిన ఈ రెండవ స్థానేశ్వరయుద్ధము భారతదేశ చరిత్ర గతినే మార్చివేసిన ప్రముఖ సంఘటనము. దీని ఫలితముగ ఉత్తర హిందూస్థానమున హిందూ రాజుల ప్రాభవ మస్తమించి మహమ్మదీయ ప్రాధాన్యతకు శంకు స్థాపనమైనది.

మహమ్మద్ ఘోరీ ప్రతినిధియైన కుతుబుద్దీన్ ఐబక్ ఢిల్లీ, కాశి, కనోజ, కలింజర్, గ్వాలియర్, గుజరాత్‌ల నాక్రమించెను. ఇతని సేనానియగు మహమ్మద్ ఖిల్జీ బీహారు, బెంగాలు రాష్ట్రము లను మహమ్మదీయ రాజ్యమున జేర్చెను. క్రీ. శ. 1206 లో మహమ్మద్ ఘోరీ మరణించెను. మహమ్మద్ గజనీ వలె గాక తాను జయించిన రాజ్యమున సుస్థిరమైన ప్రభుత్వ మేర్పరచి, చిర స్థాయిగ నుండునట్లు కృషిసల్పుటే ఇతని విశిష్టత.

## 3. ఢిల్లీ సుల్తానులు

బానిస వంశము (క్రీ. శ. 1206 – 1290) :— మహమ్మద్ ఘోరీ మరణానంతరము అతని ప్రతినిధిగనున్న కుతుబుద్దీన్ ఐబక్ క్రీ. శ. 1206 లో ఢిల్లీ సింహాసనమెక్కి స్వతంత్రరాజ్యమును స్థాపించెను. ఇతడు ప్రథమమున బానిసయగుటచే నితని వంశీకులు బానిసరాజులని పేర్కొనబడుచున్నారు. కుతుబుద్దీన్ ఢిల్లీ, అజ్మీరు లందు మసీదులను కట్టించి తన మతాభిమానమును చాటుకొనెను. ఢిల్లీయందు కుతుబ్ మీనార్ అను జయస్తంభ నిర్మాణమునకు పూను కొని తన కళాభిమానమును వెల్లడించెను. విరివిగా దాన ధర్మము లను జేసి లాఖ్-బఖ్ష యని కీర్తిగాంచెను. పరమత సహనము లేనివాడై లక్షలకొలది హిందువులను బానిసలుగ జేసెను. కుతు బుద్దీన్ క్రీ. శ. 1210 లో మరణింపగా వాని కుమారుడగు ఆరాంషా గద్దెనెక్కెను. కాని ఈతనిని కుతుబుద్దీన్ అల్లుడగు ఇల్టుమష్ హత్య గావించి ఢిల్లీ సుల్తానయ్యెను.

ఇల్టుమష్ తిరుగుబాటుదార్లగు అమీరుల నణచివేసి తన అధికారమును సుస్థిరపరచుకొనెను. అనేక దండయాత్రలు జరిపి

రాజ్య విస్తీర్ణతను పెంచెను. ఇతని రాజ్యము హిమాలయములనుండి వింధ్యపర్వతములవరకు, సింధునదినుండి బ్రహ్మపుత్రవరకు వ్యాపించి నది. ఆల్టమష్ భారతదేశమున అరబిక్ నాణెములను ప్రవేశపెట్టెను. పండితులను, కవులను పోషించెను. పెక్కు మసీదులను నిర్మించెను. అరాచకముగనున్న రాజ్యమున సుస్థిరప్రభుత్వమును నెలకొల్పి భారతదేశమున "మహమ్మదీయ రాజ్యమునకు నిజమైన వ్యవస్థాపకుడు సుల్తాను ఆల్టమష్" అని పేరుబడసెను. "స్వశక్తిచే గొప్ప సామ్రాజ్యమును నిర్మించి ప్రజాక్షేమమునకై పాటుబడిన పరిపాలకు" డని మిన్హాజ్ ఇసిరాజ్ అను చరిత్రకారుడు వర్ణించియున్నాడు.

ఆల్టమష్ క్రీ. శ. 1236 లో మరణింపగా వాని కుమారుడగు రుక్నుద్దీన్ సింహాసన మధిష్ఠించెను. కాని, ఇతడు స్త్రీలోలుడు, మద్యపానాభిరక్తుడు నగుటచే వానిని తొలగించి వాని సోదరియగు సుల్తానారజియా గద్దెనెక్కెను. భారతదేశ సింహాసన మధిష్ఠించిన మహమ్మదీయ వనిత ఈమె యొక్కతియె! ఈమె కడు సమర్థురాలు. సకల రాజలక్షణ లక్షిత. పురుషవేషమును ధరించి దర్బారునకు హాజరగుచుండెడిది. ఖడ్గపాణియై రణరంగమున కురికి తిరుగుబాటుదారుల నణచివేసెను. చరిత్రకారుడగు ఫిరిష్టా వ్రాసినట్లు "స్త్రీయై పుట్టుటే ఈమెలోపము." ఎంతటి సచుర్థురాలైనను స్త్రీ సహజమగు బలహీనత ఈమెను విడనాడలేదు. ఒక అబిసీనియా బానిసపై పక్కువజూపి తుర్కీ అమీరుల ద్వేషమునకు గురియయ్యెను. తుదకీమె దుర్మరణము నొందెను. రజియా యనంతరము బహ్రామ్, మసూద్ అనువారలు స్వల్పకాలము రాజ్యపాలన గావించిరి. తుదకు క్రీ. శ. 1246 ఆల్టమష్ అరవ కుమారుడగు నాజరుద్దీన్ సింహాసనమెక్కి ఇరువదేండ్లు పరిపాలన గావించెను. ఇతడు సాధుశీలుడు. దైవచింతన గలవాడు. రాజ్యభోగముల కాసింపక ఖురాన్ ప్రతుల వ్రాసికొని జీవించిన నిష్కాముడు. ఇతని మామయగు ఘియాజుద్దీన్ బాల్బన్ ప్రధాని పదవినొంది రాజ్యవ్యవహారములను చక్కబెట్టెను. హిందూరాజుల, ముస్లిమ్ గవర్నరుల తిరుగుబాట్ల నణచి మంగోలు దండయాత్రల నరికట్టెను.

నాజరుద్దీన్ మరణానంతరము బాల్బన్ సింహాసన మధిష్ఠించెను. ఇతడు ప్రథమమున అల్టమష్ కడ బానిసగ నుండెడివాడు. స్వశక్తిచే ఉన్నత పదవుల నందెను. మంత్రిగా ఇరువదేండ్లు, సుల్తానుగ ఇరువదేండ్లు (1266-1286) పరిపాలన గావించి బానిసరాజులలో కెల్ల ఘను డను కీర్తి గాంచెను. అమీరుల అధికారమును తగ్గించి సుల్తాను ప్రతిష్ఠను పెంపొందించుటకు ప్రయత్నించెను. గూఢచారుల నియోగించి అమీరుల, గవర్నరుల చర్యలను కనిపెట్టుచుండెడివాడు. ప్రజలకు, ప్రభుత్వోద్యోగులకు సుల్తాను దైవప్రతినిధియను భావమును కలిగించుటే ఇతని ఆశయము. తిరుగుబాటుదారుల నణచుటలో మిక్కిలి క్రూరత్వము జూపి ఇతరులకు సింహస్వప్నమయ్యెను. మంగోలుల నరికట్టుటకై బలమగు కోటలను గట్టించి, సైనికబలమును ఇనుమడింప జేసెను. బాల్బన్ రాజ్యవ్యవహారములందు క్రూరుడుగ కన్పట్టినను దయార్ద్రహృదయుడు. న్యాయశీలి. పండిత పోషకుడు. అమీర్ ఖుస్రూ అను పారశీక పండితు నాదరించెను. మంగోలుల దండయాత్రలచే నిలువనీడలేక తలదాచుకొన వచ్చిన మధ్యఆసియా రాకుమారులకు ఢిల్లీనగరమున ఆశ్రయ మిచ్చి ఆదరించెను.

మంగోలుల దండయాత్ర నరికట్టుచు బాల్బన్ కుమారుడగు మహమ్మదు మరణించెను. పుత్రశోకముతో బాల్బన్ క్రీ. శ. 1286 లో మరణించెను. పిదప వాని మనుమడగు కైకోబాద్ గద్దెనెక్కెను. కాని ఇతడు విషయలోలుడై విలాసముతో కాలము గడుపసాగెను. తుదకు క్రీ. శ. 1290 లో జలాలుద్దీన్ ఖిల్జీ అను తుర్కీ అమీరు కైకోబాదును చంపి ఢిల్లీసింహాసన మెక్కి ఖిల్జీవంశ స్థాపకుడయ్యెను.

**ఖిల్జీవంశము (క్రీ. శ. 1290 – 1321) :—** ఖిల్జీ వంశీకుడగు జలాలుద్దీన్ సింహాసన మధిష్ఠించునప్పటికి డెబ్బదేండ్ల వృద్ధుడు. సాధుశీలుడు. శాంతిప్రియుడు. 1292 లో మంగోలుల నెదుర్కొని తరిమివేసెను. బందీలుగ చిక్కిన మూడు వేలమంది మంగోలులకు ఇస్లామ్‌మత మిప్పించి, ఢిల్లీసమీపమున మొగలుపురమును నిర్మించి అందు వారికి నివాస మేర్పరచెను.

జలాలుద్దీన్ తన సోదరుని కుమారుడగు అల్లాయుద్దీన్‌ను గంగా యమున మధ్యప్రదేశమగు 'కరా' రాష్ట్రమునకు గవర్నరుగ నియమించెను. అల్లాయుద్దీన్ 1293లో బుందేల్‌ఖండ్, మాళ్వల లోని తిరుగుబాట్లు నణచివేసెను. సుల్తాను అనుమతి లేకుండనే ఆరువేల అశ్వికదళముతో వింధ్యపర్వతములను దాటి దక్షిణముగ ప్రయాణము జేసి క్రీ. శ. 1294లో దేవగిరి, ఎలిచపురములను కొల్లగొట్టి దక్షిణరాజులు తన్ను ఎదిరించులోపుననే మరలిపోయెను. జలాలుద్దీనుని హత్యగావించి అల్లాయుద్దీన్ ఢిల్లీసుల్తానుగ ప్రకటించుకొనెను.

అల్లాయుద్దీన్ ఖిల్జీ 1296 నుండి 1316 వరకు పరిపాలన గావించెను. ఇతడు కపటి. ఎంతటి క్రూరకార్యమునకైనను వెనుకాడెడివాడు కాడు. న్యాయాన్యాయవిచక్షణ లేనివాడు. కాని గొప్పవీరుడు. సాహసికుడు. పరిపాలనాదక్షత కలవాడు. మంగోలుల దండయాత్రల నెదుర్కొనుచు రాజ్యమును విస్తరింపజేసి సామ్రాజ్యాధిపత్యమును పొందిన ఘనుడు.

అల్లాయుద్దీన్ పరిపాలనాకాలమున మొగలులు ఆరుపర్యాయములు దండెత్తివచ్చిరి. వీరి దండయాత్రలకు మొగలుపురములోని నయాముస్లిముల కుట్రలే కారణమని తలచి యొకే దినమున ముప్పదివేలమందిని స్త్రీ పురుష విచక్షణ జూపక చిత్రవధ గావించెను. మొగలుల నరికట్టుటకై వాయవ్య సరిహద్దునందు అనేక కోటలను గట్టించి జాగరూకుడై మెలగెను. చేజిక్కిన మొగలు నాయకులను ఏనుగులచే త్రొక్కించి చంపించెను. సుల్తానునకు వెఱగొంది మొగలులు తమ దండయాత్రలను విరమించుకొనిరి.

1297 లో అల్లాయుద్దీన్ ఉలుగ్‌ఖాన్, నజరత్‌ఖానుల నాయకత్వమున గొప్ప సైన్యమును గుజరాతుపై బంపెను. గుజరాత్, అన్హిల్‌వార్, కాంబేలు మహమ్మదీయ రాజ్యమున జేర్చబడెను. 1301 లో రణతంభోరు వశమయ్యెను. 1303 లో చిత్తూరు దుర్గమును ఆక్రమింపగల్గెను. మాళ్వ దేశమునకు మహమ్మదీయ గవర్నరు నియమింపబడెను. మాండు, ఉజ్జయిని, ధారా, చందేరి పాలకు లోడి

పోయి అల్లాయుద్దీనునకు కప్పముగట్టుట కంగీకరించిరి. 1305 వ సంవత్సరమునకు ఉత్తర హిందూస్థానమంతయు అల్లాయుద్దీన్ పాలనలోనికి వచ్చెను.

అల్లాయుద్దీన్ తన దృష్టిని దక్షిణదేశముపై మరల్చి దక్కను దండయాత్రలకై తన ముఖ్య సేనాని యగు మాలిక్ కాఫర్‌ను నియమించెను. 1307 లో దేవగిరి మాలిక్ కాఫర్ దోపిడికి గురియయ్యెను. 1309 లో కాకతీయ సామ్రాజ్యముపై బడి, ఓరుగల్లును పట్టుకొని ప్రతాపరుద్రుని సామంతునిగా జేసికొని విశేష ధనరాసులతో మరలిపోయెను. క్రీ. శ. 1310 లో మాలిక్ కాఫర్ మరల బయలుదేరి ద్వారసముద్రపాలకు నోడించి కప్పముగట్టుట కొప్పించెను. చోళపాండ్యరాజ్యముల నణగద్రొక్కి మధురను దోచుకొని రామేశ్వరమువరకు దిగ్విజయయాత్ర సల్పెను. 1312 వ సంవత్సరమునకు అల్లాయుద్దీన్ భారతదేశ మంతటకు సామ్రాట్టయ్యెను.

అల్లాయుద్దీన్ గొప్పవిజేతగనేగాక పరిపాలనాదక్షుడుగగూడ ప్రసిద్ధికెక్కెను. రాజకీయములందు మతగురువులగు ఉలేమాల జోక్యమును నిరసించి తన కిచ్చవచ్చినట్లు పరిపాలించెను. దేశమున తిరుగుబాట్లు లేకుండ జేయుటకై కఠినమైన ఆంక్షలు, క్రూరమగు శాసనములు ప్రవేశపెట్టెను. గూఢచారుల సంఖ్యను అధికముగ పెంచెను. అమీరులు సైతము బాహాటముగ సంభాషించుటకు భయపడుచుండెడివారు. ప్రజలు నిరుపేదలైన గాని యణకువతో నుండరని తలచి పన్నులభారము నధికము చేసెను. హిందువులయెడ అతిదారుణముగ ప్రవర్తించెను.

ప్రభుత్వోద్యోగులలో లంచగొండితనమును రూపుమాపెను. సైనికబలము నితోధికముగ పెంచి వారికి జాగీరులిచ్చు పద్ధతిమాని జీతముల నేర్పాటుజేసెను. అమీరులవద్ద నున్న సైనికుల వివరముల పట్టికలను తయారు జేయించియు, గుఱ్ఱములకు ముద్రలు వేయు పద్ధతిని ప్రవేశపెట్టియు మోసముల నరికట్టెను. సైనికుల కిచ్చు జీతములు తక్కువగ నుండుటచే దైనికావసర వస్తువులకు స్వల్ప ధర

లను నిర్ణయించి హెచ్చుధరలకు విక్రయించిన వారిని కఠినముగ శిక్షించెను. తూకమునందు మోసముజేసిన వర్తకుల మాంసముతో లోటును భర్తీచేయించెడివాడు. పన్నులను ధనరూపమునగాక ధాన్య రూపమున, వస్తురూపమున సేకరించి నిల్వయుంచి కరవు సమయ ములం దుపయోగించెడివాడు. నిరంకుశముగ పాలించినను వైభవో పేతమగు దర్బారు, చక్కని ప్రభుత్వ విధానము, ఆర్థిక సంస్కరణలు ప్రజలను తృప్తిపరచినవి. అమీర్ ఖుస్రూ, షేక్ రుక్నుద్దీన్, షేక్ నిజాముద్దీన్ ఆలియా వంటి ప్రముఖులు అల్లాయుద్దీన్ దర్బారు నకు శోభగూర్చిరి. ఇబన్ బటూటాయను విదేశ యాత్రికుడు "గొప్ప ముస్లిమ్ చక్రవర్తులలో అల్లాయుద్దీ నొక"డని ప్రశంసించెను. అల్లాయుద్దీన్ మరణానంతరము అయిదు సంవత్సరములలోనే ఖిల్జీ వంశ మంతరించెను.

తుగ్లక్ వంశము (క్రీ. శ. 1321 - 1412):— తుగ్లక్ వంశస్థాపకుడైన ఘియాజుద్దీన్ అనేక సంస్కరణలను ప్రవేశపెట్టి అరాచకముగనున్న రాజ్యమున శాంతిని నెలకొల్పెను. యువరాజైన జునాఖాన్ ఓరుగల్లుపై దండెత్తి ప్రతాపరుద్రు నోడించి కాకతీయ సామ్రాజ్యమును ఢిల్లీ సామ్రాజ్యమున జేర్చెను. జునాఖాన్ కుట్ర ఫలితముగ తానున్న గుడారము కూలి పడుటచే ఘియాజుద్దీన్ మర ణించెను. జునాఖాన్ క్రీ. శ. 1325 లో మహమ్మద్ బిన్ తుగ్లక్ అను పేరుతో ఢిల్లీసింహాసన మెక్కెను.

మధ్యయుగపు భారతదేశ చరిత్రలో మహమ్మద్ బిన్ తుగ్లక్ మరువరాని వ్యక్తి. ఇతడు కడు మేధావి. విద్వాంసుడు. అరబ్బీ, పారశీక భాషలలో కవిత జెప్పగలడు. తర్క, ఖగోళ, గణిత శాస్త్రములందు పరిచయముగలవాడు. వేదాంత గ్రంథములను కూలంకషముగ జదివిన జ్ఞాని. న్యాయశాస్త్రకోవిదుడు. యుద్ధకళా విశారదుడు. స్వీయ మతాభిమాని. కాని పరమత సహనముకలవాడు. సంస్కరణాభిలాషి. కాని మొండిపట్టుదల, అసహనము, క్రౌర్యము ఇతనిని విడనాడలేదు. ప్రజల కుపయోగపడు వైద్యశాలలు, సత్ర ములు, మున్నగు సంస్థలను స్థాపించెను. మితిమీరిన తెలివితో

ఆశయములలోను, అభిప్రాయములలోను తన ప్రజలందరికన్న కొన్ని శతాబ్దములు ముందుకు నడచి అభ్యుదయ కాముడై నాటి ప్రజలకు హితముగాని కొన్ని సంస్కరణలను పట్టుదలతో అమలు జరిపి, ప్రజల క్రోధమునకు, విమర్శలకు గురియై, తనను అర్థము చేసికొనలేనివారిచే పిచ్చివా డనిపించుకొని తుదకు తన రాజ్యవిచ్ఛిన్నమునకు తానే కారకుడయ్యెను.

పర్షియాపై దండయాత్ర నడుపవలెనని సుమారు నాలుగు లక్షల సైన్యమును ప్రోగుచేసి భౌగోళికమగు అడ్డంకులవలన తన ఆశయము నెరవేరదని గుర్తించి తన ప్రయత్నమును విరమించుకొనెను. ఈ తొందరపాటు వలన ఖజానాలోని సొమ్ము తరిగిపోయెను. ఇండియా చైనాల నడుమనున్న ఖుర్జాల్ ప్రాంతపు పర్వతరాజు నణచుటకై గొప్ప సైన్యమును పంపెను. దండయాత్ర సఫలమైనను, శీతలబాధను తట్టుకొనలేక, ఆహార పదార్థముల కొరతవలనను సైన్యమంతయు నశించెను. ఢిల్లీ, గుజరాత్, లక్నావతి, మాబారు మొదలగు ఇరువది మూడు రాష్ట్రములను కల్గి హిమాలయములనుండి కర్ణాటకము వరకు వ్యాపించిన విశాలసామ్రాజ్యమున రాజధాని మధ్యగ నుండుట ఉచితమని తలచి రాజధానిని ఢిల్లీనుండి దేవగిరికి మార్చెను. దేవగిరికి దౌలతాబాదను పేరిడెను. ఢిల్లీనుండి దౌలతాబాదువరకు ఏడువందల మైళ్ళ పొడవు బాటనిర్మించెను. మార్గమధ్యమున విశ్రాంతి గృహములను, భోజన వసతులను కల్పించెను. ప్రభుత్వోద్యోగులనే గాక ఢిల్లీప్రజలందరను దౌలతాబాదునకు తరలించుట సుల్తాను అవివేకము. రాజధాని దూరమగుటచే ఉత్తర హిందూస్థానమున తిరుగుబాటులు బయలుదేరెను. మొగలుల దండయాత్ర లధికమయ్యెను. మహమ్మద్ బిన్ తుగ్లక్ మరల రాజధానిని ఢిల్లీకి మార్చెను. ఈ ప్రయాణములలో వేలకొలది ప్రజలు అసువుల గోల్పోయిరి. "పెడదారి బట్టిన సుల్తాను ప్రతిభకు దౌలతాబాదు చిహ్నముగ నిలచియున్న" దని యొక చరిత్రకారుడు వ్యాఖ్యానించి యున్నాడు.

మహమ్మద్ బిన్ తుగ్లక్ సంస్కరణలలో రాగినాణెముల ఆవిష్కరణ ముఖ్యమైనది. వెండినాణెముల స్థానమున సుల్తాన్

రాగినాణెములను ప్రవేశపెట్టినేగాని దొంగనాణెములను ముద్రింప రాదని శాసింపకపోవుటచే ప్రతిగృహము నొక టంకశాల యయ్యెను. ప్రభుత్వఖజానా రాగినాణెముల రాసులతో నిండిపోయెను. వర్తక వ్యాపారములు స్తంభించిపోయెను. దేశమున ఆర్థికమాంద్య మేర్పడెను. సుల్తాను తన పొరపాటును గుర్తించి మరల వెండినాణె ములను ప్రవేశపెట్టెను.

ఈ అవకతవక పనులవలన దేశమున కరువు వ్యాపించెను. పన్ను లను చెల్లింపలేని కర్షకులు తమ భూములను వదలి అడవులకుపోయి దొంగలగుంపులుగా తయారైరి. మాబారు, బెంగాలు, అయోధ్య, సింధు, గుజరాతులందు తిరుగుబాట్లు బయలుదేరి స్వతంత్ర రాజ్యము లయ్యెను. దక్కనునందు బహామని, విజయనగర రాజ్యములు వెలసెను. మహమ్మద్ 1351 లో సింధురాష్ట్రపు తిరుగుబాటు నణచుటకై బయలుదేరి మార్గమధ్యముననే మరణించెను. "దీనితో సుల్తానునుండి ప్రజలు, ప్రజలనుండి సుల్తాను విముక్తులై"రని బదాని అను చరిత్ర కారుడు వ్యాఖ్యానించెను.

మహమ్మద్ మరణానంతరము ఫిరోజ్‌షా సుల్తానై ముప్పది యేడు సంవత్సరములు శాంతియుతముగ పరిపాలించెను. కాని పతనా వస్థలోనున్న సామ్రాజ్యసౌధమును నిలబెట్టలేకపోయెను. మహమ్మద్ వలన నష్టపడిన కుటుంబములకు పరిహారమిచ్చెను. పన్నులభారమును తగ్గించెను. నీటివసతుల నేర్పరచి బంజరుభూములను సాగులోనికి తెచ్చెను. ఢిల్లీనగరమున నొక ఉచిత వైద్యశాల కట్టించెను. ఢిల్లీ సమీపమున ఫిరోజ్‌బాద్ నగరమును నిర్మించెను. జానూ్పరు, ఫతేబాద్, హిజర్, ఫిరుజా నగరములనుగూడ నితడే నిర్మించెను.

ఫిరోజ్‌షాతుగ్లక్ సుమారు రెండులక్షల బానిసలను చేర దీసెను. ఈ బానిసలను మహమ్మదీయులుగ జేయుటచే మతవ్యాప్తికి తోడ్పడినను వారిని పోషించుట ప్రభుత్వమున కొక అదనపుభార మయ్యెను. సైనికులకు మరల జాగీరులనిచ్చు పద్ధతిని ప్రవేశపెట్టెను. ఇతడు మూఢవిశ్వాసియైన మహమ్మదీయుడు. హిందువులను క్రూర ముగ హింసించెను. విగ్రహారాధనను నిషేధించి, దేవాలయములను

నాశనము గావించెను. బ్రాహ్మణులపైగూడ జిజియాపన్నును విధించెను. మహమ్మదీయులలోని షియా తెగవారును ఈతని హింసకు గురియైరి.

ఫిరోజ్‌షా మరణానంతరము తుగ్లక్ వంశీయులు క్రీ. శ. 1388 నుండి 1414 వరకు పరిపాలన గావించిరి. కాని వారు నామమాత్రావశిష్టులైన సుల్తానులని చెప్పవచ్చును. విశాలమైన సామ్రాజ్యము విచ్ఛిన్నమై తుదకు సుల్తాను అధికారము ఢిల్లీ పరిసరములకు మాత్రమే పరిమితమయ్యెను. మహమూద్ తుగ్లక్ పరిపాలనాకాలమున క్రీ. శ. 1398 లో ప్రాచ్య దేశములను గడగడలాడించిన మహావిజేతయగు తైమూరు తన మొగలు సేనలతో భారతదేశముపై బడెను. మార్గమధ్యమున గల గ్రామములను తగులబెట్టుచు, స్త్రీ పురుషులను భేదముజూపక ప్రజలను తన కరకుకత్తారుల కెరగావించుచు, ధన ధాన్యములను దోచుకొనుచు ఢిల్లీ చేరెను. మూడు దినములపాటు ఢిల్లీనగరము తైమూరు అత్యాచారములకు లోనయ్యెను. నగర వీధులలో శవములు కుప్పలుగా పడెను. వేలకొలది ప్రజలు బానిసలైరి. శిల్పులు, కళాకారులు సమర్ఖండునకు తరలించబడిరి. తన భీభత్సమును పూర్తిగావించి తైమూరు తిరిగి పోయెను. గుజరాతునందు దాగిన మహమూద్ ఢిల్లీకి చేరెను. క్రీ. శ. 1412 లో మహమూద్ మరణముతో తుగ్లక్ వంశ మంతరించెననియె చెప్పవచ్చును. క్రీ. శ. 1414 లో తైమూరు ప్రతినిధిగ ముల్తానునందున్న ఖిజర్‌ఖాన్ ఢిల్లీ నాక్రమించి సయ్యద్‌వంశ స్థాపకుడయ్యెను.

సయ్యద్ వంశీయులు 1414 నుండి 1450 వరకు పరిపాలన గావించిరి. వీరు షియాశాఖకు చెందిన మహమ్మదీయులు. 1451 లో ఢిల్లీసింహాసన మాక్రమించిన లోడీవంశీయులు 1526 వరకు పరిపాలన గావించిరి. వీరు ఆఫ్ఘన్ దేశస్థులు. వీరికాలమున ఢిల్లీ రాజ్యము పంజాబునుండి కాశి, బుందేల్ ఖండములవరకు విస్తరించినది. ఈ వంశమున కడపటివాడైన ఇబ్రహింలోడి (క్రీ. శ. 1517 - 26) గర్వాంధుడు. పెడసరి. తన ప్రవర్తనచే ఆఫ్ఘన్ అమీరుల ద్వేషమునకు గురియై ఆపదలను తెచ్చిపెట్టుకొనెను. పంజాబు

గవర్నరుగనున్న దౌలత్ ఖాన్ లోడి కాబూలుపాలకుడుగ నున్న బాబరును దండెత్తిరమ్మని ప్రోత్సాహపరచెను. 1526 లో జరిగిన మొదటి పానిపట్టు యుద్ధఫలితముగ లోడివంశ మంతరించి బాబరుచే మొగలు వంశము స్థాపింపబడినది.

ఢిల్లీ సామ్రాజ్య పతనమునకు కారణములు:— 1. ఢిల్లీ సామ్రాజ్యపతనమునకు పరిపాలనా పద్ధతిలోని లోపమే ముఖ్య కారణము. రాష్ట్రపాలకుల, జాగీర్దారుల అధికారమునకు పరిమితి లేదు. కేంద్రమున పాలకుడు సమర్థుడైన అణగియుండుట, అసమర్థుడైన తిరుగుబాటును లేవదీయుట పరిపాటియయ్యెను. 2. సామ్రాజ్యము విశాలమై వార్తాసౌకర్యములు, ప్రయాణ సౌకర్యములు లేకపోవుటవలన దూరముగనున్న రాష్ట్రపాలకులను కేంద్రప్రభుత్వము అదుపులో నుంచలేకపోయెను. 3. భారతదేశమున స్థిరపడిన మహమ్మదీయులు భోగలాలసులై, విలాస జీవితములను గడుపుచు తమ పూర్వశక్తి సామర్థ్యములను కోల్పోయిరి. వీరు కుట్రలలో శ్రద్ధజూపిరేగాని యుద్ధరంగమున తమ పరాక్రమమును చూపలేకపోయిరి. 4. ఢిల్లీ సుల్తానులలో కుతుబుద్దీన్, ఆల్టమష్, బాల్బన్, అల్లాయుద్దీన్ తప్ప మిగిలినవారు త్రాగుబోతులు, స్త్రీలోలురు. కొందరు సత్ప్రవర్తనులైనను అసమర్థులైరి. 5. ఢిల్లీ సుల్తానులు శక్తిబలముచే రాజ్యమును పాలించిరే గాని సామ్రాజ్య క్షేమమునకు మూలకందమైన ప్రజానురాగమును విస్మరించిరి. 6. ఢిల్లీ సుల్తానుల పరమతద్వేషము హిందువుల సానుభూతి, సహకారములను దూరముచేసెను. పరిపాలనయందు హిందువులను భాగస్వాములుగ జేయుటకీ సుల్తాను లెట్టి ప్రయత్నమును గావించి యుండలేదు. 7. మహమ్మద్ బిన్ తుగ్లక్ అవకతవకపాలన సామ్రాజ్య విచ్ఛిన్నమునకు దారితీసెను. 8. పతనమునకు దారితీయుచున్న సామ్రాజ్య వృక్షమునకు తైమూరు దండయాత్ర గొడ్డలిపెట్టయ్యెను. ఢిల్లీ సామ్రాజ్యము ముక్కలయ్యెను. 9. ఇబ్రహింలోడి అహంకారము రాజ్యాంతమునకు అంతిమ మెట్టయ్యెను. బాబరు దండయాత్ర ఢిల్లీసుల్తానులపాలన నంతరింపజేసెను.

# 4. బహమని రాజ్యము (క్రీ. శ. 1347 - 1518)

బహమని రాజ్యస్థాపన :— మహమ్మద్ బిన్ తుగ్లక్ పరిపాలనతో విసిగిపోయిన దక్కను అమీరులు ఇస్మాయిల్ మాఖ్ అనువానిని సుల్తానుగ జేసి దౌలతాబాదు రాజధానిగ స్వతంత్ర రాజ్యమును స్థాపించిరి. ఇతడు వృద్ధుడగుటచే హసన్ అను సాహసికుడైన యువకునకు రాజ్యమును వదలివేసెను. హసన్ క్రీ. శ. 1347 లో అల్లాయుద్దీన్ హసన్ గంగూ బహమనీ యనుపేర సుల్తానయ్యెను. ఒక బ్రాహ్మణుని జ్ఞాపకార్థము హసన్ తన వంశమునకు బహమని యని పేరుపెట్టెనని ఫెరిస్టా వ్రాసెను. కాని ఇతడు బహమని బిన్ ఇస్ఫండియార్ అను పారశీకరాజు సంతతి వాడగుటచే వాని వంశమునకు బహమనివంశమను పేరువచ్చెనని ప్రస్తుతము భావింపబడుచున్నది. బహమనీ సుల్తానులు ఆఫ్ఘనులు. షియా శాఖకు చెందినవారు.

హసన్ రాజధానిని గుల్బర్గాకుమార్చి తన రాజ్యమును దౌలతాబాద్, గుల్బర్గా, బీరారు, బీదరు అను తరఫ్ (రాష్ట్రము)లుగ విభజించి తనకు సహాయపడిన అమీరులను తరఫ్దారులుగ నియమించెను. జాగీరుపద్ధతి నేర్పరచి జాగీర్దారులు సుల్తానునకు సైన్యమును సరఫరాచేయు పద్ధతిని అనుసరించెను. స్వతంత్రులైన హిందూ రాజులను లొంగదీసెను. క్రీ. శ. 1358 లో హసన్ మరణించునప్పటికి బహమని రాజ్యము వైనగంగనుండి కృష్ణానదివరకు, దౌలతాబాదునుండి భోనగిరివరకు విస్తరించెను.

హసన్ మరణానంతరము వాని కుమారుడగు మహమ్మద్ షా I (1358-73) సింహాసనమెక్కి విజయనగర, తెలంగాణ హిందూరాజులతో యుద్ధములను ప్రారంభించెను. ఓరుగల్లురాజునుండి గోల్కొండ దుర్గమును, కెకెలక్షల బంగారునాణెములను పుచ్చుకొనెను. విజయనగర సైన్యమును నాశనముజేసి ముద్గల్లుకోటను వశపరచుకొనెను. కాని ముద్గల్లు, రాయచూరు దుర్గములతో కూడిన కృష్ణ, తుంగభద్రల నడుమగల అంతర్వేదికై బహమని, విజయనగర రాజులు తరచు యుద్ధములకు దిగుచుండెడివారు.

ఎనిమిదవ సుల్తానైన ఫిరోజ్‌షా (1397-1422) రాజధానియైన గుల్బర్గాయందు అనేక దివ్యభవనములను కట్టించెను. విజయనగర రాజైన దేవరాయుల నోడించెను. వాని తరువాతి సుల్తానైన అహమ్మద్‌షా(1422-35) క్రీ.శ. 1424 లో ఓరుగల్లురాజు నోడించెను. మాళ్వాపై దండెత్తెను. కొంకణదేశపు హిందూరాజులపై విజయయాత్ర సల్పెను. హిందువులను హింసించుటయందు ఆసక్తిజూపి 'వలి' యను బిరుదుగాంచెను. అహమ్మద్‌షా తరువాతి సుల్తానైన రెండవ అల్లా యుద్దీన్ పరిపాలనా కాలమున బహమనీరాజ్యమున షియా, సున్నీ విభేదములు హెచ్చెను. తరువాతి సుల్తానగు హుమాయూన్ రక్త పిపాసియై జాలిమ్ (నిరంకుశుడు) అని పేర్గాంచెను.

క్రీ. శ. 1461 లో గద్దెనెక్కిన నిజామ్‌షా ఎనిమిదేండ్లబాలు డగుటచే మంత్రిగ నున్న మహామూద్ గవాన్ పరిపాలన నతిసమ ర్థతతో నడిపెను. ఒరిస్సా, తెలంగాణ రాజులు దండెత్తిరాగా వారి నోడించి తరిమివేసెను. నిజాంషా 1463 లో హఠాత్తుగా మరణించు టచే వానిసోదరుడగు మూడవ మహమ్మద్‌షా గద్దెనెక్కి 1482 వరకు పరిపాలించెను. ఇతడును సింహాసన మధిష్ఠించునప్పటికి బాలుడగుటచే పరిపాలనాభారమంతయు మంత్రియగు గవాన్‌పైననే బడెను. గవాన్ 1469 లో కొంకణ హిందూరాజుల నోడించి అనేక కోటలను సంపా దించెను. ఒరిస్సా రాజగు కపిలేంద్రదేవు నోడించి కప్పము వసూలు జేసెను. రాజమండ్రి, కొండపల్లి కోటలను సంపాదించెను. గోవా బహ మనీరాజ్యమున చేర్చబడెను. 1481 లో హఠాత్తుగ కంచిపై దాడి జరిపి అమూల్య ఆభరణములను, ధనరాసులను కొల్లగొట్టి తెచ్చెను.

గవాన్ రాజ్యసుస్థిరతకై అనేక సంస్కరణలను ప్రవేశ పెట్టెను. రాజ్యమును ఎనిమిది సుబాలుగా విభజించి సమర్థులగు పరిపాలకుల నేర్పరచెను. బలమైన కోటలను కేంద్రప్రభుత్వ అధికార మండలమందే యుంచెను. సైన్యములకు జీతముల నేర్పాటుజేసెను. భూమిశిస్తు విధానమును సంస్కరించెను. లంచగొండితనమును రూపు మాపెను. రాజ్య ఆర్థికస్థితిని కుదుటపరచి సమర్థమయిన పరిపాలనా విధానమును ప్రవేశపెట్టెను. "విస్తృతమైన రాజ్యము, మహమ్మద్ గవాన్‌వంటి మంత్రి - యను ఈరెండు అపూర్వవస్తువులను ఈశ్వరుడు

నాకు దయతలచి యిచ్చె''నని మహమ్మద్‌షా పలుమారు చెప్పు చుండెడివాడట.

గవాన్ సంస్కరణలు అమీరుల ప్రాబల్యమునకు ప్రతిబంధకము లయ్యెను. గవాన్ ప్రతిభ, కీర్తి అసూయాపరులగు అమీరులకు కంటగింపయ్యెను. అతడు దర్బారులోని ఇరానీ పక్షముపై అభిమానము జూపుచుండెనని దక్కనీయులు కుట్రపన్నిరి. గవాన్‌పై రాజద్రోహనేర మారోపించి మద్యపానమత్తుడైయున్న సుల్తానుచే మరణశిక్ష విధింపజేసిరి. గవాన్ మరణముతో బహమనీరాజ్య ఐక్యత, వైభవము అంతరించెను.

ఖాజా మహమూద్ గవాన్ (1403 - 1481) పారశీకుడు. రెండవ అల్లాయుద్దీన్ కాలమున బహమనీ సుల్తానుల కొలువునందు ప్రవేశించెను. మేధాసంపత్తికి, శౌర్యపరాక్రమములకు, పరిపాలనా దక్షతకేగాక ఔదార్యమునకు, దానధర్మములకు, విద్యాపోషణకు గవాన్ కీర్తిగాంచెను. ఇతడు అరబ్బీ, పారశీక భాషలందు గొప్ప పండితుడేకాక న్యాయ, గణిత, ఖగోళశాస్త్రములందు అసమాన శేముషీ దురంధరుడు. తనస్వార్జిత విత్తమును వెచ్చించి బీదరునందొక పాఠశాల కట్టించెను. తనధనమంతయు గ్రంథసేకరణకే వెచ్చించి యొక అపూర్వగ్రంథాలయము నేర్పరచెను. బహమనీ సామ్రాజ్యమున కంతకు పాలనాధికారియైనను సామాన్య కుటుంబీకుని వలెనె కాలము గడపెను.

మహమ్మద్‌షా మరణానంతరము (క్రీ. శ. 1482) బహమనీ సింహాసనమెక్కిన సుల్తానులు సుఖలోలురు. అధికారము అమీర్ బరీద్ అను మంత్రిహస్తగతమైనది. బహమనీ రాజ్యము విచ్ఛిన్నమై అయిదు స్వతంత్ర రాజ్యములు వెలసినవి. ఇమాద్‌షాహి వంశము బీరారును, నిజాంషాహివంశము అహమద్ నగరమును, అదిల్‌షాహి వంశము బిజాపురమును, కుతుబ్‌షాహి వంశము గోల్కొండను, బరీద్‌షాహివంశము బీదరును పరిపాలింపసాగెను. ఈరాజ్య పంచకము మొగలు చక్రవర్తుల పరిపాలనా కాలమున మొగలు సామ్రాజ్యమున జేర్చబడెను.

## 5. విజయనగర సామ్రాజ్యము

రాజ్యస్థాపన :— కాకతీయరాజ్యము మహమ్మదీయుల హస్తగతమైన పిదప అచట ఉద్యోగులుగ నున్న హరిహర, బుక్కరాయలను సంగమవంశసోదరులు విద్యారణ్యస్వాములవారి సలహాపై క్రీ. శ. 1336 లో తుంగభద్రకు దక్షిణమున విజయనగర పట్టణమును నిర్మించి యొక హిందూరాజ్యమునకు శంకుస్థాపన గావించిరి. ఇది అనతికాలములోనే మహాసామ్రాజ్యమై మూడుశతాబ్దముల కాలము మహోన్నతదశ నొంది చరిత్రప్రసిద్ధి గాంచెను. మహాప్రవాహము వలె వచ్చిపడుచున్న ముస్లిమ్ సేనావాహిని నడ్డి హిందూమతోద్ధరణ చేయుటేగాక విజయనగరసామ్రాజ్యము ప్రాచీన ఆర్యసాంప్రదాయములకు, సంస్కృతికి పోషకస్థానమయ్యెను. భారతీయ కళలకు, విద్యలకు నిలయమై విజయనగరము విద్యానగరమని ప్రసిద్ధికెక్కెను.

రాజ్యవ్యాప్తి :— రాజ్యస్థాపకులైన హరిహర, బుక్కరాయ సోదరులు రాజబిరుదమును ధరింపక విద్యారణ్యస్వామి పేరనె పరిపాలన గావించిరి. సోదరు లిరువురు సామ్రాజ్యమును పెంపొందించుట కహర్నిశములు పాటుబడిరి. క్రీ. శ. 1353 లో హరిహరరాయలు మరణించునప్పటికి విజయనగరరాజ్యము కృష్ణానది నుండి దక్షిణమున కావేరి వరకు వ్యాపించెను. బుక్కరాయలు బహమనీ రాజులతో యుద్ధములను ప్రారంభించెను. రెండవ హరిహరరాయలు పరిపాలనాకాలమున మైసూరు, కంచి, చెంగల్‌పట్టు, తిరుచునాపల్లి విజయనగరరాజ్యమున జేర్చబడెను.

సంగమవంశ రాజులలో రెండవ దేవరాయలు (1422-46) ఘనుడు. ఇతని కాలమున విజయనగరసామ్రాజ్యము సింహళము వరకు వ్యాపించెను. మహమ్మదీయులను గూడ తన సైన్యమున జేర్చుకొని తన సైనికబలమును పటిష్ఠము జేసికొనెను. అనేక దేవాలయములను నిర్మించెను. కవికులతిలకుడగు డిండిమభట్టారకుని తన ఆస్థానకవిగ జేసికొని ఆదరించెను. కవిసార్వభౌముడగు శ్రీనాథునకు కనకాభిషేకమును చేయించెను.

సంగమ వంశములోని తుదిరాజులు వ్యసనలోలురై, మానినీ మద్యములందు ఆసక్తిగల్గి ప్రభుత్వ వ్యవహారములను చక్కబెట్టలేక పోయిరి. పెనుగొండ నేలుచున్న సాళువ నరసింహభూపతి సంగమ వంశ పాలనమంతరింపజేసి 1486 లో విజయనగర సింహాసన మాక్రమించెను. ఈ వంశమువారు నాటి నుండి 1505 వరకు పరిపాలన గావించిరి. వీరనరసింహుడను తుళువవంశీకుడు సాళువరాజును త్రోసిరాజని 1505 లో తుళువవంశ స్థాపకుడయ్యెను. ఈ వంశరాజులలో శ్రీకృష్ణ దేవరాయలు సుప్రసిద్ధుడు.

శ్రీకృష్ణ దేవరాయలు (క్రీ. శ. 1509 - 1529) :—రాయలు సింహాసన మధిష్ఠించగనే దిగ్విజయయాత్రకై బయలుదేరెను. మంత్రి యగు తిమ్మరుసు గొప్పరాజకీయతంత్రజ్ఞుడు. అపర చాణిక్యుడు. ప్రభువునకు బాసటగనుండి తనప్రజ్ఞ జూపెను. శ్రీకృష్ణదేవరాయలు బహామనీసుల్తానుల నోడించి కోవిలకొండ దుర్గము నాక్రమించెను. రాయచూరు దుర్గమును పట్టుకొని తుంగభద్ర కృష్ణల నడుమగల అంతర్వేదిపై తన అధికారమును నెలకొల్పెను. గంగరాయునిపై దండెత్తి ఉమ్మత్తూరు, పెనుగొండ, శివసముద్రముల నాక్రమించెను. గజపతుల పీచమడగించి ఉదయగిరి, కొండవీడు, విజయవాడ, కొండపల్లి దుర్గములపై తన అధికారమును ప్రతిష్ఠించెను. ఉత్తరమున కటకము వరకు దిగ్విజయయాత్ర సల్పి సింహాచలముకడ జయస్తంభమును నాటించెను. గజపతిరాజుతో వియ్యమంది కృష్ణానదికి ఉత్తరముననున్న రాజ్యభాగము నాతని కిచ్చివేసెను. గుల్బర్గాపై నొక దండయాత్ర నడిపి కోటను భూమట్టము గావించెను.

దక్షిణాపథము నేలిన హిందూరాజులలో శ్రీకృష్ణదేవరాయలు పేరెన్నికగలవాడు. ఇతడు గొప్ప పరిపాలనాదక్షుడు. న్యాయశీలుడు. ఇతని భాషాసేవ నిరుపమానము. కవులను, పండితులను ఆదరించి ఆంధ్రభోజుడని పేర్గాంచెను. 'దేశభాషలలో తెలుగు లెస్స' యని పలికి ఆముక్తమాల్యద యను గ్రంథమును రచించెను. శ్రీకృష్ణదేవరాయల 'భువనవిజయము' ఆంధ్రసారస్వత ప్రపంచమునకు వెలుగుబాట. అచటి అష్టదిగ్గజములలోని అల్లసాని పెద్దన

క్రొత్త తెన్నులతో మనుచరిత్ర మను ప్రబంధమును రచించి ఆంధ్ర కవితాపితామహు డను బిరుదుగాంచెను. రాయలు కవికాలికి గండపెండెరము తొడగి పల్లకీబట్టి తన భాషాభిమానమును చాటెను. కవులు, పండితులు, విదేశయాత్రికులు, రాయబారులు ఇతని దాతృత్వమును వేనోళ్ళ పొగడిరి.

రాయలు విరూపాక్షాలయమున నొక గోపురమును కట్టించెను. హజారా రామాలయమును నిర్మించెను. ఉగ్రనరసింహమూర్తి విగ్రహమును ప్రతిష్ఠించెను. విఠలేశ్వర ఆలయమును శిల్పకళా సమన్వితము గావించెను. పోర్చుగీసు ఇంజనీర్ల సాయమున విజయనగర పరిసరములందు నీటిపారుదలవసతు లేర్పరచి వ్యవసాయము నభివృద్ధి చేసెను. వర్తక వ్యాపారముల నినుమడింపజేసెను. అన్ని మతములవారిని సమదృష్టితో జూచి తన మతసహనమును చాటెను.

తళ్ళికోట యుద్ధము- 1565 :— శ్రీకృష్ణదేవరాయల మరణానంతరము వరుసగా అచ్యుతరాయలు, సదాశివరాయలు విజయనగరము నేలిరి. సదాశివరాయ లసమర్థుడగుటచే శ్రీకృష్ణదేవరాయల అల్లుడగు రామరాజు అధికారమును చేజిక్కించుకొని పరిపాలన గావింపసాగెను. దక్కను సుల్తానుల అంతఃకలహములలో తలదూర్చి లాభింపగోరెను. 1543 లో అహమ్మదునగరు, గోల్కొండ సుల్తానులతో చేయికలిపి బిజాపుర సుల్తానుపై కత్తిదూసెను. కాని బిజాపుర మంత్రియగు అసద్ ఖాన్ తన చాకచక్యముతో శత్రుకూటమిని చీలదీసి యుద్ధ ప్రమాదమును తప్పించెను. రామరాజు 1558 లో బిజాపుర గోల్కొండ సుల్తానులతో కలిసి అహమ్మదు నగరముపై దండయాత్ర నడిపెను. కాని తుదకు మహమ్మదీయ సుల్తాను లందరు యేకమై విజయనగరముపైబడిరి.

బిజాపూరు, గోల్కొండ, బీదరు, అహమ్మదునగరు సుల్తానులు తమ తమ సైన్యములతో వెడలి క్రీ. శ. 1565 లో కృష్ణానదీతీరమున తళ్ళికోట సమీపమున విజయనగర సైన్యముల నెదుర్కొనిరి. రక్షసి, తంగడి అను గ్రామముల మధ్య యుద్ధముజరుగుటచే నిది రక్కసి తంగడి యుద్ధమనియు పేర్కొనబడుచున్నది. ఈ యుద్ధమున

రామరాజు ఘోరపరాజయము నొందెను. లక్ష సైనికులు హతులైరి. విజయోత్సాహముతో మహమ్మదీయ సైనికులు విజయనగరమును ప్రవేశించి దోచుకొనిరి. నగరమును నామరూపములు లేకుండ నాశన మొనరించిరి. ఈ యుద్ధముతో విజయనగరసామ్రాజ్య వైభవ మంతరించినది. మధుర, జింజి, తంజావూరు మొదలగు మండల పాలకులు స్వతంత్రులగుటకు అవకాశ మేర్పడినది.

విజయనగరరాజుల పరిపాలన:— రాజు సర్వాధికారియైనను నిరంకుశుడుగాడు. కిరీటధారియైనవాడు ధర్మము తప్పక పరిపాలించ వలెనని శ్రీకృష్ణదేవరాయలు వాక్రుచ్చెను. మంత్రులు, మండలాధి పతులు, దండనాథులు, కవులు, పండితులు కూడిన సభ రాజునకు సలహాల నిచ్చుచుండెడిది. రాజ్యమును కొన్ని మండలములుగను, మండలమును కొన్ని నాడులు లేక కొట్టములుగ విభజించెడివారు. నాయకులను మండలాధిపతులు పూర్తి హక్కులను బాధ్యతలను కలిగి పరిపాలన గావించుచుండెడివారు.

విజయనగర రాజులు తరచు యుద్ధములందు మునిగియుండు టచే అధిక సైనికబలము అవసరమయ్యెను. మండలాధిపతులు పంపు సైన్యముగాక రాజు ప్రత్యేక సైన్యమును కలిగియుండెడివాడు. ఎప్పుడును పదిలక్షల సైన్యము హాజరులో నుండెడిది. అవసరసమయ ములందు యుద్ధమునందు పాల్గొనుటకు మరియొక పదిలక్షల సైన్యము సంసిద్ధముగ నుండెడిది. దేశరక్షణలో కోటలు ప్రముఖస్థాన మాక్ర మించుటచే వానిరక్షణకై అప్రమత్తులై యుండెడివారు. రేవుపట్టణము లను కాపాడుటకు నౌకాబల ముండెడిది.

ప్రభుత్వమునకు భూమిశిస్తు ముఖ్య ఆదాయము. పంటలో ఆరవవంతు పన్నుగా వసూలు చేసెడివారు. ఇంకను అనేకవిధము లైన చిల్లరపన్ను లుండెడివి. ప్రజలకు పన్నులభార మధికముగ నున్నను భోగభాగ్యములతో తులతూగుచుండెడివారు. పరిశ్రమలు, వ్యవసాయము, వర్తక వ్యాపారములు మిక్కిలి అభివృద్ధిగాంచుటే అందులకు ముఖ్యకారణము. విజయనగర రాజ్యముతో పోర్చుగీసు వారికి వర్తక సంబంధ మెక్కువగ నుండెడిది.

విజయనగర రాజులు సంస్కృతాంధ్ర, తమిళ, కన్నడభాష లను చక్కగ పోషించిరి. వారి కాలమున వివిధభాషలలో అనేక ఉద్గ్రంథములు వెలువడెను. స్త్రీలును విద్యావతులై రాజకీయోద్యోగములను చేయుచుండెడివారు. పండిత సభలయందు పాల్గొని చర్చలు జరుపుచుండెడివారు.

భవన నిర్మాణమునందు, శిల్పకళయందు విజయనగర రాజులకు గల అభిరుచి వారి కాలపు నిర్మాణములే చాటుచున్నవి. ఎత్తైన గోపురములు, శిల్పకళాన్వితములగు కళ్యాణమండపములు ఆనాటి ప్రత్యేకత. ఆలయములలోను, భవనములలోను గల శిల్పములు చిత్తరువులు సజీవములాయని భ్రమింపజేయును. విఠలాలయములోని స్తంభములు జలతరంగిణివలె మ్రోగును. రాజధాని నగరమైన విజయనగరము విదేశీయుల ప్రశంసలందినది. నికోలికాంటి యను ఇటలీయాత్రికుడు 1420 లో విజయనగరమును దర్శించి "60 మైళ్ళ చుట్టుకొలత గలిగి ఎత్తైన గోడలచే పరివేష్ఠింపబడియున్న"దని వ్రాసెను. "ప్రపంచమున ఇట్టి మహాపట్టణము నెవ్వరును ఎచ్చటను కనులతో చూచియుండలేదు. కలదని వీనులతో వినియుండలేదు. దీనికిదేసాటి" యని 1443 లో అబ్దుల్ రజాక్ అను పారశీకరాయబారి ప్రశంసించెను. "సుందరమైన తటాకములతో, కమనీయమైన ఉద్యానవనములతో, లతుకుమించిన దివ్యభవనములతో విజయనగరము రోమునగరమంత పెద్దదిగ నున్న"దని పెయజ్ అను పోర్చుగీసు యాత్రికుడు వర్ణించెను. ఇతడు రాయల అంతఃపురములోని దంతమందిరమును గాంచి అచటి శిల్పసంపద కబ్బురపడి ఇది మానవ నిర్మితమా లేక దైవప్రసాదమా యని పలికెనట. వీధులలోనె వజ్రములు, ముత్యములు రాసులుగబోసి విక్రయించుచుండెడివారనిన ఆనగర వైభవ మెంతటిదో యూహింపవలెనెగాని వర్ణింప నలవిగాదు. మరచిపోలేని, మరచిపోదమన్నను మరపుకురాని మహానగర మా విజయనగరము.

# 6. హిందూ సంస్కృతిపై ఇస్లామ్ ప్రభావము

భారతీయ సంస్కృతి :— భారత దేశ సిరిసంపదలను కొల్ల గొట్టుకొనుటకు గ్రీకులు, శకులు, హూణులు మొదలగు వివిధ తెగల వారు భారత దేశముపై దండయాత్రలను సల్పిరి. వీరు భారత దేశమున స్థిరపడి హిందూమతమును స్వీకరించి భారతీయ సంస్కృతికి వన్నె దెచ్చిరి. మధ్యయుగమున వచ్చిన మహమ్మదీయులు భారత దేశమున స్థిరపడినను హిందువులు కాలేదు. తమ మతమును, సంస్కృతిని దేశవ్యాప్తము గావింప యత్నించిరి. తమ పరిపాలనా విధానమునుగూడ అందుల కనుగుణముగనే మార్చిరి. దీనితో భారత దేశమున ఇస్లామ్, హైందవ సంఘములకు సంఘర్షణకలిగినది. విభిన్నదృక్పథములు కలిగిన రెండు సంస్కృతు లేకముకాలేదు. కాని ఒక దేశమున భిన్నవర్గములు కలిసియుండుటచే ఒకరి సంస్కృతిపై మరియొకరి సంస్కృతీ ప్రభావము ప్రసరింపక తప్పలేదు.

మహమ్మదీయ పరిపాలన :— మహమ్మదీయులు సుల్తానుని భూమిపై భగవంతుని నీడగ పరిగణింతురు. ముస్లిమ్ ప్రపంచాధినేతయగు ఖలీఫాకు ప్రతినిధిగ పేర్కొందురు. పరిపాలనా విషయములలో మతమున కెక్కువ ప్రాముఖ్యత నిత్తురు. వారికి ఖురాను ఆదర్శము, అనుసరణీయము. కత్తిబలముచేనైనను హిందువులను మహమ్మదీయమతమున జేర్చుటే ఆదర్శముగ తీసికొని పరిపాలించిరి. మతసహనమన యెట్టిదో యెరుంగక హిందువులను హింసించుటే పరమధర్మముగ నమ్మియుండెడివారు. హిందువులపై జిజియా, తీర్థ యాత్ర పన్ను మొదలగు అవమానకరములగు పన్నులను విధించెడి వారు. మహమ్మదీయులపై కంటె హిందువులపై రెట్టింపు పన్ను లుండెడివి. ఇస్లామ్‌మతమును స్వీకరించిన వారికి ఉన్నతోద్యోగములు లభించుచుండెడివి. సంఘమున అధికగౌరవ మాపాదింపబడెడిది. కాని భారత దేశమున అధిక సంఖ్యాకులు హిందువులుగనే యుండుటకు హైందవ సంస్కృతిలోని విశిష్టతయె కారణము.

సాంఘికస్థితి :— ఢిల్లీసుల్తానుల పాలనలో ప్రజల సాంఘిక వ్యవస్థయందు గొప్పమార్పు వచ్చినది. మధుపానము, వ్యభిచారము, జూదము మొదలగు వ్యసనములు ఉన్నతవర్గములం దెక్కువగ వ్యాపించినవి. బానిసలను పోషించుట గౌరవసీయమయ్యెను. స్త్రీలలో పరదా పద్ధతి అనుసరింపబడుచుండెడిది. హిందూస్త్రీలలో సతీసహగమనము, జోహారు లెక్కువ ప్రచారములో నుండెడివి. హిందూసంఘమున బాల్యవివాహములు మిక్కిలి వ్యాప్తిచెందెను. మహమ్మదీయులు తమమహోదాకు తగినన్ని వివాహములను జేసికొని తమ జనానాలను స్త్రీలతో నింపుచుండెడివారు. సంఘమున స్త్రీకి గౌరవమున్నట్లు కనబడదని ఇబన్‌బటూటా వ్యాఖ్యానించెను. హిందువుల ఋజువర్తనము, దానతత్పరత, అతిథిసత్కారము ఇబన్‌బటూటా ప్రశంసల నందుకొనెను.

మతము :— ఇస్లామ్ సంపర్కముతో హిందూమతమున వచ్చిన మార్పులు గణనీయమైనవి. పతనమగుచున్న హిందూ సంఘము నుద్ధరించుట కనేకసంస్కర్తలు బయలుదేరిరి. కొందరు వర్ణనియమములను, ఆచార వ్యవహారములను కఠినతరముగ జేసి హిందూసంఘము నతిసనాతనముగ జేయనెంచిరి. బాల్యవివాహములను, పరదాపద్ధతిని ప్రోత్సహించిరి. కొందరు వర్ణవ్యవస్థను త్రోసిరాజని, సర్వమానవ సమానత్వమును ప్రబోధించి, భక్తితత్వమును ప్రచారమునకు తెచ్చిరి. కొందరు హిందూముస్లిం ఐక్యతకు పాటుబడిరి. మధ్యయుగ సంస్కర్తలలో రామానందుడు, వల్లభాచార్య, చైతన్య మహాప్రభు, నామదేవుడు, కబీరు, నానక్ ముఖ్యులుగా పేర్కొనదగి యున్నారు. "హిందూ మహమ్మదీయు లను భేదభావమేల? అందరును ఒకేమట్టినుండి తయారుచేయబడిన కుండలవంటివారే! రామ్ రహీమ్ ఒక్కరే!" యని కబీరు బోధించెను. "హిందువుడు లేడు, మహమ్మదీయుడు లేడు, భగవంతు డొక్కడే! భగవంతుని దృష్టిలో అందరును సమానులే!" యని నానక్ ప్రచారము చేసెను. మహమ్మదీయులందు సూఫీలు భక్తితత్వమును ప్రచారము చేసిరి.

కళలు :— హిందూ ముస్లిం సంస్కృతీ ఐక్యతకు చిహ్నముగ ఉర్దూభాష వెలసినది. పారశీక, అరబ్బీ, తురుష్క పదములకు సంస్కృత జనితములగు హిందీ, పంజాబీ, బెంగాలీ మొదలగుభాషల అర్థములు, భావములు ఆపాదింపబడి ఉర్దూభాష రూపొందించబడినది. తురుష్క, అరబ్బీ, పారశీక సాంప్రదాయానుసారములుగ నిర్మింపబడిన భవనములు హైందవ కళాకారుల హస్తకౌశలమున భారతీయత నొందినవి. హిందూ ముస్లిం కళలు సమ్మిశ్రమమై క్రొత్తరూపమును దాల్చినవి. ఈ వాస్తుకళకు జానూఫ్వారులోని భవనములు ప్రబల నిదర్శనములుగ నున్నవి. నాటి సాహిత్యమునందు హిందూ, ముస్లిం సంస్కృతుల ఐక్యత కన్పించుచున్నది. అమీర్ ఖుస్రూ హిందీ పదములను భావములను మేళవించి పారశీక కవిత్వమునకు భారతీయత నాపాదించెను. సంస్కృత వేదాంతగ్రంథములు పారశీకభాషలోని కనువదింపబడెను. ఆల్బరూని హైందవ వేదాంత, జ్యోతిష గ్రంథములను అరబ్బీభాషలోని కనువదించెను. భక్తితత్వ ప్రచారమునకై అనేక గీతములు వెలువడెను. జయదేవుని గీతగోవిందము సకల జనాదరణీయమయ్యెను. అనేక చారిత్రక గ్రంథములు, నాటకములు, కావ్యములు వ్రాయబడెను. ప్రాంతీయ భాషలకును వికాసము కలిగినది.

హిందూస్థానీ పద్ధతి :— హిందూ సంస్కృతి సంపర్కముతో భారతీయ ముస్లిములందు అనేక ఆచారములు ప్రవేశించినవి. అంతస్థు లేర్పడినవి. వర్ణవ్యవస్థ వ్యాపించినది. మూఢనమ్మకములు ప్రవేశించినవి. పీరు లను పేర మహమ్మదీయ యోగులను పూజించు ఆచారము ప్రబలినది. భవన నిర్మాణమునందు, శిల్పకళయందు, చిత్రలేఖనమందు, సంగీత సాహిత్యములందు, వేషభాషలందు, ఆచార వ్యవహారములందు భారతీయ ముస్లిముల 'హిందూస్థానీ పద్ధతి'ని గాంచి బాబరు విభ్రాంతుడయ్యెను.

## అ ధ్యా య ము 9

# మధ్యయుగమున ఐరోపా

### 1. ఫ్యూ డ లి జ ము

ఫ్యూడలువ్యవస్థ రూపొందుట కనుకూల పరిస్థితులు:— మధ్యయుగ యూరపుప్రజల జీవితమునందు ప్రస్ఫుటముగ కన్పించునది ఫ్యూడలిజము. లాటిన్‌నందు ఫ్యూడమ్ అనగా భూమి యని అర్థము. భూసంబంధమైన కట్టుబాట్లతో నిర్మింపబడినదే ఫ్యూడలు వ్యవస్థ. ఈవ్యవస్థ నాటి సాంఘిక, రాజకీయ పరిస్థితుల నాధారముగ జేసికొని క్రమక్రమముగ రూపొందినదేగాని హఠాత్సంఘటనగాదు. రోమను సామ్రాజ్యము పతనమై తామరతంపరులుగ వచ్చిపడు చున్న అనాగరిక తెగల దండయాత్రలనుండి ప్రజలు తమ ధన ప్రాణములను కాపాడుకొనలేనిస్థితి యేర్పడినది. దోపిడిగాండ్ర నుండి రక్షించుకొనుటకు బలమైన కోటలు, ఆయుధపాణులై యుద్ధరంగమున కురుకు వీరులు అవసరమయ్యెను. స్థానికముగనున్న ప్రభువు సమీప ప్రజలకు తన కోటలో రక్షణనిచ్చుచు వీరులను పంపి శత్రువుల నెదుర్కొనుట పరిపాటియయ్యెను. యూరపునందంతటను స్థానికముగ కొన్ని ముఠా లేర్పడెను. స్థానిక ప్రభువు ముఠాకంతటకు నాయకుడయ్యెను. భూకామందులు తమ భూములపై హక్కును ప్రభువునకువదలి వాని రక్షణలో నున్న కవులుదారులైరి. ఇట్టి విధానము కమెండేషన్ (Commendation) అని పిలువబడెడిది. మధ్యయుగమున నాణెములు హెచ్చుగ చెలామణియందు లేకపోవుటవలన ఆర్థిక చెల్లుబడులను సేవలు (Services) రూపమున తీర్చెడివారు. పైవర్గమువారికి క్రిందివర్గమువారు సేవచేయుట పరిపాటి యయ్యెను. మతాధికారులు మతబోధలుచేయుట, రైతులు సేద్యము చేసిపెట్టుట, కార్మికులు ఆయుధములను తయారుజేసిపెట్టుట, ఉత్సాహవంతులగు యువకులు యుద్ధములందు పాల్గొనుట మొదలగునవి వివిధవృత్తులవారు జేయు వివిధములైన సేవలు.

రాజులు యుద్ధసమయములందు తమకు సహాయము చేసిన వారికి భూముల నొసగుచుండెడివారు. క్రమముగ వారి భూమి విస్తీర్ణము హెచ్చి పెద్ద పెద్ద జమీా (Estate) లుగ రూపొందినవి. వారికి వంశపారంపర్య హక్కు లభించినది. ఆ జమీాల సమస్త హక్కులు ఆయా ప్రభువులకు సంక్రమించినవి. మతతత్పరులైన రాజులు, ప్రభువులు మఠాలయములకు భూములను దానముగ నిచ్చుచుండెడి వారు. చర్చి భూములపై పన్నులుండెడివికావు. వారును ఆయా జమీాలలో సమస్త హక్కులను కలిగియుండెడివారు. ఇట్లు దేశమునం దనేక ఎస్టేట్లేర్పడి ఫ్యూడలు వ్యవస్థకు దారితీసెను.

**ఫ్యూడలిజము :—** ప్రాచీనయుగమునకు, ఆధునికయుగము నకు ఫ్యూడలిజము వారధివలె నున్నదని ష్లిన్లీ, పీచ్ అను చరిత్ర కారులు వ్రాసియున్నారు. దీనికి అగ్రస్థానమున రాజు, అంతస్థుల వారీగ భూస్వాములు, ఉప భూస్వాములు, రైతులు కలరనియు, భూమిని సాగుచేయు కర్షకుడు భూమికి అంటిపెట్టుకొనియున్న పునాది రాయి యనియు వర్ణించియున్నారు. ప్రొఫెసర్ వెల్సు ఫ్యూడలు సంఘమును ఒక పిరమిడుతో పోల్చియున్నాడు. ఫ్యూడలిజము నందు ప్రతివ్యక్తియు కొన్ని హక్కులనుకల్గి తన పైవర్గమువారికి సేవ చేయుచు క్రింది వర్గమునుండి సేవలను పొందుచుండును. వారివారి హక్కులను, బాధ్యతలను నిర్ణయించునది వారి అధీనముననున్న భూవసతి పరిమాణము.

రాజ్యమున గల భూమికంతటకును రాజు ముఖ్యహక్కుదారుడు. అతడు తనభూమిని మండలములుగ విభజించి బలవంతులగు ప్రభువుల కొసగును. వారు ప్రథమ కౌలుదార్లు (Tenants-in-chief). ప్రభువులు తమభూములను తమ అనుయాయులకు పంచియిత్తురు. వారు ఉప భూస్వాములు (Sub-tenants) అని పిలువబడుదురు. వీరు ఆభూములను కౌలుదార్ల (Minor-tenants) కు పంచియిత్తురు. ఈ భూస్వామికవర్గ ములకు క్రిందిమెట్టున నున్నవాడు భూమిని సాగుచేయు కర్షకుడు (Serf). అధికసంఖ్యాక వర్గమైన కర్షకులు వంశపారంపర్య హక్కును కలిగి భూమిని అంటిపెట్టుకొని యుందురు. ఫ్యూడలు వ్యవస్థలోని

ప్రతివర్గమును తమ పైవర్గమునకు కొన్ని ఫ్యూడలు పన్నులను చెల్లింపవలయును. యుద్ధములందు పాల్గొనవలయును. వివిధ భూస్వాములును యుద్ధసమయమందు రాజునకు నియమితసైన్యమును పంపి సహాయము చేయవలయును.

ప్రతియెస్టేటు యొక చిన్నరాజ్యమువలె నుండును. ప్రభువు న్యాయస్థానముల నేర్పరచి నేరములను విచారించును. ఆస్తివిషయము లైన తగాదాలను తీర్చును. నాటి తీర్పులలో ఆర్డియల్ (Ordeal), ట్రయల్ (Trial) ముఖ్యముగ పేర్కొనదగియున్నవి. ఆర్డియల్‌నందు నిందితుడు అగ్నిలో దుముకుట, మరుగుచున్న నీటిలో చేతిని ముంచుట, ఎఱ్ఱగ కాలిన ఇనుపకడ్డీని పట్టుకొనుట మొదలగు కఠినపరీక్షలుండెడివి. కాని నియమిత కాలములో గాయము మానిన నిందితుడు నిర్దోషిగ పరిగణింపబడును. ట్రయల్‌నందు ద్వంద్వయుద్ధము జేసి విజయము గాంచినవాడు నిర్దోషిగ పరిగణింపబడెడివాడు.

ఫ్యూడలిజమువలన మధ్యయుగ యూరపుప్రజలకు చక్కని పరిపాలనా వ్యవస్థ యేర్పడినది. నాటి అరాచక పరిస్థితులలో ప్రజలకు శాంతిభద్రతలు చేకూరినవి. అనాగరిక తెగల దండయాత్రలు తగ్గిపోయి ప్రజలు సన్నిహితులై సుఖసౌఖ్యములను పొందిరి. ప్రతి క్షేత్రమునందు భూస్వామి ఒక సురక్షితమైన కోటయందు నివసించెడివాడు. ఆయా క్షేత్రములందు వ్యవసాయముచేయు కర్షకులు కోట సమీపమున గ్రామముల నేర్పరచుకొనెడివారు. పచ్చికబీళ్ళయందు తమ పశువులను మేపుకొనుచు, సమీప అడవినుండి వంటచెరకు తెచ్చుకొనెడివారు. ప్రతి గ్రామమునందు వడ్రంగులు, కమ్మరులు, కుమ్మరులు, నేతగాండ్రు మొదలగు వివిధవృత్తులవారుండెడివారు. వస్తుమార్పిడి పద్ధతిని ఒకరికొకరు సహాయము చేసికొనుచుండెడివారు. ఆ గ్రామములో నివసించుటకనుమతి ఇచ్చినందులకు ఆ యా వృత్తులవారు ప్రభువునకు సేవలు చేయుచుండెడివారు. ప్రతిగ్రామము నందు మఠాలయ మొకటి యుండెడిది. ప్రజల ఆధ్యాత్మిక చింతనకు మఠాధికారులు తోడ్పడుచుండెడివారు. ప్రభువు నెలకొల్పిన న్యాయస్థానములు వారికి న్యాయమును ప్రసాదించుచుండెడివి. ప్రజలంద

రును తమ ప్రభువునకు విధేయులై యుండెడివారు. ప్రతిగ్రామమును స్వయంపోషకముగ నుండెడిది.

ఫ్యూడలు సాంఘిక వ్యవస్థలో ముఖ్యముగ పేర్కొనదగినవి యోధవర్గము (Knights), క్షాత్రధర్మము (Chivalry). నిజమైన యోధుడనుసరింపవలసిన విధివిధానమే క్షాత్రధర్మము. ఉన్నత వంశీకులు క్షాత్రధర్మమును స్వీకరింప ముందున కురుకుచుండెడివారు. బాల్యము నుండియు తగినశిక్షణ పొందెడివారు. పదునెనిమిదియేండ్ల ప్రాయమున ఒక ప్రత్యేక ఉత్సవమున యోధులుగ ప్రకటింపబడెడివారు. ఆర్తులను ఆదుకొనుట, అసహాయులను రక్షించుట, తన ప్రభువునకు విధేయుడుగనుండుట, క్రైస్తవమతరక్షణకు పూనుకొనుట, స్త్రీలను ఆపదలనుండి రక్షించుట, తాను ప్రేమించిన స్త్రీయెడ ప్రేమబద్ధుడగుట మొదలగు అంశములను త్రికరణ శుద్ధిగ ఆచరింతునని ప్రతి యోధుడును ప్రమాణము చేసెడివాడు. ఈ యోధుల సాహసకృత్యములు వీరగాథలుగ ప్రచారము చేయబడుచుండెడివి. యుద్ధసమయమున ప్రతియోధుడు తన ప్రభువునకు బాసటగ నిలువవలయును. శాంతి సమయములందు రాజులు, ప్రభువులు క్రీడాప్రదర్శనములు (Tournaments) జరిపెడివారు. ఇందుపాల్గొని విజయము గాంచవలెనని ప్రతియోధుడును తహతహ లాడెడివాడు.

ఫ్యూడలు వ్యవస్థలోని లోపములు :— ఫ్యూడలిజము వలన సంఘమున అనేకవర్గము లేర్పడినవి. సంఘీభావము క్షీణించినది. జాతీయభావము పెంపొందుటకు ఫ్యూడలిజము పెద్ద అవరోధమైనది. సాంఘికముగ క్రింది అంతస్తునకు దిగజారిపోయిన కర్షకుడు తన పైవర్గమునకు వెట్టిచాకిరి చేయుచు స్వాతంత్ర్యహీనుడయ్యెను. ఇతడు తనభూమితోపాటు ప్రభుభూమినిగూడ సాగుచేయవలయును. పండుగ సమయములందు, అవసరసమయములందు కర్షకుడు తన స్వామికి కానుక లర్పించుకొనవలయును. కర్షకుని తొలగించుటకు భూస్వామికి హక్కుండెడిది. కర్షకుడు తన యెద్దునుగాని, గుఱ్ఱమునుగాని అమ్ముకొనవలె నన్నను, తన కుమార్తెకు వివాహము చేయవలె నన్నను ప్రభువనుమతి పొందవలెను. కర్షకులు బానిసరైతులుగ

మారిపోయిరి. బానిసత్వమునుండి తప్పించుకొనుటకు కర్షకులు సమీపపట్టణములకు పారిపోవుచుండెడివారు.

ఫ్యూడలిజము వలన రాజుల అధికారము క్షీణించినది. ప్రజలకు రాజునకు సన్నిహితత్వము లేకుండపోయెను. ఫ్యూడలిజములోని వివిధవర్గములవారు తమ పైవర్గమువారికే విధేయత ప్రదర్శించెడివారుగాని రాజునకు విధేయులు గాకుండిరి. రాజునకు విధేయులైన భూస్వాములు దుర్భేద్యమైన కోటలను నిర్మించియు, సుశిక్షితమైన సైన్యముల నుంచియు బలవంతులైరి. రాజు భూస్వాములచేతి కీలుబొమ్మ యయ్యెను. రాజు అసమర్థుడైన భూస్వాముల నిరంకుశత్వమునకు పరిమితియుండెడిదిగాదు. వీరు తమ రాజునకుచేసిన వాగ్దానములను మరచి వానిపైనే యుద్ధము ప్రకటించుచుండెడివారు. ఒండొరులతో కలహించుచు శాంతిభద్రతలకు భంగము కలిగించుచుండెడివారు.

ఫ్యూడలిజ పతనము :— యూరపునందు ఫ్యూడలువ్యవస్థ క్షీణించుటకు అనేక అంశములు తోడ్పడినవి. (1) ఏకాధిపత్యమును సాధింపవలెనని కాంక్షించినరాజులు భూస్వాముల అధికార, ప్రాబల్యములను తగ్గించుటకు ప్రజలను సన్నిహితులుగ జేసికొనుటకు ప్రయత్నించిరి. (2) క్రూసేడులవలన భూస్వాముల అధికారము, ఆస్తులు క్షీణించెను. ఇంగ్లండు, ఫ్రాన్సులలో క్రూసేడుల ప్రభావము హెచ్చుగ కన్పట్టుచున్నది. (3) నాణెములచెలామణి హెచ్చుటచే సేనల ప్రాధాన్యత తగ్గిపోయినది. రాజులు భూస్వాములనుండి సైన్యమునకు బదులు ధనమును తీసికొని స్వంతసైన్యముల నేర్పరచుకొనసాగిరి. భూస్వాముల తిరుగుబాట్లు నణచుటకు ఇట్టి సైన్యము లెక్కువగ ఉపకరించినవి. (4) 14, 15 శతాబ్దములలో యూరపు దేశములందు వ్యాపించిన ప్లేగువ్యాధివలన అధిక జననష్టమైనది. ఆర్థికపరిస్థితులు చక్కబడినవి. ఉన్నిపరిశ్రమ లాభదాయకమగుటచే వ్యవసాయమునకు ప్రాముఖ్యత తగ్గిపోయినది. (5) తుపాకిమందు కనిపెట్టబడుటతో యుద్ధపద్ధతి మారిపోయి యోధుల ఉక్కుకవచము, భూస్వాముల రాతిగోడలు పనికిమాలినవైపోయెను.

(6) పట్టణములసంఖ్య హెచ్చుటతో ఫ్యూడలు వ్యవస్థ నామరూపము లేకుండపోయెను. మధ్యతరగతివా రేర్పడిరి. వర్తకమునకు ప్రాముఖ్యత హెచ్చినది. స్వేచ్ఛ, స్వాతంత్ర్యము, ప్రజాప్రభుత్వము మొదలగు భావములకు ప్రచారము కల్గినది. ముద్రణాయంత్రము కనిపెట్టబడుటతో విద్యావ్యాప్తికి దోహదమై ప్రజల భావనాప్రపంచమున నొక విప్లవము వచ్చినది. యుద్ధకుశలత తగ్గిపోయినది. (7) భూస్వాముల మధ్యగల అంతఃకలహములు వారిబలమును క్షీణింపజేసెను.

## 2. పవిత్ర రోమనుసామ్రాజ్యము - పోపు మతాధిపత్యము

పవిత్ర రోమనుసామ్రాజ్యము (The Holy Roman Empire) :— రోమనుసామ్రాజ్య పతనానంతరము ఫ్రాంకులను నొక తెగవారు యూరపురాజకీయములలో ప్రముఖపాత్ర వహించిరి. ఫ్రాంకులు క్లోవిస్ (Clovis) నాయకత్వమున రోమనులను తరిమివేసి గాలుదేశ ఉత్తరప్రాంతమున నొక రాజ్యమును స్థాపించిరి. ఛార్లెస్ మార్టెల్ అను ఫ్రాంకువీరుడు ఫ్రాన్సుపై దండెత్తివచ్చిన మహమ్మదీయుల నోడించి తరిమివేసెను. వాని కుమారుడగు పెపిన్ (Pepin the Short) పోపు అధికారమును ధిక్కరించుచున్న లంబార్డుల నోడించి వారినుండి పుచ్చుకొనిన రాజ్యభాగమును పోపుయధీనము జేసెను. క్లోవిస్ వంశీకుని త్రోసిరాజని పెపిన్ ఫ్రాంకురాజ్యాధిపతియగుటకు పోపు అనుమతించెను. పోపు అనుమతి పొందుటచే రాజు దైవ ప్రతినిధిగ పరిగణింపబడెను. పెపిన్ మరణానంతరము వాని కుమారుడగు ఛార్లెస్ క్రీ. శ. 768 లో సింహాసనమెక్కెను. ఇతడే చరిత్ర ప్రసిద్ధిగాంచిన షార్లమాన్ (Charlemagne) చక్రవర్తి.

షార్లమాన్ గొప్పవీరుడు. సాక్సనులను, డేనులను, హూణులను, అవారులను, బొహీమియనులను జయించి తనరాజ్యమును బహుముఖముగ విస్తరింపజేసెను. మూరులను ఇబ్రోనదివరకు తరిమివేసెను. పోపునకు విరోధులైన లంబార్డుల నోడించి ఉత్తర ఇటలీపై ఆధిపత్యమును పొందెను. క్రీ. శ. 800 క్రిస్టమస్ దినమున పోపు లియో III ఛార్లెసునకు రోమనుసామ్రాజ్య చక్రవర్తిగ పట్టాభి

షేకము జేసెను. నాటినుండియు పవిత్ర రోమనుసామ్రాజ్యము, పవిత్ర రోమను చక్రవర్తి యను పేర్లు వాడుకలోనికి వచ్చెను. పోపునకు బలమైన యూరపురాజు సహాయ మవసరమగుటయే ఛార్లెసునకు సార్వభౌమత్వమును కట్టబెట్టుటకు కారణము. ఛార్లెసును చక్రవర్తిగ ప్రకటించుటతో ప్రపంచము ఏకరాజ్యమను భావమునకు కార్యరూప మిచ్చినట్లయ్యెను. యూరపు రాజ్యాధినేతగ చక్రవర్తి, మతాధిపతిగ పోపుల ద్వంద్వపరిపాలన మొదలయ్యెను. చక్రవర్తిగ అభిషిక్తుని జేయు అధికారము పోపునకు లభించుటచే వాని ప్రాబల్యమినుమడించెను.

చక్రవర్తి పోపుల వైషమ్యము :— 10 వ శతాబ్దమునకు పోపులు ప్రాపంచక విషయలోలురైరి. అవినీతి సర్వవ్యాప్తమైనది. మతములకు, మతాలయములకు విశేషముగ భూములుండుటచే మతాధిపతులు, మతాధిపతులు భోగలాలసులై తమ కర్తవ్యమును మరచిపోయిరి. వీరును ఫ్యూడలు ప్రభువులవలె రాజునకు విధేయులై యుండుటకు ప్రమాణములుచేసి రాజులచే నియమింపబడుచుండెడి వారు. రాజులు ఈ పదవులను విశేషధనమునకు అమ్ముకొను చుండుటచే విద్యాహీనులు, ఆధ్యాత్మిక చింతనలేని భోగపురుషులు పవిత్రస్థానముల నలంకరింపసాగిరి. చర్చికి కల్గిన ఈ దుర్గతిని బాపుటకు క్లూనిక్ మతాధిపతులు విశేషముగ కృషిచేసిరి. రాజ్యపాలక వర్గమునకు మతవర్గముపై అధికారము లేకుండ నుండవలెనని ప్రచారముచేసిరి. తుదకు పోపు కార్డినల్సు అను మతాధిపతులచే యెన్నుకొనబడవలెనని ప్రతిపాదింపబడెను. క్రీ. శ. 1073 లో హిల్డిబ్రాండ్ అను మతాధిపతి పోపుగా ఎన్నుకొనబడెను. అతడు గ్రిగరీ VII అను బిరుదుతో పోపు పదవిని స్వీకరించెను.

పోపు దైవప్రతినిధియనియు, చక్రవర్తికంటె అధికుడనియు గ్రిగరీ నమ్మకము. నాటికి జర్మనురాజైన హెన్రీ IV పవిత్రరోమను చక్రవర్తిపదవిని పొందియుండెను. హెన్రీ తన అనుయాయులను బిషప్పులుగ నియమించెను. గ్రిగరీ అందుల కభ్యంతరము తెల్పెను. మతవర్గమువారు లౌకికుల (Laymen) నుండి తమ అధికారపత్రము

లను (Investiture) పొందరాదని శాసించెను. గ్రిగరీయెన్నిక చెల్లనేరదని హెన్రీ ప్రకటించెను. కాని పోపు హెన్రీని వెలి (Ex-communication) వేసి పదభ్రష్టునిగ తీర్మానించెను. హెన్రీ యుద్ధమును తలపెట్టెను గాని తనకు సహాయముగ వచ్చుటకు జర్మను ప్రభువర్గము భయపడుటచే పోపును శరణువేడవలసివచ్చెను. భయంకరమగు శీతకాలమున ఆల్ప్సులనుదాటి కానొస్సావాకోట ద్వారముకడ మూడుదినములపాటు పోపుదర్శనమునకై పడిగాపులుగాచెను. తుదకు పోపు హెన్రీపై కరుణజూపి క్షమించెను.

కాని హెన్రీ పశ్చాత్తాపము తాత్కాలికమైనదే! జర్మనీచేరి మరల యథాప్రకారము పోపు అధికారమును ప్రశ్నించెను. గొప్ప సైన్యమును గూర్చుకొని రోమునగరమును ముట్టడించెను. గ్రిగరీ సెలెర్నో (Selerno) కు పారిపోయి అచటనే మరణించెను. చివరకు పోపు చక్రవర్తుల తగాదా 1122 లో వరమ్సు ఒడంబడిక (The Concordant of Worms) వలన పరిష్కరింపబడినది. మత ఉద్యోగులకు చిహ్నములైన అంగుళీకము (Ring), దండము (Staff) మతాధికారులు ప్రసాదించునట్లును, చక్రవర్తి లేక వాని ప్రతినిధుల సమక్షమున ఎన్నికలు జరుపబడునట్లును తీర్మానించుకొనిరి.

జర్మనురాజైన ఫ్రెడరిక్ బార్బరోసా (Frederick Barbarossa) చక్రవర్తిత్వమును బడసి క్రీ. శ. 1176 లో పోపుతో వైరమును పెంచెను. తన అధికారమును పెంపొందించుకొనుటకు ఇటాలియనుల జాతీయభావమును త్రుంచివేయవలెననియు, పోపును తన ఆజ్ఞానువర్తుని జేసికొనవలెననియు తలంచెను. కాని మిలాన్ నాయకత్వమున ఉత్తరఇటలీ పట్టణవాసులు బార్బరోసాను లెగ్నానోవద్ద ఓడించిరి. బార్బరోసా పోపు అలెగ్జాండరు III నకు దాసోహమనెను.

బార్బొరోసా మనుమడగు ఫ్రెడరిక్ II మతవర్గమున ప్రబలిన అవినీతికి చర్చిభూములే కారణమనియు, వారిని పవిత్రులుగ జేయుటకు ఆ భూములను తన అధీనము చేసికొందుననియు ప్రకటించెను. పోపు ఇనోసెంటు IV సైన్యమును ప్రోగుచేసి ఫ్రెడరిక్

సైన్యములను ఇటలీనుండి పారద్రోలించెను. 1246 లో ఫ్రెడరిక్కును పదభ్రష్టుని జేసెను.

పోపు బోనిఫేస్ (Boniface) యూరపు రాజులపై తనకు సర్వాధిపత్యము (Supremacy) కలదని ప్రకటించెను. ఫ్రెంచి రాజగు ఫిలిప్ ది ఫెయిర్ (Philip the Fair) పోపు పంపిన పత్రమును తగులబెట్టి ఒక దండయాత్రనడిపి పోపును బందీగావించెను. బోనిఫేస్ మరణానంతరము ఫిలిప్ ఫ్రెంచి బిషప్పును పోపుగా ఎన్నుకొనునట్లు జేసెను. పోపు పీఠమును రోమునుండి అవిగ్నాన్ (Avignon) నకు మార్పించెను. సుమారు డెబ్బదిసంవత్సరములవరకు పోపులు ఫ్రెంచి రాజుల ప్రాబల్యమునకు లొంగియుండిరి. ఇంగ్లండు రాజైన జాన్ పోపు ఇన్నోసెంటు III కు చెల్లింప నొప్పుకొనిన కప్పమును ఎడ్వర్డు III చెల్లించుటకు నిరాకరించెను. పోపులు రాజులపై పెత్తనము చెలాయింపలేకపోయినను మార్టిన్ లూథరు పోపు అధికారమును ధిక్కరించువరకు క్రైస్తవమత ప్రపంచమునకు సర్వాధికారులై యుండిరి.

# మూడవ భాగము

## అధ్యాయము 10

# యూరపురాజ్య విజృంభణము

## 1. రినైజాన్స్ (Renaissance)

ఆధునిక యుగారంభము :— క్రైస్తవ ప్రపంచమున ఏక రాజ్యము, ఫ్యూడలిజము, పోపుల అప్రతిహతమగు మతాధిపత్యము మొదలగు మధ్యయుగ లక్షణము లదృశ్యమై క్రీ. శ. 15 వ శతాబ్దమునకు జాతిరాజ్యములు, జాతీయత, పెట్టుబడిదారీవిధానము, హేతువాదము మొదలగు అంశములు ప్రవేశించినవి. ఈ యుగ మార్పునకు తురుష్కుల కాన్‌స్టాంటినోపిల్ ఆక్రమణ (క్రీ. శ. 1453) నాందియని కొందరు చరిత్రకారులు సూచించుచున్నారు. ఈ యుగారంభమున రినైజాన్స్, రిఫర్మేషన్, జాతిరాజ్యాభ్యుదయము, భౌగోళికపరిశోధనలు ప్రస్ఫుటముగ కనబడు అంశములు.

రినైజాన్స్ :— రినైజాన్స్ అనగా పునర్జన్మయని అర్థము. యూరపువాసుల వైజ్ఞానికరంగమున వచ్చిన విప్లవమె రినైజాన్స్‌గ పేర్కొనబడుచున్నది. గ్రీకు వేదాంతము ప్రచారమగుటవలనను, సామాన్య ప్రజలయందును విజ్ఞానతృష్ణ ప్రబలి విద్యావ్యాప్తి గాంచుటవలనను యూరపువాసులలో విమర్శనాత్మకదృష్టి, హేతువాదము, నూతనవిషయ పరిశోధనాభిలాష, ప్రకృతి సౌందర్యోపాసన ప్రబలమయ్యెను. మతాచారములను, సిద్ధాంతములను గ్రుడ్డిగ నమ్మి ఆచరించుటకు స్వస్తిచెప్పబడినది. ప్రజలదృష్టి పరలోకచింతన నుండి ఐహికసుఖములపై మరలినది. "మధ్యయుగ మతవిశ్వాసములచే బంధింపబడిన మానవుని స్వేచ్ఛా - సాహసికప్రవృత్తికి కల్గిన పునర్జన్మమె రినైజాన్స్" అని డేవిస్ వ్యాఖ్యానించెను. "రాజ్యము, సంఘము, కళలు, వేదాంతము మొదలగు విషయములపై మానవుని దృక్పథమునగల మధ్యయుగ భావములను తొలగించుటే రినైజాన్స్."

రినైజాన్స ఉద్యమమునకు ఇటలీ కేంద్రస్థానమై క్రమముగ యూరపు రాజ్యము లన్నింటికిని వ్యాపించినది.

బైజాంటైన్ సామ్రాజ్యము తురుష్కుల వశమగుటతో గ్రీకు పండితులు తమతమ గ్రంథములతో పశ్చిమ ఐరోపారాజ్యములకు చేరి గ్రీకు సాహిత్యవ్యాప్తికి కారకులైరి. తురుష్కుల కాన్‌స్టాంటినోపిల్ ఆక్రమణ రినైజాన్స ఉద్యమమునకు పరోక్షకారణ మనవచ్చును. గ్రీకువేదాంత అధ్యయనము యూరపువాసులకు కనువిప్పయి విమర్శనాత్మక దృష్టిని కలుగ జేసినది. క్రూసేడుల వలన ప్రాక్పశ్చిమములకు భావసమ్మేళనము కలిగినది. యూరపువాసులకు ఉన్నతమైన నాగరిక ప్రపంచముతో సంబంధ మేర్పడినది. వర్తక వ్యాపారము లినుమడించుటతో అనేక పట్టణములు వెలసినవి. ధనవంతులగు నగరవాసులు రినైజాన్స ఉద్యమమునకు చేయూతనిచ్చి కళలను, సాహిత్యమును పెంపొందించిరి. నాటిరాజులు, మతాధికారులును ఈ ఉద్యమవ్యాప్తికి కారకులైరి. ఫ్లారెన్స రాజకుటుంబమువారు రినైజాన్సకళాకారులకు పోషకకర్తలైరి. లియో X అను పోపు రోమునగర కళాశాలయందు గ్రీకుసాహిత్యమునకు ప్రాముఖ్యత నిచ్చెను. నికోలస్ V వెటికన్ గ్రంథాలయస్థాపకుడయ్యెను. అరబ్బులు చీనావారినుండి కాగితము తయారుజేయు పద్ధతిని నేర్చుకొని యూరపువాసుల కందజేసిరి. జాన్ గూటెన్‌బర్గు కనిపెట్టిన ముద్రణాయంత్రము గ్రంథప్రచురణకు సులభమార్గమై యూరపువాసులను విద్యావంతులుగ జేయుటకు ఇతోధికముగ తోడ్పడెను.

మతాధికారుల బెదరింపులకు అబిలార్డ్, బేకన్ మొదలగు పండితుల హేతువాదము మరుగునపడిపోయెను. కాని డాంటి, పెట్రార్క్, బొకాసియో మొదలగు పండితులు తమరచనలద్వారా ప్రజల విమర్శనాదృష్టిని పెంపొందింపజేసిరి. డాంటి వ్రాసిన 'డివైన్ కామిడి', బొకాసియో వ్రాసిన 'డెకమెరాన్' అను గ్రంథములు సాహిత్యరంగమున నొకవిప్లవమును తెచ్చెను. మెకైవలీ (Machiavelli) 'ప్రిన్స' అను రాజ్యాంగ శాస్త్రగ్రంథమును వ్రాసెను. ఇటలీయందే గాక ఫ్రాన్సు, ఇంగ్లండు, స్పెయిన్ మొదలగు

యూరపురాజ్యములందును ప్రసిద్ధకవులు బయల్వెడలిరి. సెర్వాంటిస్, రాబిలస్, ఇరాస్మస్, షేక్స్పియర్, బెన్ జాన్సన్, మార్లొవి, స్పెన్సరు, మిల్టన్ నాటి సుప్రసిద్ధకవులు.

సాహిత్యమునందేగాక శాస్త్రవిషయములందును రినైజాన్స్ కాలము వెనుకంజ వేయలేదు. కొపర్నికస్ భూ భ్రమణ సిద్ధాంతమును ప్రతిపాదించెను. గెలీలియో దూరదర్శనీ యంత్రమును కనుగొనెను. న్యూటన్ భూమ్యాకర్షణ సిద్ధాంతమును ప్రచారమునకు తెచ్చెను. మానవ శరీరనిర్మాణము, రక్త ప్రసరణ విధానము కనుగొనబడుటతో వైద్యశాస్త్రమున గొప్ప మార్పువచ్చెను. రసాయనికశాస్త్ర విజ్ఞానమునందును అనేక నూతనవిషయములు పరిశోధింపబడినవి.

రినైజాన్స్ ఉద్యమఫలితముగ చిత్రలేఖనము, శిల్పము మొదలగుకళలు మానవునకు సన్నిహితమైనవి. లియోనార్డో డ విన్సి చిత్రించిన 'మోనాలిజా', 'లాస్ట్‌సప్పర్' చిత్రములు ప్రపంచఖ్యాతి గాంచినవి. మైకేలాంజిలో గొప్పచిత్రకారుడు, శిల్పి, కవి. 'లాస్ట్ జడ్జిమెంట్' ఇతని ప్రసిద్ధచిత్రలేఖనము. నాటి కళాకారులు గ్రీకు శిల్పములచే ఉత్తేజమునొంది మానవునిలోని, ప్రకృతిలోని సౌందర్యమును వెలికిదెచ్చిరి. వాస్తుశాస్త్రమునందును ప్రాచీన గ్రీకుసాంప్రదాయములు అనుసరణీయములయ్యెను. ఈ కాలమున గాతిక్ (Gothic) వాస్తు శిల్పకళలు శిఖరాగ్రము నందుకొనెను.

ఉద్యమ ఫలితములు :— శతాబ్దములనుండి వ్రేళ్ళుపాతుకొని యున్న పూర్వాచారములను పెకలించివేయుటకు రినైజాన్స్ ఉద్యమము తోడ్పడినది. మానవుడు విజ్ఞానవంతుడగుటచే సరళత్వము ప్రాప్తించినది. మానవుని దృక్పథము విశాలమై నూతనవిషయ పరిశోధనకు తావిచ్చినది. మానవున కలవడిన విమర్శనాత్మకదృష్టి చర్చిఅధికారమును ప్రశ్నించునట్లు జేసినది. మతోద్ధరణకు పురికొల్పినది.

## 2. మతోద్ధరణ (Reformation)

రిఫర్మేషన్ :— 16 వ శతాబ్దమున క్రైస్తవమత ప్రపంచము రెండు భాగములుగ చీలిపోయినది. పోపు అధికారమును ధిక్కరించుటతో ప్రారంభమైన ఉద్యమము రోమనుచర్చికి పోటీగ క్రొత్త జాతీయ చర్చీలను స్థాపించుటతో అంతమైనది. ఈ పరిణామమున కనేక కారణములు కనబడుచున్నవి.

16 వ శతాబ్ద ప్రారంభమునకు క్రైస్తవమత ప్రపంచమునకు పోపు, క్రైస్తవ రాజ్యములకు పవిత్ర రోమను చక్రవర్తి ముఖ్య అధినేతలుగ నుండిరి. జాతీయభావముతో ఉరకలు వేయుచున్న యూరపువాసులకు పోపు, చక్రవర్తుల అధికారములు ప్రతిబంధకములైనవి. రాజులు స్వలాభాపేక్షతో ఉద్యమమును ప్రోత్సహించిరి.

నాటి పోపులు, మతవర్గము ప్రజల ఆధ్యాత్మిక చింతనకు సంతృప్తి కలిగింపలేకపోయిరి. మతవర్గమువారు అవినీతిపరులై ఐహిక సుఖములకై ప్రాకులాడుచు, తమకర్తవ్యమును మరచిపోయిరి. వారి యందు ఆంతరంగికమైన పవిత్రతగాని, బాహ్యమగు మతతత్పరత గాని శూన్యమయ్యెను.

రినైజాన్స్ ఉద్యమఫలితముగ ప్రజలకు క్రొంగ్రొత్త విషయములు తెలియవచ్చినవి. క్రైస్తవమతమె సర్వోత్కృష్టమైనదిగాదనియు, ప్రాచీనప్రపంచ ప్రజలును సుఖజీవనులై యుండెడివారనియు తెలిసికొనిరి. బైబిలు ప్రాంతీయభాషలలో కనువదింపబడి సామాన్య మానవునకును అందుబాటులోనికి వచ్చుటవలన ప్రజలు క్రైస్తవమత నిజస్వరూపమును తెలిసికొనగలిగిరి. నాటి పోపు, ఇతర మతాధిపతులు ప్రబోధించుచున్న సిద్ధాంతములు, ఆచరణలో పెట్టిన కర్మకాండ కల్పితములే ననియు తెలియవచ్చినది. ప్రజలు మతమునందు మార్పు నభిలషించిరి. ఇరాస్మస్ తన రచనలద్వారా మతాధిపతుల దుర్నడతను వెల్లడిగావించెను. "లూధరు కోపజ్వాలలకంటె ఇరాస్మస్ పరిహాసములు పోపున కెక్కువ అపాయకారు లయ్యెను." 14 వ శతాబ్దమున ఇంగ్లండునందు జాన్ వైక్లిఫ్ మతాధికారుల

అవినీతినిచాటి సంస్కరణలను కోరెను. వాని శిష్యుడగు హస్ బొహీమియాలో మతసంస్కరణకు శుష్కయత్నము గావించెను. సర్ థామస్ మూర్ ఉటోపియా యను గ్రంథమున ఆదర్శప్రపంచ మును సృష్టించెను. కాని యెట్టిఫలితమును కలుగలేదు. మార్టిన్ లూథరు పోపుఅధికారమును ధిక్కరించుటతో రిఫర్మేషన్ ఉద్యమము ప్రారంభమైనది.

రాజకీయ, మతవిషయికమైన కారణములేగాక ఆర్థికసంబంధమైన కారణములుగూడ మతసంస్కరణ కుపకరించినది. మతాలయముల అధీనముననున్న సంపద రాజులకు కన్నెఱ్ఱయైనది. ఆ భూముల నాక్రమించుకొనుటకు రోమన్ కాథలిక్ చర్చి ప్రాబల్యమును తొలగించుట అవసరమైనది. చర్చిభూముల నాక్రమించుటలో ప్రజలు పాలకులు ఏకమైరి. రిఫర్మేషన్ ఉద్యమమునకు నాటి మతాధికారుల లోని అవినీతియె ముఖ్యకారణము కాదని తెలియుచున్నది. రినైజాన్స్ ఉద్యమమువలన తలయెత్తిన రిఫర్మేషన్ జాతీయోద్యమమువలన ఫలస్ఫూర్తి నొందినదని చెప్పవచ్చును.

**మార్టిన్ లూథరు :—** మార్టిన్ లూథరు 1483 లో సాక్సనీ యందు జన్మించెను. ఎర్ఫర్టు విశ్వవిద్యాలయమున పట్టభద్రుడయ్యెను. కొంతకాలము అగస్టీనియన్ మఠమున సన్యాసిగ కాలముగడిపెను. పిదప విటెన్‌బర్గు విశ్వవిద్యాలయమున తత్వశాస్త్రము నభ్యసింప వెడలెను. ఇరాస్మస్ గ్రంథములోని విషయముల యథార్థతను తెలిసికొనుటకు రోమునగరమునకేగి మతాధికారుల భోగలాలసత్వ మును కనులారగాంచెను. మతసంస్కరణను వాంఛించెను.

పోప్ లియో X రోమునగరమున సెయింట్‌పీటర్ చర్చిని పునర్నిర్మాణముగావింప ధనమును ప్రోగుచేయదలచెను. పాపపరిహార పత్రముల విక్రయమునకై (Sale of Indulgences) దేశ నలుమూలలకు సన్యాసుల నంపెను. పాపపరిహారపత్రములను విక్రయించుట అవినీతియని తెల్పుచు లూథరు 95 అంశములు గల పత్రమును చర్చిద్వారమునకు అంటించెను. క్రైస్తవమతముపై పోపునకెట్టి అధికారము లేదనియు, మతము భగవంతునకు మానవునకు మధ్య

నుండు సంబంధము గాన మధ్యవర్తుల ప్రమేయము లేదనియు తెల్పుచు మరియొక పత్రమును ప్రకటించెను. పోపు ఆగ్రహావేశుడై లూథరును బహిష్కరించి వానిని దండింపుమని రోమనుచక్రవర్తిని కోరెను.

లూథరు తన మతమునకు జర్మనీయందు విశేషప్రచారము కలిగించెను. జాతీయతాభావముకల్గిన జర్మనురాజులు, ప్రజలు లూథరు అనుయాయులైరి. వారిలో దేశభక్తి రగుల్కొనినది. విదేశీయులైన పోపు చక్రవర్తుల ప్రాబల్యమునకు కినిసి, లూథరునకు అండగా నిలచిరి. జర్మనీయందు తిరుగుబాటు కలుగునేమోయని భయపడి చక్రవర్తి యగు ఛార్లెసు V లూథరును దండింపలేక పోయెను.

లూథరు పోపు అధికారమును ధిక్కరించుట (Protest) చే లూథరు అనుయాయులకు ప్రొటెస్టెంట్లు (Protestants) అను పేరు కల్గినది. లూథరు విజయమునకు అతని ఆత్మబలము, పట్టుదల, కార్య దీక్ష కారణములని చెప్పవచ్చును. కాని రాజకీయమైన కుట్రలు, ఎత్తులు లేకపోయినయెడల వైక్లిఫ్, హస్ లవలెనె లూథరుగూడ అణచివేయబడెడివాడె!

ప్రొటెస్టెంటు మతవ్యాప్తి :— క్రీ. శ. 1546 లో లూథరు మరణించినను ప్రొటెస్టెంటు మతము అతిశీఘ్రముగ స్విడ్జర్లాండ్, ఫ్రాన్స్, డెన్మార్కు, హాలెండు, నార్వే, స్వీడన్, పోలెండు, ఇంగ్లండు, స్కాట్లండులకు వ్యాపించినది. జ్వింగ్లీ యను పండితుడు తనమత సంస్కరణోద్యమమును జ్యూరిచ్ యందు ప్రారంభించెను. ఈతని అనుయాయులు జ్వింగ్లియను లని పిలువబడిరి. ఫ్రెంచివాడగు జాన్ కాల్విన్ ప్రబోధించిన మతము కాల్వినిజమ్ అని పిలువబడినది. ఈ మతమునకు జినీవా కేంద్రమైనది. జర్మనీ, నెదర్లాండు, స్కాట్లండు లలో కాల్వినిజము బాగుగా వ్యాపించినది. ఫ్రాన్సు దేశ ప్రొటెస్టెంట్లు హ్యూజినాట్లు (Huguenots) అని పిలువబడిరి. కాథరిన్ ను పరిత్యజించి ఆనీ బోలిన్ అను సుందరాంగిని వివాహమాడుటకై హెన్రీ VIII నూతన మతమునకు ఇంగ్లండునందు ప్రవేశము కల్పించి ఇంగ్లండు చర్చిపై రాజుదే సర్వాధికారమని ప్రకటించెను. ఎలిజబెత్ వరి

పాలనా కాలమున ఇంగ్లండులోని ఆంగ్లికన్ చర్చి స్థిరరూపము దాల్చి నది. స్కాట్లండునందు జాన్‌నాక్స్ అనునతడు ప్రెస్బిటేరియను మత మును ప్రవేశపెట్టెను. మతవిషయములపై రాజుల అధికారమును నిరసించెను. యూరపునందు కొన్ని దేశములు ప్రొటెస్టెంటు మత మును, కొన్ని దేశములు కాథలిక్ మతమును రాజ్యాంగబద్ధము గావించెను. అల్పసంఖ్యాకవర్గ మతస్థులను హింసించుట పరిపాటి యయ్యెను. మతయుద్ధములు ప్రారంభమయ్యెను. యూరపు వాసులు మతసహనము నలవరచుకొనుటకు సుమారు ఒక శతాబ్ద కాలము పట్టినది.

కౌంటరు రిఫర్మేషన్ :— రిఫర్మేషన్ ఉద్యమము క్రైస్తవ మతమున విప్లవమును తెచ్చెను. కౌంటరు రిఫర్మేషను ఉద్యమము కాథలిక్ చర్చిని సంస్కరించి, పటిష్ఠము జేసెను. 16 వ శతాబ్ద తుది భాగమున పోపులు, మతాధికారులు మతతత్పరులై కోల్పో యిన అధికార గౌరవములను సంపాదించుకొనిరి. ఇటలీలో ట్రెంట్ నందు 1545 నుండి 1563 వరకు అనేక మతసమావేశములు గావింప బడెను. తత్వవేత్తలు కాథలిక్ మతాచారములలోని అసహజత్వమును తొలగించి, మతాధికారుల ప్రవర్తనపై ఆంక్షలను విధించి, క్రమ శిక్షణను నెలకొల్పి రోమన్ చర్చిని సంస్కరించిరి. ఇగ్నేషస్ లయోలా యను స్పానిష్ సైనికుడు జెసూట్లను నొక సంఘమును నెలకొల్పి రోమన్ కాథలిక్ మతప్రచారమునకు పూనుకొనెను. యూరపునందు పోపు అధికారమును, రోమన్ చర్చి ఆధిక్యతను పునఃప్రతిష్ఠింప యత్నించెను. వీరి ప్రచార ఫలితముగ ఫ్రాన్సు, జర్మనీ, పోలెండు మొదలగు దేశములలో ప్రొటెస్టెంటులకు స్థానము లేకుండ పోయినది. ప్రొటెస్టెంటు మతవ్యాప్తికి రాజాదరణ లభించి నట్లె కాథలిక్ మతస్థిరత్వమునకును రాజాదరణ తోడ్పడినది. జాతీయాభిమానమె ఇటలీ, ఫ్రాన్స్, స్పెయిన్, పోర్చుగల్, ఆస్ట్రియా, పోలెండు దేశములు కాథలిక్కు మతము నంటిపెట్టు కొనియుండునట్లు జేసెను. కాథలిక్ రాజ్యములలో ఇంక్విజిషన్ Inquisition) అను పేర ప్రత్యేక మత న్యాయస్థానముల నేర్పరచి

కాథలికేతరులను విచారించి శిక్షించిరి. ఇండెక్స్ (Index) అను పేర పుస్తకముల జాబితాను తయారుచేసి కాథలిక్కులు చదువరాని గ్రంథములను నిషేధించిరి. ప్రొటెస్టెంటులలో లూథరీనులు, ఆంగ్లీయనులు, కాల్వినిస్టులు మొదలగు శాఖ లేర్పడుటయు కాథలిక్కులకు పరోక్షముగ బలముకూర్చినది.

## 3. జాతి రాజ్యములు

జాతీయ భావము :— మధ్యయుగపు క్రైస్తవ ప్రపంచము ఏకరాజ్యమను భావమునకు బదులుగ ఆధునికయుగమున యూరపునందు వివిధ ప్రాంతములలో జాతీయభావము పెంపొంది ప్రత్యేక రాజ్యము లేర్పడినవి. ఫ్యూడలువ్యవస్థ రూపుమాయుటతో బలమైన రాచరిక ప్రభుత్వము లేర్పడినవి. జర్మనీ, స్పెయిన్, ఫ్రాన్స్, బ్రిటన్, రష్యా, పోలెండ్, పోర్చుగల్, టర్కీ రాజ్యములు తమ ప్రత్యేకతను నిరూపించుకొనెను. భూసంబంధమైన బంధములచేగాక మాతృదేశ ప్రేమచే బంధింపబడి ప్రజలందరు ఏకకుటుంబముగ సుసంఘటితమైరి. జాతిగౌరవమును నిలబెట్టుటకు సర్వమును త్యాగము చేయ సిద్ధపడిరి. రాజు లిది యూతగగొని తమ అధికార ప్రాబల్యముల నినుమడింప జేసికొనుటకు కృషిసల్పసాగిరి.

### స్పెయిన్

స్పెయిన్ :— 15 వ శతాబ్దమునకు ఐబీరియన్ ద్వీపకల్పములోని చిన్నచిన్న రాజ్యములన్నియు యేకమై పోర్చుగల్, కాస్టిలి, అరగాన్ రాజ్యము లేర్పడినవి. అరగాన్ రాజగు ఫెర్డినాండు కాస్టిలి రాకుమార్తెయగు ఇసబెల్లాను వివాహమాడుటతో రెండురాజ్యము లేకమై ఆధునిక స్పెయిన్ గ రూపొందినది. 1492 లో గ్రనడానుండి మూరులను తరిమివేయుటతో స్పెయిన్ నందు మహామ్మదీయుల పాలన అంతరించినది. అమెరికాయందు వలస లేర్పడినవి. నెదర్లాండ్సు, ఇటలీలోని కొన్ని రాజ్యములు స్పానిష్ సామ్రాజ్యమున చేర్చబడినవి. ఫెర్డినాండు మనుమడగు ఛార్లెసు V పరిపాలనాకాలమున స్పెయిన్

ఉచ్ఛదశనందినది. సామ్రాజ్యము విస్తరించినది. 1519 లో ఛార్లెసు రోమను చక్రవర్తిగ ఎన్నుకొనబడెను. ఛార్లెస్ కాథలిక్ మతమునందు గాఢాభిమానము కలిగియున్నను జర్మనీలోని ప్రొటెస్టెంట్లను అణచలేకపోయెను. అందులకు ఫ్రెంచిరాజగు ఫ్రాన్సిస్ ముఖ్యవిరోధిగనుండి శత్రుకూటమితో చేయికలుపుటయె కారణము. ఇతడు మతమునకంటె రాజకీయములకె హెచ్చు ప్రాధాన్యత నిచ్చి తనపదవిని కాపాడుకొనెను.

ఛార్లెసు కుమారుడైన ఫిలిప్ II (1556-1598) యూరపు రాజకీయములలో ప్రముఖపాత్ర వహించెను. పోర్చుగల్ రాజ్యమును స్పెయిన్‌తో కలిపివేయగల్గెను. తురుష్కులను లెపెంటో నౌకా యుద్ధమున ఓడించెను. యూరపునందు స్పెయిన్‌నునకు అగ్రస్థానము కల్పించి, రోమన్ కాథలిక్ మతమును యూరపు ఏకైక మతముగ జేయవలెనని కాంక్షించెను. అందులకితడు పొరుగు ప్రొటెస్టెంటు రాజ్యములతో నెగాక తన సామ్రాజ్యములోని సామంతరాజ్యములతోగూడ యుద్ధములు చేయవలసివచ్చెను. నెదర్లాండులోని ప్రొటెస్టెంట్లను కాథలిక్కులుగ మార్చవలెనని, ఆ రాజ్యముపై సంపూర్ణ అధికారమును సంపాదింప యత్నించి నెదర్లాండ్సును పోగొట్టుకొనెను. ఇంగ్లండుపై దండయాత్రనడిపి తన నౌకాబలము నంతను వ్యర్థముజేసికొనెను. ఫ్రెంచి సింహాసనమునకై ముగ్గురు హెన్రీలు జరిపిన వారసత్వయుద్ధమున తలదూర్చెను గాని హెన్రీ ఆఫ్ నెవారీ విజయుడగుటచే ఫిలిప్‌నకు ఆశాభంగము కలిగెను.

ఆంగ్లచరిత్రకారులు ఫిలిప్‌ను దుయ్యబట్టిరి. స్పానిష్‌చరిత్రకారులు వానిని ఆకాశమునకెత్తి గొప్ప విజేతగ, పరిపాలనా దక్షుడుగ పొగడియుండిరి. కొన్ని అపజయములను పొందినను ఫిలిప్ పరిపాలనలో స్పెయిన్ అగ్రరాజ్య మయ్యెనని చెప్పవచ్చును.

## ఫ్రాన్సు

ఫ్రాన్స్ :— షార్లమాన్ సామ్రాజ్య పశ్చిమభాగము ఆధునిక ఫ్రాన్స్‌గ పేర్కొనబడుచున్నది. క్రీ. శ. 987 లో పారిస్ ప్రభువగు హూగ్ కాపట్ ఫ్రెంచిరాజుగ ఎన్నుకొనబడుటతో ఫ్రెంచిజాతీయ

చరిత్ర ప్రారంభమైనదని చెప్పవచ్చును. కాపట్ రాజపదవి నొందెనే గాని, నార్మండి, ఆక్విటైన్, బర్గండీ, ఫ్లాండర్సు, ఛాంపెన్, టూలైజ్ మొదలగు రాష్ట్రములు స్వతంత్రపాలన కలిగియుండెను. లూయీ VI ఫ్యూడలు ప్రభువులను కొంతవర కణచెను. కాని వాని మనుమడగు ఫిలిప్ అగస్టస్ (1180 - 1223) పరిపాలనా కాలమున ఫ్రాన్సునందు రాజ్యాధికారము సుస్థాపితమై ఫ్రాన్స్ జాతీయ రాజ్యముగ రూపొందినది. నార్మండీ, ఆంజోలలో ఆంగ్ల ప్రభువుల అధికారము అంతరింపచేయబడినది. ఫ్యూడలు లార్డ్సుల బలము తగ్గిపోయినది. ఫ్రాన్సునకు పారిస్ రాజధానియైనది. ఫిలిప్ పారిస్‌నందు నాటర్‌డామ్ ఆలయమును కట్టించెను. వర్తక వ్యాపారముల నినుమడింప జేసెను.

ఫిలిప్ తరువాత ప్రముఖుడుగ పేర్కొనదగినవాడు లూయీ IX (1226 - 1270). ఇతడు తన రాజ్యమున న్యాయపరిపాలనా విధానమును సంస్కరించెను. ఫ్రెంచిదేశపు ప్రథమ నిరంకుశ పాలకుడుగ ఫిలిప్ IV (1283 - 1314) ను పేర్కొనవచ్చును. మతవర్గముపైగూడ పన్నులను విధించెను. రాజాధికార ప్రాబల్యముల నినుమడింప జేసెను. ఎస్టేట్స్ జనరల్ (Estates General) అను ప్రజాసభ నేర్పరచి తన చెప్పుచేతలలో నుంచుకొనెను. లూయీ XI పరిపాలనా కాలము శత సంవత్సర యుద్ధ అరాచకమునకు గురియైనది. కాని జోన్ ఆఫ్ ఆర్కు అను వీరవనిత దేశమును రక్షించి జాతీయతను పెంపొందింప జేసెను. 15 వ శతాబ్దమునకు బర్గండీ, బ్రిటనీలు గూడ ఫ్రెంచిరాజ్యమున కలసిపోయినవి. ఫ్రెంచివిప్లవము వచ్చువరకు ఫ్రాన్సునందు బూర్బాన్‌వంశరాజుల అధికారమునకు అవరోధములేక ఫ్రాన్స్ యూరపునం దొక ప్రముఖ రాజ్యముగ ప్రసిద్ధిగాంచినది.

## గ్రేట్ బ్రిటన్

గ్రేట్‌బ్రిటన్:— జూలియస్ సీజరు దండయాత్రతో ఇంగ్లండు చరిత్ర ప్రారంభమగుచున్నది. సుమారు నాలుగు శతాబ్దముల కాలము రోమనులు బ్రిటనును పరిపాలించిరి. ఆంగ్లులు, సాక్సనులు, జూటుల దండయాత్రలతో బ్రిటన్‌నందు రోమను పాలన అంతరించినది. పశ్చిమ సాక్సను రాజులలో ఆల్‌ఫ్రెడ్ మహాశయుడు (Alfred

the Great) ప్రముఖుడు. వెసెక్సురాజుల పాలనలో డేనుల దండయాత్రలు ప్రారంభమైనవి. డేనిష్ రాజులలో కాన్యూటు సుప్రసిద్ధుడు. క్రీ. శ. 1066 లో నార్మండీ రాజగు విలియమ్ ది కాంక్వెరర్ ఇంగ్లండుపై దండెత్తి నార్మను పరిపాలన ప్రారంభించెను. ఇంగ్లండునందు ఫ్యూడలిజమును ప్రవేశపెట్టెను. కాని ఫ్యూడలు విధానములోని లోపములను సరిదిద్ది బలమైన కేంద్రప్రభుత్వము నేర్పరచెను. నార్మను పాలనము వలన ఇంగ్లండు వర్తకవ్యాపారము లినుమడించెను. భాష అభివృద్ధి గాంచెను. దేశములోని వివిధ జాతులవారు ఏకమై బలమైన జాతిగ రూపొందెను.

రెండవ హెన్రీ కాలమున ఇంగ్లండు, స్కాట్లండులేగాక ఫ్రాన్సునందు అధికభాగము అతని పాలనలోనికిపోయెను. హెన్రీ అనంతరము ఫ్రాన్సులోని రాజ్యభాగము చేయిజారిపోవుటచే జాన్ ఇంగ్లండునే అంటిపెట్టుకొని యుండవలసివచ్చెను. జాన్ నిరంకుశు డగుటచే భూస్వాములు, మతాధికారులు ఏకమై 1215 లో రాజును మాగ్నాకార్టా యను పత్రముపై సంతకము పెట్టునట్లుజేసిరి. ఈ మహాస్వేచ్ఛా పత్రము ఆంగ్లేయుల ప్రజాస్వామికమునకు ప్రధమ సోపానము.

పార్లమెంటు :— మూడవ హెన్రీ పరిపాలనా కాలమున అంతఃకలహము ప్రాప్తించినది. భూస్వామికవర్గము సైమన్ డిమాంట్ ఫర్డ్ అనువాని నాయకత్వమున రాజు నోడించి క్రీ. శ. 1265 లో నొక పార్లమెంటును సమావేశపరచిరి. ఇది సైమన్ పార్లమెంటని పిలువబడుచున్నది. హెన్రీ కుమారుడగు ఎడ్వర్డు I పార్లమెంటు యొక్క ఆవశ్యకతను గుర్తించి యొక పార్లమెంటును సమావేశ పరచెను. ఇది మోడల్ పార్లమెంటని పేర్గాంచినది. ఎడ్వర్డు III పరిపాలనాకాలమున పార్లమెంటునందు ప్రభువుల సభ (House of Lords), కామన్సు సభ (House of Commons) అను రెండు సభ లేర్పడెను. శత సంవత్సర యుద్ధకాలమున పార్లమెంటునకు ఆర్థిక విషయములపైనే గాక విదేశాంగ నీతిపైనను అధికారము లభించెను. రిచర్డు II పార్లమెంటును నిర్లక్ష్యము జేయుటచే వానిని తొలగించి

లాంకాస్టరు వంశీయుడగు హెన్రీ IV ను గద్దెనెక్కించిరి. 15 వ శతాబ్దాంతమునకు ఆర్థికబిల్లులపై కామన్సుసభకు సంపూర్ణ అధికారము లభించినది.

క్రీ. శ. 1485 లో ట్యూడరు వంశీయుడగు హెన్రీ VII యార్కిస్టుల నోడించి ఆంగ్లసింహాసన మధిష్ఠించెను. ట్యూడరు నిరంకుశత్వమునకు ప్రారంభకుడయ్యెను. భూస్వాముల అధికార ప్రాబల్యములను పూర్తిగ తొలగించెను. హెన్రీ VIII ఇంగ్లండునందు ప్రొటెస్టెంటు మతమును ప్రవేశపెట్టెను. ఎలిజబెత్ I పరిపాలనా కాలమున బ్రిటన్ ఉచ్చదశనందినది. స్పానిష్ ఆర్మెడాపై విజయము గాంచుటతో యూరపునందు ఇంగ్లండునకు ప్రముఖస్థానము లభించినది.

## 4. భౌగోళిక పరిశోధనలు

**అనుకూల పరిస్థితులు :—** నవీన యుగారంభమున భౌగోళిక పరిశోధనలు జరుపుటకు అనేకశక్తులు దోహదమయ్యెను. (1) క్రూసేడులు ప్రాక్పశ్చిమముల సంబంధముల నినుమడింపజేసెను. ప్రాగ్దేశము లను గూర్చి తెలిసికొనవలెనను ఉత్సాహము యూరపువాసులలో వృద్ధిగాంచెను. వారిని దూరప్రయాణములకు సిద్ధపడునట్లుజేసెను. (2) రినైజాన్సు ఉద్యమము యూరపువాసులలో సాహసిక ప్రవృత్తిని మేల్కొల్పినది. నావికా దిక్సూచి ప్రవేశపెట్టుటవలన, భూమి గుండ్రముగ నున్నదను సిద్ధాంతము బహుళప్రచార మొందుటవలనను, భూగోళశాస్త్రముపై రినైజాన్స శాస్త్రవేత్తల సిద్ధాంతములు విశ్వసింపబడుటవలనను నావికులు మహాసాగరములపై సుదూర యానము చేయుటకు సంసిద్ధులైరి. తుపాకిమందు వినియోగము వారికి అపరిచిత దేశములలో ప్రాణరక్షణకు అండగనుండునను ధైర్యమును కలుగజేసినది. (3) కాన్‌స్టాంటినోపిల్, ఇతర తూర్పు మధ్యధరా సముద్రరేవులు తురుష్కులవశమై యుండుటచే ప్రాగ్దేశములతో వర్తకమునకు ఆటంకము కలిగినది. సుగంధద్రవ్యములకు కొరత యేర్పడినది. తూర్పుగ ప్రయాణముచేసి భారతదేశమునకు నౌకా

మార్గమును కనిపెట్టవలయునను తీవ్ర ఆకాంక్ష ఉద్భవించినది. (4) మార్కొపోలో మొదలగు యాత్రికులు అపరిచితములైన తూర్పు దేశములను గూర్చి వర్ణించియుండిరి. ప్రాగ్దేశముల సిరిసంపదలు, వైభవము, వర్తకానుకూలత యూరపువాసులను నిలువనీయలేదు. (5) జాతి రాజ్యస్థాపనతో అధికబల సంపన్నులై తమ అధికార ప్రాబల్యముల నినుమడింప జేసికొనవలెననియు, మహాసామ్రాజ్యములను నిర్మింపవలెననియు కాంక్షించిన నాటిరాజులు సాహసవంతులగు నావికులకు ధనసహాయము చేసి నూతన దేశములను కనిపెట్టుటకు ప్రోత్సహించిరి.

**నూతన పరిశోధనలు :—** పోర్చుగల్ పాలకుడుగనున్న హెన్రీ నౌకాయానమునం దభిరుచి గలవాడు. భూగోళ నౌకాయానములను గూర్చి పరిశోధించుటకై యొక వేధశాలను స్థాపించెను. నౌకాయానశాస్త్ర మభివృద్ధిచేయుటకై అనేక శాస్త్రజ్ఞులను చేరదీసెను. హెన్రీ ఆదరణతో భౌగోళిక పరిశోధనలయందు పోర్చుగల్ ముందడుగువేసెను. క్రీ. శ. 1442 లో కొందరు పోర్చుగీసునావికులు ఆఫ్రికాతీరము వెంబడి ప్రయాణముచేసి గినీతీరమును కనిపెట్టిరి. 1486 లో బార్తలోమ్యూడయ్యాజ్ ఆఫ్రికా దక్షిణాగ్రము వరకు చేరెను. అచట తుఫాను లెక్కువగ నుండుటచే ముందునకు పోలేక దానికి తుఫానుల అగ్రము (Cape of Storms) అని పేరిడెను.

15 వ శతాబ్దపు సాహసికులైన నావికులలో క్రిస్టఫర్ కొలంబస్ ప్రముఖుడు. కొలంబస్ జినోవానగరవాసి. చిరుతప్రాయముననే నావికుడుగ చేరి అనుభవమును గడించెను. పిదప పోర్చుగల్ ప్రభువు కొలువునందుచేరి నౌకాయాన శాస్త్రజ్ఞానమును పొందెను. భారతదేశమునకు నౌకామార్గమును కనిపెట్టవలెనని కుతూహలపడెను. ఆర్థిక సహాయమునకై ప్రభువుల నర్థించెను. తుదకు స్పానిష్ దంపతులగు ఇసబెల్లా, ఫెర్డినాండులు కొలంబసునకు ఆర్థికసహాయము గావించిరి. క్రీ. శ. 1492 ఆగస్టున కొలంబస్ సాంతా మేరియా, పింటా, నీనా అను మూడు ఓడలతో పాలాస్ (Palos) రేవునుండి బయలుదేరి పశ్చిమముగ ప్రయాణముసాగించి అక్టోబరు 12 వ

కొన్ని దీవులను చేరెను. తాను భారత దేశమును చేరితినని తలచి కొలంబస్ ఆ దీవులకు 'ఇండీస్' అని పేరిడెను. 1493 మార్చి 15 వకు కొలంబస్ స్పెయిన్ చేరి ఘనమైన స్వాగతమును పొందెను. ఇతడు మరల రెండుమారులు నౌకాయాత్రలను సాగించెను గాని విశేష లాభము చేకూరలేదు. కొలంబస్ సమర్థుడైన పరిపాలకుడు గాకపోవు టచే అమెరికాలోని ఇండియనులతో విరోధము తెచ్చుకొనెను. 1500 లో స్పెయిన్ నుండి యొక అధికారి అమెరికా చేరి కొలంబస్ ను బందీగా పంపెను. కాని ప్రజలు ఆందోళన సాగించుటచే స్పెయిన్ రాజు కొలంబస్ ను విడుదల చేయుటయేగాక 1503 లో మరియొక యాత్రను నడుప నియోగించెను. కాని అతడెట్టి విజయమును గాంచ లేదు. క్రీ. శ. 1506 లో కొలంబస్ మరణించెను. కొలంబస్ భారత దేశమునకు మార్గమును కనుగొనలేకపోయినను నూతన ఖండమును యూరపువాసులకు పరిచయముచేసెను. "ప్రపంచపటమున కితడు పశ్చిమఇండియాదీవులు, హోండూరాస్, నికరాగ్వా, కోస్టారికా, డరయన్, వెనుజులాలోని పారాలను కలిపెను." కొలంబస్ మరణా నంతరము అతని సాహసకృత్యములను ప్రపంచము మరచిపోయినది. ఫ్లారెంటైన్ నావికుడైన అమెరిగో వెస్ పుకి నూతనఖండ తీరభూములను పరిశోధించెను. వాని పేరుమీదుగనే ఆ ఖండమునకు అమెరికా యను పేరు వచ్చినది.

1498 లో వాస్కో-డగామా యను పోర్చుగీసు నావికుడు తుఫానుల అగ్రమునుదాటి హిందూమహాసముద్రమున ప్రయాణము సాగించి భారత దేశ పశ్చిమతీరముననున్న కళ్ళికోట రేవును చేరెను. అచటి జామొరిన్ ను దర్శించి విలువైన సరకులతో తిరిగివచ్చెను. 1499 లో గేబ్రియల్ అను పోర్చుగీసు నావికుడు దక్షిణఅమెరికాలోని బ్రెజిల్ ను చేరెను. ఫెర్డినాండ్ మాజిలాన్ అను మరియొక పోర్చు గీసు నావికుడు 1519 లో అయిదు నౌకలతో ప్రపంచమును చుట్టి వచ్చుటకై బయలుదేరెను. దక్షిణ అమెరికా దక్షిణాగ్రమును చేరి అచటిజలసంధిని దాటి పసిఫిక్ మహాసముద్రమున ప్రవేశించెను. ఆ జలసంధి ఆతని పేరిట మాజిలాన్ జలసంధి యని పిలువబడు

చున్నది. మాజిలాన్ ఓడలు పసిఫిక్ మహాసముద్రమున పెను తుఫానునకు గురియై 89 దినములు భయంకరమైన ప్రయాణము సాగించి లాడ్రోను దీవులను చేరెను. అచటినుండి అతడు ఫిలిప్పైను దీవులను చేరెనుగాని అచటి ఆదివాసులతో యుద్ధము చేయుచు అసువుల బాసెను. మూడు సంవత్సరముల అనంతరము మాజిలాన్ పతాక నౌకయగు విట్టోరియా హిందూమహాసముద్రమును దాటి గుడ్‌హోప్ అగ్రమునుచుట్టి స్వదేశమునకు చేరెను. మార్గమధ్యమున మరణించినను ప్రపంచమును చుట్టివచ్చినకీర్తి మాజిలాన్ నకు దక్కినది. ఈ ప్రపంచయాత్రవలన ఆసియా, అమెరికాలు వేర్వేరు ఖండములని తేటతెల్లమైనది.

ఆంగ్లపరిశోధకులు భారతదేశమునకు వాయవ్యదిశగ మార్గమును కనిపెట్టవలెనని ఒక శతాబ్దకాలము ప్రయత్నించి విఫలులైరి. కాని వారి ప్రయత్నములు ఉత్తరఅమెరికా తీరభూముల పరిశోధన కుపకరించినవి. 1497 లో జాన్ కాబట్ బ్రిస్టల్‌నుండి బయలుదేరి అట్లాంటిక్ సముద్రమును దాటి న్యూఫౌండ్‌లాండ్ చేరెను. సెబాస్టియన్ కాబట్ లాబ్రడార్ తీరమును పరిశోధించెను. ఎలిజబెత్ పరిపాలనాకాలమున డ్రేక్, హాకిన్స్, రాలి అను నావికులు సుదూర ప్రయాణములను గావించిరి. స్పానిష్ నౌకలను దోచుకొని 'ఎలిజబెతన్ సీడాగ్స్' (Elizabethan sea-dogs) అని పేరుబడసిరి. హాకిన్స్ ఆఫ్రికానుండి నీగ్రోలను బంధించితెచ్చి పశ్చిమ ఇండియా దీవులలో విక్రయించుచు బానిస వర్తకమునకు ప్రారంభకుడయ్యెను. డ్రేకు మాజిలాన్ వలెనె ప్రపంచమును చుట్టివచ్చిన కీర్తిగాంచెను.

## 5. వలసలు - సామ్రాజ్యవ్యాప్తి

పోర్చుగల్ :— నౌకాయానరంగమున ముందుకురికి అనేక సాహసయాత్రలను జేసిన పోర్చుగీసువారు అనేక వలసరాజ్యములను స్థాపించిరి. ప్రాగ్దేశమునందు పోర్చుగీసు సామ్రాజ్యమునకు శంకుస్థాపన గావించినవాడు ఆల్బూకర్క్. ఇతడు 1509 లో గవర్నరుగ నియమింపబడెను. భారతదేశమున గోవా, డయ్యూ, డామన్‌లందు

వర్తక కేంద్రములు నెలకొల్పబడెను. సింహళము, ఆఫ్రికాతీర రేవులు, ఆర్మజ్, మలక్కా, మలయా మొదలగు ప్రదేశములలో వర్తక స్థానములు వెలసి హిందూమహాసముద్రాధిపత్యము లభించినది. కాని వీరి అధికారము ఎంత శీఘ్రముగ పెరిగినదో అంత వేగముగనె విరిగినది. ప్రాగ్దేశములలో వారిప్రాబల్యము క్షీణించినది. పోర్చుగలు స్పెయిన్ రాజుల పాలనక్రిందికి పోవుటతో నూతనఖండములోని వలసలు స్పానిష్‌ప్రభుత్వాధీన మయ్యెను.

స్పెయిన్ :— 16 వ శతాబ్ద ప్రథమపాదమునందు స్పెయిన్ వారు దక్షిణ అమెరికా, మెక్సికో, మధ్య అమెరికా, పశ్చిమ ఇండియా దీవులందు అనేక వలసలను స్థాపించిరి. అచటి అజ్టెక్, ఇన్కా సామ్రాజ్యముల నంత మొందించి ఆదేశవాసులపై యాజమాన్యమును పొందిరి. పెరు, మెక్సికోలనుండి వెండి, బంగారములు స్పెయిన్‌నకు ఓడలలో జేరవేయబడినవి. పోర్చుగీసు వారి వలసలు గూడ స్పెయిన్ వలసలతో కలిపివేయబడి లాటిన్ అమెరికా యను పేర పిలువబడసాగినది. లాటిన్ అమెరికా వాసులు స్పానిష్ సామ్రాజ్యవాద విధానమునకు గురియై అనేక కష్టముల ననుభవించిరి. తుదకు వారు విప్లవమును బయలుదేరదీసి స్వాతంత్ర్యము నొందిరి.

హాలెండు :— ప్రాగ్దేశములందు పోర్చుగీసువారి ఆధిక్యత నంత మొందించుటకు ప్రయత్నించినవారిలో డచ్చివారు ముఖ్యులు. 16 వ శతాబ్దమున స్పానిష్ యాజమాన్యమును తొలగించుకొని జాతీయ ప్రభుత్వమును నెలకొల్పుకొనిన డచ్చివారు అనతికాలములోనె యూరపునందు ప్రథమశ్రేణి నౌకాబల సంపన్నులుగ పేర్గాంచిరి. జావా, మలక్కా సింహళములనుండి పోర్చుగీసువారిని తరిమివేసిరి. అంబోయినా యుద్ధమున ఆంగ్లేయుల నోడించి సుగంధ దీవులలో వారికి స్థానములేకుండ జేసిరి. జావాలోని బటేవియాను రాజధానిగ జేసికొని పాలించిరి. సుగంధ ద్రవ్యముల వర్తకమునందు విశేష ధనమును గడించిరి. భారతదేశమందును నాగపట్టణము చిన్సూరాలందు వర్తకస్థానములను నెలకొల్పిరి. 1626 లో ఉత్తర

అమెరికాయందు న్యూ ఆమ్‌స్టర్‌డామ్ అను వలస నేర్పరచుకొనిరి. ప్రస్తుత మది న్యూయార్కు అని పిలువబడుచున్నది. 1652 లో డచ్చివారు దక్షిణాఫ్రికాయందు కేప్‌కాలనీని స్థాపించిరి. కాని 18 వ శతాబ్ద ప్రారంభమునకు డచ్చివారి ప్రాబల్యము క్షీణింపసాగినది.

ఫ్రాన్సు :— 16, 17 శతాబ్దములలో ఫ్రాన్సు గొప్పరాజ్యముగ రూపొంది పొరుగురాజ్యములపై యాజమాన్యమును పొంద నభిలషించెను. స్పెయిన్, ఇంగ్లండులవలెనె వలసరాజ్యస్థాపనకు పూనుకొనెను. ఫ్రెంచివారు సెంట్ లారెన్సు నదీమండలమును పరిశోధించి దానిపై ఆధిపత్యమును పొందిరి. జాక్విస్ కార్టియర్ కెనడాను కనుగొని ఫ్రెంచివలసగ జేసెను. 1608 లో ఛాప్లియన్ క్విబెక్ అను వలసను స్థాపించెను. ఉత్తర అమెరికాతీరము వెంట అనేక వర్తక కేంద్రములు నెలకొల్పబడెను. లూసియానా యను వలస యేర్పరుపబడెను. సప్తసంవత్సర యుద్ధమున ఫ్రెంచివారి ప్రతిష్ఠ భంగమైనది. కెనడా ఆంగ్లేయులకు దక్కినది.

పదునాల్గవ లూయీకడ మంత్రిగనున్న కోల్బర్ట్ ఫ్రెంచి ఈస్ట్ ఇండియా కంపెనీస్థాపనకు ప్రోద్బలమిచ్చెను. భారతదేశమున పుదుచ్చేరి, కరైకాల్, మాహె, చంద్రనాగూరు మొదలగు ప్రదేశములలో వర్తకస్థానములు నెలకొల్పబడెను. డ్యూమా అను ఫ్రెంచి గవర్నరు పుదుచ్చేరిని ప్రముఖ వర్తక కేంద్రముగ చేసెను. డూప్లే భారతదేశమున ఫ్రెంచివారి పలుకుబడిని పెంపొందించుటకు ప్రయత్నించెను. కాని ఫ్రెంచివారికి ఆంగ్లేయులపోటీ హెచ్చైనది. తుదకు ఆంగ్లేయులే విజయము గాంచిరి.

ఇంగ్లండు :— స్పానిష్ నౌకలను దోచుకొనుటలో ఆంగ్ల నావికులు ప్రజ్ఞజూపి స్పానిష్ ఆర్మెడాను నాశన మొనరించి కీర్తి గాంచిరి. నౌకాయానమున ఆంగ్లేయులకు ఉత్సాహ మినుమడించినది. తూర్పుదేశములతో వర్తకమునకు ఉరకలు వేయసాగిరి. క్రీ. శ. 1600 లో తూర్పుఇండియా కంపెనీ యేర్పరుపబడినది. సూరత్, బొంబాయి, మద్రాసు, కలకత్తా మొదలగు ప్రదేశము

లలో కంపెనీ వర్తక కేంద్రములు వెలసినవి. డచ్చి, పోర్చుగీసు, ఫ్రెంచి వర్తక సంఘముల పోటీకి నిలచి క్రమముగా వారి నందర నోడించివేయగల్గెను. స్వదేశరాజుల అంతఃకలహములలో తలదూర్చి రాజ్యసంపాదనకు పూనుకొనెను. ప్లాసీ యుద్ధమున పొందిన విజయము బక్సారు యుద్ధముతో స్థిరపడినది. ఆంగ్లేయులకు బంగాళమున సుస్థిరస్థాన మేర్పడినది. క్లైవు, వారన్ హేస్టింగ్స్, కారన్‌వాలిస్, మార్క్విస్ ఆఫ్ హేస్టింగ్స్, వెలస్లీ, డల్‌హౌసి మొదలగు కంపెనీ గవర్నరులు భారతదేశమున ఆంగ్లేయుల కొక మహాసామ్రాజ్యమును ఏర్పాటుజేసిరి. సింహాళము, బర్మా, మలయా లందును ఆంగ్లరాజ్య మేర్పడినది. ఉత్తర అమెరికాయందు అట్లాంటిక్ తీరము వెంబడి పదునాలుగు వలసరాజ్యములు స్థాపింపబడినవి. సప్త సంవత్సర యుద్ధమున కెనడా ఆంగ్లేయుల వశమైనది.

అ ధ్యా య ము 11

# 16, 17 శతాబ్దములలో ఆసియా

## 1. మొగలు సామ్రాజ్యము

**మొగలుసామ్రాజ్య స్థాపన :—** భారతదేశమున మొగలు రాజ్యమును స్థాపించినవాడు బాబరు. ఇతడు తల్లితరపున చెంగిజ్ ఖాన్, తండ్రి తరపున తైమూరు వంశములకు చెందినవాడు. స్వశక్తిచే కాబూలు రాజ్యమును సంపాదించుకొని క్రీ. శ. 1526 లో భారత దేశముపై దండయాత్ర నడిపెను. లోడీవంశీకుడగు ఇబ్రహిం లోడీని పానిపట్టువద్ద ఓడించి ఢిల్లీసింహాసనమును పొందెను. రాజపుత్ర రాజ్యకూటమికి నాయకుడైన రాణా సంగ్రామసింహుని కణ్వాహా యుద్ధము (1527) న ఓడించెను. బెంగాలు, బీహారులలోని ఆఫ్ఘన్ అమీరులు గోగ్రా యుద్ధము (1529) న ఓడి బాబరునకు దాసోహ మనిరి. మూడు యుద్ధములతో బాబరు ఉత్తర హిందూస్థానమంతయు తన ప్రాబల్యముక్రిందికి దెచ్చెను. క్రీ. శ. 1530 లో బాబరు అనారోగ్యముచే మరణింపగా వాని కుమారుడగు హుమాయూన్ ఢిల్లీసింహాసనము నధిష్ఠించెను.

బాబరు రాజ్యమును సంపాదించెనేగాని మొగలుల అధి కారము సుస్థిరత చెందలేదు. హుమాయూన్ అనేకకష్టముల నెదుర్కొనవలసి వచ్చెను. తుదకు షేర్‌షా అను సూర్‌వంశీకుడు హుమాయూన్‌ను పదభ్రష్టునిగావించి తరిమివేసెను.

షేర్‌షా కొలదికాలమె (1540-45) పరిపాలించినను తన సంస్కరణలద్వారా భారతదేశ చరిత్రయందు ప్రముఖస్థాన మేర్ప రచుకొనెను. రాజ్యమును సర్కారులుగను, పరగణాలుగను విభజించి షిగ్దార్, అమీన్ మొదలగు ఉద్యోగుల నేర్పరచెను. మూడుసంవత్సరముల కొకసారి ఉద్యోగులను బదిలీచేయు పద్ధతిని ప్రవేశపెట్టెను. క్రమమైన న్యాయపాలన ప్రవేశపెట్టి న్యాయ సింహుడని పేర్గాంచెను. భూమిని సర్వేచేయించి పంటలో మూడవ

వంతు పన్నుగా వసూలుచేసెను. వ్యవసాయాభివృద్ధికి పాటుబడెను. రైతుల కష్టసుఖముల నాలించి తగిన సహాయము చేయుచుండెడివాడు. రాజ్యమున అనేక బాటలు వేయించి రాకపోక సౌకర్యములను కలిగించెను. మార్గమధ్యమున సరాయి లను వసతిగృహములను కట్టించెను. అంచెటపాపద్ధతిని ప్రవేశపెట్టెను. మహమ్మదీయ మతాభిమానియైనను మతసహనమును జూపెను. "ఏ ప్రభుత్వమును, బ్రిటిష్ ప్రభుత్వమైనను, ఈ పఠానువలె ఇంతటి వివేకమును ప్రదర్శించియుండలే"దని యొక చరిత్రకారుడు ప్రశంసించెను.

రాజ్యభ్రష్టుడైన హుమాయూన్ పలుకష్టముల నెదిర్చి పర్షియా చేరి కొంత సైనికసహాయమంది కాబూలు, కాందహారుల నాక్రమింప గల్గెను. షేర్ షా మరణానంతరము ఢిల్లీసింహాసన మెక్కిన సూర్ వంశీయులు అసమర్థులగుటచే హుమాయూన్ 1555 లో తిరిగి ఢిల్లీ రాజ్యమును సంపాదించుకొనగల్గెను. కాని సింహాసనమును పొందిన ఏడు నెలలకే ఒక ప్రమాదమునకు గురియై అసువులబాసెను. బెంగాలు నవాబగు మహమ్మద్ అదిల్ షాకడ మంత్రిగనున్న హేమూ చందర్ పెద్దసైన్యముతోవచ్చి ఢిల్లీ, ఆగ్రాల నాక్రమించి రాజా విక్రమాదిత్య యను బిరుదుతో సింహాసన మధిష్ఠించెను. హుమాయూన్ కుమారుడగు అక్బరు నాటికి పదమూడేండ్ల బాలుడు. అక్బరు తన సంరక్షకుడగు బైరాంఖాన్ సహాయమున హేమూను క్రీ. శ. 1556 లో పానిపట్టుకడ నోడించి ఢిల్లీ నాక్రమించెను.

**అక్బరు (క్రీ. శ. 1556 - 1605) :—** అక్బరు సింహాసన మెక్కినప్పటికి మొగలుల అధికారము పంజాబు, ఢిల్లీ పరిసరములకు మాత్రమే చెల్లుబడియగుచుండెను. అక్బరు భారత దేశమున ఏకచ్ఛత్రాధిపత్యమును సాధింపవలెనని కాంక్షించెను. ప్రథమమున సూర్ వంశీకులను లొంగదీసెను. బైరాంఖాన్ గ్వాలియర్, జానుపూరు, ఆజ్మీరులను జయించి మొగలురాజ్యమున జేర్చెను. 1564 లో మాళ్వ ఆక్రమించబడెను. అక్బరు రాణిదుర్గావతి నోడించి గోండ్వనమును మొగలురాజ్యమున కలిపివేసెను. అక్బరు రాజపుత్రులను జయించినను వారి రాజ్యములను వారికే యిచ్చివేసి వారిని

సామంతులుగ జేసికొనెను. రాజపుత్రులతో మిత్రత్వమును పెంచుకొని తన రాజ్యవ్యాప్తికై వారి శౌర్య ధైర్యములను వినియోగించుకొనెను. 1568 లో చిత్తూరు అక్బరువశమైనను శిశోదయవంశీకుడగు రాణాప్రతాపసింహుడు మొగలులకు తలవంచలేదు. తాను బ్రతికియున్నంతకాలము అక్బరునకు ప్రక్కలోని బల్లెమై మెలగెను.

అక్బరు క్రమముగ గుజరాతు, బెంగాలు, కాశ్మీరు, కాబూలు, కాందహారు, బెలూచిస్థాన్, సింధుల నాక్రమించెను. 1595 వ సంవత్సరమునకు అక్బరు రాజ్యము హిందూకుష్ పర్వతముల నుండి అస్సామువరకు, హిమాలయములనుండి నర్మదానదివరకు విస్తరించెను.

ఉత్తర హిందూస్థానమున దిగ్విజయము గాంచిన అక్బరు తన దృష్టిని దక్కనుపై మరల్చెను. అహమ్మదు నగరమున యువరాజునకు సంరక్షకురాలుగ నున్న చాందుబీబి మొగలుల నెదిర్చెనుగాని లాభములేక బీరారు నిచ్చి సంధిచేసికొనెను. ఆమె మరణానంతరము అహమ్మదునగర రాజ్యమున కొంతభాగము మొగలుల వశమైనది. అక్బరు దుర్భేద్యమని పేర్గాంచిన అసిర్ ఘర్ కోటను పట్టుకొని ఖాందేష్‌ను మొగలురాజ్య సుబాగ జేసికొనెను. 1601 సంవత్సరమునకు రాజ్యవిస్తరణ కార్యక్రమము పూర్తియైనది.

**అక్బరు పరిపాలన :—** అక్బరు భారతదేశమున మొగలుల అధికారమును సుస్థిరపరచి, రాజ్యమును విస్తరింపజేయుటేగాక చక్కని పరిపాలనా పద్ధతి నేర్పరచి తన అసాధారణ ప్రజ్ఞ జూపెను. మతప్రసక్తిలేని జాతీయ ప్రభుత్వమును నెలకొల్పి ఆదర్శప్రభువయ్యెను. ప్రజాసహకారమే సామ్రాజ్య రక్షయని గుర్తించి అధికసంఖ్యాకులైన హిందువుల మన్ననలందుటకు ప్రయత్నించెను. హిందువులతో వివాహసంబంధముల నేర్పరచుకొని వారికి ఉన్నతోద్యోగముల నిచ్చెను. తాను అంబరురాజగు బిహారీమల్లుని కుమార్తెను వివాహమాడెను. తన కుమారుడగు సలీమునకు జయపురాధీశుని కుమార్తెతో పెండ్లి గావించెను. మాన్‌సింగ్, భగవాన్‌దాస్, తోడరుమల్, బీర్‌బల్ మొదలగు రాజపుత్రులకు మొగలు రాకుమారులతో

సమానమగు గౌరవమును కల్పించి ఉన్నతోద్యోగములందుంచెను. హిందువుల కవమానకరములగు పన్నులను తీసివేసెను.

అక్బరు తనరాజ్యమును 15 సుబాలుగ విభజించి సుబేదారు లను నియమించెను. పరిపాలనా విషయములందు మంత్రుల సలహా




లను తీసుకొనుచుండెవాడు. న్యాయపాలనయందు హిందువులకు హిందూధర్మశాస్త్రము, మహమ్మదీయులకు ఖురాను ప్రమాణ గ్రంథములుగ నిర్ణయించెను. సైనిక విధానమునందు మన్సబ్‌దారీ పద్ధతిని

ప్రవేశపెట్టెను. పదిగుఱ్ఱములనుండి పదివేలగుఱ్ఱములవరకు ఆధిపత్యమును వహించు ముప్పదిమూడు తరగతుల మన్సబ్ దారుల నేర్పరచి వారికి జీతములను నిర్ణయించెను. మన్సబ్ దారులు సైన్యాధిపతులుగనేగాక రాజ్యపరిపాలనా వ్యాసంగమున మంత్రులుగ, రాష్ట్రపాలకులుగ న్యాయాధికారులుగ వ్యవహరించుచుండెడివారు.

అక్బరు రెవెన్యూ సంస్కరణలయందు తోడరుమల్లు ఇతోధికముగ సహాయముజేసెను. భూసారమునుబట్టి భూమిని నాలుగు రకములుగ విభజించి, అధిక ఫలవంతములగు భూమిని పంటనుబట్టి మూడు తరగతులుగ విభజించెను. పంటలో మూడవవంతు పన్నుగా వసూలుచేసెను.

అక్బరు బానిసత్వమును నిరసించి యుద్ధ ఖైదీలను బానిసలుగ విక్రయించరాదని శాసించెను. హిందూ సంఘమునగల దురాచారములను మాన్ప ప్రయత్నించెను. మహమ్మదీయులలోని బహు భార్యాత్వముపై ఆంక్ష విధించెను. విద్యాభివృద్ధికై పాటుబడెను. ప్రభువుల ఆదరణతో భారత దేశపరిశ్రమ లభివృద్ధిగాంచి వర్తక వ్యాపారము లినుమడించెను.

అక్బరు సిక్రీనగరమున ఇబదత్ ఖాన్ అను మందిరమును నిర్మించి అందు మతసభలను గావించుచుండెడివాడు. హిందూ, మహమ్మదీయ, బౌద్ధ, జైన, శిక్కు, పారశీక, క్రైస్తవ మతవేత్తల నాహ్వానించి వారి తర్కవితర్కములను శ్రద్ధగ ఆలకించుచుండెడివాడు. అన్ని మతముల సారమును క్రోడీకరించి 1582 లో దిన్ ఇ ఇలాహి అను నూతన మతమును ప్రవేశపెట్టెను. తన సామ్రాజ్యమున ప్రజలలో మత భేదమును తొలగించి జాతీయతను పెంపొందించుటె అక్బరునకు నూతనమత ఆవిష్కరణలో గల మహదాశయము.

అక్బరు గొప్ప కళాపోషకుడు. ఇతని దర్బారులోని పారశీక పండితులలో ఫైజి, అబుల్ ఫజుల్ ముఖ్యులు. ఫైజి భగవద్గీతను పారశీక భాషలోని కనువదించెను. అబుల్ ఫజుల్ ఐనిఅక్బరి, అక్బరు నామా యను గ్రంథములను రచించెను. తాన్ సేన్ అక్బరు ఆస్థాన

మునకు కోకిల. అక్బరు ఫతేపూరు సిక్రీ నగరమును నిర్మించి తన కళాభిమానమును చాటెను.

విదేశదండయాత్రికులుగ నున్న మొగలులను భారతీయులుగ జేసి అక్బరు ఘనుడయ్యెను. అక్బరు 'భారత జాతీయ తాపిత' యని శ్రీ నెహ్రూ వాక్రుచ్చెను. ఐరోపాలో మతకలహములతో అల్ల కల్లోలముగ నున్న సమయమున అక్బరు మతసహనమును జూపి, సర్వమానవ సమానత్వమును ప్రబోధించెను. సమకాలికులగు ఎలిజబెత్ I, ఫ్రెంచి రాజగు నాల్గవ హెన్రీ, పారశీక చక్రవర్తియగు షా అబ్బాస్‌లకంటె అక్బరు ఘనుడనిపించుకొనెను.

జహాంగీరు (క్రీ. శ. 1605 - 1627) :— అక్బరు మరణా నంతరము వాని కుమారుడగు సలీమ్ 1605 లో జహాంగీరు అను బిరుదుతో పట్టాభిషిక్తుడయ్యెను. రాణాప్రతాపసింహుని కుమారు డగు అమరసింహుని వశపరచుకొనెను. శత్రుదుర్భేద్యమైన కాంగ్రా కోటను పట్టుకొనెను. కాని కాందహారును పోగొట్టుకొనెను. జహాంగీరు తన పరిపాలనా విధానమున అక్బరు అడుగు జాడలలో నడచెను. న్యాయగంటను వ్రేలాడదీసి ప్రజలకు న్యాయమును గూర్చుటకు అన్నివేళల సంసిద్ధుడనని ప్రకటించెను. జహాంగీరు మద్యపానానురక్తుడై పరిపాలనా విషయములందు శ్రద్ధతీసికొనక పోయినను రాణియగు నూర్జహాను అతిసమర్థతతో రాచకార్యము లను చక్కబెట్టెను. ఆంగ్లరాయబారులైన సర్ థామస్‌రో, కెప్టెన్ హాకిన్సులు పాదుషాను దర్శించి సూరతునందొక వర్తకశాలను నిర్మించుకొనుట కనుజ్ఞబడసిరి.

తన కుమారుడగు ఖుస్రూ జేసిన తిరుగుబాటునకు సిక్కుల గురువగు అర్జునసింగు ప్రోద్బలము కలదని వానిని చంపించుటతో సిక్కులకు మొగలులకు వైషమ్యములు ప్రారంభమయ్యెను. జహాంగీరు పరిపాలనాకాలమున చివరి సంవత్సరములు అంతఃపుర కుట్రలతో, వారసత్వ యుద్ధముతో అశాంతిదాయకమయ్యెను.

షాజహాను (క్రీ. శ. 1628 - 1658) :— షాజహాను పరి పాలనాకాలమును మొగలుల స్వర్ణయుగమని చెప్పవచ్చును. అక్బరు

ప్రవేశపెట్టిన సంస్కరణలు షాజహాను కాలమున పూర్తి ఫలితముల నిచ్చెను. ప్రభుత్వ ఆదాయము 22 కోట్లవరకు పెరిగెను. పరిశ్రమలు, వర్తకవ్యాపారము లభివృద్ధిగాంచెను. దేశము శాంతి సౌభాగ్యములతో వర్ధిల్లెను. షాజహాను కవులను, పండితులను, కళాకారులను ఆదరించెను. హిందీ, పారశీక భాషలలో చక్కని సాహిత్యము వెలువడెను. షాజహాను ఢిల్లీ, ఆగ్రా నగరములలో అనేక దివ్యభవనములను నిర్మించెను. మూడుకోట్ల రూపాయలను వెచ్చించి అపురూపమైన తాజ్‌మహాలును నిర్మించెను. మోతీ మసీదునకు మూడు లక్షలు వెచ్చించెను. ఢిల్లీ సమీపమున షాహజానాబాదు అను నగరమును నిర్మించెను. అచటి భవనములలో రంగమహాల్, ముంతాజ్‌మహాలు, దివాని ఇ ఆలమ్, దివాని ఇ ఖాస్ ముఖ్యమైనవి. ఎఱ్ఱకోట నిర్మాణము షాజహాను కాలముననే పూర్తిగావింపబడినది. మొగలు సామ్రాజ్య వైభవమునకు తగియుండునట్లు తన వద్దనున్న అమూల్య రత్నములను పొదిగించి మయూరసింహాసనమును చేయించెను.

వెలుగు నంటియుండు నీడవలె షాజహాను వైభవమునందు సామాన్య ప్రజల దుర్భరదారిద్ర్యము తొంగి చూచుచున్నది. గుజరాతు, దక్కనులందు తాండవమాడిన క్షామదేవతవలన వేలకొలది ప్రజలు అసువులు బాసిరి. షాజహాను ఆడంబరప్రియుడై కోట్లకొలది ధనమును రాళ్ళపాలు జేసెను. కాందహారు, మధ్యఆసియా యుద్ధములకు ప్రభుత్వ ధనమును వృధాచేసెనేగాని ప్రజోపకరమైన పనులను చేయలేకపోయెను.

షాజహాను యెంతటి వైభవము ననుభవించినను వార్ధక్యమున కడగండ్ల పాలయ్యెను. రాజ్యముకొరకై రాకుమారులు పోటీపడిరి. వారసత్వయుద్ధము ప్రారంభమయ్యెను. సోదరులగు దారా, షుజా, మురాదులను చంపించి, తండ్రిని బందీగావించి ఔరంగజేబు సింహాసనము నధిష్ఠించెను. షాజహాను ఆగ్రానగరమున బందీగ ఏడేండ్లు గడపి తన 74 వ యేట స్వర్గస్థుడయ్యెను.

**ఔరంగజేబు (1658 - 1707):—** ఔరంగజేబు పరిపాలనా కాలమంతయు యుద్ధములతోనె గడచిపోయెను. ఔరంగజేబు

ఈశాన్య సరిహద్దు అల్లరుల నణచివేసి అస్సాము నాక్రమించెను. సముద్రదొంగల కాశ్రయమిచ్చుచున్న అరకాన్‌రాజు నోడించి చిట్టగాంగ్‌ను మొగలు సామ్రాజ్యమున జేర్చెను. వాయవ్య సరిహద్దు పఠానులను లొంగదీసెను. దక్కనునందు బిజాపూరు, గోల్కొండ రాజ్యములను ఆక్రమించి, తంజావూరు, తిరుచనాపల్లి హిందూరాజుల నోడించి, మొగలుసామ్రాజ్యమును వైఘనదివరకు విస్తరింపజేసెను. ఔరంగజేబు కాలమున భారత దేశమంతయు మొగలుల పాలనలోనికి వచ్చెనని చెప్పవచ్చును. "ఔరంగజేబు అంతయు జయించినట్లు కనబడెను. కాని యథార్థమున కత డంతయు పోగొట్టుకొనెను." అందుల కతని మతవిధానము, దక్కను విధానము కారణములని చెప్పవచ్చును.

ఔరంగజేబునకు మతమునందు అభిమానము మెండు. భారత దేశమును ఇస్లామ్‌మత రాజ్యముగ చేయనెంచెను. ఇతడు స్వమతము నెంతగ నభిమానించెనో పరమతము నంతకు రెట్టింపుగ ద్వేషించెను. సున్నీమతస్థుల నాదరించెను. షియాలపై కత్తిగట్టెను. సూఫీల నవమానించెను. హిందువులను హింసించుటే పరమాశయముగ జేసి కొనెను. హిందూ ఆలయములను పాఠశాలలను పడగొట్టుటకై ఉత్తరువులిచ్చెను. విగ్రహారాధనను నిషేధించెను. జిజియా, తీర్థ యాత్ర పన్నులను వసూలుజేసెను. హిందువులపై మహమ్మదీయుల కంటె రెట్టింపుపన్ను విధించెను. సాంఘికముగ, ఆర్థికముగ వారిని హీనస్థితికి త్రోసి మహమ్మదీయులుగ జేయుటే పాదుషా ఆశయము. తన ఆశయసిద్ధికై యెట్టి అనర్థకములనైనను యెదుర్కొనుటకు ఔరంగజేబు సంసిద్ధుడయ్యెను.

ఔరంగజేబు మతవిధానమును నిరసించుచు ఉత్తరహిందూ స్థానమున జాటులు, బుందేలులు, సత్నాములు తిరుగుబాటు గావించిరి. సిక్కు గురువగు తేజబహాదూరును చంపించుటచే సిక్కులు గురుగోవిందసింగు నాయకత్వమున తిరుగబడిరి. మార్వారు పాలకుడగు జస్వంతసింహుడు మరణింపగా ఆ రాజ్యమునకు మహమ్మదీయ పాలకు నేర్పరచి యువరాజగు అజితసింహుని బంధీగావించెను.

దీనితో ఔరంగజేబు రాజపుత్రుల ఆగ్రహమునకు గురియయ్యెను. మార్వారు, మేవారు రాజపుత్రు లేకమై మొగలుసైన్యముల నెదిరించిరి. ఔరంగజేబు ఉత్తర హిందూస్థానమున తిరుగుబాటుల నణచుటలో నిమగ్నుడైయుండ దక్షిణమున శివాజి మహారాష్ట్రులకు

నాయకుడై స్వతంత్ర రాజ్యస్థాపనకు పూనుకొనెను. మహారాష్ట్రుల నణచుటకు, బీజపూరు, గోల్కొండలలో షియాసుల్తానుల పాలవ తొలగించుటకు ఔరంగజేబు తన దక్కను విధానమును రూపొందించు

కొనెను. ఔరంగజేబు శివాజిని మాయోపాయమున ఆగ్రాకు పిలిపించి బంధించెను గాని యుక్తిశాలియైన మహారాష్ట్రవీరుడు తప్పించుకొని స్వదేశమును చేరెను. ఔరంగజేబు శివాజిని స్వతంత్ర రాజుగ గుర్తింపక తప్పలేదు. కాని శివాజి 1680 లో స్వర్గస్థుడగుటచే ఔరంగజేబు తన దక్కనువిధానము నమలుజరుప అవకాశము లభించెను. బీజపూరు, గోల్కొండ రాజ్యములను మొగలు సామ్రాజ్యమున జేర్చి శివాజికుమారుడగు శంభూజిని వధించి, యువరాజగు సాహును బందీగ తీసికొనిపోయెను. కాని అంతటితో మహారాష్ట్రీల బల మంతరించ లేదు. శివాజి సోదరుడగు రాజారాము, పిదప వాని భార్యయగు తారాబాయి మహారాష్ట్రీల స్వాతంత్ర్య యుద్ధమును కొనసాగించిరి. మహారాష్ట్రులు మొగలు సామ్రాజ్యమును దోచుకొనిరి. మొగలు సైన్యములకు మహారాష్ట్రీలు సింహస్వప్నమైరి. ఔరంగజేబు మహారాష్ట్రీలకు దాసోహమనవలసివచ్చెను. అపజయ పరంపరల వలన ఔరంగజేబునకు మనోధైర్యము సడలిపోయినది. 1707 లో ఔరంగజేబు ఢిల్లీకి ప్రయాణమై పోవుచు మార్గమధ్యముననే మరణించెను. ఔరంగజేబు మరణముతో మొగలు సామ్రాజ్యవైభవ మంతరించినది.

మొగలు సామ్రాజ్య పతనమునకు కారణములు:— ఔరంగజేబు పరమత ద్వేషమే సామ్రాజ్య క్షయమునకు దారితీసినది. రాజ్యరక్షకులైనవారే భక్షకులుగ మారిరి. ఔరంగజేబు యుద్ధములతోనే కాలము గడుపుటవలన పరిపాలనా వ్యవహారములు కుంటువడినవి. .. ధనాగారము కొల్లబోయినది. సైన్యము నిర్వీర్యమైనది. ఔరంగజేబు తరువాతి పాదుషాలు అసమర్థులగుటచే రాజ్యమును సుసంఘటితపరుచ లేకపోయిరి. రాష్ట్రపాలకులు స్వతంత్రులైరి. నాదిర్షా, అబ్దాలి మొదలగు విదేశీయుల దండయాత్రలు పతనోన్ముఖమైన సామ్రాజ్య వృక్షమునకు గొడ్డలిపెట్టు లయ్యెను. మొగలులు నౌకాబలమునందు శ్రద్ధతీసికొనకపోవుటచే సముద్రమార్గమున వచ్చిన యూరోపియనుల రాజ్యస్థాపనా కార్యక్రమము నడ్డగింప లేకపోయిరి. వర్తకమునకై వచ్చిన ఆంగ్లేయులు భారత సామ్రాట్టులైరి.

## 2. మధ్యయుగమున చైనా

### మింగ్ వంశము

మింగ్ వంశము (1360 - 1644) :— జగజ్జేత యగు చెంగిజ్ ఖాన్ ఆసియా ఐరోపాలలో విశాల సామ్రాజ్యమును స్థాపించెను. ఇతని సామ్రాజ్యమున ఉత్తరచైనా, మంగోలియా, మధ్య ఆసియా, పర్షియా, టర్కిస్థాన్, కకేషియా, తూర్పు రష్యా చేరి యుండెను. కుబ్లాయిఖాన్ పరిపాలనాకాలమునందే మార్కోపోలో చైనాను దర్శించి చైనా వైభవమును యూరోపియనులకు వెల్లడించెను. క్రీ. శ. 1280 నుండి 1360 వరకు ఉత్తరచైనా మంగోలుల పాలనను పొందెను. హూంగ్ వూ (Hung-wu) అను నొక సామాన్య రైతుకుటుంబీకుడు ఉత్తరచైనాయందొక తిరుగుబాటును లేవదీసి విదేశీయులైన యూన్ వంశపాలన నంతరింపజేసి మింగ్ (Ming) వంశస్థాపకుడయ్యెను. చీనాభాషయందు మింగ్ అనగా ప్రకాశవంతమైనదని అర్థము. చీనా చరిత్రయందు మింగ్ వంశపాలనా కాలము ప్రకాశవంతమైనదనియె చెప్పవచ్చును. హూంగ్ వూ తన ముప్పదేండ్ల పరిపాలనాకాలమున బీదల ఆర్థికస్థితిని మెరుగుపరచుటకు కృషిచేసెను. ఇతని తరువాతి చక్రవర్తియగు యంగ్ లో (Yung Lo) మింగ్ వంశమున సుప్రసిద్ధుడు. ఇతడు పీకింగ్ పట్టణమును నిర్మించెను.

మింగ్ వంశీయులు గొప్ప పరిపాలనా దక్షులు. ప్రజలకు పన్నుల భారము తక్కువ. రోడ్లు, కాలువల నిర్మాణముతో దేశమున రాకపోక సౌకర్యము లినుమడించెను. కాగితపు కరెన్సీ చెలామణిలోనికివచ్చి వర్తక మభివృద్ధిగాంచెను. ప్రభుత్వ ధాన్యాగారములు (Public Graneries) నిర్మింపబడెను. మింగ్ వంశీయులు చీనా సంస్కృతి, కళల అభివృద్ధికిని ఇతోధికముగ సహాయపడిరి. అనేక దివ్యభవనములు నిర్మింపబడెను. చీనావారు పింగాణీపాత్రలపై చిత్రవిచిత్రములైన నగిషీల నద్ది తమ కళాపాటవమును ప్రదర్శించిరి. కొయ్య, దంత నగిషీ వస్తువుల పనితనమునందు చీనావారు ఈ కాలమున అత్యున్నతస్థానము నందిరి.

మింగ్ వంశ పరిపాలనా కాలమునందే క్రైస్తవమతము చీనా యందు ప్రవేశించినది. ఫ్రాన్సిస్ జావియర్ (Francis Xavier) అను క్రైస్తవమతప్రచారకుడు చీనాయందు క్రైస్తవమతవ్యాప్తికి కృషి చేసెను. కాని చీనారాజులు ఈ మతవ్యాప్తి నరికట్టిరి. యూరోపియను వర్తకులు చీనాయందు వర్తక కేంద్రములను నెలకొల్ప యత్నించిరి కాని వారి ప్రయత్నములు ఫలించలేదు. తుదకు 1537 లో పోర్చుగీసువారు కాంటన్ సమీపమున మకావో (Macao) అను చిన్నద్వీపముపై నొక వర్తక కేంద్రమును స్థాపింపగల్గిరి.

## మంచూ రాజులు

**మంచూ వంశము (1644 - 1911) :—** మంచూరియాలో స్థిరపడిన తార్తారులు క్రీ. శ. 1644 లో మింగ్ వంశరాజుల నోడించి చీనా నాక్రమింపగల్గిరి. వీరు మంచూ (Munchu) లని పిలువబడిరి. ఈ రాజులలో కంగ్ హి (Kang Hsi), యంగ్ చంగ్ (Yung Cheng), చియన్ లంగ్ (Chien Lung) అనువారలు సుప్రసిద్ధులు. మంచూ రాజులు విదేశీయులయ్యు చీనా ఆచార వ్యవహారముల నవలంబించి చీనావారైరి. చైనాను బలమైన రాజ్యముగ రూపొందించిరి.

కంగ్ హి సుప్రసిద్ధ ఫ్రెంచి చక్రవర్తియగు పదునాల్గవ లూయీకి సమకాలికుడు. ఇతడు గొప్ప పరిపాలనాదక్షుడు. విజేత. కన్ ఫ్యూషియన్ మతాభిమాని. కళాపోషకుడు. చీనా భాషానిఘంటువును, విజ్ఞానసర్వస్వము (Encyclopedia) ను తయారు జేయించెను. ఇతడు మతసహనమును జూపి క్రైస్తవమత ప్రచారకుల నాదరించెను. కాని వారు కుట్రలయందు పాల్గొనుటచే రాజాభిమానముచు కోల్పోయిరి. విదేశీయుల వర్తక, మతప్రచారముల నరికట్టుచు కఠిన ఆంక్షలు విధింపబడెను. కంగ్ హి చీనాపై దండెత్తివచ్చిన రష్యనుల నోడించి తరిమివేసెను. రెండురాజ్యములకు సరిహద్దులు నిర్ణయింపబడెను. ఒండొరుల ఆస్థానములలో రాయబారుల నేర్పరచుకొని మైత్రిని పాటించిరి. చియాన్ లంగ్ టర్కిస్థాన్, టిబెట్ లను చీనాసామ్రాజ్యమున జేర్చెను. టిబెట్ పై దండెత్తివచ్చిన నేపాళీయులను తరిమి

వేసెను. ఇతడు విదేశీయుల వర్తకముపై ఆంక్షలను కఠినతరము గావించెను. తూర్పుఇండియా కంపెనీకి నల్లమందు వర్తకమునకు సౌకర్యములను కల్పింపుమని ఇంగ్లండురాజగు జార్జి III ఒక రాయబారవర్గము నంపెను. కాని చీనాచక్రవర్తి వారి కోర్కెలను తీర్చుటకు నిరాకరించెను.

మంచూల కాలమున చీనాపరిశ్రమ అత్యున్నతస్థానము నందెను. పింగాణీ సామగ్రి యూరోపియనుల దృష్టి నాకర్షించెను. వారు ఈ మంటికి, వస్తువులకు చీనా పేరు విశేషణముగా జేర్చిరి (China Clay). జేడ్ (Jade) అను అమూల్య రత్నములపై నగిషీలు చెక్కి అపూర్వమగు వస్తువులను తయారుజేయుటయందును చీనా వారు గొప్ప నైపుణ్యమును సంపాదించిరి.

పోర్చుగీసువారి తరువాత స్పెయిన్, హాలెండు, ఇంగ్లండువారు చీనా దేశమున వర్తకమును జేయవచ్చిరి. కాని చీనావారు యూరోపియనులతో వర్తకమునకు సుముఖత చూపలేదు. బలప్రయోగమున ఫార్మోజాయందు యూరోపియను వర్తక కేంద్రములు వెలసెను. క్రీ. శ. 1816 లో ఆంగ్లరాయబారికి చక్రవర్తి దర్శన మిచ్చుటకు నిరాకరించుటతో ఆంగ్లేయులు చైనాపై దండయాత్ర జరిపిరి. ఇది నల్లమందు యుద్ధము (Opium War) గా ప్రసిద్ధిగాంచెను. ఇందు విజయముగాంచి కాంటన్, షాంగ్‌హై మొదలగు అయిదు చీనా రేవులలో ఆంగ్లేయులు నిరాటంకముగ వర్తకముచేయు సౌకర్యమును పొందిరి. హాంగ్‌కాంగ్ దీవి ఆంగ్లేయుల అధీనమయ్యెను. నాటి నుండి చీనా రాజకీయములలో యూరోపియనులు ప్రముఖపాత్ర వహింపసాగిరి.

అ ధ్యా య ము 12

# ఇంగ్లండు - నియమబద్ధైక ప్రభుత్వము

## 1. రాజు-పార్లమెంటు తగాదా

కలహ కారణములు :— ట్యూడరు వంశరాజులు నిరంకుశు లైనను ప్రజాహిత కార్యములను జేసి వారి మన్ననలకు పాత్రులైరి. ఏడవ హెన్రీ భూస్వాముల అధికారమును తగ్గించి వారినుండి విశేష ముగ ధనమును వసూలు జేసి పన్నులకై పార్లమెంటుపై ఆధారపడ కనే పరిపాలన గావించెను. ఎనిమిదవ హెన్రీ పార్లమెంటును తనచేతి కీలుబొమ్మగ జేసి తన కవసరమగు చట్టములను చేయించెను. ఎలిజబెత్ I పార్లమెంటును తరచు సమావేశపరచకనే పరిపాలన సాగించెను. ఎలిజబెత్ తరువాత ఇంగ్లండు రాజ్యాధిపతులైన స్టూవర్టులును ట్యూడరులవలె నిరంకుశాధికారమును పొంద యత్నించిరి. కాని పరిస్థితు లనుకూలించ లేదు. రాజునకు పార్లమెంటునకు వైరము ప్రారంభమైనది.

మొదటి స్టూవర్టు రాజైన జేమ్సు I నకు రాచరికముపై విపరీత అభిప్రాయము లుండెడివి. రాజు దైవాంశసంభూతు డనియు, అతని అధికారమును ప్రశ్నించుహక్కు ఎవ్వరికిని లేదని జేమ్సువాదము. ఈ హక్కును గుర్తించిన పార్లమెంటు మనుగడయె అంతమగును గాన వారు జేమ్సువాదమును త్రోసిపుచ్చిరి. శాసన విధానమును నిర్ణయింపవలసిన బాధ్యత రాజుదేననియు, రాజు అభీష్టము ననుస రించి పార్లమెంటు శాసనములను చేయవలెనని సూచించెను. చట్టములవలన రాజునకు అధికారము లభించుచున్నదనియు కావున రాజు చట్టబద్ధుడై యుండవలెననియు, చట్టములు ప్రజ లభీష్టము ననుసరించి రూపొందించవలెననియు పార్లమెంటు వాదించెను.

పార్లమెంటునందు అధిక సంఖ్యాకులు ప్రొటెస్టెంట్లు. రాజు కాథలిక్కు మతాభిమాని యగుటచే కాథలిక్కులకు కొన్ని సౌకర్య

ములను గూర్చదలచెను. పార్లమెంటు అభ్యంతరపెట్టెను. రాజు కాథలిక్కు రాజ్యములతో వివాహ సంబంధములు, మైత్రి కోరెను. పార్లమెంటు తన నిరసనను తెల్పెను. విదేశాంగ వ్యవహారములతో పార్లమెంటునకు నిమిత్తములేదని జేమ్సు వాదించెను. గాడ్విన్ అనువాని ఎన్నిక చెల్లనేరదని జేమ్సు అభ్యంతరపెట్టెను. ఎన్నికలలో రాజు జోక్యమును పార్లమెంటు నిరసించెను.

రాజు పదవీస్వీకరణకాలమందు టన్నేజి, పౌండేజిలవలన వచ్చు ఆదాయమును రాజునకు వదలివేయుట ఆచారము. కాని జేమ్సునకు ఆ ధనము చాలక పార్లమెంటును సంప్రదించకనే క్రొత్త పన్నులను విధించెను. ఇది అక్రమమని పార్లమెంటు తన నిరసనను తెల్పెను. దుష్ప్రవర్తనకు లోనైన మంత్రులను, రాజస్నేహితులను (Favourites) శిక్షించుటకు పార్లమెంటువారిపై అభియోగము (Impeachment) లను తెచ్చి విచారింపసాగెను. రాజు పార్లమెంటున కట్టి అధికారము లేదని అడ్డుపడినను పార్లమెంటు తనపనిని నిర్విఘ్నముగ కొనసాగించెను. జేమ్సు నాలుగుమార్లు పార్లమెంటును సమావేశపరచి రద్దుచేసెను.

స్టూవర్టు వంశమున రెండవ రాజైన ఛార్లెసు I తండ్రికన్న ఘనుడనిపించుకొనెను. ఇతని కాలమున రాజు - పార్లమెంటు కలహము తీవ్రరూపము దాల్చి అంతర్యుద్ధమునకు దారితీసెను. ఛార్లెసునకు పార్లమెంటు ఒక సంవత్సరమునకే టన్నేజి, పౌండేజిల నిచ్చెను. రాజునకు అభిమానపాత్రుడగు బకింగ్‌హామ్ ప్రభువుపై అభియోగమును తెచ్చెను. ఛార్లెసు పార్లమెంటును రద్దుచేసెను. ధన మవసరమగుటచే ప్రజలనుండి బలవంతపు అప్పులు (Forced Loans) పుచ్చుకొనెను. ఇవ్వనివారిని కారాగారబద్ధులుగ జేసెను. దేశమునందు సైనికశాసనము (Martial Law) నమలు పరచెను. గృహస్థుల ఇండ్లలో సైనికులనుంచి వారి పోషణ భారమును గృహస్థులపై వైచెను.

**హక్కుల అర్జీ (1628)** :— క్రీ. శ. 1628 లో ఛార్లెసు ఫ్రాన్సు, స్పెయిన్‌లపై యుద్ధమును ప్రకటించి ఆర్థిక సహాయమునకై

పార్లమెంటును సమావేశపరచెను. వారు రాజునకొక హక్కుల విజ్ఞాపనము (The Petition of Rights) ను పెట్టుకొనిరి. పార్లమెంటు అనుమతిలేకుండ ప్రజలపై విధించిన పన్నులు, పుచ్చుకొనిన అప్పులు న్యాయసమ్మతములుగావు. విచారణలేకుండ ప్రజలను బంధించుట అన్యాయము. శాంతిసమయములందు సైనికచట్టము నమలుపరచుట అక్రమము. గృహస్థుల యిండ్లపై సైనికులను తరుముట నీతిబాహ్యమని పార్లమెంటు ఆ పత్రమున ఉల్లేఖించెను. రాజు దానిని పుచ్చుకొనెనే గాని ఆ సూత్రములకు బద్ధుడుకాలేదు. పార్లమెంటునుండి ధనసహాయము పొందిన వెంటనే దానిని రద్దుచేసెను.

ఛార్లెసు పదకొండు సంవత్సరముల నిరంకుశపాలన (The Eleven year's Tyrrany) యందు వెంట్‌వర్తు, లాడ్ అనువారలు రాజునకు ముఖ్య సలహాదారులైరి. ఆదాయాభివృద్ధికై వెంట్‌వర్తు అనేక మార్గములను చూపెను. ఫ్యూడలువ్యవస్థ నామరూపములులేకుండ పోయినను ఫ్యూడలు పన్నులను వసూలుచేసెను. వర్తకులకు గుత్త వ్యాపార హక్కులను విక్రయించెను. నౌకాదళ నిర్మాణమునకై ఓడపన్ను (Ship Money) వసూలు చేసెను. హాంప్టన్ అనునతడు ఓడపన్ను అక్రమమని రాజు మాగ్నకార్టా, హక్కుల అర్జీలలోని షరతుల నతిక్రమించుచున్నాడను ప్రచారమును చేసి ప్రజలలో గొప్ప సంచలనమును కలిగించెను. కాంట్రబరీ ఆర్చి బిషప్ పదవినొందిన విలియం లాడ్ ఇంగ్లండు మతవిధానమున మార్పు తీసికొనిరావలెనని యొక నూతన ప్రార్థనా పుస్తకమును ప్రవేశపెట్టెను. అందలి నిబంధనలు కాథలిక్ మతమునకు దగ్గర సంబంధము కలవిగా నుండుటచే ఇంగ్లండు, స్కాట్లండు ప్రజలు ఆ పుస్తకమును ప్రతిఘటించిరి. లాడ్ ప్యూరిటన్లపై కఠిన ఆంక్షలను విధించుటచే వారు వేలసంఖ్యలో అమెరికాకు వలస పోసాగిరి. స్కాచి వారు యుద్ధమునకు దిగిరి.

పార్లమెంటులో కలతలు:— స్కాచి వారు యుద్ధమునకు దిగుటతో ఛార్లెసు మరల పార్లమెంటును సమావేశపరచవలసి వచ్చెను. మతవిషయమున పార్లమెంటులో భేదాభిప్రాయము

వచ్చెను. రాజు కాథలిక్ స్త్రీని వివాహమాడి, కాథలిక్కులపై అభిమానము జూపుట, ప్యూరిటన్లపై కఠినచర్యలను తీసికొనుట కొందరు పార్లమెంటు సభ్యులకు సహింపరానిదయ్యెను. వారు బిషప్పులనే తీసివేసి మతమునందు సంపూర్ణమైన మార్పులకు తీసి

ఇంగ్లండు
రాజు పాలిత రాష్ట్రములు
పార్లమెంటు పాలిత రాష్ట్రములు
స్కాట్లండు
ఉత్తర సముద్రము
ఐరిష్ సముద్రము
ఇంగ్లీషు ఛానెల్

కొని రావలెనని కాంక్షించిరి. లాడ్ ప్రవేశపెట్టిన మార్పులను తొలగించిన చాలునని కొందరు అభిప్రాయపడిరి. తుదకు పార్లమెంటునందు రెండు పక్షము లేర్పడెను. ఒక పక్షము రాజునకు

అండగా నిలచెను. ప్రభుత్వముపై అధికారము రాజుదా లేక పార్లమెంటుదా యను సమస్యను పరిష్కరించుటకు యుద్ధము తప్పనిసరి యయ్యెను.

అంతర్యుద్ధము (Civil War) :— భూస్వాములలో అధిక భాగము, వారి పలుకుబడిలోనున్న రైతులు రాజపక్షము వహించిరి. ఇది ఆంగ్లికను మతపక్షమని చెప్పనచ్చును. రాజుల పక్షమునకు రాయలిస్టులు అని పేరువచ్చెను. మధ్యతరగతికి చెందిన వర్తకులు, పట్టణవాసులు, కొందరు భూస్వాములు పార్లమెంటేరియను పక్షముగ నేర్పడిరి. నౌకాబలముగూడ వీరి అధీనముననే యుండుట పార్లమెంటునకు అధికబలమును చేకూర్చెను. ధనవంతులగు వర్తకులుండుటచే ఆర్థికలోపము తీరెను. ఇంగ్లండు ఉత్తర, పశ్చిమ భాగములలో రాజునకు, తూర్పు దక్షిణ భాగములలో పార్లమెంటునకు అధిక ప్రాబల్యము లభించెను. 1642 లో ఇరుపక్షములకు యుద్ధము ప్రారంభమైనది. ఎడ్జిహిల్, న్యూబరీ, మార్ స్టన్ మూరు, నేస్బిల కడ ఘోరయుద్ధములు జరిగెను. తుదకు పార్లమెంటునకే విజయము లభించినది. రాజు బందీగ చిక్కెను. దేశమున అశాంతిని ప్రజ్వరిల్ల జేయుచు, రక్తపాతమునకు కారకుడయిన రాజు నేమిచేయవలె ననునది పెద్దసమస్య యయ్యెను. పార్లమెంటు పక్షమునకు నాయకుడై, సైనికుల అభిమానమునకు పాత్రుడైన ఆలివర్ క్రాంవెల్ కామన్స్ సభలో రాజును విచారింపజేసెను. ప్రజలకు, పార్లమెంటునకు ద్రోహము చేసెనను నేరముపై 1649 జనవరి 30 వ తేదీన వైట్ హాల్ భవన ప్రాంగణమున నొక ప్రత్యేక వధ్యశిలపై ఛార్లెసు శిరచ్ఛేదము గావింపబడెను.

## 2. ప్రశాంత విప్లవము

పునఃప్రతిష్ఠ :— 490 మంది సభ్యులుగల పార్లమెంటు నందు రాయలిస్టులు, రాజు శిరచ్ఛేదమునకు ప్రతికూలురైన సభ్యులు పోగా మిగిలిన 90 మంది ప్యూరిటను సభ్యులు ప్రభుత్వాధికారమును హస్తగతమొనరించుకొనిరి. వీరికి రంపు పార్లమెంటు (Rump

Parliament) అను పేరువచ్చెను. వీరు ప్రథమ సమావేశమునందె లార్డ్సుసభను, రాచరికమును రద్దుచేసిరి. 41 సభ్యులుగల సమితితో కామన్వెల్తు ప్రభుత్వము నేర్పరచిరి. కాని వారు న్యూమోడలు సైన్యాధిపతుల ఆజ్ఞానువర్తులై నడువవలసివచ్చెను. రిపబ్లిక్ పరిపాలన సరిగలేకుండుటచే క్రాంవెలు సైనికసహాయముతో పార్లమెంటును రద్దుచేసి ఇన్‌స్ట్రుమెంట్ ఆఫ్ గవర్నమెంటు (Instrument of Government) అను రాజ్యాంగచట్టమును తయారుచేసెను. ఇంగ్లండు, స్కాట్లండు, ఐర్లండులకు ప్రాతినిధ్యమును వహించు కామన్సుసభ నేర్పరచుటకును, లార్డు ప్రొటెక్టరు (Lord protector) రాజ్యసమితి సలహాతో పరిపాలన సాగించునట్లును ఏర్పాటుగావించెను. 1653 డిశంబరులో ఆలివరు క్రాంవెలు ప్రొటెక్టరుగా ఎన్నికయై ప్రొటెక్టరేటు పరిపాలనను స్థాపించెను. కాని ఈ ప్రభుత్వముగూడ సాగలేదు. 1656 లో మరల లార్డుసభ ఏర్పరుపబడినది. క్రాంవెలు అనంతరము వాని కుమారుడగు రిచర్డు ప్రొటెక్టరు పదవినందెను. కాని ఇతనికి సైనికాధికారులతో పొత్తు కుదరక తన పదవిని పరిత్యజించెను. సేనాధిపతులు మరల రంపు పార్లమెంటును పిలిపించి రిపబ్లిక్‌ను స్థాపించిరి. మాంక్ నాయకత్వమున స్కాచి సైన్యము న్యూమోడలుసైన్యము నోడించి క్రొత్త పార్లమెంటును సమావేశపరచెను. ప్రజాభిప్రాయము ననుసరించి పార్లమెంటు ఛార్లెసు I కుమారుడగు రెండవ ఛార్లెసును ఆహ్వానించి 1660 లో రాచరికమును పునఃప్రవేశపెట్టెను.

**ప్రశాంత విప్లవము (1688):—** పునఃప్రతిష్ఠవలన సింహాసనమును పొందిన ఛార్లెసు II తన కాథలిక్కు మతాభిమానమును బాహాటముగ ప్రకటించుకొనక మెలకువతో ప్రవర్తించెను. పార్లమెంటును సంతృప్తిపరచుటకై క్లారెండన్ చట్టము నంగీకరించెను. కాని 1681 నుండి ఫ్రెంచిరాజగు లూయి XIV చేసిన ఆర్థిక సహాయముతో పార్లమెంటును సమావేశపరచకయె నిరంకుశపాలన సాగించెను. కాథలిక్కులకు ఉన్నతోద్యోగములనిచ్చి వారికి మతస్వాతంత్ర్యము కలిగించుటకై ప్రయత్నించెను. ఛార్లెసు

అనంతరము 1685 లో వాని సోదరుడగు జేమ్సు II సింహాసన మధిష్ఠించి ఇంగ్లండును కాథలిక్కు రాజ్యముగ మార్చుటకు, రాజుల నిరంకుశాధికారమును పునరుద్ధరించుటకు ప్రయత్నించెను. సస్పెండింగ్ (Suspending), డిస్పెన్సింగ్ (Dispensing) అను విశేష అధికారములతో కాథలిక్కులపై నున్న ఆంక్షలను తొలగించి, ఉన్నతాధికారులుగ నియమించెను. లండను నగరవాసులను భయపెట్టుటకై నగర సరిహద్దులలో గొప్ప సైన్యమును నిలిపెను.

జేమ్సు అనంతరము ప్రొటెస్టెంటగు మేరీ సింహాసన మెక్కునని ప్రజ లూరట కలిగియుండిరి. కాని 1688 లో జేమ్సునకు పుత్రుడు కలిగెనను వార్త ప్రజలను దుఃఖసాగరమున ముంచివేసెను. పార్లమెంటులోని రెండు పక్షములవారు ఏకమై నెదర్లాండ్సు పాలకుడగు విలియమును భార్యయగు మేరీతో ఇంగ్లండునకు వచ్చి సింహాసన మధిష్ఠింపుమని ఆహ్వానించిరి. విలియము పెద్ద సైన్యముతో వచ్చి దిగెను. రాజున కండగ నిలచువారే లేరైరి. నిస్సహాయుడైన జేమ్సు ఆలుబిడ్డలతో దేశమువదలి పారిపోయెను. విలియమ్ మేరీలు ఇంగ్లండుసింహాసన మధిష్ఠించిరి. రాచరికమును నియమబద్ధముగ చేయుటకై హక్కుల చట్టము రూపొందించబడినది. రక్తపు బొట్టు చిందించకనే గొప్ప పరివర్తన కలుగుటచే నిది ప్రశాంత విప్లవము (Bloodless Revolution) అని పేర్గాంచినది.

హక్కుల చట్టము (1689):— విలియమ్ మేరీలు అధికారమును స్వీకరింపగనే గ్రేటుబ్రిటనున కొక హక్కుల చట్టమును ప్రసాదించిరి. దాని ననుసరించి విలియమ్ మేరీలకు సంతతిలేక పోయిన వారి తరువాత ఆనీ వారసురాలుగ నిర్ణయింపబడెను. కాథలిక్కులుగాని, కాథలిక్కులను వివాహమాడినవారు గాని సింహాసనార్హులుగారని వక్కాణించబడెను. రాజు సస్పెండింగ్, డిస్పెన్సింగ్ మొదలగు విశేషాధికారములను చెలాయించుట, హైకమీషన్ మొదలగు ప్రత్యేక న్యాయస్థానములను నెలకొల్పుట న్యాయసమ్మతము గాదని నిర్దేశింపబడెను. పార్లమెంటు అనుమతిపొందని పన్నులను వసూలుచేయుట, ఎన్నికలలో జోక్యము కల్పించుకొనుట,

ప్రజల వాక్ స్వాతంత్ర్యమునకు భంగము కలిగించుట నిషేధింపబడెను. శాంతిసమయములందు రాజు సైన్యము లుంచరాదని శాసింపబడెను.

ఈ చట్టముతో రాజుల అధికారము నియమబద్ధము చేయబడెను. శత్రుభయమువలన రాజ్యమున కొంత సైన్యముంచుట అవసరమగుటచే పార్లమెంటు సైనికశాసనము (Mutiny Act) ను చేసెను. దాని ననుసరించి రాజు సైన్యముల నుంచుకొనుటకు ప్రతి సంవత్సరము పార్లమెంటు అనుమతి పొందవలెనని శాసింపబడెను. మంత్రులు సంవత్సరమున కవసరమగు ఖర్చులను అంచనావేసి పార్లమెంటునందుంచిన వారు దాని కనుగుణముగ పన్నులను మంజూరు చేయు ఆచార మేర్పడుటచే రాజు పార్లమెంటును ప్రతి సంవత్సరము సమావేశపరచుట తప్పనిసరి యయ్యెను. త్రైవార్షిక చట్టము (1694) ననుసరించి ప్రతి మూడు సంవత్సరముల కొకసారి ఎన్నికలను జరిపించి క్రొత్త పార్లమెంటును సమావేశపరచవలెనని శాసింపబడెను. దీనివలన ప్రజావిశ్వాసమును కోల్పోయిన పార్లమెంటు సభ్యులు అధికారములోనుండు అవకాశము పోయెను. మత సహన చట్టము (The Toleration Act - 1689) వలన ప్యూరిటన్లకు పూజా స్వాతంత్ర్యము లభించెను. క్రమముగ ఆంగ్లేయులలో మతసహనము వృద్ధి పొంది 19 వ శతాబ్దమున కాథలిక్కులకును పూజా స్వాతంత్ర్యము లభించెను.

## 3. పార్టీప్రభుత్వము - కాబినెట్ విధానము

పార్లమెంటరీ పార్టీలు :— ఛార్లెసు I పక్షము వహించిన వారు రాయలిస్టులు, కెవెలియర్లు అని పిలువబడిరి. రాజునకు వ్యతిరేకులైనవారు పార్లమెంటేరియనులు, లెవెలర్లు అని పేర్కొనబడిరి. రెండవ ఛార్లెసు పరిపాలనాకాలమున ఈ పక్షమునకు క్రొత్తపేర్లు వచ్చెను. రాజు అనుయాయులు రాజపక్షము (Court Party), వ్యతిరేకులు దేశపక్షము (Country Party) అని పేర్కొనబడిరి. రాజపక్షము తన ప్రత్యర్థులను విగులు (తిరుగుబాటుదార్లు–Whigs) అని నిరసించిరి.

దేశపక్షమువారు వారిని టోరీలు (దోపిడిదొంగలు–Tories) అని ఈసడించిరి. ఈ ఎగతాళి పిలుపులే ఆయా పక్షములకు స్థిరపడెను.

టోరీ పార్టీయందు భూస్వామికవర్గము, విగ్గుపార్టీయందు అతివాదులగు ప్రొటెస్టెంట్లు, ధనవంతులగు వర్తకులు అధిక ప్రాబల్యమును పొందియుండిరి. పల్లెపట్టులందు టోరీలు, పట్టణములందు విగ్గులు అధికసంఖ్యాకులుగ నుండెడివారు. పన్నులభారము తమపై బడునని టోరీలు యుద్ధమునకు విముఖులుగ నుండెడివారు. కంట్రాక్టులవలన లాభము పొందవచ్చుననియు, దేశ ప్రతిష్ఠను కాపాడు కొనుటకు యుద్ధము లవసరమని విగ్గులు అభిప్రాయపడెడివారు.

పార్టీ ప్రభుత్వము :— విలియమ్ ప్రథమమున రెండుపార్టీల నుండియు మంత్రులను తీసికొనెను. కాని వారు రాజుతో సహకరించుటకుబదులు ఒండొరులపై కుట్రలు పన్నసాగిరి. పరిపాలన కుంటువడెను. విలియమునకు ఫ్రెంచియుద్ధములకై ధన మవసరమయ్యెను. టోరీలు యుద్ధమునకు ధనమును మంజూరు చేయుటకు వెనుకంజ వేయసాగిరి. ఫ్రెంచిరాజగు లూయీ విజయము గాంచిన మరల స్టూవర్టులు ఇంగ్లండుపాలకులగుదురేమో నని వారితో రహస్యముగ మంతనములను సాగించిరి. ప్రభుత్వమునకు ఋణము నిచ్చియున్న విగ్గు వర్తకులు లూయీ విజయముగాంచిన తమకు ధన నష్టము కలుగునని విలియమ్ విజయమునే కాంక్షించుచు యుద్ధమున కనుకూలముగ ప్రచారము గావించిరి. ఫ్రెంచి దండయాత్రభయము ప్రజలను యుద్ధమునకు సుముఖులుగ జేసెను. పార్లమెంటునకు విగ్గులు అధికసంఖ్యాకులుగ ఎన్నికయైరి. విలియమ్ అధికసంఖ్యాకవర్గమైన విగ్గులనుండియె మంత్రివర్గము నేర్పరచెను. వారు ప్రతిపాదించిన బిల్లులు పార్లమెంటులో సులభముగ అంగీకారము పొందుచుండెడివి. క్రమముగ పార్లమెంటులోని అధికసంఖ్యాకవర్గము నుండియె మంత్రి వర్గము నేర్పాటు చేయుట ఆచారమై, పార్టీ ప్రభుత్వము వచ్చెను.

కాబినెట్ విధానము :— పార్టీనాయకుని మాటకు పార్టీ సభ్యులందరు శిరసావహించుట సహజము. కావున రాజు పార్టీనాయకుని

మంత్రివర్గములోనికి తీసికొనుట తప్పనిసరియయ్యెను. పరిపాలనా సౌలభ్యమునకై పార్టీనాయకునకు అనుకూలురైనవారినే ఇతర మంత్రులుగ నియమించుట అవసరమయ్యెను. పార్టీనాయకుడు ముఖ్యమంత్రి (Chief Minister) అనియు మంత్రిమండలి కాబినెట్ (Cabinet) అనియు పేర్గాంచెను. మంత్రిమండలి పార్టీవిధానమునకు కట్టుబడియుండుటచే కాబినెట్టునకు ఏకాభిప్రాయము, సమష్టి బాధ్యత యేర్పడెను. ఏమంత్రియందైనను పార్లమెంటునకు విశ్వాసము లేకపోయిన మంత్రివర్గము సమష్టిగ రాజీనామా నిచ్చుట ఆచారమయ్యెను. అట్టిసమయములందు రాజు ఎన్నికలను జరిపించి క్రొత్తమంత్రివర్గము నేర్పరచుచుండెడివాడు. ఇదియె కాబినెట్ ప్రభుత్వవిధానము.

ప్రధానమంత్రి :— ఆనీ అనంతరము ఇంగ్లండు హానోవరు వంశీకుల పాలనలోనికి పోయెను. ఈ వంశ ప్రథమరాజైన జార్జి I నకు ఆంగ్లభాషా పరిచయము లేకపోవుటచే కాబినెట్ సమావేశములకు హాజరైనను అందు పాల్గొనజాలకపోయెను. తుదకితడు సమావేశములకు హాజరగుటమానివేసి ముఖ్యమంత్రినే అధ్యక్షపదవిని స్వీకరింపుమని కోరెను. నాటినుండి ముఖ్యమంత్రిబాధ్యతలు హెచ్చి రాజ్యమున ప్రధానవ్యక్తియై ప్రధానమంత్రి (Prime Minister) అను పేరు బడసెను. సర్ రాబర్టు వాల్‌పోల్ మొదటి బ్రిటిష్ ప్రధాని.

రాజు సమక్షమున లేకపోవుటచే మంత్రిమండలికి స్వాతంత్ర్యము హెచ్చి అన్నివిషయములు యథేచ్ఛగ చర్చించి విషయ నిర్ణయము చేయుట కవకాశమేర్పడెను. పరిపాలనా విషయములందు రాజు జోక్యము తగ్గిపోయి ప్రధానమంత్రికి గురుతర బాధ్యత యేర్పడెను. రాజు నామమాత్రుడయ్యెను. మంత్రిమండలి పార్లమెంటునకు బాధ్యత వహించియుండుటచే బాధ్యతాయుత ప్రభుత్వము (Responsible Government) ఏర్పడెను. రాజుల అధికారము పూర్తిగ పార్లమెంటుచే నియమబద్ధము చేయబడుటచే ఇంగ్లండునందు నియమబద్ధక రాచరికము (Constitutional Monarchy) స్థిరపడిపోయెను.

అధ్యాయము 13

# రాజకీయ విప్లవములు

## 1. అమెరికా స్వాతంత్ర్యయుద్ధము

అమెరికా వలసలు :— 15వ శతాబ్దపు భౌగోళిక పరిశోధనల ఫలితముగ నూతన ఖండమయిన అమెరికాయందు అనేక వలసలు వెలసినవి. 17 వ శతాబ్దమునకు అట్లాంటిక్ తీరమునంటి పదమూడు ఆంగ్లవలస లేర్పడినవి. వర్జీనియా, మేరీలాండ్, ఉత్తర కారొలినా, దక్షిణ కారొలినా, జార్జియాలు దక్షిణ మండలముగను. న్యూయార్కు, న్యూజెర్సి, డీలావేర్, పెన్సిల్వేనియాలు న్యూయార్కు మండలముగను, మెసాచుసెట్స్, న్యూహాంప్షైర్, రోడ్ ఐలెండ్, కనెక్టికట్ రాష్ట్రములు న్యూ ఇంగ్లండుగను పేర్కొనబడుచుండెడివి. వివిధ వలసలు విభిన్న ఆచారములను, సంస్కృతులను పెంపొందించుకొని తమ తమ ప్రత్యేకతను ప్రదర్శించుచుండెడివి. కాని ఫ్రెంచివారి భయమువలన వలసరాజ్యములవారు సన్నిహితులై యుండెడివారు. వలసల పాలనకై ఇంగ్లండురాజు గవర్నరులను పంపుచుండెడివాడు. అమెరికావాసులు తమ మాతృదేశముపై అవ్యాజ ప్రేమను ప్రదర్శించెడివారు. పార్లమెంటు శాసనములను శిరసా వహించెడివారు. కాని ఇంగ్లండు అవలంబించిన ప్రాచీన వలసవిధానము (Old Colonial Policy) అమెరికనులకు సహింపరానిదై విప్లవమునకు దారితీసెను.

విప్లవ కారణములు :— అమెరికా వలసలలోని అధిక సంఖ్యాకులు బ్రిటిషుప్రభుత్వముచే హింసింపబడి మత స్వాతంత్ర్యమునకై వలసవచ్చిన ప్యూరిటన్లు, కాథలిక్కులు. వీరికి బ్రిటిషు ప్రభుత్వముపై గాఢాభిమానము లేదనిన సత్యదూరముగాదు. వర్తక వ్యాపారములందు బ్రిటిషు ప్రభుత్వము చూపిన స్వార్థపరత్వము వలన ప్రజల యేహ్యాభావమును పెంపొందించెను. వలసలు మాతృదేశాభి

వృద్ధికే స్థాపింపబడెనను దురభిప్రాయముతో బ్రిటన్ అనేక ఆంక్షలను విధించెను. వలస ప్రజలు తమ సరకులను బ్రిటిషుపడవలలో బ్రిటన్




అమెరికా వలస రాజ్యములు

నకే యెగుమతిచేసి తమకు కావలసిన సరకులను బ్రిటిషు పడవలలో బ్రిటన్నుండియే తెప్పించుకొనవలెనని శాసించెను. బ్రిటన్ మధ్యవర్తి

త్వములేని విదేశవర్తకమును నిషేధించెను. బ్రిటన్ పరిశ్రమలకు మేలొనర్చుటకై వలసలలోని పరిశ్రమలకు ఆటంకములను కల్పించెను. ఈ కఠోర నిబంధనలు వలసరాజ్యములవారికి సహింపరానివయ్యెను.

సప్తసంవత్సర యుద్ధము (1757–63) న ఫ్రెంచివారోడిపోయి కెనడాను ఆంగ్లేయుల వశముగావించిరి. కెనడానుండి ఫ్రెంచివారు తొలగుటతో వలసరాజ్యములకు ఫ్రెంచిదండయాత్రభయ మంత రించినది. తమ రక్షణకై మాతృదేశముపై ఆధారపడి యుండవలసిన అవసరము తీరినది. శత్రుభయము తీరగనే వలసరాజ్యములవారు తమ హక్కులకై పోరాడ సిద్ధపడిరి.

సప్తసంవత్సర యుద్ధానంతరము బ్రిటన్ వలసరాజ్య రక్షణకై కొంత సైన్యమును అమెరికాయందుంచ దలచెను. ఆసైన్య పోషణకగు ఖర్చునేగాక, సప్తసంవత్సర యుద్ధమునకు వెచ్చింపబడిన ధనమును గూడ పన్నుల రూపమున వసూలు జేయదలచి బ్రిటన్ 1765 లో స్టాంపు చట్టము (The Stamp Act) ను ప్రవేశపెట్టెను. వర్తక వ్యాపారములపై ఆంక్షలను కఠినతరము గావించెను. అమెరికా వాసులు ఈ పన్నులను తిరస్కరించిరి. ప్రాతినిధ్యము లేనిదే పన్ను చెల్లింపమనిరి (No taxation without representation). వలసవాదుల ఆందోళన ఫలితముగ బ్రిటన్ 1766 లో తన స్టాంపుచట్టమును రద్దు గావించెను. అనేక యితర పన్నులను గూడ తీసివేసెను. కాని తమకు వలస రాజ్యములలో పన్నువిధించు హక్కు కలదని నిరూపించుటకై తేయాకుపై స్వల్పపన్ను నుంచెను. "పెన్నీ వసూలుచేసినవారు పౌను వసూలు చేయగలరు" అను భావముతో అమెరికన్లు తేయాకు చట్టమును ప్రతిఘటించిరి. దేశభక్తులు తేనీరు సేవించుటే మానివేసిరి.

1773 లో కొందరు మెసాచుసెట్స్‌వాసులు రెడ్ ఇండియన్ వేషధారులై బోస్టన్ రేవునందు ప్రవేశించి 90 వేల డాలర్ల విలువగల తేయాకును సముద్రమున కలిపివేసిరి. ఈ సంఘటన 'బోస్టన్ టీ పార్టీ' అనుపేర చరిత్ర ప్రసిద్ధిగాంచెను. ఈ వార్త ఇంగ్లండు చేరగనే బ్రిటిషు ప్రభుత్వము క్రోధావేశముతో అమెరికన్లను దండింప నిశ్చ యించెను. పీనల్ చట్టమును ప్రవేశపెట్టెను. మెసాచుసెట్స్‌నందు

సైనికపాలన నేర్పరచెను. బ్రిటన్ రాజగు మూడవజార్జి అవలంబించిన నిరంకుశ విధాన ఫలితముగ అమెరికను విప్లవము వర్ధిల్లి, వలస రాష్ట్రములు సుసంఘటితమై, మాతృదేశముపై అభిమానము పూర్తిగ మాసిపోయెను.

అమెరికా స్వాతంత్ర్య యుద్ధము :— క్రీ. శ. 1774 లో పండ్రెండు వలసరాజ్యముల ప్రతినిధులు ఫిలడెల్ఫియాయందు సమావేశమైరి. బ్రిటిషు వస్తువులను బహిష్కరించుటకు, తమ కష్ట నిష్ఠురముల నాలింపనియెడల మాతృదేశముతో తెగత్రెంపులు జేసికొనుటకు నిశ్చయించుకొనిరి. కాని జార్జి వలసరాజ్యములవారి విన్నపమాలింపక బలప్రయోగముచే నైన వారి స్వాతంత్ర్యాభిలాషను అణచివేయ నిశ్చయించెను. అమెరికన్లు యుద్ధమునకు సిద్ధపడిరి. 1775 లో జార్జి వాషింగ్టన్ అను యోధుని తమ విప్లవ సైన్యమునకు సేనానిగా నెన్నుకొనిరి. 1776 జులై 4 న ఫిలడెల్ఫియా కాంగ్రెస్ వలస రాజ్యముల స్వాతంత్ర్యమును ప్రకటించి మాతృదేశముతో సంబంధమును త్రెంచుకొనెను.

బ్రూక్లిన్ యుద్ధమున విజయమంది బ్రిటన్ న్యూయార్కు, న్యూజెర్సిల నాక్రమించెను. ప్రథమమున అపజయముల నందినను వాషింగ్టన్ పట్టుదలను విడనాడక పోరును కొనసాగించెను. 1777 లో సారటోగా యుద్ధమున ఘనవిజయమందెను. 1778 లో ఫ్రెంచివారు, 1779 లో స్పానిష్‌వారు, 1780 లో డచ్చివారు బ్రిటన్‌పై యుద్ధమును ప్రకటించి అమెరికన్లతో చేరిరి. 1781 లో బ్రిటిషు సేనానియగు కారన్‌వాలిస్ యార్కుటౌన్‌కడ లొంగిపోవుటతో యుద్ధ మంతమయ్యెనని చెప్పవచ్చును. ఇందరు శత్రువుల నొక్కమారు ప్రతిఘటించి నిలచుట దుష్కరమని గ్రహించి బ్రిటన్ 1783 లో అమెరికా వలస రాజ్యముల వారి స్వాతంత్ర్యము నంగీకరించుచు యుద్ధమును విరమించెను. జార్జి రాజు మొండి పట్టుదల, మంత్రియగు నార్తు ప్రభువు అసమర్థత బ్రిటన్ ఓటమికి కారణములయ్యెను. జార్జివాషింగ్టన్ దేశభక్తి, కార్యదీక్ష, సహనము, యుద్ధ నైపుణ్యము, సమర్థమగు నాయకత్వము వలసరాజ్యములవారి వాంఛిత మీడేరుటకు మూలకారణమయ్యెనని చెప్పవచ్చును.

యుద్ధఫలితములు :—18, 19 శతాబ్దముల ప్రపంచ చరిత్రపై అమెరికా స్వాతంత్ర్యయుద్ధ ప్రభావము ప్రస్ఫుటము. అమెరికా వలసరాజ్యము లొక రిపబ్లిక్ గా నేర్పడి, రాజుల నిరంకుశాధికారము నుండి విముక్తినొంది ప్రజాస్వామిక ప్రభుత్వ మేర్పరచుకొనుటకు విప్లవ మొక సాధనమని నిరూపించెను. ఐర్లండు, ఫ్రాన్సు, లాటిన్ అమెరికాలలోని రాజకీయ విప్లవములకు అమెరికావిప్లవము మార్గదర్శకమయ్యెను. ఈ యుద్ధ అనుభవముతో ఇంగ్లండు తన ప్రాచీన వలసవిధానమునకు స్వస్తిచెప్పి, తన వర్తకాభివృద్ధికై వలస రాజ్యములను కొల్లగొట్టుటమాని వలసప్రజల ఆర్థికాభివృద్ధికై పాటుబడసాగినది.

అమెరికా సంయుక్తరాష్ట్రములు:— యుద్ధము ముగియగనే 13 రాజ్యములవారు భిన్నస్వతంత్ర రాజ్యముల స్థాపనకై గడంగిరి. 1787 లో ఫిలడెల్ఫియా యందొక మహాసభ గావింపబడెను. చిన్న రాజ్యములు తమ స్వతంత్రమును నిలుపుకొనజాలవనియు, సమష్టి క్షేమమునకు, అభివృద్ధికి ఫెడరల్ ప్రభుత్వ మవసరమనియు వాషింగ్టన్ సలహా నిచ్చెను. బెంజిమిన్ ఫ్రాంక్లిన్, జేమ్సు మెడిసన్, అలెగ్జాండరు హెమిల్టన్ మొదలగు కార్యకర్తల కృషి ఫలితముగ 13 వలసరాజ్యములు ఒక రాజ్యాంగమును రూపొందించుకొని 1789 లో అమెరికా సంయుక్తరాష్ట్రములు (United States of America) అను పేర నొక రిపబ్లిక్ ప్రభుత్వము నేర్పరచుకొనెను. జార్జి వాషింగ్టన్ ప్రథమ అధ్యక్షుడుగ నెన్నుకొనబడెను. నేటి అమెరికా సంయుక్తరాష్ట్రముల రాజధాని నగరమైన వాషింగ్టన్ అమెరికా స్వాతంత్ర్యప్రదాతయైన జార్జివాషింగ్టన్ స్మృతిచిహ్నము.

## 2. ఫ్రెంచి విప్లవము

ప్రపంచ చరిత్రయందు పదునెనిమిదవ శతాబ్దమున ఫ్రెంచి విప్లవము అత్యధిక ప్రాముఖ్యముగల అపూర్వ సంఘటనము. అగ్ని పర్వతము బ్రద్దలైనటుల ఫ్రెంచి విప్లవము విజృంభించి అతిభయానక దృశ్యములతో, అతి సాహసిక కృత్యములతో, నిత్య నూతన పరి

ణామములతో నొప్పారి యూరపు రాజకీయములందు గొప్ప సంచల నము కలిగించెను. ప్రాత ఆచారములు, కట్టుబాట్లు తొలగిపోయి, స్వాతంత్ర్యము, సమానత్వము, సౌభ్రాతృత్వము అను క్రొంగ్రొత్త భావములు ప్రాతిపదికగ నూతన సాంఘిక, రాజకీయ, ఆర్థిక వ్యవస్థ యేర్పడుటతో, ఫ్రెంచి విప్లవము యూరపు చరిత్రగతినే మార్చి వేసెను.

## విప్లవ కారణములు

రాజుల నిరంకుశత్వము :— మధ్యయుగపు ఫ్యూడలు వ్యవస్థ పతనమొంది రాజుల నిరంకుశాధికారము వృద్ధిపొందెను. ఫ్రెంచి రాజులు సుమారు 175 సంవత్సరముల కాలము పార్లమెంటును సమావేశ పరచక యె పరిపాలన గావించిరి. నాల్గవ హెన్రీ భూస్వాముల అధికారముల నంతమొందించి సర్వాధిపత్యమును పొందెను. పదునాల్గవ లూయీ తానే ప్రభుత్వము (I am the State) అని ప్రక టించిన నిరంకుశ ప్రభువు. లూయీ XV, లూయీ XVI లు పదునాల్గవ లూయీ అడుగుజాడలలోనే నడచిరి. కాని ప్రజాభిమాన మును పొందలేకపోయిరి. అందులకు వీరి విదేశాంగ విధానము విఫలమగుటయు నొక కారణముగ పేర్కొనవచ్చును. పదునాల్గవ లూయీ యూరపు యుద్ధములందు పాల్గొని రాజ్యమును సంపా దించుటే గాక ఫ్రెంచి ప్రతిష్ఠను పెంపొందించెను. కాని తరువాతి రాజులు పాల్గొనిన పోలిష్, ఆస్ట్రియా వారసత్వ యుద్ధములు, సప్త సంవత్సర యుద్ధములలో అపజయము కలిగినది. అమెరికాలోని వలసలు శత్రువశమైనవి. భారతదేశమున ఫ్రెంచివారి పలుకుబడి తగ్గిపోయినది. అమెరికా స్వాతంత్ర్యయుద్ధమున పాల్గొనుటవలన ఫ్రెంచిరాజునకు మేలుకంటె కీడే హెచ్చుగ కలిగినది. విదేశాంగ విధానవైఫల్యము, నిరంకుశపాలన ఫ్రెంచిరాజులను ప్రజల సాను భూతికి దూరము చేసెను.

సాంఘిక అసమానత్వము :— ఫ్రెంచి సంఘము అనేక తర గతులుగ విభజింపబడి యుండెడిది. ప్రభువర్గము, మతవర్గము ప్రథమ,

ద్వితీయ స్థానముల నాక్రమించియుండెడివి. వీరు అల్పసంఖ్యాకులైనను అనేక సౌకర్యము (Privileges) లను కలిగియుండెడివారు. విశాల భూభాగములు వీరి అధీనముననే యుండెడివి. వీరికి పన్నులు చెల్లింప వలసిన బాధ్యత లేదు. ఉన్నత ప్రభుత్వోద్యోగము లన్నియు వీరి పరమై యుండెడివి. వర్తకులు, కార్మికులు, కర్షకులు, బానిసరైతులు (Serfs) తృతీయవర్గముగ (Third Estate) నుండెడివారు. ఈ వర్గమున నున్న బుర్జువా (Bourgeoisie) లందు పట్టణవాసులగు న్యాయ వాదులు, వైద్యులు, బాంకర్లు, వర్తకులు చేరియుండెడివారు. వీరు ఉన్నత వర్గములకు గల సౌకర్యములను అవసరమైన బలప్రయోగము చేసియైనను పొందవలెనని కాంక్షించుచుండెడివారు. సంఘమున తుదిమెట్టునందున్న కర్షకులస్థితి కడు శోచనీయముగ నుండెడిది. వీరు రాజునకు పన్నులు, ఫ్యూడల్ ప్రభువునకు కమతము, మతవర్గమునకు మతపన్ను (Tithe - పంటలో పదవవంతు) చెల్లింపవలసి యుండెడిది. వీనికితోడు వెట్టిచాకిరి చేయవలసియుండెడిది. సంవత్సరమంతయు కష్టపడినను తుదకు మిగులునదిలేక రైతు అప్పులపాలై అర్ధాకలితో కాలము గడుపుచుండెడివాడు.

ప్రజల ఆర్థిక దుస్థితి:— ధనవంతులగు ప్రథమ, ద్వితీయ వర్గములవారు పన్నులను చెల్లింపవలసిన అగత్యములేదు. పన్నుల భారమంతయు తృతీయవర్గముపైననే పడుచుండెడిది. పన్నులను విధించుటలో నీతి, న్యాయము పాటింపబడుచుండెడిదికాదు. వానిని వసూలుచేయుటయందును అతికఠినముగ ప్రవర్తించెడివారు. పన్నులను వసూలుచేయు మధ్యవర్తులు ప్రజలనుండి అధికధనమునుపిండి లాభించుచుండెడివారు. రాజ్యమునకు వెన్నెముకయైన రైతులు రాజుల నిరంకుశత్వము, సాంఘిక అసమానత్వమే తమ యిక్కట్టులకు కారణమని గ్రహించి విప్లవమునకు సిద్ధపడిరి.

ఫ్రాన్స్‌నందు కనబడుచున్న లోపములన్నియు నాటి యితర యూరపురాజ్యములందును కలవు. పశ్చిమ యూరపు రాజ్యముల లోని ప్రజలు ఫ్రెంచివారికంటె అధ్వాన్నస్థితిలో నున్నారనిన

అతిశయోక్తి కాదు. కాని ఫ్రాన్స్‌నందే ప్రథమమున విప్లవము వచ్చుటకు కొన్ని యితర కారణములు దోహదమయ్యెను.

భావవిప్లవము:— ఫ్రెంచి విద్వాంసులగు వోల్టేరు, రూసో, పెయిన్, మాంటెస్క్యూ, క్వెస్నీ మొదలగువారు తమ రచనలు, ఉపన్యాసముల ద్వారా ఫ్రెంచిప్రజలలో నొక భావవిప్లవము (Intellectual Revolution) ను తెచ్చిరి. ప్రజల నికృష్టజీవనమునకు రాజుల నిరంకుశత్వము, భూస్వాముల దౌర్జన్యము, మతాధికారుల అవినీతి కారణములని వోల్టేరు ప్రచారముచేసెను. తన వ్యంగ్య రచనల ద్వారా సాంఘిక వ్యవస్థలోని లోపముల నెత్తిచూపెను. బాధ్యతలులేని హక్కులు తగవనియు భూస్వాములు, మతాధికారులు ప్రభుత్వమునకు ముద్దుబిడ్డలైయున్నారనియు తెల్పి నాటి ప్రభుత్వ విధానమును ఖండించెను. ప్రజలకొరకే ప్రభుత్వ మేర్పడినదనియు, ప్రభుత్వము సక్రమమార్గమున నడచుటలేదని తోచిన ఆ ప్రభుత్వమును కూలద్రోసి క్రొత్త ప్రభుత్వము నేర్పరచుకొను హక్కు ప్రజలకు కలదని రూసో సిద్ధాంతీకరించెను. ఫ్రెంచి ప్రజలు నాటి యితర యూరపు రాజ్యములలోని ప్రజలకంటె విజ్ఞానవంతులై యుండుటచే ఈ నూతన సిద్ధాంతములను శీఘ్రముగ గ్రహింప గల్గిరి. స్వాతంత్ర్యము (Liberty) సమానత్వము (Equality) సౌభ్రాతృత్వము (Fraternity) అను భావములకు మిగుల ప్రచారము కల్గి ఫ్రెంచి ప్రజానీకము విప్లవోన్ముఖమయ్యెను.

అమెరికా స్వాతంత్ర్య యుద్ధ ప్రభావము :— ఫ్రెంచి వేదాంతుల సిద్ధాంతములకు అమెరికా వలసరాజ్యములవారి స్వాతంత్ర్య యుద్ధము ప్రత్యక్ష నిదర్శనమయ్యెను. అమెరికా వలస రాజ్యముల విజయము ఫ్రెంచి ప్రజలలో నూతనోత్సాహమును కలిగించెను. ప్రభుత్వ వ్యవస్థను మార్చుటకు విప్లవమే శరణ్యమని ధ్రువపడెను. అమెరికా విప్లవమునందు పాల్గొని స్వదేశమునకు తిరిగివచ్చిన ఫ్రెంచి సైనికులు విప్లవ బీజములను వెదజల్లుటలో మిక్కిలి తోడ్పడిరి. ఫ్రెంచి విప్లవమునకు అమెరికా స్వాతంత్ర్య యుద్ధము నాందియైనది.

లూయీ అసమర్థత :— క్రీ. శ. 1772 లో ఫ్రెంచి సింహాసన మధిష్ఠించిన పదునారవ లూయీ అసమర్థుడు. ఇతనికి స్వీయ అభిప్రాయములే లేవనిన అతిశయోక్తికాదు. భార్య యగు మేరీ ఆంటొనెటి చేతి కీలుబొమ్మయి, ఆమె ఆదేశానుసారము పరిపాలించుచుండెడివాడు. మేరీ తన కిష్టులైనవారిని ఉన్నత పదవులందుంచుచు తన అభిమానమును కోల్పోయిన అభాగ్యులను అథఃపతనమునకు త్రొక్కుచుండెడిది. ధనమును విచ్చలవిడిగ విలాసములకు, విందులకు వెచ్చించుచుండెడిది. మేరీ ఆస్ట్రియా రాకుమార్తె యగుటచే ఫ్రెంచి ప్రజల అభిమానమును చూరగొనలేకపోయెను. తరచు రాజకీయ విషయములందు జోక్యము కలిగించుకొనుచు దేశమున అరాచక పరిస్థితులను కల్పించెను.

లూయీ ఆర్థికదురవస్థ :— తరచు యుద్ధములందు పాల్గొనుటచే ప్రభుత్వము దివాలాతీసెను. జాతీయ ఋణము పెరిగిపోయెను. ప్రజలపై క్రొత్తపన్నులను విధించు అవకాశము కన్పించదయ్యెను. ప్రథమ, ద్వితీయ వర్గములపై పన్నులను విధించుటకు రాజునకు ధైర్యము లేదయ్యెను. ఆర్థిక సంస్కరణలను తలపెట్టిన టర్గాట్ అనుమంత్రి పదభ్రష్టుడయ్యెను. ఎందరు మంత్రులు మారినను ప్రభుత్వ ఆర్థిక దుస్థితిని తొలగింపజాలరైరి. తుదకు లూయీ తన చిక్కులనుండి విముక్తుడగుటకు పార్లమెంటును సమావేశపరుచ వలసి వచ్చెను. 1789 మే లో ఫ్రెంచిపార్లమెంటగు ఎస్టేట్స్ జనరల్ (Estates General) ను సమావేశపరచుటే విప్లవమునకు తక్షణ కారణమయ్యెను.

## విప్లవము

బాస్టెల్ ముట్టడి :— పార్లమెంటులోని ప్రథమ, ద్వితీయ వర్గ ప్రతినిధులు ఏకమై తృతీయవర్గమువారు తలపెట్టిన సంస్కరణలను ప్రతిఘటింపసాగిరి. అధిక సంఖ్యాకులగు తృతీయవర్గ ప్రతినిధులు పార్లమెంటు సమష్టి సమావేశములను జరిపి ఓటింగు తీసికొనవలెనని పట్టుబట్టిరి. రాణి ప్రోద్బలమున రాజు పార్లమెంటును రద్దుచేయ నిశ్చయించెను. కాని తృతీయవర్గమువారు తమ పదవులను విసర్జింప

నిరాకరించి నేషనల్ అసెంబ్లీ యను పేర సమావేశములను జరిపి నూతన రాజ్యాంగమును రచింప పూనుకొనిరి. వారికి మిరబూ నాయకత్వము వహించెను. నేషనల్ అసెంబ్లీని సైనికసహాయముతో అంత మొందింప దలచి లూయీ విదేశసైన్యములను పిలిపించి పారిస్ నగరసమీపమున సమీకరించెను. అందులకు పారిస్ ప్రజలు కోపోద్రిక్తులై 1789 జులై 14 న గుంపులు గుంపులుగ చేరి, రాజుల నిరంకుశాధికారమునకు చిహ్నముగ నున్నదని తలచిన బాస్టైల్ దుర్గమును చుట్టుముట్టిరి. ప్రభుత్వ కారాగారముగ నున్న బాస్టైల్ దుర్గమును వశపరచుకొని ఖైదీలను వదలివేసిరి. బాస్టైల్ ఆక్రమణతో విప్లవము ప్రారంభమయినది.

1789 లో పారిస్ పరిసరములందు ధాన్యమునకు కొరత యేర్పడి కరువు తాండవించినది. దేశములోని ధాన్యమునంతను రాజు కొని నిలువజేయుటచే కరువు వచ్చెనని వదంతి బయలుదేరినది. 1789 అక్టోబరు 5 న కొన్ని వేలమంది పారిస్ వనితలు వర్సెయిల్స్ నగరమునకు పోయి రాజదంపతులను పారిస్ నగరమునకు తోడ్తెచ్చి టూయిలర్స్ భవనమున బందీలుగ నుంచిరి.

లెజిస్లేటివ్ అసెంబ్లీ :— ప్రభుత్వాధికారమును హస్తగత మొనరించుకొనిన నేషనల్ అసెంబ్లీ అనేక సంస్కరణలను చేసి ప్రభుత్వ స్వరూపమునే మార్చివేసెను. పౌరుల హక్కుల ప్రకటన గావించి సాంఘిక, రాజకీయ, ఆర్థికసమానత్వములను చాటెను. చర్చి భూములను లాగికొనెను. అమానుషమగు పన్నులను రద్దు చేసెను. ఫ్యూడల్ నిబంధనలను తొలగించి కర్షకునకు స్వాతంత్ర్యము కల్గించెను. కాగితపు కరెన్సీని చెలామణిలోనికి తెచ్చి రాజ్య ఆర్థిక దుస్థితిని మాన్పెను. ప్రజలకు పూజాస్వాతంత్ర్యమును కల్గించెను. పార్లమెంటు అధికారములను పెంపొందించి నియమబద్ధమైన రాచరికమును ఏర్పరచెను. పరిపాలనా వ్యవహారములను నిర్వహించుటకు లెజిస్లేటివ్ అసెంబ్లీ యను సభ యేర్పరుపబడెను.

నియమబద్ధమైన రాచరిక మేర్పడుటతో ఫ్రాన్సునందు విప్లవ మంత మొందలేదు. అధికారము, పలుకుబడి కోల్పోయిన భూస్వామిక,

మతాధికారవర్గములు తిరిగి తమ పూర్వపు స్థితిని పొందుటకు రహస్యముగ కుట్రలు పన్నసాగిరి. మధ్యతరగతికి చెందిన బూర్జువాలకు పరిపాలనయందు వచ్చిన మార్పులు తృప్తినివ్వలేదు. వారు అతివాదులై అనేక విప్లవసంఘములు (Clubs) గా నేర్పడిరి. అందు జిరాండియనులు (Girondians) జాకొబిన్లు (Jocobins) ముఖ్యులు. రిపబ్లిక్ స్థాపనే వీరి లక్ష్యమై యుండెను. ఇట్టి స్థితిలో లూయీ ఫ్రాన్స్‌నుండి పారిపోవుటకు ప్రయత్నించి, విప్లవసైన్యముచే పట్టుబడెను. రాజదంపతులు పారిస్ నగరమునకు బందీలుగా కొనిరాబడిరి. ఈ వార్త మేరీసోదరుడగు ఆస్ట్రియారాజునకు తెలియగనే అతడుగ్రుడై ఫ్రాన్స్‌పై దండెత్త నిశ్చయించెను. రాజుల దైవాంశసంభూతత్వమును నిలుపుకొనుటకు విప్లవమును అణచివేయుట అవసరమనియు ఫ్రాన్స్‌పై యుద్ధమునకు తనకు తోడ్పడుడని సాటి యూరపురాజుల నర్థించెను. ఆస్ట్రియా, ప్రష్యా రాజులు ఏకమై ఫ్రెంచి విప్లవసైన్యములను సులభముగ ఓడించిరి.

ప్రథమ రిపబ్లిక్ :— డాంటన్ నాయకత్వమున జాకొబిన్లు ఫ్రెంచి అపజయమునకు రాజే కారకుడని ప్రచారముచేసి పారిస్ ప్రజలను రెచ్చగొట్టిరి. నేషనల్ అసెంబ్లీ గత్యంతరములేక 1792 సెప్టెంబరు 21 న రాచరికమును రద్దుచేసి ఫ్రాన్స్‌ను రిపబ్లిక్‌గా ప్రకటించెను. నేషనల్ కన్వెన్షన్ (National Convention) అను సభ నూతనరాజ్యాంగ నిర్మాణమునకు పూనుకొనెను. అతివాదులగు జాకొబిన్లు అధికారమును హస్తగత మొనరించుకొని రాయలిస్టులను వేలసంఖ్యలో ఉరికంబములకు పంపిరి. విప్లవ సైన్యము నూతనోత్సాహముతో పోరాడి వేల్మీ (Valmy) యుద్ధమున ఆస్ట్రియా, ప్రష్యా సైన్యముల నోడించెను. జర్మనీయందు ప్రవేశించి రైన్‌నదీ తీరముననున్న అనేక పట్టణముల నాక్రమించెను. ఆస్ట్రియావారి నెదర్లాండ్సు, సెవాయి రాష్ట్రము విప్లవ సైన్యముల ఆక్రమణలోనికి వచ్చెను.

నేషనల్ కన్వెన్షన్ రాజును విచారించి దేశద్రోహ నేరముపై 1793 జనవరి 20 న ఉరితీయించెను. తొమ్మిదిమంది సభ్యులతో

నొక సభ నేర్పరచి ఫ్రాన్సు శాంతిభద్రతలను కాపాడు భారము అప్పగించెను. రాజునకు సానుభూతి చూపినవారి నందరను గిలటిన్ యంత్రమునకు ఆహుతిచేసి రాక్షస ప్రభుత్వము (Reign of Terror) ను సాగించిరి. జిరాండియనులును జాకొబిన్ల మారణహోమమునకు ఆహుతియైరి. ఈ రాక్షసత్వము భరింపరానిదయ్యెను. ప్రతివారును తమ ప్రాణముల కెప్పుడు ముప్పువచ్చునో యని భయపడసాగిరి. విప్లవమునకు సానుభూతి చూపిన విదేశీయులు విప్లవకారులను రక్త పిపాసులని నిందింపసాగిరి. తుదకు జాకొబిన్ నాయకుడగు రాబిస్పరీని గిలటిన్‌కు బలిచేయుటతో ఫ్రాన్సునందు హత్యాకాండ అంత మొందినది. నూతన రాజ్యాంగ మేర్పరచి అయిదుగురు డైరెక్టర్లతో డైరెక్టరీ (Directory) ప్రభుత్వ మేర్పడినది.

## నెపోలియన్ యుద్ధములు

**నెపోలియన్ విజయములు :—** ఫ్రెంచి విప్లవ ఫలితములలో ముఖ్యముగా పేర్కొనదగినది నెపోలియన్ విజృంభణము. నెపోలియన్ బోనపార్టీ 1769 ఆగష్టు 15 న కార్సికాద్వీపమున జన్మించెను. బ్రిసీ, పారిస్ సైనిక కళాశాలలయందు యుద్ధప్రావీణ్యతను గడించెను. ఫ్రెంచిసైన్యమున నొక సామాన్యసైనికుడుగ చేరి 1793 లో టూలన్ యుద్ధమున ఆంగ్లేయుల నోడించి బ్రిగేడియర్ జనరల్ పదవి నొందెను. డైరెక్టరీ ప్రభుత్వకాలమున అనేక యుద్ధములలో విజయము గాంచి డైరెక్టర్ల మెప్పునొందెను. 1796 లో ఉత్తర ఇటలీపై దండయాత్ర నడుపుటకు సర్వసైన్యాధిపతిగ నియమింపబడెను. ఇటలీనుండి ఆస్ట్రియనులను తరిమివేసి, ఈజిప్టుపై దండెత్తి అలెగ్జాండ్రియాను పట్టుకొనెను. కెయిరో నాక్రమింపగల్గెను. కాని నైలుయుద్ధమున ఫ్రెంచి నౌకాదళము నెల్సన్ అను ఆంగ్లసేనానిచే నోడింపబడెను. ఫ్రాన్సునందు డైరెక్టర్లు ప్రజాభిమానమును కోల్పోవుటచే నెపోలియన్ రహస్యముగ పారిస్ చేరి ప్రజాసహాకారముతో డైరెక్టర్లను త్రోసి పుచ్చి 1802 లో కాన్సలేట్ ప్రభుత్వమును స్థాపించెను. నెపోలియన్ పదేండ్లకాలము కాన్సల్‌గా నియమింపబడెను. 1804 లో కాన్సలేట్


నెపోలియన్ సామ్రాజ్యము
రష్యా
ప్రష్యా
డచ్చీ ఆఫ్ వార్సా
ఆస్టర్లిట్జ్
వియన్నా
ఆస్ట్రియా సామ్రాజ్యము
తురుష్క సామ్రాజ్యము
నల్ల సముద్రము
రీను పరగణా
హాలాండు
ఉత్తర సముద్రము
అట్లాంటిక్ మహా సముద్రము
లండన్
పారిస్
ఫ్రాన్సు
ఇటలీ
మాడ్రిడ్
స్పెయిన్
పోర్చుగల్
కార్సికా
ఎల్బా
సార్డీనియా
సిసిలీ
మెడిటరేనియన్
సముద్రము

ప్రభుత్వమును రద్దుచేసి తానే చక్రవర్తిగ ప్రకటించుకొని ఫ్రెంచి సింహాసన మధిష్ఠించెను. నెపోలియన్ అధికారము యూరపునం దధిక భాగమున చెల్లుచుండెను. రష్యా చక్రవర్తియగు జారు, నెపోలియన్‌తో మిత్రత్వసంధి గావించుకొనెను. ఆంగ్లేయులును యుద్ధమును విరమించి ఎమిన్స్‌కడ సంధిచేసికొనిరి.

నెపోలియన్ పతనము :— నెపోలియన్ గొప్ప ఆశావాది. యూరప్ ఖండమున కంతటికి చక్రవర్తి కావలెనని అతని ఆకాంక్ష. భూమిపై యుద్ధములందు నెపోలియన్‌నకు ఎదురు నిలచువారే లేరైరి. కాని ఆంగ్లేయులు సముద్రాధిపత్యమును కలిగియుండిరి. నెపోలియన్ బ్రిటన్‌పై దండెత్తుటకు గొప్ప నౌకాదళము నేర్పరచెను. కాని 1805 లో నెల్సన్ సేనాని ట్రఫాల్గర్ యుద్ధమున ఫ్రెంచి నౌకాదళ మును పూర్తిగా నాశనమొనరించెను. ఆంగ్లేయుల ఆధిక్యతకు వారి వర్తక వ్యాపారములే కారణమనితలచి నెపోలియన్ కాంటినెంటల్ పద్ధతి (Continental System) ని ప్రవేశపెట్టెను. ఇంగ్లండు సరకులను, ఇంగ్లండు వలసరాజ్యముల సరకులను తన సామ్రాజ్యమునగాని, మిత్ర రాజ్యములందుగాని దిగుమతి చేసికొనరాదని శాసించెను. కాని ఈ పద్ధతివలన నెపోలియన్ మిత్రరాజ్యముల సహకారమును కోల్పో యెను. కాంటినెంటల్ పద్ధతి తుదకితని పతనమునకే కారణమయ్యెను.

బ్రిటన్‌పై ఆర్థిక దిగ్బంధనము కఠినతరము చేయుటకై నెపోలి యన్ స్పెయిన్, పోర్చుగల్‌లపై ప్రాబల్యమును పొందగోరెను. పోర్చుగల్ నెపోలియన్ ఆజ్ఞానువర్తి యయ్యెను. ఒక వారసత్వ తగవును సాకుగాజేసికొని నెపోలియన్ స్పెయిన్ రాజ్యవ్యవహార ములలో జోక్యము కల్పించుకొనెను. వారసుల నిరువురను సమాధాన పరచి రాజ్యమును తన తమ్మునకిప్పించునట్లు చేసెను. కాని స్పానిష్ వారు జాతీయభావము పెనగొన పరపరిపాలనను నిరసించిరి. ఆంగ్లే యుల సహాయముతో ఫ్రెంచి ఆధిపత్యమును త్రోసివేయగల్గిరి. నెపోలియన్, స్పానిష్ జాతీయభావమును అణచివేయలేకపోయెను.

రష్యను జారు కాంటినెంటల్ పద్ధతిని త్రోసిరాజని ఆంగ్లేయు లతో వర్తకవ్యాపారములను సాగించెను. రష్యనులను దండించు

టకై నెపోలియన్ 1812 లో ఆరులక్షల సైన్యముతో మాస్కోపై దండయాత్రనడిపెను. కాని రష్యనులు తమ నగరమును ధ్వంస మొనరించి, ఆహారపదార్థము లందకుండునట్లు చేసి ఫ్రెంచి సైన్యము లకు తినుటకు తిండి నిలువ నీడ లేకుండ జేసిరి. ఫ్రెంచిసైన్యము రష్యను శీతకాలమును చవిచూచి వెనుకకు మరలెను. కాని ఈ అనాలోచిత దండయాత్రవలన 5 లక్షల ఫ్రెంచిసైనికులు హతులైరి. నెపోలియన్ బలము క్షీణించి 1813 అక్టోబరులో లీప్‌జిగ్ యుద్ధమున ఘోర పరాజయము పొందెను. ఇంగ్లండు, ప్రష్యా, రష్యా, ఆస్ట్రియా రాజ్యకూటమి 1814 లో పారిస్‌నందు ప్రవేశించి నెపోలియన్‌చే పదవీత్యాగము చేయించి ఎల్బాద్వీపమునకు ప్రవాసము పంపెను. కాని నెపోలియన్ మరుసంవత్సరమె ఎల్బానుండి తప్పించుకొని పారిస్ చేరి తన సైన్యములను సమీకరించుకొనెను. లిన్నీయుద్ధమున జర్మనుల నోడించి వాటర్లూవద్ద ఆంగ్లేయుల నెదుర్కొనెను. కాని విధి ప్రతికూలమై నెపోలియన్ ఓడిపోయి ఆంగ్లేయుల బందీగ అట్లాంటిక్ సముద్రముననున్న సెంట్ హెలీనా ద్వీపమునకు పంప బడెను. నెపోలియన్ అచటనే తన జీవిత శేషమును గడిపి 1821 లో మరణించెను.

నెపోలియన్ సంస్కరణలు :— పరిపాలనాదక్షత, యుద్ధ నైపుణ్యము మూర్తీభవించిన వ్యక్తులు ప్రపంచచరిత్రలో బహు అరుదు. అట్టివారిలో నెపోలియన్ ప్రముఖుడుగ పేర్కొనదగి యున్నాడు. విజేతగ నితడు ప్రసిద్ధపురుషులగు అలెగ్జాండరు, ఛెంగిజ్ ఖానులతో పోల్చదగియున్నాడు. ఫ్రాన్సును పునరుద్ధరించుటకై యితడు ప్రవేశపెట్టిన సంస్కరణలే యితని పరిపాలనాదక్షతకు ప్రత్యక్ష నిదర్శనములు. నెపోలియన్ కాన్సల్‌పదవి నొంది, ఇరుగు పొరుగు రాజ్యములతో సఖ్యత నేర్పరచుకొని 1799 నుండి 1809 వరకు గల పదిసంవత్సరములలోనె తన ప్రతిభనంతయు ప్రదర్శించెను.

విప్లవఫలితముగ అరాచకముగనున్న రాజ్యమున బలమైన కేంద్రప్రభుత్వ మవసరమని తలచి అధికారమును కేంద్రీకృతము

గావించెను. వివిధ ప్రభుత్వశాఖలను తన అజమాయిషీలోనికి తెచ్చెను. అనుభవశూన్యమై అసమర్థమైయున్న స్థానికపరిపాలనా సంస్థలను రద్దుచేసెను. పరిపాలనాపాటవమునకై ప్రజాస్వాతంత్ర్యమును నిర్లక్షించెను. కాని సాంఘిక సమానత్వమును ధృఢపరిచెను. ఫ్రెంచి సంఘములోని వర్గభేదములను రద్దుచేసి సర్వమానవ సమానత్వమును చాటెను. సివిల్ మిలిటరీ ఉద్యోగములను అందరికి అందుబాటులో నుంచి సమర్థతకు ప్రాధాన్యత నిచ్చెను. 'లీజియన్ ఆఫ్ ఆనర్' అను గౌరవ పతకములతో ఉద్యోగుల ఉత్సాహము నినుమడింపజేసెను.

ప్రజాసహకారమును బడయుటకు వారి ఆధ్యాత్మిక చింతనకు తృప్తికలిగించుట అత్యవసరమని తలచి నెపోలియన్ పోపుతో సఖ్యత నేర్పరచుకొని ఫ్రాన్సునందు కాథలిక్ మతమును పునః ప్రవేశపెట్టెను. ప్రొటెస్టెంట్లకు, యూదులకు పూజా స్వాతంత్ర్యము నొసగి మతసహనమును ప్రదర్శించెను.

నెపోలియన్ క్రోడీకరింపజేసిన శిక్షాస్మృతివలన అతని కీర్తి చిరస్థాయియైనది. దేశములోని వివిధ న్యాయసూత్రములను నొక క్రమపద్ధతిలో క్రోడీకరింపజేసి సివిల్ కోడ్, సివిల్ ప్రొసీజర్ కోడ్, క్రిమినల్ కోడ్, క్రిమినల్ ప్రొసీజర్ కోడ్, కమర్షియల్ కోడ్ అను అయిదు భాగములుగల 'కోడ్ నెపోలియన్' నేర్పరచెను. సులభ గ్రాహ్యమై, సర్వోత్కృష్టమై యుండుటచే నీ శిక్షాస్మృతి యితర యూరప్ రాజ్యములకు ఆదర్శము, అనుసరణీయ మయ్యెను.

ప్రజల ఆర్థికాభివృద్ధికి, సుఖజీవనమునకై నెపోలియన్ అనేక ప్రజోపకర కార్యములను ప్రారంభించెను. రాకపోకల సౌకర్యముల నినుమడింపజేసి వర్తకాభివృద్ధికై పాటుబడెను. పారిస్‌నుండి మిలాన్, నేపిల్స్, రోమ్ మొదలగు పట్టణములకు రోడ్లు వేయించెను. అనేక కాలువలను త్రవ్వించి వ్యవసాయము నభివృద్ధిచేసెను. ఉద్యోగుల లంచగొండితనమును రూపుమాపెను. ప్రభుత్వ వ్యయమునందు పొదుపు, పన్నుల వసూలునందు క్రమపద్ధతి నేర్పరచి రాజ్య ఆర్థిక ప్రతిపత్తికి స్థిరరూపమును కల్పించెను. ఫ్రెంచి బాంక్ (The Bank

of France) ను స్థాపించెను. ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత కళాశాల స్థాయిలలో విద్యాబోధనకు ఒక ప్రణాళిక నేర్పరచియు, అనేక నూతన విద్యాలయములను, గ్రంథాలయములను నెలకొల్పియు ప్రజల సాంస్కృతిక వికాసమునకు శ్రద్ధవహించెను.

నెపోలియన్ యెంతటి సమర్థుడైనను అతని అధికార వ్యామోహామే అతని పతనమునకు మూలకారణమైనది. ఫ్రాన్సు దేశపు సహజ సరిహద్దులతో తృప్తిపడక యూరపునంతటిని తన యేలుబడిలోనికి తెచ్చుకొనవలెననెడి దురాశయే ఆతనిని దునుమాడినది. వానిలోని ఉత్తమ గుణములు మరుగున పడిపోయినవి. కత్తిబలము శాశ్వత ఫలితముల నీయజాలదని నెపోలియన్ చరిత్ర చాటుచున్నది.

## అధ్యాయము 14

# పారిశ్రామిక విప్లవము - పార్లమెంటు సంస్కరణలు

## 1. ఇంగ్లండులో పారిశ్రామిక విప్లవము

పారిశ్రామిక విప్లవము :— సమాజమునందు జరుగు గొప్ప మార్పునే విప్లవ మందురు. యూరపునందు వైజ్ఞానిక పునర్జన్మవలన మానవునకు విమర్శనాత్మకదృష్టి కలిగి, శాస్త్రవిజ్ఞానము పెంపొంది అనేకపరిశోధనలు గావింపబడెను. ఈ పరిశోధనల ఫలితముగ ప్రజల జీవిత విధానమే మారిపోయినది. ఈ మార్పు ఒక ఆకస్మిక సంఘట నగగాక క్రమక్రమముగ సుమారు ఒక శతాబ్దకాలములో రూపొంది నది. కాని ఈ మార్పువలన ప్రాతవిధానమునకు నూతన విధానము నకు హస్తిమశకాంతర ముండుటచే నిది విప్లవముగా పేర్కొనబడు చున్నది. పారిశ్రామికవిప్లవము ప్రథమమున ఇంగ్లండునందు ప్రారంభమై పిదప యూరపులోని యితర దేశములకును వ్యాపించినది.

విప్లవము ఇంగ్లండునందే ప్రథమముగ సంభవించుటకు అనేక అంశములు దోహదపడెను. సప్తసంవత్సర యుద్ధానంతరము ఇంగ్లండు వలసరాజ్యములు, సామంతరాజ్యములు పెంపొంది ఉత్పాదిత వస్తువుల విక్రయమునకు, ముడిపదార్థముల దిగుమతికి సానుకూల మయ్యెను. సామ్రాజ్యవ్యాప్తితోపాటు ఆర్థికలాభము గూడ నొనగూడి అనేక పరిశ్రమలను నెలకొల్పుటకు ఆర్థికస్తోమత లభించెను. పరిశ్రమలకు ముఖ్య అవసరములైన ఇనుము, బొగ్గు, నీటిశక్తి ఇంగ్లండునకు ఇతోధికముగ నున్నవి. ఉత్పాదిత వస్తువులను ప్రపంచ నలుమూలలకు జేర్చుటకు అధిక నౌకాబలము గలదు. ఫ్రాన్సు, ఫ్లాండర్సులలోని ప్రొటెస్టెంటు నేతపనివాండ్రు పూజా స్వాతంత్ర్యము నకై ఇంగ్లండుచేరి బ్రిటన్ పారిశ్రామికాభివృద్ధికి దోహద మొనర్చిరి.

బ్రిటన్ నందలి సౌమ్యశీతోష్ణస్థితి పారిశ్రామికులు సంవత్సరమంతయు ఉత్సాహముతో కృషిచేయుటకు అనుకూలమైయున్నది. ఫ్రెంచి విప్లవము, నెపోలియన్ యుద్ధములలో యూరపు రాజ్యములయందు రాచకీయ అనిశ్చిత పరిస్థితులేర్పడి భయాందోళనలను కలిగించెను. కాని బ్రిటన్‌నందు చక్కని ప్రభుత్వవ్యవస్థ యేర్పడియుండుటచే ఒడుదుడుకులు లేక ప్రభుత్వ రక్షణ, ప్రోత్సాహములతో పరిశ్రమ లభివృద్ధి గాంచినవి.

ముఖ్య పరిశోధనలు, పరిశ్రమలు:— 18 వ శతాబ్ద మధ్య కాలమున పంట మార్పిడి పద్ధతి, మరనాగలి, డ్రిల్ మొదలగు యంత్రములు ప్రవేశపెట్టబడుటతో వ్యావసాయిక రంగమున గొప్ప విప్లవము వచ్చినది. ఉత్పత్తి రెట్టింపయినది. భూమి విలువ హెచ్చినది. భూస్వాములు తమ పొలములనుండి కర్షకులను వెడలగొట్టి పెద్ద పెద్ద క్షేత్రముల నేర్పరచిరి. కర్షకులు పొట్టచేతపట్టుకొని జీవనోపాధి వెదకికొనుచు సమీపనగరములకు చేరసాగిరి. వీరి వలన ఫ్యాక్టరీలకు కార్మిక సమస్య తీరి పారిశ్రామిక విప్లవమునకు ప్రోద్బలము లభించెను.

1733 లో జాన్ కెయిస్ అను నతడు ఫ్లయింగ్ షటిల్ అను నూతనమగ్గమును కనిపెట్టెను. దీనివలన నూలునకు కొరత యేర్పడెను. నూలు ఉత్పత్తి అధికము చేయవలసివచ్చెను. 1764 లో హార్‌గ్రీవ్స్ అను నతడు స్పిన్నింగ్ జెన్నీ అను యంత్రమును కనిపెట్టెను. 1769 లో రిచర్డ్ ఆర్క్‌రైట్ నీటిశక్తిచే నడచు వాటర్ ఫ్రేమ్ అను వడకు యంత్రమును కనిపెట్టెను. 1776 లో క్రాంప్టన్ అనునతడు జెన్నీ, ఫ్రేమ్ సూత్రములను మేళవించి మ్యూల్ అను యంత్రమును ఆవిష్కరించెను. 1785 లో కార్ట్‌రైట్ అతివేగమున నేయు 'పవర్ లూమ్'ను ప్రవేశపెట్టెను. ఇంగ్లండు నేతపరిశ్రమ మిక్కిలి అభివృద్ధి గాంచి వస్త్రోత్పత్తి అనేకరెట్లు పెరిగెను. 1760 లో ఇంగ్లండు సాలునకు 4 మిలియను పౌనుల ప్రత్తిని వినియోగించెడిది. కాని ఈ సంఖ్య 1815 నకు 100 మిలియను పౌన్లు, 1840 నకు 500 మిలి

యను పౌనులకు పెరిగిపోయెను. లాంకషైరు నేతపరిశ్రమకు కేంద్రమయ్యెను.

యంత్రముల వినియోగము హెచ్చుటతో ఇనుము ముఖ్య అవసరమయ్యెను. ఇనుప ఖనిజమునకై గనుల త్రవ్వకము హెచ్చెను. ఖనిజమును కరగించి ఇనుమును తయారు చేయుటకు కర్రబొగ్గును వినియోగించెడివారు. అబ్రహామ్‌డార్బీ అను నతడు కర్రబొగ్గునకు బదులు నేలబొగ్గును వినియోగించి ఇనుము-ఉక్కు పరిశ్రమలో గొప్ప మార్పు తెచ్చెను. బొగ్గుగనులను త్రవ్వుట ప్రారంభమయ్యెను. గనులనుండి వేడిగాలి, నీరు బయటకు తోడివేయుటకు యంత్రములు, ప్రమాదముల నరికట్టుటకు డేవీస్ సేఫ్టీలాంప్ కనిపెట్టబడెను. ఇనుము బొగ్గు దొరకుచున్న ప్రాంతములలో గొప్ప గొప్ప కర్మాగారములు నెలకొల్పబడెను. బర్మింగ్‌హామ్, లాంకషైరు, యార్కుషైరు, న్యూకాజిల్, గ్లాస్గోపట్టణములు పారిశ్రామిక కేంద్రములయ్యెను.

యంత్రములను నడుపుటకు ప్రథమమున గుఱ్ఱములు, పిదప నీటిశక్తి ఉపయోగించెడివారు. నదులలోని నీరు తగ్గిపోయినప్పుడు యంత్రములను నడుపుట దుష్కరమగుచుండెడిది. పిదప ఆవిరిశక్తి వినియోగములోనికి వచ్చెను. ప్రథమమున బొగ్గుగనులలోని నీటిని తోడుటకు ఆవిరిశక్తి ఉపయోగింపబడినది. జేమ్సువాట్ ఈ యంత్రము నభివృద్ధిపరచి ఇతర పరిశ్రమలయందును ఆవిరిశక్తి వినియోగపడునట్లు జేసెను.

పారిశ్రామికాభివృద్ధి ఫలితముగ రాకపోకల సౌకర్యములు హెచ్చెను. సరకుల రవాణాకై మంచిరోడ్లు అవసరమయ్యెను. టెల్‌ఫర్డ్, రెనీ, మెట్‌కాఫ్, మెక్‌ఆడమ్ మొదలగు ఇంజనీర్లు రోడ్డు నిర్మాణమున నూతన పద్ధతులను ప్రవేశపెట్టిరి. ముఖ్య పారిశ్రామిక కేంద్రములు రేవుపట్టణములతో కలుపబడెను. చౌకగ రవాణా చేయుటకు కాలువలు త్రవ్వబడెను. ఆవిరిశక్తితో నడచు బోట్లు కనిపెట్టబడెను. 1815 లో స్టీవెన్‌సన్ ఆవిరిశక్తితో పనిచేయు 'రాకెట్' అను రైలుఇంజనును తయారు చేసెను. 1825 లో ఉత్తర ఇంగ్లండునందు స్టాక్టన్-డార్లింగ్‌టన్ రైలుమార్గ మావిష్కరింప

బడెను. ఇదియె ప్రపంచమున ప్రప్రథమ రైలుమార్గము. 1850 సంవత్సరమునకు ఇంగ్లండునందు రైలుమార్గములు ఒక వలవలె నేర్పడెను. పొగయోడలు కనిపెట్టబడుటతో సముద్రయానముగూడ శీఘ్రతరమయ్యెను. ప్రయాణసౌకర్యములతోపాటు వార్తాసౌకర్యములును పెంపొందెను. 1835 లో విద్యుత్ శక్తిచే పనిచేయు టెలిగ్రాఫ్ పద్ధతి ఆవిష్కరింపబడెను. 1850 లో ఇంగ్లండు ఫ్రాన్సుల మధ్య కేబుల్ వేయబడెను. 1866 లో ఐరోపా అమెరికాలు అట్లాంటిక్ కేబుల్‌తో కలిపివేయబడెను.

19 వ శతాబ్ద మధ్యకాలమునకు యూరపునకు ఇంగ్లండు కర్మాగారమయ్యెను. ఇతర యూరపు రాజ్యములు ఉత్పాదిత వస్తువులకై ఇంగ్లండుపై ఆధారపడి యుండవలసివచ్చెను. తమ తమ దేశములందును పరిశ్రమల నభివృద్ధిచేసికొనవలెనని కాంక్షించిరి. ఇంగ్లండు పెట్టుబడి, సాంకేతిక సహాయములతో బెల్జియం అనేక పరిశ్రమలను స్థాపించుకొనెను. ఫ్రెంచివిప్లవము, నెపోలియన్ యుద్ధములవలన ఫ్రాన్సునందు పరిశ్రమలు వెనుకబడెను. నెపోలియన్ పతనానంతరము గావింపబడిన సంధి ననుసరించి ఖనిజసంపదకు నిలయమైన ఆల్సేస్-లోరైన్ రాష్ట్రము జర్మనీవశమగుటచే ఫ్రాన్స్ వ్యావసాయిక రాజ్యముగనే యుండవలసివచ్చెను. జర్మనీ అనేక చిన్న చిన్న రాష్ట్రములుగ చీలియుండుటచే పరిశ్రమ లభివృద్ధిగాంచలేదు. కాని జర్మనీ ఏకరాజ్యముగ రూపొందిన పిదప అతిశీఘ్రముగ పారిశ్రామికాభివృద్ధిని సాధించినది. క్రమముగ ప్రపంచమంతటను వివిధ పరిశ్రమలు వ్యాపించినవి. ప్రతిదేశమును పారిశ్రామికముగ అభివృద్ధి గాంచుటకు ప్రయత్నించుచున్నది.

పారిశ్రామిక విప్లవ ఫలితములు :—పారిశ్రామిక విప్లవ ఫలితముగ గృహపరిశ్రమల స్థానమున పెద్ద పెద్ద ఫ్యాక్టరీలు వెలసెను. ఉత్పత్తి అనేకరెట్లు పెరిగెను. వస్తువులు అతిచౌకగ ఉత్పత్తి చేయబడసాగెను. వస్తువుల వినియోగము హెచ్చి వర్తక వ్యాపారము లినుమడించెను. దేశ మనతి కాలములోనే భాగ్యవంత మయ్యెను.

వ్యవసాయమునకు ప్రాముఖ్యత తగ్గిపోయినది. పల్లెప్రాంత ప్రజలు పారిశ్రామిక కేంద్రములకు తండోపతండములుగ తరలిపోయిరి. అనేక నూతన పట్టణములు వెలసినవి. కాని ఈ పట్టణములు క్రమపద్ధతిలో నిర్మింపబడకపోవుటచే అనారోగ్యదాయకములై అంటు వ్యాధులకు నిలయములైనవి.

ప్రాతపద్ధతియందు కార్మికుడు తనచే నిర్మితమైన వస్తువును జూచి మనఃశాంతిని పొందెడివాడు. కాని నూతన పద్ధతియందు పని విభాగమువలన కార్మికుడు అట్టి సంతృప్తిని కోల్పోయి యంత్రములలో తానొక యంత్రముగ పనిచేయవలసి వచ్చెను.

ప్రాతపద్ధతియందు కార్మికుడు తన గృహమునే యంత్రాలయముగ జేసికొని, స్వంతపనిముట్లతో వస్తూత్పత్తి జేసెడివాడు. కాని నూతన పద్ధతియందు పెద్ద పెద్ద యంత్రములను నెలకొల్పుట సామాన్య కార్మికునకు అలవిగాని పనియయ్యెను. ధనవంతులగువారు ఫ్యాక్టరీలను నెలకొల్పి కార్మికులకు వేతనములనిచ్చి పనిచేయింపసాగిరి. పెట్టుబడిదారీ వ్యవస్థ యేర్పడినది. పెట్టుబడిదారులు, కార్మికులు అను రెండు ముఖ్యవర్గము లేర్పడినవి. వర్గపోరాట మారంభమైనది. కార్మికసంఘము లేర్పడినవి. సామ్యవాద సిద్ధాంతము ప్రచారమునకు వచ్చినది. ప్రథమమున ప్రభుత్వము పారిశ్రామిక విషయములందు జోక్యము కల్గించుకొనక కార్మిక సంఘములు న్యాయవిరుద్ధములుగా పరిగణించెను. కాని కార్మికుల ఆందోళన ఫలితముగ వారికి సౌకర్యములను కలిగించుటకై ప్రభుత్వము తన విధానమును మార్చుకొని అనేక సంక్షేమ చట్టములను ప్రవేశపెట్టెను. వర్గపోరాటమును రూపుమాపి సామరస్యమును గూర్ప ప్రయత్నించెను. ఫ్యాక్టరీ విషయములను పరిశీలించుటకు ప్రభుత్వోద్యోగులేర్పడిరి.

పారిశ్రామిక విప్లవఫలితముగ మానవునకు కాయకష్టము తప్పినది. యంత్రములను నడిపించు సాంకేతికవిద్య అవసరమైనది. మానవుని జీవిత విధానమే మారిపోయినది. సాహిత్యము, శిల్పము, చిత్రలేఖనము మొదలగు వివిధకళల యందును యంత్రయుగ ప్రభావము ప్రసరించి కాలానుగుణ్యమైన మార్పునొందినవి.

## 2. పార్లమెంటు సంస్కరణలు

**సంస్కరణల ఆవశ్యకత:—** 19 వ శతాబ్దపు బ్రిటిషు చరిత్ర నాటి యూరప్ రాజ్యములవలె విప్లవములతో, అంతఃకలహములతో భయానకముగాక శాంతి, సౌఖ్యములతో ప్రశాంతభరితమై సాంఘిక, ఆర్థిక, రాజకీయ రంగములలో అభ్యుదయ కామియై యున్నది. ప్రశాంత విప్లవ ఫలితముగ రాజు అధికారము నియమ బద్ధమై ప్రజాస్వామిక ప్రభుత్వ మేర్పడినది. కాని నాటి పార్లమెంటు ప్రజలందరకుగాక ధనికులగు భూస్వామిక వర్గమునకు మాత్రమె ప్రాతినిధ్యము వహించు సంస్థగ నుండెడిది. ఏకాధిపత్యము (Monarchy) నకు బదులు ధనికులైన స్వల్పజనాధిపత్య ప్రభుత్వము (Oligarchy) ఏర్పడినదని చెప్పవచ్చును. కావున బ్రిటన్ నందు నిజమైన ప్రజాస్వామిక ప్రభుత్వ మేర్పడ లేదు.

ఆంగ్లికన్ మతస్థులకు మాత్రమె ఓటుహక్కు, ప్రభుత్వోద్యోగములను పొందు అర్హతయుండెడిది. కాథలిక్కులకు, డిసెంటర్లకు, యూదులకు రాజకీయ మతస్వాతంత్ర్యములు లేవు.

ఎన్నికవిధానము బహిరంగ పద్ధతిని జరుగుచుండెడిది. లంచముల నిచ్చుట కెవ్వరును వెనుకాడెడివారుకారు. ఆ యా ప్రాంతముల లోని పెత్తందార్లు తమ పలుకుబడి నుపయోగించియో లేక లంచముల నిచ్చియో తమ యేజెంట్లను గెలిపించుకొనెడివారు. ఒక్కొక్కప్పుడు కొన్ని నియోజకవర్గములు వెలకమ్ముడుబోవుచుండెడివి. వీనిని రాటెన్ బరో (Rotten Boroughs) లని పిలచెడివారు.

పారిశ్రామిక విప్లవ ఫలితముగ వ్యవసాయమునకు ప్రాధాన్యత తగ్గి అనేక పరిశ్రమ లేర్పడెను. ప్రజలు పల్లెలను వదలి తండోపతండములుగ పారిశ్రామిక కేంద్రములకు తరలి పోయిరి. పల్లెలు పాడుబడెను. ప్రాతపట్టణములు జనశూన్యము లయ్యెను. కాని పార్లమెంటునందు ఆ యా ప్రాంతములకు గల ప్రాతినిధ్యమునం దెట్టి మార్పు కలుగ లేదు. భూస్వాములు ఆ యా నియోజకవర్గముల

నుండి తమ కనుకూలురైన వారిని సభ్యులుగా పంపుచుండెడివారు. ఇవి పాకెట్ బరో (Pocket Boroughs) లని పిలువబడెడివి. పారిశ్రామిక కేంద్రములందు నూతనముగ నేర్పడిన పట్టణములు అధిక జనసంఖ్య కలిగిన ప్రాంతములైనను పార్లమెంటునకు ప్రతినిధులను పంపు అవకాశము లేదయ్యెను.

పారిశ్రామిక విప్లవఫలితముగ బ్రిటన్ సాంఘిక వ్యవస్థయందు గొప్ప మార్పువచ్చినది. పరిశ్రమలయందు, వాణిజ్యమందు అధిక లాభములను సంపాదించి కొందరు ధనవంతులైరి. వీరు మధ్యతరగతి వారు (Middle Class) గ పరిగణింపబడిరి. ఇందువలన సంపత్తినిబట్టి తరతమ భేదము లేర్పడియుండెను. భూస్వాములతోపాటు వీరును ప్రభుత్వ కార్యకలాపములందు పాల్గొనుటకు తహతహలాడసాగిరి.

18 వ శతాబ్దాంతమునకు ప్రజలలో గొప్ప ఆందోళన బయలు దేరి పార్లమెంటును సంస్కరింపవలెనని పట్టుబట్టిరి. యంగర్ పిట్, ఛార్లెస్ ఫాక్స్ మొదలగువారు పారిశ్రామిక పట్టణములకు ప్రాతినిధ్యమివ్వవలెనని పోరాడిరి. కాని నెపోలియన్ యుద్ధములవలన ప్రజలు తమదృష్టిని దేశరక్షణపై మరల్చి శాంతము వహించిరి.

మతస్వాతంత్ర్యము :— 1689 లోని మతసహనచట్టమువలన బ్రిటన్‌లోని ఆంగ్లికనేతరులపై ఆంక్షలు తొలగి పూజాస్వాతంత్ర్యము లభించెను. కాని సాంఘిక, రాజకీయ సమానత్వము సిద్ధించలేదు. 1828 లో టెస్టుఆక్టు, కార్పొరేషన్ ఆక్టులను రద్దుచేయుటతో ప్రభుత్వోద్యోగములకు ఆంగ్లికనేతరులును అర్హులైరి. 1829 లో కాథలిక్ ఎమాన్సిపేషన్ చట్టము (Catholic Emancipation Act) ను ప్రవేశపెట్టుటతో కాథలిక్కులకు ప్రొటెస్టెంట్లతో సమానమగు రాజకీయహక్కులు లభించెను. ప్రజలకు రాజకీయ సమానత్వము సిద్ధించినది.

మొదటి సంస్కరణ చట్టము, 1832 :— ప్రజల ఆందోళనను గమనించి లిబరల్ పార్టీ నాయకుడైన గ్రేమంత్రి పార్లమెంటును సంస్కరింప పూనుకొనెను. భూస్వాములు అధిక సంఖ్యాకులుగ

నున్న టోరీలు సంస్కరణ శాసనమును తీవ్రముగ ప్రతిఘటించిరి. తుదకెట్లో 1832 లో పార్లమెంటు సంస్కరణ శాసనము వెలువడి నది. ఈ శాసనము ననుసరించి రాటెన్, పాకెట్ బరోలకు చెందిన 143 స్థానములు రద్దుచేయబడెను. ఆస్థానములు నూతనముగ వెలసిన పారిశ్రామిక పట్టణములకు పంచబడెను. పల్లెలలో 10 పా॥ ఆదాయము వచ్చు భూవసతిగలవారు, 50 పా కవులు వచ్చు ఈనాముదార్లు, పట్టణములలో 10 పా॥ అద్దె వచ్చు గృహ యజ మానులు ఓటర్లుగా నమోదు చేయబడిరి. ఈ చట్టమువలన భూస్వామికవర్గపు గుత్తఅధికారము నశించి ఉన్నత మధ్యతరగతి వారికి (Upper Middle Class) స్థానము లభించెను. ఆందోళనను సాగించిన సామాన్య ప్రజలకు ఏమియు లాభింపలేదు. కాని మొదటి సంస్కరణము ఆమోదింపబడుటతో తరువాతి సంస్కరణములను ప్రవేశపెట్టుటకు అవకాశము లభించినది.

చార్టిస్టుల ఉద్యమము :— రాబర్టు ఓవెన్ మొదలగు ఆదర్శ వాదుల ప్రచారఫలితముగ బ్రిటన్‌నందు కార్మిక సంఘములు వెల సెను. మొదటి సంస్కరణవలన కార్మికులకు ఎట్టి హక్కులు లభింపక పోవుటచే వారు తమ ఆందోళనను తీవ్రతరము గావించిరి. 1838లో విలియం లోవెట్ అను కార్మికనాయకుడు 'పీపుల్స్ చార్టరు' (People's charter) అను పత్రమును ప్రకటించెను. అందు 1. యుక్త వయస్కులైన పురుషులందరకు ఓటుహక్కుండవలెను. 2. రహస్య ఓటింగు పద్ధతి ప్రవేశపెట్టవలెను. 3. కామన్స్‌సభ సభ్యులకు ఆస్తినిబం ధన లుండరాదు. 4. సామాన్యులును సభ్యులగుటకు వీలుగ పార్ల మెంటు సభ్యులకు జీతముల నేర్పాటు చేయవలెను. 5. ప్రతి సంవత్స రమును ఎన్నికలు జరిపింపవలెను. 6. జనసంఖ్యను ప్రాతిపదికగ జేసికొని నియోజకవర్గ విభజన జరుగవలెనని సూచింపబడెను. సరి యైన నాయకత్వము లోపించుటచే చార్టిస్టు ఉద్యమము అణచివేయ బడినది. కాని 19 వ శతాబ్దాంతమున 20 వ శతాబ్దప్రారంభమున బ్రిటన్ ప్రవేశపెట్టిన సాంఘిక రాజకీయ సంస్కరణలకు చార్టిస్టు

ఉద్యమము మూలకారణమై చార్టిస్టుల కోర్కెలన్నియు ఫలస్మృతి నొందినవి.

ఇతర సంస్కరణములు :— విక్టోరియా రాణి పరిపాలనా కాలమున డిస్రేలీ, గ్లాడ్‌స్టన్ అను రాజకీయ వేత్తలు తమ పరిపాలనా దక్షతతో నొక యుగమును సృష్టించిరి. 1867 లో ప్రధానమంత్రిగ నున్న డిస్రేలీ (టోరీ నాయకుడు) రెండవ సంస్కరణ శాసనమును చేసెను. ఈ చట్టము ననుసరించి పట్టణములలోని గృహ యజమానులు, సంవత్సరమునకు 10 పౌనులు అద్దె చెల్లించువారు, పల్లెలలో 12 పౌ॥ ఆదాయము పొందువారు ఓటర్లుగా నమోదు చేయబడిరి. పార్లమెంటు నియోజక వర్గములు పునర్విభజింపబడెను. ఈ చట్టమువలన కార్మికులలో అధికసంఖ్యాకులకు ఓటు హక్కు లభించినది. ఉన్నత మధ్యతరగతివారి ప్రాబల్యము చాలవరకు తగ్గిపోయినది.

ఇంగ్లండులో ఓటర్ల సంఖ్య హెచ్చినను ఎన్నికలలో అవినీతి తగ్గలేదు. కార్మికులు తమ ఓటు హక్కును సద్వినియోగ పరచుకొను అవకాశము లేక ఫ్యాక్టరీ యజమానుల బెదరింపులకు లొంగిపోవలసివచ్చెను. లిబరల్ పార్టీనాయకుడగు గ్లాడ్‌స్టన్ 1872 లో బాలట్ చట్టము ద్వారా రహస్య ఓటింగ్ పద్ధతిని ప్రవేశపెట్టెను. ఎన్నికలలో జరుగు అత్యాచారముల నరికట్టెను.

గ్లాడ్‌స్టన్ మంత్రి 1884 లో ప్రవేశపెట్టిన మూడవ సంస్కరణ శాసనమువలన పల్లెలలోగాని పట్టణములలోగాని 10 పౌనులు ఆదాయము వచ్చువారందరకును ఓటుహక్కు లభించెను. దీనితో బ్రిటన్ జనసంఖ్యలో ఏడింట ఒకవంతునకు ఓటుహక్కు కల్గెను. నియోజకవర్గములను పునర్విభజించి 50,000 ఓటర్ల కొక ప్రతినిధిని పంపు సౌకర్యమును కలిగించెను. ఎన్నికలలో అవినీతిని మాపుటకై ఎన్నికల ఖర్చులకు హద్దుల నేర్పరచెను. కార్మికులకు ఈ శాసనము చాల మేలు కలిగించినది.

ప్రజాభిప్రాయము ప్రతికూలముగ నుండి కామన్సుసభయందు సంఖ్యాబలమును పొందలేకపోయినను ప్రభువులసభయందు అధిక సంఖ్యాకులుగ నుండుటచే కన్సర్వేటివ్ పక్షమువారు తమ అధికార ప్రాబల్యములను నిలబెట్టుకొనగలుగుచుండిరి. తమ కిష్టములేని బిల్లులను త్రోసివేయగల్గుచుండిరి. లిబరల్ పక్ష ప్రభుత్వమున ఆస్క్విత్ మంత్రివర్గమున ఆర్థికమంత్రిగనున్న లాయడ్ జార్జి 1910 లో కొన్ని క్రొత్తపన్నులను సూచించుచు బడ్జెట్టును ప్రతిపాదించెను. ప్రజా సంక్షేమ కార్యక్రమములకై ధనవంతులనుండి అధికపన్నులను వసూలు చేయుటే ఆ బడ్జెట్టు ముఖ్య ఆశయము. కాని ప్రభువులసభవారు బడ్జెట్టును తిరస్కరించిరి. ఆస్క్విత్ మంత్రి ప్రభువులసభ అధికారములను తగ్గించుటకై పార్లమెంటు చట్టము (Parliament Act-1911) ను ప్రవేశపెట్టెను. దీనివలన ఆర్థికసంబంధమైన బిల్లులను ప్రభువులసభ త్రోసివేయరాదనియు, ముమ్మారు కామన్సుసభ ఆమోదమొందిన బిల్లు ప్రభువులసభ ఆమోదము లేకుండనే చట్టము కాగలదనియు శాసింపబడెను. దీనివలన తమ అధికారములు తగ్గిపోవుచున్నను తప్పనిసరియై ప్రభువులసభ ఆమోదించెను. దీనితో కామన్సుసభ ప్రాముఖ్యత హెచ్చెను.

మొదటి ప్రపంచయుద్ధమున బ్రిటిషు స్త్రీలు ప్రభుత్వమున కనేక విధముల సాయపడి విజయమునకు తోడ్పడిరి. ప్రధాన మంత్రిగ నున్న లాయడ్ జార్జి స్త్రీలకును ఓటుహక్కు నిచ్చుటకై 1918 లో నాల్గవ సంస్కరణ శాసనము చేసెను. దీనివలన ఆస్తితో నిమిత్తము లేకుండ 21 సం॥ నిండిన పురుషుడు, 30 సం॥ నిండిన స్త్రీ ఓటు హక్కును పొందిరి. స్త్రీలనుగూడ పార్లమెంటునకు ఎన్నుకొన వచ్చునని సూచింపబడెను. 1928 లో ప్రధానమంత్రిగ నున్న బాల్డ్విన్ ఐదవ సంస్కరణ శాసనముద్వారా వయోజన ఓటింగు పద్ధతిని ప్రవేశపెట్టి 21 సంవత్సరములు నిండిన స్త్రీ పురుషు లందరకు ఓటుహక్కు కలుగజేసెను. దీనివలన బ్రిటన్ జనాభాలో మూడింట రెండు వంతులకు ఓటుహక్కు లభించెను.

# బ్రిటన్-ఆదర్శ ప్రజాస్వామిక ప్రభుత్వము

శ్రేయోరాజ్యము:—వివిధ కాలములలో జరిగిన సంస్కరణ శాసనముల వలన ప్రభుత్వాధికారము సామాన్యప్రజల హస్తగతమైనది. రాజకీయ సమానత్వము సిద్ధించినది. 1911 లో సభ్యులకు జీతముల (400 పౌ॥) నేర్పరచి యుండుటచే పార్లమెంటు సభ్యత్వమును పొందిన బీదవారును తమకాలమంతయు ప్రజాసేవకే వినియోగించుట కవకాశ మేర్పడినది. పార్లమెంటు పదవీకాలమును అయిదు సంవత్సరములకు తగ్గించుటచే ప్రజావిశ్వాసమును కోల్పోయిన పక్షములు ఎక్కువ కాలము అధికారములో నుండు బాధ తప్పినది. నిర్బంధ, ఉచిత ప్రాథమిక విద్యావిధానమును ప్రవేశపెట్టుటవలన ప్రజలు విద్యావంతులై నిజమైన ప్రజాస్వామికమును పొందిరి. సాంఘిక సంక్షేమమునకై ఫ్యాక్టరీచట్టములు, వర్క్‌మెన్స్ కంపెన్సేషన్ చట్టములు, చిల్డ్రిన్స్ చట్టము, పెన్షన్ చట్టము గావింపబడెను. నిరుద్యోగులకు సహాయకారిగ లేబర్ ఎక్ఛేంజి చట్టము ప్రవేశపెట్టబడెను. నేషనల్ ఇన్సూరెన్స్ చట్టము కార్మికుల ఆర్థిక స్థితిని చక్కబరచెను. సత్సాంప్రదాయములతో, ప్రజాసంక్షేమ కార్యక్రమములను కొనసాగించుచు, సాంస్కృతిక వికాసమునకు పాటుబడుచు, బ్రిటిష్ పార్లమెంటు ఆదర్శప్రాయమైనదయ్యెను. బ్రిటన్ శ్రేయోరాజ్యముగ రూపొందెను.

## అధ్యాయము 15

# నూతన జాతీయ రాజ్యములు

## 1. జర్మనీ

వియన్నాకాంగ్రెసు :— ఫ్రెంచి విప్లవ ఫలితముగ వెదజల్లబడిన జాతీయభావ బీజములవలన 19వ శతాబ్దపు యూరపుచరిత్ర గతియే మారిపోయినది. ఒకే భాష, ఒకే సాంప్రదాయములుగల్గిన ఒకజాతి ప్రజలు తమ దేశవ్యవహారములను పరుల యాజమాన్యము, జోక్యము లేకుండ చక్కబెట్టుకొనవలెనను అభిలాషయె జాతీయభావమునకు మూలమంత్రమైనది. ఈ జాతీయభావమును రూపుమాపుటకు చేసిన ప్రయత్నములు విఫలమై, 1830, 1848 లలో విప్లవములు చెలరేగినవి. నూతన జాతిరాజ్యము లేర్పడినవి.

నెపోలియన్ జర్మనీపై దండెత్తునప్పటి కది 349 చిన్న చిన్న రాజ్యములుగ నుండెడిది. నెపోలియన్ వాని నేకముగావించి ఏక రాజ్యముగ రూపొందించెను. వాని నిరంకుశత్వము జర్మనులలో జాతీయభావమును పెంపొందించి సుసంఘటితపరచెను. ప్రష్యా నాయకత్వమున జర్మనులు నెపోలియన్‌ను ప్రతిఘటించి ఫ్రెంచి సార్వభౌమత్వమునుండి విముక్తులైరి. నెపోలియన్ పతనానంతరము సామ్రాజ్యవాదులగు ఆస్ట్రియా, రష్యా, ప్రష్యా, ఫ్రెంచి రాజకీయవేత్తలు క్రీ. శ. 1815 లో వియన్నాయందు సమావేశమై యూరపు రాజకీయములను చక్కదిద్ద యత్నించిరి. ఫ్రెంచి విప్లవ పూర్వ పరిస్థితులను పునఃప్రతిష్ఠింప నిశ్చయించి, యూరపు ప్రజలలో చెలరేగిన జాతీయభావమును విస్మరించి, యూరపురాజ్య విభాగములను చిత్రించిరి. జర్మనీయందు ముప్పదియెనిమిది రాజ్యములుగల నొక సమాఖ్య నేర్పరచిరి. దానిపై ఆస్ట్రియాకు సార్వభౌమత్వమును కట్టబెట్టిరి. కాని ప్రజాస్వామిక సిద్ధాంతములు, అఖండ జర్మనీ అను భావము సర్వవ్యాప్తము కాసాగెను. ఆస్ట్రియా పాలకుడగు మెటర్నిక్

ప్రజా ఉద్యమముల నణచివేయ ప్రయత్నించెనుగాని విఫలుడయ్యెను. 1830 విప్లవము ఈ ఉద్యమకారులకు ప్రోత్సాహము కల్గించినది. 1848 లో ఫ్రాన్సునందు బయల్వెడలిన విప్లవజ్వాలలు జర్మను రాజ్యములందును వ్యాపించినవి. రైను నదీతీరమునుండి డాన్యూబు వరకు విప్లవము విస్తృతి చెందినది. రాజవంశములు గడగడలాడెను. కాని తుదకు విప్లవము అణచివేయబడినది.

జర్మనీ ఐక్యత :—విల్‌హెల్మ్ I ప్రష్యా సింహాసన మధిష్ఠించుటతో జర్మను జాతీయోద్యమ చరిత్రయందు క్రొత్త అధ్యాయము ప్రారంభమైనది. విల్‌హెల్మ్ కడుసమర్థుడు. ఇతనికడ మంత్రిగా చేరిన ఓటోవాన్ బిస్మార్కు రాజకీయతంత్రములలో అపరచాణిక్యుడు. జర్మనీ ఐక్యత సాధించి యూరపు రాజ్యములలో జర్మనీకొక ప్రముఖస్థానము సంపాదింపవలెనని ఇతని ఆశయము. తన ఆశయ సిద్ధికై సామ దాన భేద దండోపాయముల నుపయోగించెను. జర్మను రాజ్యములపై సార్వభౌమత్వమును కలిగియున్న ఆస్ట్రియా నోడించుట ముఖ్యమని తలచి పటిష్ఠమైన సైన్యమును తయారుచేసి సమయమునకై వేచియుండెను.

షెల్‌స్విగ్ (Schleswig), హోల్‌స్టైన్ (Holstein) రాష్ట్రముల విషయమున డెన్మార్కు, ఆస్ట్రియాలకు వివాద మేర్పడి యుద్ధమునకుదిగిరి. బిస్మార్కు ఆస్ట్రియా పక్షమున జేరి డెన్మార్కు నోడించెను. కాని ఆ రాష్ట్రముల పంపకము విషయమున ఆస్ట్రియాతో వివాదము తెచ్చి 1866 లో ఆస్ట్రియా నోడించి షెల్‌స్విగ్, హోల్‌స్టైన్‌లను ప్రష్యా రాజ్యమున జేర్చెను. ఆస్ట్రో-ప్రష్యను యుద్ధమున ఫ్రాన్సు ఇటలీల సహాయము పొందుటలోనె బిస్మార్కు రాజకీయతంత్రజ్ఞత కనబడుచున్నది. ఈ యుద్ధమువలన జర్మనురాజ్యములపై ఆస్ట్రియా సార్వభౌమత్వము తొలగిపోయినది. ఉత్తర రాష్ట్రములవారు ప్రష్యా ఆధిపత్యమును స్వీకరించిరి. ఇరువదియొక్క రాష్ట్రములతో ప్రష్యా నాయకత్వమున 1867 లో 'ఉత్తర జర్మను కాన్ఫెడరేషన్' ఏర్పడినది.

ఆస్ట్రో-ప్రష్యను యుద్ధసమయమున బిస్మార్కు ఫ్రాన్సునకు లక్జెంబర్గు, బెల్జియముల నిప్పింతుమని వాగ్దానము చేసెను. కాని

ఫ్రాన్సునకు ఆ రాజ్యములు దక్కక పోవుటచే మూడవ నెపోలియన్ బిస్మార్కుపై కత్తిగట్టెను. బిస్మార్కు గూడ యుద్ధమునే కోరి యుండుటచే ఫ్రాన్సును కదనరంగమునకు కవ్వించెను. నెపోలియన్ సామ్రాజ్య కాంక్షకు భీతిచెందియున్న దక్షిణ జర్మను రాజ్యముల వారు ఫ్రాంకో-ప్రష్యను యుద్ధమున ప్రష్యాపక్షమున చేరిరి. 1870 లో బిస్మార్కు సెడాన్ యుద్ధమున నెపోలియన్ నోడించి




పారిస్‌ను ముట్టడించెను. ఫ్రెంచి ప్రజలు నెపోలియన్‌ను పదభ్రష్టుని గావించి మూడవ రిపబ్లిక్ నేర్పరచుకొనిరి. జర్మనీకి ఆల్సెస్, లొరైను రాష్ట్రముల నిచ్చి సంధి గావించుకొనిరి. ఇట్టి ఘనవిజయ మును సాధించి బిస్మార్కు 1871 లో విలియము I ను కైజరు (Kaiser) గా ప్రకటించెను. ఆస్ట్రియా రాజ్యము తప్ప మిగత జర్మను రాజ్యములన్నియు విల్‌హెల్మ్ సార్వభౌమత్వమును స్వీక రించెను.

దినదినాభివృద్ధి గాంచుచున్న జర్మనీ ఫ్రాన్సునకు ప్రక్కలోని బల్లెమయ్యెను. ఇంగ్లండు, రష్యాలు జర్మను ఆధిక్యతకు కలతజెంది యుద్ధసమయములందు ఫ్రాన్సునకు అండగా నిలతుమని ప్రకటించిరి. బిస్మార్కు 1879 లో ఆస్ట్రియాతో మిత్రత్వ సంధి గావించుకొనెను. 1882 లో ఇటలీ జర్మనీ స్నేహము నర్థించెను. మూడు రాజ్యములు కలసి నొక కూటమిగా నేర్పడుటతో మధ్య ఐరోపాయందు వారిశక్తి కెదురులేకుండ పోయెను.

జర్మనీ ఐక్యతను సాధించి, యూరపు రాజ్యములలో జర్మనీకొక విశిష్టస్థానమును సంపాదించి బిస్మార్కు ఫలస్మృతి నొందెను. ఇతడనుసరించిన విధానము 'Blood and Iron Policy' అని ప్రసిద్ధి గాంచినది. విలియం I అనంతరము ఫ్రెడరిక్ III సింహాసనమధిష్ఠించి స్వల్పకాలము పాలించెను. అతని అనంతరము విల్‌హెల్మ్ II పట్టాభిషిక్తుడయ్యెను. ఇతడు కడు దురాశాపీడితుడు. మొండిపట్టుదల కలవాడు. ఇతనికడ మంత్రిగా నెగ్గుట దుర్లభమై బిస్మార్కు 1890 లో తన పదవికి రాజీనామా నిచ్చి రాజకీయ రంగమునుండి తొలగిపోయెను. 1898 లో పరమపదించెను.

## 2. ఇటలీ ఐక్యత

ఇటలీలో విప్లవము :—మధ్యయుగమున అనేక చిన్న చిన్న రాజ్యములుగా చీలియుండిన ఇటలీ నెపోలియన్‌చే ఏకరాజ్యముగ రూపొందించబడినది. నెపోలియన్ ఇటలీ ఆక్రమణ ఇటాలియనులలో జాతీయభావమును పెంపొందించుటకు పరోక్షకారణమైనది. వియన్నాకాంగ్రెసు ఇటలీని మరల చిన్న చిన్న రాజ్యములుగ చీల్చి వేసెను. 1815 వ సంవత్సరమునకు సార్డినియారాజు ఆధిపత్యమున పీడ్‌మాంట్, జినోవా, సెవాయి, నైస్ రాజ్యము లుండెను. లంబార్డి, వెనిస్ రాజ్యములు ఆస్ట్రియాచక్రవర్తి పాలనలోనికి పోయెను. పార్మా, మొడీనా, టస్కనీరాజ్యములు ఆస్ట్రియా రాజవంశీకుల పాలనలోనుండెను. రోము, పరిసర రాజ్యములపై పోపు అధికారము వహించి యుండెను. నేపుల్స్, సిసిలీలు వేరొక రాజ్యముగా నేర్పడియుండెను.

ఫ్రెంచివిప్లవఫలితముగను, నెపోలియన్ నిరంకుశపాలనవలనను ఇటాలియనులలో జాతీయత, స్వయంనిర్ణయాధికార భావములు వ్యాపించి యుండెను. పారిస్‌నందు చెలరేగిన 1830, జులై విప్లవము ఇటలీ ప్రజలలోగూడ సంచలనము కలిగించెను. ఆస్ట్రియా ఇటలీలో విప్లవము నణచివేయగల్గెను కాని ప్రజలలో జాతీయభావమును రూపు మాపలేక పోయెను. ఇటలీ స్వాతంత్ర్యమును సంపాదించుటకై దేశభక్తులు బయలుదేరిరి. కార్బొనరీ అను సంస్థ రహస్య సమావేశములను జరుపుచు ఇటలీ ఐక్యతకై ప్రచారముచేయసాగెను. జినోవావాసుడగు జోసెఫ్ మాజినీ 'యంగ్ ఇటలీ' అను ఉద్యమమును బయలుదేరదీసెను. తన రచనలద్వారా, ఉపన్యాసములద్వారా ప్రజలలో జాతీయభావమును పెంపొందించెను. రెడ్ షర్టులను స్వచ్ఛందసైన్యము తయారయ్యెను.

సార్డీనియారాజగు ఛార్లెస్ ఆల్బర్టు జాతీయోద్యమమునకు చేయూతనిచ్చెను. 1848 మార్చి 23 న ఆస్ట్రియాపై యుద్ధమును ప్రకటించి ఆస్ట్రియనులను లంబార్డీనుండి తరిమివేసెను. వెనిస్‌సందొక రిపబ్లిక్ యేర్పరుపబడెను. కాని ఆస్ట్రియా చక్రవర్తి ఆల్బర్టు నోడించి వెనీషియా, లంబార్డీలను మరల పొందగల్గెను. రోమునందు మాజినీ రిపబ్లిక్ స్థాపింప యత్నించి విఫలుడయ్యెను.

ఇటలీ ఐక్యత :— ఆల్బర్టు రాజ్యపరిత్యాగముచేసి తన కుమారుడగు విక్టర్ ఇమాన్యూలును సార్డీనియా గద్దె నెక్కించెను. ఇమాన్యూలు ఇటలీ ఐక్యతను సాధించుటే తన ముఖ్య ఆశయముగ జేసికొనెను. 1852 లో కౌంట్ కవూరు అనునతనిని ప్రధానమంత్రిగా నియమించెను. కవూరు గొప్ప రాజకీయ పరిజ్ఞానముకలవాడు. నియమబద్ధమైన రాచరికమునందు విశ్వాసముకలవాడు. ఇటలీ నేక రాజ్యముగ రూపొందించి తన రాజునకు కట్టబెట్టవలెనని కాంక్షించెను. అందులకు విదేశీయుల సహాయ మవసరమని నమ్మెను. క్రిమియా యుద్ధమున ఇంగ్లండు, ఫ్రాన్సులకు సహాయముగ సైన్యముల నంపి వారి సానుభూతిని బడసెను. ఫ్రెంచిరాజగు నెపోలియన్ III తో రహస్యసంధి గావించుకొని ఆస్ట్రియనుల నోడించుటకు ఫ్రెంచి సైనిక

సహాయమందెను. సెవాయి, నైస్ రాష్ట్రములను నెపోలియన్ కిచ్చుట కొడంబడెను. కవ్వూరు ఫ్రెంచివారి సహాయముతో ఆస్ట్రి



ఇటలీ ఐక్యత

యనులను సాల్ఫెర్నో (Solferino) యుద్ధమున ఓడించి మిలాన్, లంబార్డీల నాక్రమించగల్గెను. కాని సార్డీనియా విజృంభణకు ఈసు

చెంది నెపోలియన్ తన సహాయమును విరమించి ఆస్ట్రియాతో చేరెను. ఈ మిత్రద్రోహమువలన ఇమాన్యూల్ పురోగమించలేక పోయెను. ఆస్ట్రియా మరల వెనిస్ నాక్రమించగల్గెను. లంబార్డీ యందు అధిక భాగము ఇమాన్యూలునకు దక్కెను. 1860 లో పార్మా, మొడీనా, టస్కనీలలోని ప్రజలు తమ ఆస్ట్రియను ప్రభువులను వెడలగొట్టి ఇమాన్యూలు అధిపత్యమును స్వీకరించిరి. దీనితో వెనిస్ తప్ప మిగత ఉత్తర ఇటలీ భాగమంతయు ఇమాన్యూలు పాలనలోనికి వచ్చెను.

నేపుల్స్ రాజ్యమును ఇటలీ రాజ్యమున జేర్చుటకు తోడ్పడినవాడు గారిబాల్డి. ఇతడు మాజినీ శిష్యుడు. గొప్ప వీరుడు, యుద్ధకుశలుడు. విప్లవవాది. ఇతని అభ్యుదయ భావములను, చర్యలను గమనించి ఆస్ట్రియను ప్రభువు వీనిని దేశబహిష్కారము గావించియుండెను. 1848 లో గారిబాల్డి మరల స్వదేశమునకు తిరిగి వచ్చి మాజినీ నెలకొల్పిన 'యువ ఇటలీ' ఉద్యమమందు చేరి రెడ్ షర్ట్సు సైన్యమునకు సేనానియయ్యెను. నేపుల్స్‌రాజు పాలనకు సిసిలీప్రజ లసంతృప్తులై విప్లవమునకు సిద్ధముగానుండిరి. కవూరు గారిబాల్డిని సిసిలీలో జాతీయోద్యమమును నడుపుటకు ప్రోత్సహించెను. సైనికసహాయము చేసెను. గారిబాల్డి వేయిమంది రెడ్ షర్టులతో సిసిలీ చేరెను. సిసిలియనులు వానికి ఘనస్వాగతమిచ్చిరి. గారిబాల్డి నేపుల్స్ సైన్యమును సిసిలీనుండి తరిమివేసి ప్రభుత్వాధికారమును హస్తగత మొనరించుకొనెను. పిదప 25 వేల సైన్యముతో సిసిలీ నుండి బయలుదేరి నేపుల్స్ రాజును తరిమివేసి ఆ రాజ్యమును ఆక్రమించెను. సిసిలీ, నేపుల్స్‌లను ఇమాన్యూలున కప్పగించి తన దేశభక్తిని చాటెను. 1861 వ సంవత్సరమునకు వెనిస్, పోపు రాష్ట్రములు తప్ప ఇటలీలోని మిగత భాగమంతయు ఇమాన్యూలు అధికారములోనికి వచ్చెను. ఇమాన్యూలు ఇటలీరాజుగా ప్రకటింపబడెను. టురైన్ రాజధానినగరముగ చేయబడెను.

1866 లో ఆస్ట్రో-ప్రష్యను యుద్ధమున కవూరు ప్రష్యనులతో చేరి ఆస్ట్రియాతో పోరాడి వెనిస్‌ను దక్కించుకొనెను. 1870 లో

ఫ్రాంకో-ప్రష్యాను యుద్ధము ప్రారంభమైనది. నెపోలియన్ రోము లోని ఫ్రెంచి సైన్యములను యుద్ధరంగమునకు తరలించెను. ఇదే తగిన సమయమని ఇమాన్యూలు తన సైన్యములతో రోమునందు ప్రవేశించెను. ఇంతటితో ఇటలీ ఏకరాజ్యముగ రూపొంది ఐక్య ఇటలీకి రోము రాజధానియైనది. మాజినీ ప్రబోధము, విక్టరు ఇమాన్యూలు సమర్థత, కవూరు తంత్రజ్ఞత, గారిబాల్డి నిస్వార్థదేశభక్తి ఇటలీ ఏకరాజ్యమగుటకు కారణము లయ్యెనని చెప్పవచ్చును.

## 3. బాల్కన్ రాజ్యములు

టర్కిష్ సమస్య (The Eastern Question) :— రెండవ మహమ్మదు కాలమున క్రీ. శ. 1453 లో కాన్‌స్టాంటినోపిల్ తురుష్కుల వశమైనది. క్రమముగ గ్రీసు, సెర్వియా, బాస్నియా, ఆల్బేనియా, వాలేషియా, మాల్డేవియా, క్రిమియాలు తురుష్క పాలనలోనికి పోయెను. సొలేమాన్ కాలమున హంగరీయం దధిక భాగము తురుష్క సామ్రాజ్యమున జేర్చబడినది. కాని 19 వ శతాబ్దమున ఆటొమన్ తురుష్క సామ్రాజ్యము పతనావస్థనొందినది. బాల్కన్ ద్వీపకల్పములోని క్రైస్తవరాజ్యములు తురుష్క పాలననుండి విముక్తిపొందుటకు ప్రయత్నింపసాగినవి. సామ్రాజ్యము విచ్ఛిన్నమగుట తథ్యమని తోచగనే యూరపులోని వివిధరాజ్యములు టర్కీ సమస్యలో తలదూర్చి లాభము పొందగోరెను. మధ్యధరాసముద్ర ప్రవేశమును పొందుటకై రష్యా తీవ్రముగ యత్నింపసాగెను. బాల్కను రాజ్యములలో స్వాతంత్ర్యేచ్ఛను పురికొల్పి టర్కీనుండి విడివడునట్లుజేసి వానిని తన ప్రాబల్యముక్రింద నుండునట్లు జేయవలెనని ఆశించెను. ఆసియా ఐరోపాలలో అఖండసామ్రాజ్యమును పొందియున్న రష్యా మధ్యధరాసముద్రాధిపత్యమును పొందిన యెడల యూరపునందు మిక్కిలి బలవత్తరమైన రాజ్యముగ రూపొందుననియు, భారతదేశముపైగూడ దండయాత్ర జరుపగలదనియు తలచి బ్రిటన్ టర్కీసామ్రాజ్యమును నిలబెట్ట యత్నించెను. 19 వ శతాబ్దమంతయు టర్కీసమస్యతోనే యూరపురాజ్యములు కలవరపడెను.

బాల్కన్ రాజ్యముల స్వాతంత్ర్యేచ్ఛ :— బాల్కన్ రాజ్యములలో ప్రథమమున స్వతంత్రపాలన పొందిన రాజ్యము సెర్వియా. 1821 లో గ్రీకులు తిరుగుబాటొనరించిరి. ఇది గ్రీకు స్వాతంత్ర్య యుద్ధముగ పరిణమించినది. తుదకు బ్రిటన్, ఫ్రాన్సు, రష్యాలు గ్రీకులకు సాయముగా వచ్చుటతో 1829 లో స్వతంత్ర గ్రీసురాజ్య మేర్పడినది. బాల్కన్ ద్వీపకల్పవాసులు, రష్యనులు స్లావు తెగకు చెందియుండుటవలనను, ఇరువురు ఒకే మతవిధానము (Greek Orthodox Church) ననుసరించుటవలనను ఒకరిపై నొకరికి గాఢాభిమాన మేర్పడినది. బాల్కను రాజ్యముల స్వాతంత్ర్య సంపాదనకు రష్యా అండగాజేర సంకల్పించినది. 1853 లో టర్కీతో యుద్ధమునకు దిగుటకు రష్యాకు సాకుదొరికినది. జెరూసలెమ్‌నకు యాత్రార్థమై యేగిన క్రైస్తవులను తురుష్కులు బాధించుచున్నారనియు, తురుష్క సామ్రాజ్యములోని క్రైస్తవులను రక్షించు బాధ్యత తనపై నున్నదని ప్రకటించెను. మాల్డేవియా, వాలేషియాల నాక్రమించెను. రష్యా దుడుకుతనమునకు కలతజెంది బ్రిటన్, ఫ్రాన్సులు టర్కీకి అండగా నిలచిరి. ఈ రెండుపక్షముల సంఘర్షణ క్రిమియా యందు కేంద్రీకృతమగుటచే నిది క్రిమియన్ యుద్ధము (1854-56) గా పేర్గాంచినది. ఈ యుద్ధఫలితముగ మాల్డేవియా వాలేషియాలు రుమేనియా యనుపేర టర్కీ సార్వభౌమత్వమున స్వపరిపాలనగల రాజ్యముగ రూపొందినది.

1875 లో బాస్నియావాసులు తిరుగుబాటుచేసి తురుష్క ఉద్యోగులను హతమార్చిరి. సుల్తాను తిరుగుబాటు నతిక్రూరముగ అణచివేసెను. స్లావులకు జరిగిన అన్యాయమునకు ప్రతీకారముగ రష్యా టర్కీపై యుద్ధము ప్రకటించి ప్లెవ్నా (Plevna) వద్ద ఘన విజయమును గాంచెను. సాన్ స్టెఫెనో (San Stefano) సంధితో రూసో - టర్కిష్ యుద్ధ మంతమైనది. సెర్బియా, మాంటినీగ్రో, రుమేనియాలు స్వతంత్రరాజ్యములైనవి. బల్గేరియా అను నూతన రాజ్య మేర్పరచబడి స్వపరిపాలనగల సామంత రాజ్యముగ నిర్ణయించబడినది. ఈ సంధి సూత్రములు యూరపు రాజ్యములకు ఈసు

కలిగించెను. యుద్ధమేఘము లావరించినవి. కాని 1878 లో బిస్మార్కు యూరపురాజ్యములను బెర్లిన్‌నందు సమావేశపరచి యుద్ధప్రమాదమును తప్పించెను. బెర్లిన్‌సంధి ననుసరించి సెర్బియా, రుమేనియా, మాంటినిగ్రోల స్వాతంత్ర్యము ధ్రువపడినది. ఇంగ్లండు నకు సైప్రస్ అను దీవి లభించినది. బాస్నియా, హెర్జిగోవినా (Herzgovina) లపై ఆస్ట్రియాకు యాజమాన్యము సిద్ధించినది. మాసిడోనియాపై టర్కీ ఆధిపత్య మంగీకరింపబడినది.

బెర్లిన్‌సంధి బాల్కన్ సమస్యలను పూర్తిగ పరిష్కరింప లేక పోయినది. కావున గ్రీసు, బల్గేరియా, సెర్బియాలు కలసి 'బాల్కన్ లీగ్'గా నేర్పడి టర్కీపై యుద్ధమును ప్రకటించెను. మొదటి బాల్కన్ యుద్ధమున బాల్కన్ కూటమికే విజయము లభించినది. 1913 లండన్‌సంధి ననుసరించి టర్కీ యూరపునందు కాన్‌స్టాంటి నోపిల్ తప్ప మిగత రాజ్యభాగమంతయు వదలుకొనెను. కాని రాజ్య పంపకమున బాల్కన్ కూటమిలోని రాజ్యములకు భేదాభి ప్రాయము లేర్పడి రెండవ బాల్కన్ యుద్ధమునకు దారితీసెను. బల్గేరియా సెర్బియాపై దండయాత్ర జరిపెను. మాంటినిగ్రో, గ్రీసు, రుమేనియాలు సెర్బియాకు అండగానిలచి బల్గేరియా నోడించుటకు సాయపడెను. బుఖారెస్టు సంధి (1913) తో రెండవ బాల్కన్‌యుద్ధ మంతమైనది. ఈ యుద్ధఫలితముగ బల్గేరియా విలువైన రాజ్యభాగము లను పోగొట్టుకొనవలసివచ్చెను. బల్గేరియా జర్మనీ పక్షమునచేరెను. మిగిలిన బాల్కన్ రాజ్యములు జర్మనీకి ప్రతిపక్షులుగ నుండవలసి వచ్చెను. బాల్కన్ ద్వీపకల్ప రాజకీయ సమస్యలు ప్రథమ ప్రపంచ యుద్ధమునకు దారితీసెను.

అ ధ్యా య ము 16

# ఆసియా రాజ్యముల జాతీయవికాసము

## 1. జపాను

**జపాను :—** జపాను దేశము ప్రాచీనకాలమున 'యామటో' అని పిలువబడెడిది. మార్కో-పోలో ఈ రాజ్యమును 'చిపాంగో' అని పేర్కొనెను. జపానీయులు షింటోమతస్థులు. ప్రకృతిదేవతలను, పూర్వీకులను పూజించుచుండెడివారు. వీరు యుద్ధప్రియులని చెప్ప వచ్చును. క్రమముగ నీదేశమునకు బౌద్ధమతము వ్యాపించినది. జపాను చక్రవర్తి మికెడో అని పిలువబడును.

కుబ్లాయిఖాన్ నాయకత్వమున మంగోలులు జపానుపై దండ యాత్రలను నడిపిరి గాని విఫలురైరి. సెయింట్ ఫ్రాన్సిస్ క్జావియర్ అను పోర్చుగీసు క్రైస్తవ మిషనరీ జపానునందు క్రైస్తవమతమును ప్రవేశపెట్ట యత్నించెను. కాని జపానీయులు 1641 లో యూరో పియనులను తమదేశమునుండి వెడలగొట్టిరి. నాటినుండి జపాను విదేశీయులు తమ దేశమునందు ప్రవేశించుటగాని, జపానీయులు విదేశముల కేగుటగాని నిషేధించి, యితర దేశములతో సంబంధము లేకుండ కాలముగడిపెను.

రెండు శతాబ్దములవరకు జపాను ఏకాంతవాసమునకు భంగము కలుగలేదు. 1853 లో తిమింగలముల వేటకై బయలుదేరిన అమెరికను నౌకలు గాలివాలునకు జపానుదీవులను చేరెను. కాని జపానువారు అమెరికన్లను తమ దేశమున అడుగిడకుండ నడ్డగించిరి. అమెరికనుల ఆయుధబలమునకు తలయొగ్గి రెండు రేవులలో అమెరికను వర్తక నౌకలకు ప్రవేశానుమతి నొసగిరి. క్రమముగ ఆంగ్లేయులు, ఫ్రెంచి వారు, జర్మనులు, రష్యనులు, డచ్చివారు జపానునందు వర్తక సౌకర్యములను పొందగల్గిరి.

జపానునందు మికెడో పేరునకుమాత్రమె చక్రవర్తిగ నుండెడి వాడు. నిజమైన అధికారము షోగనుల హస్తగతమై యుండెడిది.

షోగను లవలంబించిన నూతన విధానమును భూస్వామికవర్గము తీవ్రముగ ప్రతిఘటించి 1867 లో నొక విప్లవమును బయలుదేర దీసెను. షోగనులు తమ హక్కులను త్యాగముచేసి చక్రవర్తిని సర్వాధికారిగ జేసిరి. ఇట్లు సర్వాధికారమును పొందిన ప్రథమ చక్రవర్తి ముట్సుహిటో.

జపాను విజృంభణ:— ముట్సుహిటో కడు సమర్థుడు. 1867 నుండి 1912 వరకు సుమారు నలుబదిఏడు సంవత్సరములు ఏక చ్ఛత్రాధిపత్యముగ పాలించి జపానును పాశ్చాత్యరాజ్యములతో దీటైనదానినిగ రూపొందించెను. 1871 లో ఫ్యూడలు వ్యవస్థ నంత మొందించి భూస్వామిక వర్గమునకు గల ప్రత్యేక హక్కులను తొల గించెను. ప్రజాస్వామిక సూత్రములతో నొక రాజ్యాంగమును ఏర్పరచి 1890 లో డయట్ (Diet) అను పార్లమెంటును సమావేశ పరచెను. శిక్షాస్మృతిని సంస్కరించెను. సైనిక, నౌకాబలములను సంస్కరించి అభివృద్ధిపరచెను. విదేశీ సాంకేతిక నిపుణుల నాహ్వా నించి జపానీయులకు శిక్షణ నిప్పించెను. ఫ్రెంచి ప్రవీణులు సైన్యము నకు, ఆంగ్లనావికులు నౌకాదళమునకు శిక్షణ నిచ్చిరి. అమెరికన్లు జపానువ్యావసాయిక రంగమున విప్లవాత్మకమైన మార్పులను తెచ్చిరి. పరిశ్రమలయందు నూతనపద్ధతు లవలంబింపబడెను. జపాను విద్యా ర్థులు వివిధదేశములకేగి ఆధునికశాస్త్రములందు పారంగతులై తిరిగి వచ్చి దేశాభ్యుదయమునకు పాటుబడిరి. విశ్వవిద్యాలయములు నెలకొల్పబడెను. రైల్వేలు, టెలిగ్రాఫ్, తంతి తపాలు కార్యా లయములు, వార్తాపత్రికలు ప్రవేశపెట్టబడెను. రేవు లభివృద్ధి చేయబడెను. పోగయోడలు జపాను రేవులకు శోభగూర్చెను. అతిస్వల్పకాలములోనే దేశము అన్నిరంగములయందు గణనీయమైన అభివృద్ధిని సాధించెను. 19 వ శతాబ్దాంతమునకు జపాను ఆధునిక రాజ్యముగ రూపొందినది.

పారిశ్రామికాభివృద్ధినొందిన జపాను అంతర్జాతీయ వర్తక రంగమున ప్రవేశించి యూరపురాజ్యముల వర్తకముపై దెబ్బతీసెను. జపానుపోటీకి ఇంగ్లండు, జర్మనీలు నిలువలేకపోయెను. ఇనుము,

ప్రత్తి మొదలగు ముడిసరకుల సరఫరాకు ఉత్పాదిత వస్తువులకు తగిన విక్రయ సౌకర్యములకు ఒక సామ్రాజ్య మవసరమని గుర్తించి జపాను తన రాజ్యవిస్తరణకై పూనుకొనెను. పొరుగుననున్న చైనా మిక్కిలి బలహీనమైయుండుటచే తన దృష్టిని చైనాపై మరల్చెను. ప్రథమ సైనో-జాపనీసుయుద్ధ (The First Sino-Japanese war 1894-95 ఫలితముగ జపానునకు కొరియా, లియోటంగ్ ద్వీపకల్పము, ఫార్మోజా దీవి దక్కెను. జపాను విజృంభణ యూరోపియనులను కలవరపర చెను. ఆసియా రాజ్యములలో తమ వర్తకమునకు స్వస్తిచెప్పబడునేమో యని వెఱగొందిరి. రష్యా, ఫ్రాన్సు, జర్మనీలు చైనా ఉద్ధారకులుగ బయలుదేరి జపానుపై వత్తిడితెచ్చి లియోటంగ్ ద్వీపకల్పమును వదలుకొనునట్లు చేసిరి. కాని రష్యా 1898 లో లియోటంగ్ ద్వీప కల్పమున తిష్టవేసి మంచూరియా నాక్రమించి, కొరియా సరిహద్దు లలో తన సైన్యమును సమీకరించెను.

1902లో జపాను బ్రిటన్‌తో మిత్రత్వసంధి గావించుకొనెను. తన సైనికబలమును పెంపొందించుకొని 1904 లో రష్యాపై యుద్ధమును ప్రకటించెను. రూసో-జాపనీసు యుద్ధము (1904-5) న జపాను అబ్బురపాటు కలిగించు విజయములను గాంచెను. లియో టంగ్, మంచూరియాలనుండి రష్యను సైన్యములు వెడలగొట్టబడెను. రష్యాఓటమి ప్రపంచ రాజ్యములను దిగ్భ్రాంతులుగ జేసెను. జపాను శక్తిసామర్థ్యములు ప్రపంచమునకు వెల్లడయ్యెను. ఆసియా రాజ్యములు యూరపు రాజ్యములకు తీసిపోవని నిరూపింపబడెను.

యుద్ధానంతరము జపాను వర్తకవ్యాపారము లినుమడించెను. టోకియో, యోకహామా, ఒసాకా, కోబ్, నాగోయా మొదలగు పట్టణములు గొప్ప పారిశ్రామిక కేంద్రములయ్యెను. సైనిక, నౌకా బలములు ఇతోధికముగ పెంచబడెను. మొదటి ప్రపంచయుద్ధమున జపాను మిత్రమండలితో చేరి షాంటుంగ్‌నుండి జర్మనులను వెడల గొట్టెను. యుద్ధానంతరము సంధిసూత్రముల నిర్ణయమున కేర్పడిన అగ్రరాజ్య పంచకమున జపానునకు స్థానమియ్యబడెను.

## 2. చైనా

రాజకీయ చైతన్యము :— 19 వ శతాబ్దమునకు మంచూ రాజుల ప్రాబల్యము క్షీణించి సామ్రాజ్యము పతనోన్ముఖమయ్యెను. రష్యనులు, జర్మనులు, ఫ్రెంచివారు, ఆంగ్లేయులు చైనాయందు వర్తక సౌకర్యములను పొంది తమ అధికార ప్రాబల్యములను పెంచు కొనసాగిరి. పొరుగుననున్న జపాను చైనాపై సార్వభౌమత్వమును సంపాదింప ప్రయత్నింపసాగెను. 1895 లో జపానుతో యుద్ధమున ఓడి కొరియా, లియోటంగ్, ఫార్మోజాలను పోగొట్టుకొనెను. 20 వ శతాబ్దారంభమునకు దేశమున మూడింట రెండువంతుల భాగము విదేశీయుల ప్రాబల్యమున నుండెను. మంచూరాజులు విదేశీయుల వెడలగొట్టజాలరైరి. ప్రజలకు ప్రభుత్వముపై విశ్వాసము తగ్గి పోయెను. ప్రజా ప్రభుత్వ మేర్పడినగాని చైనీయులకు విముక్తి లేదని ఉద్యమములు బయలుదేరెను. 1912 విప్లవ ఫలితముగ చైనా ప్రజాస్వామ్య ప్రభుత్వమును పొందెను. ఈ విప్లవమును సాధించిన వాడు డాక్టర్ సన్ యెట్ సెన్.

సన్ యెట్ - సెన్ :— సన్ యెట్ సెన్ 1866 లో క్వాంగ్ టుంగ్ గ్రామమున నొక రైతు కుటుంబమున జన్మించెను. సెన్ బాల్యమునుండియు అభ్యుదయ భావములను కలిగియుండెడివాడు. హాంగ్ కాంగు వైద్యకళాశాలయందు పట్టభద్రుడయ్యెను. విదేశీయుల దోపిడికి గురియగుచున్న తన దేశమునుగాంచి విచారించెను. మంచూపాలన తొలగించుటకు విప్లవవాదియయ్యెను. క్యుమింగ్ టాంగ్ (Kuomingtong) అను జాతీయ పక్షమును స్థాపించెను. 1895 లో దేశ బహిష్కృతు డయ్యెను. కాని పట్టినపట్టు విడువక ఉద్యమమును కొనసాగించెను. 1912 న దేశమున విప్లవమును బయలుదేరదీసి ప్రజాప్రభుత్వమును స్థాపించెను. యువాన్ షికై మొదటి అధ్యక్షుడుగ నెన్నుకొనబడెను. కాని యితడు దేశపరిస్థితు లను చక్కబెట్టలేకపోయెను. 1917 లో సన్ యెట్ సెన్ ప్రభు త్వాధికారమును వహించెను.

సంస్కరణలు :— ఉత్తర, దక్షిణ చైనాలలో ఐక్యతకల్పించుటకై సన్‌యెట్‌సెన్ అనేక ప్రయత్నములను గావించెను. ఉత్తర ప్రాంతవాసులు యుద్ధోన్మాదులై దేశమున అశాంతి కలిగించుచున్నను సన్‌యెట్‌సెన్ దేశాభ్యుదయమునకై అనేక సంస్కరణలను గావించెను. సంఘమునయున్న దురాచారముల మాన్పెను. లిపిని సంస్కరించి సామాన్య ప్రజలుగూడ విద్యనభ్యసించు అవకాశమును కలుగజేసెను. వ్యవసాయమున నూతన పద్ధతులను ప్రవేశపెట్టి ఉత్పత్తిని పెంచెను. రాకపోకల సౌకర్యముల నినుమడింపజేసెను. వ్యవసాయదారులకు, కార్మికులకు అనేక సౌకర్యములను కలిగించెను. చైనా కొక నూతన రాజ్యాంగమును ప్రసాదించి సన్‌యెట్‌సెన్ 1925 లో దివంగతుడయ్యెను.

## 3. భారత స్వాతంత్ర్యోద్యమము

### ప్రథమ ఘట్టము (1885—1905)

కాంగ్రెసు స్థాపన :— వర్తకమునకై వచ్చిన ఆంగ్లేయులు స్వదేశరాజుల అంతఃకలహములు ఆధారముగ రాజ్యస్థాపన గావించి సుమారు రెండు శతాబ్దముల కాలము పరిపాలించిరి. పరపాలనలో క్రమ్మగిన భారతీయులకు క్రమముగ కనువిప్పు కలిగినది. రాజ్యసంపాదనకై కంపెనీవా రనుసరించిన విధానములు స్వదేశరాజులను సందేహభయోత్పాతులుగ జేసెను. కంపెనీవారు ప్రవేశపెట్టిన సంస్కరణలు ప్రజలలో గొప్ప సంచలనము కలుగజేసెను. తుదకు 1857 లో భారతీయులు బ్రిటిష్ ప్రభుత్వముపై తిరుగుబాటొనరించి ప్రథమ స్వాతంత్ర్యయుద్ధమును జరిపిరి. ఈ స్వాతంత్ర్యయుద్ధ ఫలితముగ భారతదేశముపై ప్రభుత్వాధికారము కంపెనీవారినుండి బ్రిటిష్‌రాజు హస్తగతమైనది.

భారతీయులలో జాతీయభావము పెంపొందుటకు బ్రిటిష్ ప్రభుత్వము పరోక్షముగ ప్రబలకారణమైనది. పరపరిపాలనపై యేవగింపు భారతీయులను సన్నిహితులుగ జేసినది. బెంటింక్ ప్రవేశ

పెట్టిన ఆంగ్లవిద్య భారతీయుల స్వాతంత్ర్యోద్యమమునకు చేయూత నిచ్చినదని చెప్పవచ్చును. ఆంగ్లవిద్య నభ్యసించిన భారతీయులు ఇంగ్లండు, తదితర యూరపురాజ్యముల పరిపాలనావిధానమునకు సుపరిచితులై భారతదేశమునందును స్వయంనిర్ణయాధికారములు కావలెనని కాంక్షించి జాతీయోద్యమమును కొనసాగించిరి. 1875 లో సురేంద్రనాధబెనర్జీ కలకత్తాయందు 'ఇండియన్ అసోసియేషన్' అను సంస్థను స్థాపించి నివురుగప్పిన నిప్పువలె భారతీయులలో నిద్రాణమైయున్న జాతీయభావమును మేల్కొలుప యత్నించెను. 1882 లో రిప్పన్ ప్రభువు భారతీయులను స్వపరిపాలనా విధానమున శిక్షణ నిచ్చుటకై స్థానిక స్వపరిపాలనా సంస్థలను ప్రవేశపెట్టెను. డఫ్రిన్ అను రాజప్రతినిధి పరిపాలనాకాలమున 1885 లో భారతజాతీయ కాంగ్రెసు స్థాపింపబడినది. ఈ సంస్థాపనకు తగిన ప్రోద్బలము, ప్రోత్సాహము ఎ. ఓ. హ్యూమ్ అను ఆంగ్లేయునివలన లభించిన వనుటలో నిది నిర్మాణాత్మకమైనదేగాని విప్లవాత్మకమైనది గాదనుట తేటతెల్లమగుచున్నది. కలకత్తాపట్టణ సుప్రసిద్ధ న్యాయవాదియగు W. C. బెనర్జీ భారతజాతీయ కాంగ్రెసునకు ప్రథమ అధ్యక్షుడయ్యెను. దేశము నలుమూలలనుండి సుమారు డెబ్బదిమంది ప్రతినిధులు బొంబాయిలోని గోకులదాస్ తేజ్‌పాల్ సంస్కృత కళాశాలయందు జరుపబడిన ప్రథమ సమావేశమునకు హాజరైరి. అందు దాదాభాయి నౌరోజి, ఫిరోజిషా మెహతా మొదలగు ప్రబుద్ధులు గలరు. ప్రజాభిప్రాయమునకు ప్రతిబింబమై ప్రభుత్వమున భాగస్వామ్యము, ప్రజోపకరమైన సంస్కరణలను కోరుట కాంగ్రెసు మహదాశయమై యుండెను.

ప్రథమమున బ్రిటిష్‌ప్రభుత్వము కాంగ్రెసునకు సానుభూతి చూపెను. కాని 1886 లో ఇంగ్లండునందు కన్సర్వేటివ్ మంత్రివర్గ మేర్పడుటతో జాతీయోద్యమమునకు కొంత ప్రతిబంధక మేర్పడినది. అయినను కాంగ్రెసు దినదినాభివృద్ధిగాంచి సంస్కరణలకై ఆందోళనను ప్రారంభించెను. కౌన్సిల్ సభలయందు భారతీయులసంఖ్య పెంచవలయుననియు, వారి అధికారములను విస్తృతము చేయవలెననియు;

భారతీయ పరిశ్రమలకు ప్రోత్సాహ, రక్షణల నీయవలెననియు, ప్రజలలో విద్యావ్యాప్తికై శ్రద్ధవహింపవలెననియు, భారతీయులకు ఉన్నత ప్రభుత్వోద్యోగముల నధికముగ నీయవలెననియు కాంగ్రెసు ప్రభుత్వమునకు సూచించెను. నాటి కాంగ్రెసు నాయకులలో దాదాభాయి నౌరోజి, సురేంద్రనాథ బెనర్జీ, గోపాలకృష్ణగోఖలే, లోకమాన్య బాలగంగాధర తిలక్ మున్నగువారు ముఖ్యులు. వీరి ఆందోళన ఫలితముగనే బ్రిటిష్ ప్రభుత్వము 1892 లో కౌన్సిల్ చట్టమును గావించెను.

ఇండియన్ కౌన్సిల్స్ చట్టము (1892):— కంపెనీ పరిపాలనా వ్యవహారములను చక్కదిద్దుటకై బ్రిటిష్ పార్లమెంటు 1773 లో రెగ్యులేటింగ్ చట్టమును గావించెను. దీనివలన గవర్నరు జనరలునకు నల్గురు సభ్యులుగల సుప్రీమ్ కౌన్సిల్ అను సలహాసంఘ మేర్పడెను. 1784 లో గావింపబడిన పిట్టు ఇండియాచట్టమువలన రెగ్యులేటింగ్ చట్టములోని లోపములు సవరింపబడెను. సుప్రీమ్ కౌన్సిల్‌లోని సభ్యుల సంఖ్య మూడునకు తగ్గింపబడెను. 1833 చార్టరు చట్టము ననుసరించి కౌన్సిల్‌నం దొక 'లా మెంబరు' చేర్చబడెను. ఈ సభకు శాసనాధికారము లభించెను. 1853 చార్టరు చట్టమువలన భారత దేశమునకు లెజిస్లేటివ్ కౌన్సిలు అను సభ యేర్పడెను. ఇందు గవర్నరుజనరలు, నల్గురు కార్యనిర్వాహక సభ్యులు, సర్వసైన్యాధిపతి, రాష్ట్రములనుండి వచ్చిన ఆర్గురు ప్రభుత్వోద్యోగులు సభ్యులుగా నుందురు. భారతదేశముపై పాలనాధికారము బ్రిటిష్‌రాణి హస్త గతమైన పిదప పరిపాలనయందు భారతీయుల సహకారముగూడ పొందవలెనని ఆశించబడెను. 1861 కౌన్సిల్సు చట్టము ననుసరించి గవర్నరుజనరలు కార్యనిర్వాహక సభయందు 6 నుండి 12 వరకు భారతీయులను జేర్చుకొనవలెననియు అందు కనీసము సగభాగము అనధికార సభ్యులై యుండవలెననియు ప్రతిపాదింపబడెను. ఈ అదనపు సభ్యులకు శాసనాధికారము మాత్రమె యొసగబడెను. రాష్ట్రములందును లెజిస్లేటివ్ కౌన్సిలు నెలకొల్పబడెను.

1892 ఇండియన్ కౌన్సిలు చట్టము ననుసరించి కౌన్సిలు యొక్క అధికారములు, సభ్యులసంఖ్య హెచ్చింపబడెను. సుప్రీమ్ కౌన్సిలునందు 10 నుండి 16 గురు అదనపు భారతీయ సభ్యులను జేర్చుకొనవచ్చుననియు, రాష్ట్రసభలయందు అదనపు భారతీయ సభ్యులసంఖ్య 8 నుండి 20 వరకు నుండవచ్చుననియు సూచింపబడెను. అదనపుసభ్యులను స్థానికసంస్థలు, విశ్వవిద్యాలయ సెనేటుసభలు, వర్తకసంఘములు ఎన్నుకొనవలెననియు ప్రతిపాదింపబడెను. దీనివలన పరోక్షఎన్నిక పద్ధతి ప్రవేశపెట్టబడెను. బడ్జెటుపై చర్చజరుపుటకును, కార్యనిర్వాహకసభ్యుల చర్యలను ప్రశ్నించుటకును ఎన్నిక సభ్యులకు అవకాశ మీయబడెను.

## ద్వితీయ ఘట్టము (1905 – 1920)

క్రమముగ భారతజాతీయ కాంగ్రెసునందు అతివాదపక్షము బయలుదేరెను. ప్రతి సంవత్సరము ప్రతిపాదనలను ప్రభుత్వమునకు పంపుచు, వారి దయాభిక్షకై ప్రాకులాడుటకంటె కార్యరూపమున ప్రజాభిప్రాయమును ప్రభుత్వమునకు వెల్లడించి హక్కులను బడయవలెనని వీరివాదము. ఈ అతివాదపక్షమున తిలక్, లాలా లజపతిరాయి, బిపిన్ చంద్రపాలు ముఖ్యనాయకులు. వీరు స్వాతంత్ర్యమునకై ప్రభుత్వముతో పోరాడవలెనని తీర్మానించిరి. "స్వరాజ్యము నా జన్మ హక్కు, దానిని నేను బడయుదును" అని తిలక్ మహాశయు డుద్ఘాటించెను. 1905 లో కర్జన్ ప్రభువు పరిపాలనా సౌకర్యమునకై బంగాళమును రెండు రాష్ట్రములుగ విభజించెను. బెంగాలు విభజన దేశమున పెద్ద అలజడి కలిగించినది. తమ జాతీయభావమును రూపుమాపి తమ ఐక్యతను భంగపరచుటే ప్రభుత్వ ఆశయమని బెంగాలు ప్రజలు ఆందోళన సాగించిరి. బెంగాలు విభజన అతివాదపక్ష వ్యాప్తికి మిక్కిలి అనుకూలించినది. వందేమాతరమ్ ఉద్యమము బయలుదేరినది. విదేశవస్తుబహిష్కరణకై ప్రచారము జరిగినది. 1907 సూరత్ కాంగ్రెసునందు అతివాద మితవాదపక్షములకు అభిప్రాయ భేదములు హెచ్చినవి. సురేంద్రనాథబెనర్జీచే బెంగాలునందు ప్రారంభింపబడిన స్వదేశీ ఉద్యమము అనతికాలములోనే దేశవ్యాప్త

మైనది. కొందరు యువకులు హింసాత్మక చర్యలకుగూడ సాహసించిరి. 1904-5 లో రష్యా జపానుచే నోడింపబడెను. ఆసియా రాజ్యము యూరపురాజ్యము నోడించుట యొక వింతయయ్యెను. ప్రయత్నించిన భారతదేశమునుండియు బ్రిటిష్‌వారిని వెడలగొట్టుట సాధ్యమగునని దృఢవిశ్వాసము కల్గెను.

భారతదేశములోని ముఖ్య మతవర్గమైన మహమ్మదీయులు కాంగ్రెసునకు సంపూర్ణసహకార మివ్వలేదు. 1906 లో నవాబ్ సలీముల్లా అను ముస్లిమ్‌నాయకుడు ఢక్కాయందు 'ముస్లిమ్‌లీగ్' అను సంస్థను స్థాపించెను. లీగ్ బెంగాలు విభజనను సమర్థించెను. బ్రిటిష్ వస్తు బహిష్కరణోద్యమమును ఆక్షేపించెను. ప్రభుత్వమునకు సహకారము జూపెను.

ప్రజలలో విజృంభించిన జాతీయోద్యమ, స్వాతంత్ర్యేచ్ఛల నణచుటకై బ్రిటిష్ ప్రభుత్వము దమననీతిని ప్రదర్శించెను. అతివాద పక్షనాయకులను విచారణలేకుండనే చెరసాలకంపెను. ప్రజాసమూహములపై లాటీలను ప్రయోగించెను. తిలక్ రాజద్రోహ నేరముపై మాండలే నగరమునకు పంపబడెను. అయినను ప్రజలలో స్వాతంత్ర్యాభిలాష నశించలేదు. మితవాదపక్షమును సమాధానపరచుటకై రాజప్రతినిధిగనున్న మింటో ప్రభువు, భారత రాజ్యాంగమంత్రిగనున్న మార్లే ప్రభువుతో సంప్రదించి 1909 లో సంస్కరణలను ప్రవేశపెట్టెను. ఇవి మింటో - మార్లే సంస్కరణలుగా పేర్గాంచెను.

మింటో-మార్లే సంస్కరణలు(1909):— క్రీ.శ. 1909 లో చేయబడిన కౌన్సిల్స్ చట్టమువలన కేంద్రకౌన్సిల్‌లోని అదనపు సభ్యులసంఖ్య 60 వరకు పెంచబడెను. మద్రాసు, బొంబాయి, బెంగాల్, యునైటెడ్ ప్రావిన్సెస్, బీహారు, ఒరిస్సాలలోని కౌన్సిల్ సభలందు అదనపు సభ్యుల సంఖ్య 50 వరకు, పంజాబు, అస్సాము, బర్మాలందు 30 వరకు నుండవచ్చునని సూచింపబడెను. ఎన్నిక విధానము ప్రవేశపెట్టబడెను. అల్పసంఖ్యాక వర్గములకు ప్రాతినిధ్య మివ్వవలెనను సూత్రముపై శాసనసభల యెన్నికలలో మహమ

దీయులకు, ఆంగ్లోఇండియనులకు, క్రైస్తవులకు, భూస్వాములకు, వర్తక సంఘములకు, స్థానిక సంస్థలకు, విశ్వవిద్యాలయములకు ప్రత్యేక నియోజకవర్గము (Separate Electorates) లేర్పరుపబడెను. భారత రాజ్యాంగమంత్రి సలహా సంఘమందు, కేంద్రరాష్ట్ర కార్యనిర్వాహక వర్గములందు భారతీయులకు ప్రవేశము కల్పింపబడెను. రాష్ట్రముల లోని కౌన్సిల్‌లందు అనధికార సభ్యులసంఖ్య హెచ్చుగానుండ వలెనని నిర్ణయింపబడుట యొక విశేషము. శాసనసభలు బడ్జెటుపై చర్చ జరుపుటేగాక తీర్మానములు చేయుటకును అవకాశమివ్వ బడెను.

ఈ చట్టమువలన భారతదేశమున బాధ్యతాయుత పరిపాల నము ప్రవేశపెట్టబడలేదు. కార్యనిర్వాహకవర్గము శాసనసభకు బాధ్యతవహించి యుండవలసిన అవసరములేదు. ప్రత్యేక ఎన్నికవర్గ ముల నేర్పరచుటతో ప్రజలలో సంఘీభావము సన్నగిల్లినది. ఇది యొక విషబీజమై క్రమముగ వృద్ధిపొంది, ద్విజాతి సిద్ధాంతమునకు మూలకారణమై దేశమును రెండు ముక్కలుచేయుటకు తోడ్పడినది. బ్రిటిష్‌వారి 'విభజించి పాలించు' అను రాజ్యాంగనీతికి మింటో-మార్లే సంస్కరణలు చక్కని ఉదాహరణము.

మితవాద పక్షమువారు సంస్కరణము నామోదించి ఎన్నిక లందు పాల్గొనిరి. కాని ఆచరణయందు దానిలోని లోపములు బయల్పడుటచే అసంతృప్తిచెంది విప్లవాత్మకమైన మార్పులకై ఆందో ళన కొనసాగించిరి. 1914 లో అనిబిసెంటు కాంగ్రెసునందుచేరి ప్రముఖ పాత్రవహించెను. 1916 సెప్టెంబరులో హోంరూలు ఉద్యమమును ప్రారంభించెను. 1913లో లీగ్ తన ఆశయములను మార్చుకొని స్వయం నిర్ణయాధికారమె తమ ఆశయమని ప్రకటించెను. 1916లో కాంగ్రెసు, లీగులు లక్నోయందు సమావేశమై సంయుక్తప్రణాళికను తయారుజేసి కొనిరి. నానాటికి ప్రజలలో పెంపొందుచున్న స్వాతంత్ర్యాభిలాషను, మొదటి ప్రపంచ సంగ్రామమున భారతదేశము చేసిన సహాయము, త్యాగములను గుర్తించి బ్రిటిష్ పార్లమెంటు నూతన సంస్కరణ లను ప్రవేశపెట్టదలచెను. 1917 లో భారతరాజ్యాంగ మంత్రిగ

మున్న మాంటెగు భారతీయులకు అంచెలవారిగా బాధ్యతాయుత పరిపాలన నొసగనున్నామని ప్రకటించెను. మాంటెగు భారతదేశ మును దర్శించి ప్రజానాయకులతో సంప్రదించెను. 1919 లో ఇండియా ప్రభుత్వచట్టము (The Government of India Act) గావింప బడెను. ఇది మాంటెగు, వైస్రాయిగనున్న చెమ్సుఫర్డ్ల సంయుక్త కృషి ఫలితమగుటచే మాంటెగు-చెమ్సుఫర్డు సంస్కరణలనియు మాంట్ఫర్డ్ సంస్కరణలనియు పిలువబడెను.

మాంట్ఫర్డు సంస్కరణలు (1919) :— ఈ చట్టము ననుస రించి కేంద్రకార్యనిర్వాహక వర్గమున ముగ్గురు భారతీయులకు స్థాన మీయబడెను. కాని వీరు శాసనసభకు బాధ్యులుకారు. కేంద్ర శాసనసభ లెజిస్లేటివ్ అసెంబ్లీ, కౌన్సిల్ ఆఫ్ స్టేట్స్ అను రెండుసభ లుగ విభజింపబడినది. ప్రత్యక్ష ఎన్నికవిధాన మమలు జరుపబడినది. వీనియందు ఎన్నిక సభ్యులసంఖ్య హెచ్చింపబడినది. ఈ సభలు శాస నములు చేయుటేగాక బడ్జెటునందు కొన్ని పద్దులపై ఓటుచేయుట కును, కార్యనిర్వాహకవర్గ సభ్యుల చర్యలను విమర్శించుటకును, కొన్ని ప్రతిపాదనలను చేయుటకును అధికారము లీయబడెను. కాని రాజప్రతినిధికి శాసనసభల తీర్మానములను త్రోసివేయుటకు విశేషాధి కార మీయబడెను.

రాష్ట్రములందు ద్వంద్వప్రభుత్వము (Dyarchy) ప్రవేశ పెట్ట బడెను. ప్రభుత్వశాఖలు రిజర్వుడు శాఖలని, ట్రాన్స్ఫర్డుశాఖలని రెండువిభాగములు గావింపబడెను. పోలీసు, రెవెన్యూ, న్యాయశాఖ మొదలగు రిజర్వుడు శాఖలను పరిపాలించు కార్యనిర్వాహక సభ్యులు గవర్నరుకు బాధ్యులైయుందురు. విద్య, ఆరోగ్యము, అడవులు, స్థానికసంస్థలు మొదలగు ట్రాన్స్ఫర్డు శాఖలను శాసనసభకు బాధ్యు లైన మంత్రులు నిర్వహింతురు. ప్రభుత్వాధికారమును ప్రజాయత్తము చేయుటలో నిది ప్రథమదశగా పేర్కొనబడినది. దీనివలన భారతీయు లకు స్వపరిపాలనయందు శిక్షణకలుగునని ప్రకటింపబడినది. శాసన సభ ు యందు ఎన్నిక సభ్యులకు అత్యధిక ప్రాతినిధ్య మివ్వబడినది.

కాని శాసనసభ ప్రతిపాదించిన బిల్లులను గవర్నరు వీటో (Veto) చేయుట కధికారమివ్వబడెను.

ఎన్నియో మార్పులు కలుగుననియు, సంపూర్ణమైన బాధ్యతాయుత పరిపాలన వచ్చుననియు ఆశించిన భారతీయులకు మాంటేగ్ ఫర్డు సంస్కరణలు ఆశాభంగము కలిగించెను. భారత జాతీయ కాంగ్రెస్ మాంటేగ్ ఫర్డు సంస్కరణలను నిరసించెను. ప్రజలలో బ్రిటిష్ ప్రభుత్వమునందు ద్వేష మధికమయ్యెను. అశాంతి ప్రబలెను. బ్రిటిష్ ప్రభుత్వము రౌలట్ చట్టమును ప్రవేశపెట్టి నాయకులను జైళ్ళ కంపెను. సభలు, సమావేశములను నిషేధించెను. రౌలట్ చట్టము దమననీతి చిహ్నమని ప్రకటించుటకు, యుద్ధానంతరము దేశమందు కలిగిన నిరుద్యోగము, అధికధరలు మొదలగు విషయములను చర్చించుటకు పంజాబునందు జలియన్‌వాలాబాగ్ నందొక సభ గావింపబడెను. డయ్యరు అను సేనాని నిరాయుధులైయున్న ప్రజలపై కాల్పులను సాగించెను. జలియన్‌వాలాబాగ్ నందేగాక దేశము నలుమూలలందు బ్రిటిష్ దౌర్జన్యమునకు, నిరంకుశత్వమునకు అనేకులు తమ అసువుల నర్పించి, దేశభక్తిని ప్రదర్శించి, త్యాగధనులైరి. ప్రపంచ యుద్ధానంతరము టర్కీ సామ్రాజ్యము విభజింపబడినది. సుల్తానున కన్యాయము జరిగినదని భారతదేశములోని ముస్లిములు ఆందోళన సాగించిరి. ఇది ఖిలాఫత్ ఉద్యమముగా పేర్గాంచినది. ఈ ఉద్యమమునకు మహమ్మద్ ఆలి, షౌకత్ ఆలి, మౌలానా అబుల్ కలామ్ అజాద్ నాయకులై బహుళ ప్రచారము గావించిరి. కాంగ్రెసు గూడ ఈ ఉద్యమమునకు సానుభూతి జూపి, చేయూత నిచ్చెను. రాజకీయముగ ఆందోళనాభరితమైయున్న సమయమున 1920 ఆగస్టు 1 వ తేదీన తిలక్ మహాశయుడు బొంబాయి నగరమున దివంగతుడయ్యెను. కాంగ్రెసునకు సారథ్యము వహించి జాతీయోద్యమమును కొనసాగించు భారము గాంధిమహాత్ముని భుజస్కంధములపై బడెను.

## తృతీయఘట్టము (1920 - 47)

గాంధిజి దక్షిణాఫ్రికా భారతీయుల హీనస్థితిని తొలగించుటకై సత్యాగ్రహములను జరిపి, గాంధి-స్మట్స్ ఒడంబడికతో విజయమంది 1914 లో భారతదేశమున కేతెంచెను. దక్షిణాఫ్రికాకు భారతీయులను కూలీలుగ పంపు పద్ధతిని తొలగించుటకై కేంద్ర శాసనసభలో ప్రయత్నము చేసెను. దేశమంతటను పర్యటించి తన ఉపన్యాసములద్వారా ప్రజల సానుభూతిని సంపాదించెను. రాజప్రతినిధియు గాంధిజి కోరికను మన్నించెను. దీనితో భారత రాజకీయరంగమున గాంధిజికి గొప్ప ప్రాముఖ్యత యేర్పడెను.

మాంటెఫర్డు సంస్కరణలు, రౌలట్ చట్టము, జలియన్‌వాలా బాగ్ హత్యలు భారత రాజకీయ రంగమున గొప్ప మార్పు తెచ్చెను. ఖిలాఫత్ ఉద్యమఫలితముగ హిందూ ముస్లిమ్ ఐక్యత హెచ్చెను. 1920 లో నాగపూరు కాంగ్రెసు సమావేశమున గాంధిజి ప్రతిపాదించిన సహాయ నిరాకరణ సూత్రము సర్వజనామోద మయ్యెను. గాంధిజి జాతీయ కాంగ్రెసు నాయకత్వమును వహించి సహాయ నిరాకరణోద్యమమును ప్రారంభించెను. గాంధిజి పిలుపు నందుకొని అనేకులు ప్రభుత్వ ఉద్యోగములకు రాజీనామాలిచ్చి ఉద్యమమున జేరిరి. న్యాయస్థానములు, కళాశాలలు, పాఠశాలలు, ప్రభుత్వ కచేరీలు బాయ్‌కాట్ చేయబడెను. దీనికితోడుగ విదేశీవస్త్ర బహిష్కరణ, ఖద్దరు ఉద్యమము వ్యాప్తినొందెను. ఇంటింట రాట్నములు వెలసెను. స్వదేశ వస్తువులకు అధిక గౌరవ మాపాదింపబడెను. ప్రభుత్వము గాంధిజిని అతని అనుచరులను నిర్బంధించెను.

శాసనసభలలో ప్రవేశించి ప్రభుత్వ కార్యకలాపముల కడ్డు తగులవలెనని చిత్తరంజన్ దాస్, మోతీలాల్ నెహ్రూ మొదలగువారు తలచిరి. 1925 సంవత్సరపు ఎన్నికలలో స్వరాజ్యపార్టీ 145 స్థానములలో 45 స్థానముల నాక్రమింపగల్గెను. వీరు ప్రభుత్వమునకు ప్రతి విషయమునందు అడ్డుతగులుచు తమ ఆశయమును సిద్ధింపజేసికొనిరి.

మాంటేగ్ ఫర్డు సంస్కరణల ఫలితములను పర్యవేక్షించుటకు, భావి కార్యక్రమమును నిర్ణయించుటకు బ్రిటిష్ ప్రభుత్వము సైమన్ నాయకత్వమున నొక కమీషన్‌ను నియమించెను. కాని ఇందు భారతీయు లెవ్వరును లేకుండుటచే కాంగ్రెసువారు ఈ కమీషన్‌ను బహిష్కరించిరి. భారతప్రజలు తమ నిరసనను తెలిపి, సైమన్‌ను తిరిగి పొమ్మని ప్రదర్శనలు జరిపిరి. సైమన్ ఎట్లో తన పర్యట నను ముగించుకొని ఇంగ్లండున కేగెను. రాజకీయ సంస్కరణకై ఆందోళన చేయుచున్న కాంగ్రెసు దృక్పథము మారిపోయెను. 1929 లాహోరు కాంగ్రెసునందు పండిత జవహరులాల్ నెహ్రూ సంపూర్ణ స్వరాజ్యసాధనే కాంగ్రెసు లక్ష్యమని ప్రకటించెను.

భారత ప్రజానాయకులకు ఆంగ్ల ప్రభుత్వమునకు సమాధానము కుదుర్చుటకై రౌండు టేబుల్ సమావేశ మేర్పాటు గావింపబడెను. కాంగ్రెసు నాయకులు వైస్రాయిగానున్న ఇర్విన్‌ను కలుసుకొని బాధ్యతాయుత పరిపాలన నేర్పరతుమన్న వాగ్దానమును కోరిరి. కాని రాజప్రతినిధి అందుల కియ్యకొనకపోవుటచే కాంగ్రెసువారు రౌండు టేబుల్ సమావేశమునకు హాజరుకాలేదు.

ఆంగ్లప్రభుత్వ దమననీతికి నిరసనగా మహాత్ముడు శాసనోల్లంఘ నమును జేసెను. 1930 మార్చి 12 న దండి గ్రామమునకు బయలు దేరి ఉప్పు సత్యాగ్రహోద్యమమును ప్రారంభించెను. భారతదేశము తీరము పొడవునను అనేక ప్రదేశములలో కాంగ్రెస్ స్వచ్ఛంద సేవ కులు సముద్రపు నీటినుండి ఉప్పును తయారుచేసి ఉప్పుచట్టము నుల్లంఘించిరి. ప్రభుత్వము సత్యాగ్రహులపై దౌర్జన్యము జరిపి వేలకొలది సత్యాగ్రహులను జైళ్ళకంపెను.

దేశమున అలజడి తగ్గించుటకై రాజప్రతినిధియగు ఇర్విన్ గాంధిజితో మంతనములను జరిపెను. తుదకు ఇద్దరకు ఒడంబడిక జరిగెను. గాంధిజి తన ఉద్యమమును విరమించి రెండవ రౌండు టేబిల్ సమావేశమునకు కాంగ్రెస్ ఏకైక నాయకుడుగ హాజరయ్యెను.

రెండవ రౌండుటేబిల్ సమావేశము విఫలమగుటచే మహాత్మా గాంధి మన దేశమునకు తిరిగివచ్చెను. కాని వెంటనే గాంధిజి, అతని

అనుచరులతో సహా జైలునం దుంచబడెను. రౌండు టేబుల్ సమావేశమున మన దేశమున హరిజనులకు ప్రత్యేక ప్రాతినిధ్యమివ్వవలెనని తీర్మానించిరి. ఇది అక్రమమని, భారతీయుల ఐక్యతను భంగపరచుటే ఈ నిర్ణయ లక్ష్యమని గాంధిజి ఆమరణాంత నిరాహారదీక్ష పూనెను. 1932 పూనా ఒడంబడిక ననుసరించి ప్రభుత్వము తన ప్రయత్నమును విరమించుకొనెను.

ఇండియా గవర్నమెంటు చట్టము (1935) :—రౌండు టేబుల్ సమావేశముల ఫలితముగను, సైమన్ కమీషన్ సూచనలను పాటించియు 1935 లో "ఇండియా ప్రభుత్వ చట్టము" చేయబడెను. దీని ననుసరించి రాష్ట్రములలో ద్వంద్వ ప్రభుత్వము రద్దు చేయబడెను. రాష్ట్రములయందు పూర్తిగ బాధ్యతాయుత పరిపాలనము ప్రవేశపెట్టబడెను. కాని గవర్నరునకు వీటో అధికారము యివ్వబడెను. దీనివలన గవర్నరు తన కిష్టము లేని శాసనములను తిరస్కరించుటకు వీలయ్యెను. కేంద్రప్రభుత్వమందు ఫెడరల్ సూత్రము ప్రవేశపెట్టబడెను. రాచరికము కలిగిన స్వదేశ సంస్థానములు, బాధ్యతాయుత పరిపాలన కలిగిన బ్రిటిష్ ఇండియా రాష్ట్రములను ఫెడరల్ విధానమున నొకచోజేర్చి సమష్టి అభివృద్ధికి పాటుబడవలెనని బ్రిటిష్ ప్రభుత్వము కాంక్షించెను. ఫెడరల్ శాసన సభయందు కౌన్సిల్ ఆఫ్ స్టేట్స్, ఫెడరల్ అసెంబ్లీ యను రెండు సభలుండును. కౌన్సిలునందు బ్రిటిష్ ఇండియాకు 156 స్థానములు, స్వదేశసంస్థానములకు 104 స్థానములు కేటాయించబడెను. అసెంబ్లీయందు బ్రిటిష్ ఇండియాకు 250 స్థానములు, స్వదేశ సంస్థానములకు 125 స్థానములు చూపబడెను. బ్రిటిష్ ఇండియాయందు ఎన్నిక విధానముండును. స్వదేశ రాజులు తమ ప్రతినిధులను నియమింపవచ్చును. అల్పసంఖ్యాక వర్గములకు, స్త్రీలకు, కార్మికులకు, వర్తక సంఘములకు, భూస్వాములకు ప్రత్యేక ప్రాతినిధ్య మివ్వబడెను.

కేంద్ర కార్యనిర్వాహక వర్గమునందు ద్వంద్వప్రభుత్వము ప్రవేశపెట్టబడినది. ఇందు ముగ్గురు అధికారసభ్యు లుందురు. వీరు సైన్యము, విదేశవ్యవహారములు, క్రైస్తవ మతవిషయములను నిర్వ

హించుదురు. వీరు శాసనసభకు బాధ్యులుకారు. మిగిలిన శాఖలను పాలించు మంత్రులు శాసనసభకు బాధ్యులైయుందురు. రాష్ట్రముల మధ్యవచ్చు వివాదములను, కేంద్రరాష్ట్రములకు వచ్చు వివాదములను పరిష్కరించుటకు ఫెడరల్ న్యాయస్థాన మేర్పరుపబడినది.

కాని ఈ చట్టము భారతీయులకు సంతృప్తి నివ్వలేదు. తమ అధికారములు తగ్గిపోవునేమోనని స్వదేశరాజులు ఫెడరల్ సూత్రమున కంగీకరింపలేదు. రాజప్రతినిధికి ప్రత్యేకాధికారము లుండుటచే ప్రజలకు సంపూర్ణాధికారములు కలుగలేదని కాంగ్రెసువారు ఈ చట్టమును తిరస్కరించిరి. ఫెడరల్ సూత్రము అమలుజరుగక కేంద్రమున 1919 చట్టము ననుసరించియే పరిపాలన జరుపబడెను. రాష్ట్రములందు మాత్రము 1935 చట్టమనుసరింపబడినది. 1937 లో సుప్రీమ్‌కోర్టు యేర్పడినది.

1939 లో రెండవ ప్రపంచ యుద్ధము ప్రారంభమయ్యెను. భారతదేశ నాయకులను సంప్రదించకనే బ్రిటిష్ ప్రభుత్వము భారతదేశమును యుద్ధమున దించెను. బ్రిటన్ స్వలాభమునకు చేయుచున్న యుద్ధమునకు సహాయము చేయుటకు కాంగ్రెస్ నిరాకరించెను. యుద్ధమును వ్యతిరేకించుచు గాంధిజి వ్యక్తిసత్యాగ్రహము (Individual Satyagraha) ను ప్రారంభించెను. యుద్ధవ్యతిరేక ప్రచారకులను ప్రభుత్వము చెఱసాలల కంపెను.

మహమ్మదాలి జిన్నా :— 1910 నుండి మహమ్మదాలి జిన్నా ముస్లిమ్‌లీగ్‌నకు నాయకుడై, లీగ్ ఆశయసిద్ధికై పాటుపడెను. ఇతడు కడు సమర్థుడు. 1930-32 రౌండ్ టేబిల్ సమావేశములకు హాజరై మహమ్మదీయులకు ప్రత్యేక సౌకర్యములు, రక్షణ అవసరమని వాదించెను. భారతదేశమునకు స్వతంత్రమే సిద్ధించిన అది హిందూ రాజ్యము కాగలదనియు, మహమ్మదీయులకు అన్యాయము జరుగుననియు భావించెను. హిందువులు, మహమ్మదీయులు భిన్నజాతుల వారనియు, మహమ్మదీయుల వికాసమునకు ప్రత్యేక రాజ్యమవసరమనియు, మహమ్మదీయు లధికసంఖ్యాకులుగ నున్న ప్రాంతములతో

మహమ్మదీయ రాజ్య మేర్పడవలె ననియు వాదింపసాగెను. 1940 లో తన ద్విజాతి సిద్ధాంతమును వెల్లడించి పాకిస్థాన్ (పవిత్రభూమి) ఏర్పడవలెనని ప్రకటించెను. గాంధిజి, అబుల్ కలాం అజాద్ మొదలగు కాంగ్రెసు నాయకులు జిన్నాకు నచ్చజెప్ప జూచిరి. దేశము విచ్ఛిన్నమై పోవుననియు, భారతజాతి వికాసమునకు ద్విజాతి సిద్ధాంతము గొడ్డలిపెట్టనియు చెప్పిచూచిరి. కాని జిన్నా పట్టినపట్టు విడువలేదు. ఈ నాయకుల విభేదములు ఆంగ్ల ప్రభుత్వమునకు చక్కని అవకాశ మయ్యెను. స్వాతంత్ర్య ప్రదాన దినమును వాయిదా వేయసాగిరి.

1942 - వ సంవత్సరమున యుద్ధములో బ్రిటన్ స్థితి మిక్కిలి ప్రమాదకరమైనది. భారత దేశమునకు క్రొత్త రాజ్యాంగ సూత్రములను సూచించి, యుద్ధమున సహాయము గోరుటకు బ్రిటిష్ ప్రభుత్వము సర్ స్టాఫర్డ్ క్రిప్సు మంత్రిని ఇండియాకు పంపెను. యుద్ధానంతరము వీలగునంత త్వరలో భారత దేశమునకు స్వాతంత్ర్యము నిచ్చుట బ్రిటన్ యుద్దేశ్యమని క్రిప్సు సూచించెను. యుద్ధానంతరము ఇండియన్ యూనియను యేర్పడునట్లు సూచించెను. కాని వెంటనే భారతీయులకు వచ్చు క్రొత్తహక్కులు లేవు. క్రిప్సు ప్రతిపాదనలు ముఖ్య రాజకీయ పక్షములకు అంగీకారము కాలేదు. దేశరక్షణ (Defence) శాఖకు భారతీయుని నియమింపదలచిన ప్రభుత్వవైఖరి భారతీయులకు యిష్టముగా లేదు. క్రిప్సు రాయబారము (Cripps Mission) విఫలమైనది.

క్రిప్సు ప్రతిపాదనలు వీగిపోయిన పిదప 1942 వ సంవత్సరము ఆగస్టునెలలో కాంగ్రెసు సమావేశమయ్యెను. ఆంగ్లేయులు భారత దేశమును వదలిపోవలెననియు ప్రభుత్వమును సంపూర్ణముగ భారతీయుల వశము చేయవలె ననియు ప్రతిపాదించిరి. 'క్విట్ ఇండియా' ఉద్యమము ప్రారంభమయ్యెను. కాంగ్రెసు నాయకుల నందఱను ప్రభుత్వము చెఱసాలలకంపెను. దేశనాయకులయెడ ప్రభుత్వము అక్రమముగ ప్రవర్తించెనని భారతీయులు క్రోధము వెళ్ళబుచ్చిరి.

1945 వ సంవత్సరమున ఏప్రియల్‌లో ఐరోపా రంగమున 'మిత్రమండలి' (Allied Powers) కి యుద్ధములో గెలుపు కల్గినది. భారత రాజ్యాంగ ప్రతిష్టంభన (Indian Political Deadlock) ను పరిష్కరించుటకు క్రొత్తప్రయత్నములు జరిగినవి. రాజప్రతినిధియగు లార్డ్ వేవెలు సిమ్లాలో దేశనాయకుల సమావేశములు జరిపి కాంగ్రెసు ముస్లిమ్‌లీగ్‌లకు సామరస్యము కుదుర్చుటకు యత్నించెను. కాని ముస్లిమ్‌లీగ్ తన పట్టుదల వీడలేదు.

యుద్ధము పూర్తియై మిత్రమండలికి సంపూర్ణముగ జయము గల్గినది. బ్రిటన్‌లో క్రొత్త ఎన్నికలు జరిగి 1946 వ సంవత్సరమున చర్చిలు ప్రభుత్వము పడిపోయి కార్మిక పక్షము (Labour Party) నకు చెందిన అట్లీప్రభుత్వ మేర్పడినది. వెంటనే భారతదేశమునకు స్వాతంత్ర్యము నిచ్చుటను గూర్చి దేశనాయకులతో ఆలోచించుటకు లార్డు పెథిక్ లారెన్సు, ఎ. వి. అలెగ్జాండరు, సర్ స్టాఫర్డు క్రిప్సు అను ముగ్గురు బ్రిటిష్ మంత్రులు వచ్చిరి. ముఖ్య రాజకీయ పక్షములతో సమాలోచనలు జరిపిరి. 1946 సెప్టెంబరులో పండిత జవహర్‌లాల్ నెహ్రూ నాయకత్వమున తాత్కాలిక కేంద్ర ప్రభుత్వ మేర్పడినది. అమాత్యత్రయము ముస్లిమ్‌లీగ్ కోరిన దేశవిభజనము (Partition) నకు తొలుత సమ్మతించలేదు. కాని, పాకిస్థాన్ నిర్మాణమునకు ముస్లిమ్‌లీగు దేశమున గొప్ప ఆందోళన జరిపెను. అల్లరులు బయలు దేరెను. కాంగ్రెసు నాయకులు దేశవిభజన కంగీకరింపక తప్పలేదు. 1947 వ సంవత్సరము జులైలో బ్రిటిష్ పార్లమెంటు ఇండియా స్వాతంత్ర్య చట్టమును ప్రకటించెను.

## స్వాతంత్ర్య ప్రదానము

**భారత స్వాతంత్ర్య చట్టము (1947):—** 1947 ఆగష్టు 15 నుండి భారతస్వాతంత్ర్య చట్టము అమలులోనికి వచ్చెను. ఈ చట్టము ననుసరించి ఆంగ్లేయులు భారతదేశముపై తమకున్న హక్కును వదలుకొనిరి. భారతకార్యదర్శి పదవి రద్దుచేయబడెను. భారత దేశము ఇండియన్ యూనియన్, పాకిస్థాన్ అను భాగములుగ

విభజింపబడెను. ఆ యా భాగములలోని ప్రజలు తమకిష్టమైన ప్రభుత్వము నేర్పరచుకొనుటకు అనుమతింపబడెను.

ఇండియన్ యూనియన్:— పాకిస్థాన్‌పోను మిగిలిన భాగమంతయు ఇండియన్ యూనియన్‌నందు చేరియున్నది. ఢిల్లీ ఇండియన్ యూనియన్‌కు రాజధాని. 1947 లో ఆంగ్ల రాజప్రతినిధిగ వచ్చిన లార్డ్ మౌంట్ బాటన్ ఇండియన్ యూనియన్‌కు మొదటి గవర్నరు జనరలుగ నియమింపబడెను. పండిత జవహర్‌లాల్ నెహ్రూ ప్రధానమంత్రి పదవిని స్వీకరించెను. మౌలానా అబుల్‌కలామ్ అజాద్, సర్దారు వల్లభభాయిపటేలు మొదలగు ప్రభృతులు మంత్రి మండలియందు సభ్యులుగ చేరిరి. మహాత్మాగాంధి ఎట్టిపదవిని స్వీకరింపక ప్రజాసేవకు, దేశ అభ్యుదయమునకు కృషి చేయ సంకల్పించెను. భారత స్వాతంత్ర్య యోధుడుగ, భారతజాతి పితగ పేర్గాంచిన గాంధిజి 1948 జనవరి 30 న ఒక మతోన్మాది తుపాకిగుండు కెరయై అసువులబాసి అమరుడయ్యెను. దేశవిభజన కార్యక్రమమును సక్రమముగ జరిపించి లార్డు మౌంట్‌బాటన్ భారతీయుల మన్ననలకు పాత్రుడయ్యెను. 1948 లో పదవీ విరమణజేసి స్వదేశమున కేగెను. శ్రీమాన్ చక్రవర్తుల రాజగోపాలాచారి గవర్నరు జనరలు పదవిని స్వీకరించెను.

పాకిస్థాన్:— మహమ్మదీయు లధికముగనున్న ప్రదేశములు పాకిస్థానునందు చేర్చబడెను. బంగాళము పంజాబు రాష్ట్రములు రెండుగ విభజింపబడెను. తూర్పు బెంగాల్, అస్సాములోని సిల్హట్ జిల్లాలు కలసి తూర్పు పాకిస్థాన్‌గను; పశ్చిమ పంజాబు, వాయువ్య సరిహద్దురాష్ట్రము, బెలూచిస్థానము, సింధురాష్ట్రములను కలిపి పశ్చిమ పాకిస్థాన్‌గను నిర్దేశింపబడెను. కరాచి రాజధాని యయ్యెను. లీగ్‌నాయకుడగు మహమ్మదాలి జిన్నా పాకిస్థానమునకు మొదటి గవర్నరు జనరలుగ నియమింపబడెను. ఇటీవల పాకిస్థాన్ రాజధాని కరాచినుండి రావల్పిండికి మార్చబడినది.

సంస్థానముల విలీనీకరణ:— భారత దేశమున బ్రిటిష్ ఇండియా పోను మిగతభాగమున 562 సంస్థానము లుండెడివి. ఇందు జమ్ము-కాశ్మీరు, హైదరాబాదు, మైసూరు, తిరువాన్కూరులు తప్ప మిగిలిన వన్నియు చిన్న చిన్న రాజ్యములు. భారత దేశముపై ఆంగ్లే యుల అధికారము తొలగుటతో ఈ సంస్థానముల కన్నిటికి స్వాతంత్ర ప్రతిపత్తి యేర్పడెను. దేశము ఛిన్నాభిన్నమై పోవున ట్లనిపించెను. ఈ సంస్థానము లన్నింటిని ఐక్యపరచి అఖండ భారత దేశమును స్థాపింప వలెనని మన జాతీయనాయకులు కాంక్షించిరి. తాత్కాలిక ప్రభుత్వ కాలమున సంస్థానముల విషయములను జూచు బాధ్యత వహించిన సర్దారు వల్లభభాయిపటేలు సంస్థానాధిపతుల కొక విజ్ఞప్తిజేసెను. సంస్థానాధిపతులు తమ రాజ్యములను ఇండియన్ యూనియన్ నందు జేర్చుట శ్రేయస్కరమని తెల్పెను. జాతీయైక్యత, దేశాభివృద్ధి, పరి పాలనా సౌలభ్యము మొదలగు విషయములను వారి దృష్టికి తెచ్చెను. స్వతంత్ర భారత దేశమున ప్రజాస్వామ్య పద్ధతులలో పరిపాలన జరుగు చుండ తాము రాజ్యాధిపతులుగ నుండి రాచరికము నెరపుట భావ్యము కాదని తలచి సంస్థానాధిపతులు తమతమ రాజ్యములను ఇండియన్ యూనియన్, పాకిస్థానములందు లీనము జేసిరి. 1947 ఆగస్టు 15 వ తేదికి జమ్ము-కాశ్మీరు, జునాగఢ్, హైదరాబాదు రాజ్యములు మాత్రము మిగిలియుండెను.

జునాగఢ్ కథియవారు ప్రాంతమున నున్నది. అందు అధిక సంఖ్యాకులు హిందువులు. పరిపాలకుడు మహమ్మదీయుడు. ప్రజలు ఇండియన్ యూనియన్ నందు చేర నభిలషించిరి. నవాబు పాకిస్థానము నకు పారిపోయెను. జనవాక్యము జరుపబడి జునాగఢ్ ఇండియన్ యూనియన్ నందు లీనముచేయబడెను.

భారత దేశములోని సంస్థానములన్నింటిలో హైదరాబాదు పెద్దది. రజాకార్ల వలన దేశ శాంతిభద్రతలకు ముప్పు వాటిల్లెను. పటేలు ఈ సంస్థానముపై పోలీసుచర్య తీసికొనెను. హైదరాబాదు సంస్థానము 1949 నవంబరు 23 న ఇండియన్ యూనియన్ నందు చేర్చబడెను.

**జమ్ము - కాశ్మీరు :—** పాకిస్థాను మద్దతుతో కొందరు కొండ జాతులవారు కాశ్మీరునందు అల్లరులు లేవదీసిరి. పాకిస్థాన్ కొంత భాగము నాక్రమించెను. కాశ్మీరును ఇండియన్ యూనియన్‌నందు జేర్చుట కంగీకరించి, కాశ్మీరుమహారాజు తనకు రక్షణ కల్పింపుమని భారత ప్రభుత్వమును వేడెను. భారత సైన్యములు కాశ్మీరునందు ప్రవేశించి దురాక్రమణదారుల నెదుర్కొనెను. కాశ్మీరు ఇండియన్ యూనియన్‌నందు చేర్చబడెను.

## రిపబ్లిక్ ఇండియా

**నవభారత రాజ్యాంగము :—** అమాత్యత్రయము చేసిన సూచనల ననుసరించి యేర్పడిన భారతరాజ్యాంగ పరిషత్తు 1946 డిశంబరునుండి సమావేశముల జరుప నారంభించెను. ఈ పరిషత్తు 1949 నవంబరునకు ఒక సమగ్రమైన రాజ్యాంగమును తయారు చేసెను. ఈరాజ్యాంగము 1950 జనవరి 26 నుండి అమలులోనికి వచ్చెను. దీని ననుసరించి ఇండియన్ యూనియన్ సర్వస్వతంత్ర ప్రజాస్వామిక రిపబ్లిక్‌గా అవతరించెను.

బాబూ రాజేంద్రప్రసాద్ అధ్యక్షుడయ్యెను. డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణన్ ఉపాధ్యక్షపదవిని స్వీకరించెను. పండిత జవహరులాల్ నెహ్రూ ప్రధానమంత్రి యయ్యెను.

**రాష్ట్రములు :—** రాజ్యాంగమునందు భారతదేశమునగల రాష్ట్రములు నాలుగు తరగతులుగ విభజింపబడి యున్నవి. A తరగతి రాష్ట్రములు గవర్నరులచే పరిపాలింపబడెడివి. పూర్వము సంస్థానములుగ నున్న భాగములు B తరగతి రాష్ట్రములుగ పొందుపరుపబడినవి. వీనిని రాజప్రముఖులు పరిపాలించెడివారు. అజ్మీరు, భోపాల్, మణిపూర్ మొదలగు చిన్నచిన్న రాష్ట్రములు చీఫ్ కమీషనర్లచే పరిపాలింపబడెడివి. ఇవి C తరగతి రాష్ట్రములుగ పిలువబడెడివి. అండమాన్ - నికోబారు దీవులు D తరగతి రాష్ట్రముగ పేర్కొనబడెను. ఈ రాష్ట్రమునకు చీఫ్‌కమీషనరు పాలకుడుగ నుండెడివాడు.

## భాషారాష్ట్ర సమస్య

భాషారాష్ట్రములు :—భారతదేశములోని రాష్ట్రముల విభజనకు యెట్టి సూత్రమును అనుసరింపబడలేదు. ఆంగ్లేయులు ఈరాష్ట్రముల నన్నింటిని ఒకేమారు తమ యేలుబడిలోనికి తెచ్చుకొనియుండకపోవుటచే భాషాప్రాతిపదిక గాని, భౌగోళిక పరిస్థితులను గాని, ఆర్థికస్తోమతనుగాని, పరిపాలనా సౌలభ్యమునుగాని దృష్టియందుంచుకొనలేక పోయిరి. తమ కెప్పుడు లభించిన ప్రాంతమున కప్పుడే పరిపాలనా వసతులను కల్పించిరి. ఇట్లుండుటచే రాష్ట్రములలో క్రమపద్ధతి లేకుండ పోయెను. ప్రత్యేకభాష, సంస్కృతి, ఆచారవ్యవహారములు గల వేర్వేరు జాతులవారు ఒకేరాష్ట్రమున నుండుటయు, ఒకే భాష సంస్కృతిగల జాతి వేర్వేరు రాష్ట్రములందు చీలియుండుటయు తటస్థించెను. నేటి ప్రజాస్వామిక యుగమున యిట్లుండుట వాంఛనీయము గాదు. శాసనసభలలో వేర్వేరు భాషలవారు చేరియుండుటచే తమ మాతృభాషలను వదలి అందరకు తెలియు వేరొకభాషలో కార్యకలాపములను జరుపవలసి వచ్చును.

జాతివికాసమునకు, పరిపాలనా సౌలభ్యమునకు భాషాప్రయుక్త రాష్ట్రములు అత్యవసరములని గుర్తింపబడెను. ఈ భాషారాష్ట్ర సమస్యపై నొక నివేదికను తయారుచేయుటకై ఫజల్ ఆలి నాయకత్వమున రాష్ట్రపునర్నిర్మాణ సంఘమను నొక సంఘము నియమింపబడెను. ఈ సంఘమువారు దేశమంతయు పర్యటించి ప్రముఖుల అభిప్రాయములను సేకరించి ఒక నివేదికను తయారు జేసిరి. ఈ నివేదిక నాధారముగ జేసికొని రాష్ట్ర పునర్నిర్మాణ చట్టము రూపొందింపబడినది. 1956 నవంబరు 1వ తేదీనుండి క్రొత్త రాష్ట్రములు అమలులోనికి వచ్చినవి. ఇందు 14 గవర్నరు పాలిత రాష్ట్రములు, 6 చీఫ్ కమీషనరు పాలితరాష్ట్రములు గలవు. చీఫ్‌కమీషనరు రాష్ట్రముల పాలనపై కేంద్రప్రభుత్వము అజమాయిషీ జరుపును.

రాష్ట్రములు :—1. ఆంధ్రప్రదేశ్, 2. అస్సాము, 3. బీహారు, 4. బొంబాయి, 5. కేరళ, 6. మధ్యప్రదేశ్, 7. మద్రాసు, 8. మైసూరు, 9. ఒరిస్సా, 10. పంజాబు, 11. రాజస్థాన్, 12. ఉత్తరప్రదేశ్, 13. పశ్చిమబెంగాలు, 14. జమ్మూ-కాశ్మీరము.

కేంద్రపాలిత రాష్ట్రములు :— 1. ఢిల్లీ, 2. హిమాచల ప్రదేశ్, 3. మణిపూరు, 4. త్రిపుర, 5. అండమాన్ - నికోబారు దీవులు, 6. లక్షదీవులు - మినికాయి - అమిన్ దీవులు.

## నవచైతన్యము

పంచవర్ష ప్రణాళికలు :— రత్నగర్భ యని పేర్గాంచిన భారతదేశము పరరాజ్యపాలనలో దుర్భర దారిద్ర్యము ననుభవించెను. జనసంఖ్య హెచ్చెను. కాని ఆర్థికపుష్టిని కల్గించు పరిశ్రమలు క్షీణించెను. అనారోగ్యము, కరువులు తాండవించెను. స్వాతంత్ర్యము నొందిన పిదప మన దేశ అభ్యుదయమునకై మన ప్రభుత్వము అనేక విధముల ప్రయత్నించుచున్నది. ప్రజల ఆర్థికస్థితిని చక్కబెట్టుట, నిరుద్యోగమును నిర్మూలించుట, అధిక ఆహారోత్పత్తి జేయుట, దేశములోని సహజసంపదను సద్వినియోగము జేయుటకొరకై ఒక నిర్ణీత పథకములో పనిచేయవలసిన అవసర మేర్పడెను. అందులకై 1950 మార్చి నెలలో ప్రణాళికా సంఘము (Planning Commission) యేర్పాటు చేయబడెను. ప్రథమ పంచవర్ష ప్రణాళికలో అధిక ఆహారోత్పత్తికి ప్రాధాన్యత ఈయబడెను. వ్యవసాయాభివృద్ధికై అనేక ప్రాజెక్టులు నిర్మింపబడెను. రెండవ పంచవర్ష ప్రణాళికలో పరిశ్రమాభివృద్ధికై కృషిజరుగుచున్నది. దీనితోపాటు ప్రజలలో ఆరోగ్యాభివృద్ధి, విద్యావ్యాప్తి జరుగుచున్నది. వ్యావసాయికముగ, పారిశ్రామికముగ, సామాజికముగ భారతదేశము పురోగమించుచున్నది. సర్వతోముఖాభివృద్ధిని సాధించుచున్నది.

## అ ధ్యా య ము 17

# అంతర్జాతీయ సంఘర్షణలు

## 1. మొదటి ప్రపంచయుద్ధము

**కారణములు :—** మొదటి ప్రపంచయుద్ధమునకు యూరపు రాజ్యముల సామ్రాజ్యకాంక్ష మూలకారణముగ పేర్కొనవచ్చును. బ్రిటన్ సూర్యాడస్తమించని మహాసామ్రాజ్యమును సంపాదించెను. ఫ్రాన్సు ఇండో చైనాను జయించి ఆఫ్రికాయందు అనేక వలసలను స్థాపించియుండెను. రష్యా యూరల్ పర్వతములనుండి పసిఫిక్ మహాసముద్రమువరకు గల విశాల భూభాగమున కధిపతియై యుండెను. నూతనముగ జాతీయవికాసముగాంచి, పారిశ్రామికముగ అభివృద్ధి నొందిన జర్మనీ వలసల స్థాపనకు పూనుకొనెను. ఆఫ్రికా, చైనాల యందు కొన్ని వలసల నేర్పరచుకొనగల్గెను. సామ్రాజ్య నిర్మాణ కార్యక్రమమున జర్మనీ, బ్రిటన్, ఫ్రాన్సు, రష్యాలకు సంఘర్షణ ఉద్భవించెను.

సామ్రాజ్య నిర్మాణమున ముందంజ వేయలేకపోయినను జర్మనీ వర్తకరంగమున యితర యూరపురాజ్యముల నధిగమించెను. అది అపారమగు ఖనిజసంపదను కలిగియుండుటే అందులకు ముఖ్య కారణము. జర్మను వస్తువులు యూరపురాజ్యములకేగాక ప్రపంచ నలుమూలలకు కుప్పతిప్పలుగ వచ్చిపడెను. జర్మనీ పోటీకి బ్రిటన్ నిలువజాలదయ్యెను.

20 వ శతాబ్ది తొలి దశాబ్దమునకు యూరపురాజ్యములు రెండు ముఖ్యకూటములుగ నేర్పడెను. జర్మనీఆధిక్యతను గాంచి ఆరాజ్య సహకారమునకై ఇటలీ, ఆస్ట్రియాలు మిత్రత్వసంధి గావించుకొనెను. ఈకూటమి 'మిత్రకూటమి' (Triple Alliance) అని పేర్కొనబడెను. జర్మను ప్రాబల్యమునకు ఈసుచెందిన రాజ్యములు

ప్రత్యర్థికూటమిగా నేర్పడెను. ఈ కూటమి 'మిత్రమండలి' (Triple Entite) అని పిలువబడెను. ఇందు బ్రిటన్, ఫ్రాన్స్, రష్యాలు చేరియుండెను.

ఇరుపక్షములవారు ఒకరినొకరు నమ్మజాలక యుద్ధసన్నాహములను చేసికొనసాగిరి. జర్మనీ శాస్త్రవిజ్ఞానమున మిక్కిలి అభివృద్ధిని సాధించి అనేక మారణాస్త్రములను నిర్మించెను. కెయిజరుగనున్న విల్హెల్మ్ II గొప్ప ఆశావాది. యూరపునందు జర్మనీకి అగ్రస్థానము సంపాదింపవలెననియు అందులకు యుద్ధ మవసరమనియు ప్రచారము చేసెను. సైనిక, నౌకాబలములను ఇతోధికముగ పెంచెను. జర్మనీ సన్నాహములనుగాంచి ఫ్రాన్స్ 1913 లో నిర్బంధ సైనికవిధానమును ప్రవేశపెట్టెను. రష్యా ఫ్రాన్సు ననుసరించెను.

జర్మనీ టర్కీతో మైత్రిని పెంపొందించుకొనుటకై బెర్లిన్ బాగ్దాదులను రైలుమార్గముతో కలుపుటకు పథకములను రూపొందించెను. ఈ పరిణామము బ్రిటన్ అసూయానుమానములను పెంపొందించెను.

1905 - 1914 మధ్య ఉత్పన్నమైన అనేక సంఘటనలు ప్రపంచ యుద్ధమును తప్పనిసరి యగునట్లు చేసెను. 1905 లో ఫ్రాన్సు మొరాకో నాక్రమింప ప్రయత్నించెను. కాని జర్మనీ అడ్డుపడి సుల్తాను స్వాతంత్ర్యమునకు భంగము కలుగకుండ జేసెను. 1908 లో ఆస్ట్రియా చక్రవర్తి తనయాజమాన్యమున నున్న బాస్నియా, హెర్జిగోవినాలను తనరాజ్యమున కలిపివేసికొనెను. ఇందులకు జర్మనీ మద్దతు లభించెను. కాని బాస్నియా సెర్బియాతో చేర సంకల్పించి యుండుటచే ఆస్ట్రియా సెర్బియాలకు వైరము సంప్రాప్తించెను. 1911 లో ఫ్రాన్స్ మొరాకో రాజధానియగు ఫెజ్ పై దండయాత్ర నడిపెను. జర్మనీ తన ఆక్షేపణను తెలిపి మొరాకోనుండి ఫ్రెంచి వారిని తరిమివేయుటకు సిద్ధపడెను. తుదకు ఫ్రాన్సు జర్మనీకి ఫ్రెంచి కాంగో నిచ్చి మొరాకో నాక్రమించగల్గెను.

ఆస్ట్రియా యువరాజగు ఫెర్డినాండు బాస్నియా రాజధాని యగు సెరాజెవోనందు 1914 జూన్ 28 న ఒక సెర్బియన్ పౌరునిచే

చంపబడెను. ఆస్ట్రియా సెర్బియాపై యుద్ధమును ప్రకటించెను (జులై 28). రష్యా సెర్బియాకు అండగా నిలతునని వెల్లడించెను. కావున జర్మనీ రష్యాపై యుద్ధమును ప్రకటించెను (ఆగస్టు 1). తన మిత్రరాజ్యమగు రష్యాకు సహాయపడవలెనని ఫ్రాన్సు తలచుటచే జర్మనీ ఫ్రాన్సుపై యుద్ధమును ప్రకటించెను (ఆగస్టు 3). ఇటలీ తటస్థముగ నుండుటకు నిశ్చయించుకొనెను. ఫ్రాన్సుపై దండెత్తుటకు కెయిజరు తనసైన్యములను తటస్థరాజ్యమైన బెల్జియంగుండ నడిపించెను. బెల్జియంతో మిత్రత్వసంధి చేసికొనియున్న బ్రిటన్ జర్మనీపై యుద్ధమును ప్రకటింపవలసి వచ్చెను (ఆగస్టు 4). ఆస్ట్రియా - సెర్బియా వైరము తుదకు ప్రపంచయుద్ధముగ మారినది. 1914 నవంబరులో టర్కీ జర్మనీతో చేరినది. 1915 లో ఇటలీ, 1917 లో అమెరికా సంయుక్తరాష్ట్రములు మిత్రమండలిలో చేరినవి.

యుద్ధవిధానము :— మొదటి ప్రపంచయుద్ధము యెన్నడూ కని విని యెరుగనంతటి అపూర్వ యుద్ధముగ పరిణమించినది. అనేక నూతన ఆయుధములు, యుద్ధపరికరములు ప్రవేశపెట్టబడినవి. ఇది శాస్త్రజ్ఞుల, సాంకేతిక ప్రవీణుల యుద్ధమని చెప్పిన సమంజసముగ నుండును. ప్రథమమున జర్మనులు ఇంగ్లండుపై దాడి జరుపుటకు జెప్లిన్లు, విమానములు; నౌకలను ముంచివేయుటకు జలాంతర్గాముల నుపయోగించిరి. బ్రిటన్ టాంకులను ప్రవేశపెట్టెను. విషవాయువు వాతావరణమును కలుషితము చేసినది. యుద్ధము ప్రతిఖండమునకు వ్యాపించినది. ప్రతిదేశము తన సర్వసంపదను యుద్ధవినియోగమునకై సిద్ధపరచినది.

1914 లో ప్రారంభమైన యుద్ధము నాలుగు సంవత్సరములు కొనసాగినది. ప్రథమమున మిత్రకూటమి (Triple Alliance) కే విజయము లభించెను. కాని అమెరికా సంయుక్తరాష్ట్రముల సహాయమందగనే మిత్రమండలి (Triple Entite) కి విజయావకాశములు హెచ్చెను. ఫ్రాన్స్, బెల్జియములనుండి జర్మను సైనికులు తరిమివేయబడిరి. జర్మను ప్రజలు కెయిజరు ప్రభుత్వమున కసంతృప్తి వెల్లడించిరి. తుదకు విజయావకాశములు సన్నగిల్లి, ప్రజాభిప్రాయము వ్యతిరేక

మగుటతో కెయిజరు రాజ్యపరిత్యాగముచేసి హాలెండునకు పారిపోయెను. జర్మనీ రిపబ్లిక్ గా ప్రకటింపబడెను. 1918 నవంబరు 11 న నూతన ప్రభుత్వము మిత్రమండలితో సంధిచేసికొనుట కంగీకరించి యుద్ధము నంతమొందించెను. కాన్‌స్టాంటినోపిల్ ఆక్రమింపబడుటతో టర్కీ లొంగిపోయెను. బల్గేరియా, ఆస్ట్రియాలును మిత్రమండలికి దాసోహమనెను.

1919 లో పారిస్‌నందు ముప్పది సభ్యరాజ్యముల ప్రతినిధులతో సంధిషరతులు రూపొందించబడెను. ఇందు విల్సన్, లాయడ్‌జార్జి, క్లెమెంషూ ప్రముఖపాత్ర వహించిరి. మిత్రమండలి జర్మనీతో వర్సెయిల్స్ సంధి చేసికొనెను. దీనివలన ఆల్సెయి, లొరైను రాష్ట్రములు, సార్ మండలములోని బొగ్గుగనులు ఫ్రాన్సునకు దక్కెను. పశ్చిమప్రష్యా పోలెండునకు కలుపబడెను. జర్మను వలసలు మిత్రమండలిలోని రాజ్యములకు మాండేటరీలుగా లభించెను. జర్మనీ యుద్ధఖర్చులక్రింద కొన్నివేల మిలియనుపౌనులను మిత్రమండలికి చెల్లింపవలసి వచ్చెను.

ఆస్ట్రియా చక్రవర్తి రాజ్యపరిత్యాగము చేసెను. ఆస్ట్రియా సామ్రాజ్యము విచ్ఛిన్నమై జాతిరాజ్యములు వెలసినవి. బాల్టిక్ మండలమున నూతన జాతిరాజ్యము లేర్పరుపబడినవి. టర్కీ యూరపులోని సామ్రాజ్యభాగమంతయు వదలుకొనినది. ఆసియాఖండములోని సామ్రాజ్యభాగము మాండేటరీ రాజ్యములుగ చేయబడెను. ఈ యుద్ధముతో ప్రపంచ రాజకీయపటము పునః చిత్రితమైనది.

యుద్ధ ప్రభావము :— ఈ యుద్ధమువలన 10 మిలియనుల జనులు హతులైరి. 20 మిలియనులు క్షతగాత్రులైరి. సుమారు 186,000,000,000 డాలర్ల ధనము వ్యయమైనది. ప్రతిదేశమునందు ఆహారకొరత యేర్పడినది. పరిశ్రమలు పతనమైనవి. జీవితావసరవస్తువులే కరువై ప్రజ లల్లాడిరి. అంటువ్యాధులు వ్యాపించినవి. దేశముల ఆర్థిక ప్రతిపత్తి అధ్వాన్నమై జాతీయఋణము ఆకాశమునంటినది. ఈ పరిస్థితులు సాంఘిక, రాజకీయ రంగములందు విప్ల

వాత్మకమైన పరిణామములకు దారితీసినవి. విజయమందిన దేశములు ఓడిపోయిన దేశములు సమముగనే యుద్ధఫలితము ననుభవించెను.

యుద్ధమువలన యూరపునందు రాచరికము రూపుమాసినది. ఆస్ట్రియా, జర్మనీ, రష్యా, టర్కీ, మాంటినిగ్రో లందు నూతన జాతి రాజ్యములు వెలసినవి. పోలెండు, జెకోస్లవేకియా, యుగోస్లావియా, ఫిన్‌లాండ్, లాట్వియా, లిథూవేనియా, ఇస్తోనియా, జర్మనీ, ఆస్ట్రియా, హంగరీ, రష్యాలకు నూతన సరిహద్దులేర్పడినవి. రాచరికస్థానమును ప్రజాప్రభుత్వము లాక్రమించినవి. భూస్వామిక వర్గపు రాజకీయపలుకుబడి నశించినది. రష్యా విప్లవమునకు మొదటి ప్రపంచయుద్ధ మొక కారణమని చెప్పవచ్చును.

## 2. రెండవ ప్రపంచ యుద్ధము

కారణములు :— మొదటి ప్రపంచ యుద్ధానంతరము 1919 లో చేయబడిన శాంతిసంధి ఫలితమె రెండవ ప్రపంచయుద్ధ మనవచ్చును. వర్సెయిల్స్ సంధియందు జర్మనీని సంప్రదించకయె ఆ రాజ్యముపై భరింపరాని భారము మోపబడెను. జర్మనులకు యూరపు రాజ్యములయెడ ద్వేషము ప్రబలెను. ఈ ద్వేషాగ్నిని హిట్లరు రగుల్కొలిపి యుద్ధమునకు కారకుడయ్యెను.

వలసరాజ్య స్థాపనయందు ప్రపంచ రాజ్యములమధ్య ఈర్ష్యాసూయలు పొడసూపెను. జర్మనీవలసలన్నియు ఆక్రమింపబడెను. మొదటి ప్రపంచయుద్ధ విజయములందు తమకు తగిన భాగస్వామ్యము లభించలేదని ఇటలీ, జపానులు అసంతృప్తిని ప్రకటించెను. బ్రిటన్, ఫ్రాన్స్, అమెరికా సంయుక్తరాష్ట్రములు, బెల్జియం, హాలెండ్, పోర్చుగల్ రాజ్యములు ప్రపంచభూభాగమున అధికభాగముపై గుత్తాధికారము కలిగియుండుట జర్మనీ, ఇటలీ, జపానులకు భరింపరాని విషయమయ్యెను. ఈ రాజ్యములు బలహీనరాజ్యముల నాక్రమించి తమ అధికార ప్రాబల్యములను పెంపొందించుకొన దలచెను. 1931 లో జపాను మంచూరియాపై, 1935 లో ఇటలీ అబిసీనియాపై

దండెత్తెను. 1936 నుండి జర్మనీ తన సామ్రాజ్య నిర్మాణకార్యక్రమమునకు పూనుకొనెను.

1919 సంధి సూత్రములందు జాతీయత, స్వయంనిర్ణయాధికార సూత్రములకు అధిక ప్రాముఖ్య మీయబడెను. కాని యుద్ధానంతర మేర్పడిన నూతన రాజ్యములందు ఒకేజాతికి చెందినవారు అల్ప సంఖ్యాక వర్గములుగ చీల్చబడి యుండిరి. ఆస్ట్రియా ప్రజలు జర్మను తెగకు చెందినవారు. జెకోస్లవేకియా, పోలెండులందును జర్మను లుండిరి. హిట్లరు జాతీయస్వయంనిర్ణయాధికార సూత్రమును ప్రతిపాదించి ఆయా రాజ్యభాగములు జర్మనీకి చెందవలెనని దండయాత్రలను ప్రారంభించెను.

మొదటి ప్రపంచ యుద్ధానంతరము శాంతిస్థాపన కేర్పడిన నానాజాతిసమితి దురాక్రమణదారుల నరికట్టలేకపోయెను. ప్రపంచ రాజ్యములచే ఆయుధవిసర్జన చేయింపలేకపోయెను. మిత్రమండలి లోని రాజ్యములు ఆయుధవిసర్జన కంగీకరింపకపోవుటచే హిట్లరు నిర్బంధసైనిక విధానమును ప్రవేశపెట్టి అనేక మారణాస్త్రములను నిర్మించి యుద్ధసన్నద్ధు డయ్యెను.

రాజకీయ సిద్ధాంతభేదములును అంతర్జాతీయ సంఘర్షణకు దారి తీసెనని చెప్పవచ్చును. జర్మనీ నాజీ విధానమును, ఇటలీ ఫాసిజమును నమ్మి సైనిక నియంతృత్వ పాలనయందు విశ్వాసమును ప్రకటించెను. ప్రజాస్వామిక రాజ్యముల కీ సిద్ధాంతములు వెగటుగ తోచెను.

హిట్లరు దురాక్రమణ విధానము రెండవ ప్రపంచయుద్ధమునకు తక్షణ కారణమని చెప్పవచ్చును. ఇటలీ, జపానులు జర్మనీతో చేరి అక్షరాజ్యములు (Axis Powers) గా నేర్పడెను. బ్రిటన్, ఫ్రాన్సు, రష్యాలు మిత్రమండలిగా నేర్పడి అక్షరాజ్యముల నెదిరించెను. జపాన్ పెరల్ హార్బరుపై దాడిచేయుటతో అమెరికా సంయుక్త రాష్ట్రములు మిత్రమండలిని చేరెను.

అక్షరాజ్యములకు ఘనవిజయములు కలిగెను. యూరపునం దధిక భాగము జర్మనీ కైవశమయ్యెను. ఆఫ్రికాయందును అక్షరాజ్యములవారు రోమెల్ సేనాధిపత్యమున అనేక విజయముల నందిరి. జపాను పసిఫిక్ మండలమున తన ప్రతాపము జూపి ఆగ్నేయాసియా రాజ్యములను కబళించెను. 1935 నుండి 1942 వరకు అక్షరాజ్యముల విజృంభణ వరికట్టుట అసాధ్యమయ్యెను. 1941 జూన్‌లో హిట్లరు మాస్కో ఆక్రమణకై బయలుదేరెను. 1942 శీతకాలమున యుద్ధము తీవ్రతరమయ్యెను. రష్యనులు తమ పంటపొలములను పట్టణములను నాశనముచేసిరి. రష్యను శీతకాలము జర్మనులకు ప్రథమ శత్రువయ్యెను. నెపోలియన్ వలెనే హిట్లరు రష్యా దండయాత్రతో పతనోన్ముఖుడయ్యెను. ఈ దండయాత్రవలన హిట్లరు 318,000 సైనికులను కోల్పోయెను. మిత్రమండలికి విజయావకాశములు హెచ్చెను. జర్మనులు వెనుకకు తరుముబడిరి. ఆఫ్రికాయందు అక్షరాజ్యములకు స్థానము లేకుండ చేయుబడెను. 1943 సెప్టెంబరులో మిత్రమండలి సైన్యములు ఇటలీయందు ప్రవేశించెను. ముసోలినీ పదభ్రష్టుడై చంపబడెను. హిట్లరు ఆత్మహత్య చేసికొనెను. 1945 లో జర్మనీ లొంగిపోయెను. అమెరికా సంయుక్తరాష్ట్రములు జపానులో హిరోషిమా, నాగసాకిలపై అణ్వాస్త్రములను ప్రయోగించుటతో జపాను లొంగిపోయెను. రెండవ ప్రపంచయుద్ధము అంతమయ్యెను.

యుద్ధప్రభావము :— రెండవ ప్రపంచయుద్ధము మొదటి ప్రపంచయుద్ధముకన్న కడు దారుణముగ పరిణమించినది. ఈయుద్ధమున అంతరిక్ష మెక్కువగ వినియోగింపబడినది. అతిభయంకరమైన మారణాస్త్రములు ప్రయోగింపబడినవి. ధన ప్రాణనష్టములు అంచనాకందకుండపోయినవి. హిట్లరు రష్యను దండయాత్రవలననే ఇరు పక్షములందు సుమారు 10 మిలియనుల ప్రజలు హతులైరి. ఈ యుద్ధములవలన ఇరుపక్షములకు సమాన ప్రతిఫలమే దక్కెనని రూఢియైనది.

యుద్ధానంతరము సంధిషరతుల నిర్ణయించుటకై అగ్రరాజ్య పంచకమైన అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సు, రష్యా, చైనాలు అనేక

సమావేశములను జరిపెను. ఇటలీ, రుమేనియా, బల్గేరియా, హంగరీ, ఫిన్‌లాండులతో ప్రత్యేక సంధులు చేసికొనబడెను. ఇటలీ తన సామ్రాజ్య భాగములను వదులుకొని యుద్ధఖర్చుల క్రింద 360 మిలియను డాలర్లు చెల్లించుట కొడంబడెను. జర్మనీవిషయమున యింతవరకు అగ్రరాజ్యములకు సమాధానము కుదురలేదు. జపానునందు కొంత కాలము సైనికపాలన యేర్పరుపబడినది. శాంతి సుస్థాపితమైన పిదప పార్లమెంటరీ విధానమున నియమబద్ధమైన రాచరికము ప్రవేశపెట్టబడినది.

## 3. రష్యా విప్లవము

**జారుల పరిపాలన :—** పీటరు, కాథరైనుల కాలమున రష్యా రాజకీయముగ మిక్కిలి బలసంపన్న మయ్యెను. తరువాత సింహాసన మెక్కిన జారులు (Tsars) రష్యా రాజ్యవిస్తీర్ణమును పెంచివేసిరి. 20 వ శతాబ్దమునకు రష్యా సామ్రాజ్యము బాల్టిక్ సముద్రమునుండి పసిఫిక్ సముద్రమువరకు, ఆర్కిటిక్ సముద్రమునుండి నల్లసముద్రము వరకు వ్యాపించెను. పారిశ్రామిక విప్లవఫలితముగ రష్యాలో కొన్ని పరిశ్రమలు నెలకొల్పబడెను. కార్మికుల సంఖ్యయు హెచ్చెను. విప్లవ మునకు పూర్వము ఫ్రాన్సులో ఏర్పడిన పరిస్థితులే రష్యాయందును ఏర్పడెను. జారులు నిరంకుశపాలకులై యుండిరి. ధనికవర్గమువారు విశేష సౌకర్యములను పొందుచుండిరి. కర్షకులు, కార్మికులు మిక్కిలి హీనస్థితియందుండి పలుకష్టముల నెదుర్కొనవలసి వచ్చెను. వర్గపోరాటము ప్రారంభమయ్యెను. ఇట్టిస్థితిలో మొదటి ప్రపంచ యుద్ధము వచ్చెను. రష్యనులు తమ బాధలను మరచి చక్రవర్తి కండగా నిలచి యుద్ధరంగమున కురికిరి. కాని తగిన ఆయుధములు లేక ఓటమినే పొందవలసి వచ్చెను. ఇందులకు జారు అసమర్థతయే కారణమని ప్రజలు ఈసడింపసాగిరి. యుద్ధమువలన పన్నులభార మధికమయ్యెను. దేశమున ఆహారధాన్యముల కొరత యేర్పడెను. దేశ నలుమూలల విప్లవచ్ఛాయలు పొడసూపెను.

**మార్క్సు ప్రబోధము :—** టాల్‌స్టాయి, గోర్కి, టర్గినీవ్ అను గ్రంథకర్తలు నాటి రష్యా సాంఘిక పరిస్థితులను వర్ణించుచు వ్యంగ్యరచనలను సాగించిరి. ప్రజల దైన్యజీవితమును హృదయ విదారకముగ చిత్రించిరి. ఈ రచనలవలన రష్యనులలో రాజకీయ సంచలనము కలిగెను. కాని రష్యనులలో విప్లవోద్రేకమును కలిగించినవాడు మార్క్సు. ఇతడు జర్మను దేశీయుడగు యూదు (Jew) జాతీయుడు. 1848 లో సామ్యవాద సిద్ధాంతమును ప్రకటించి వర్గ పోరాటమునకు దోహదపరచెను. మార్క్సు సిద్ధాంతము రష్యా విప్లవమునకు శంఖారావ మయ్యెను.

**1917 మార్చి విప్లవము :—** 1917 వ సంవత్సరమునకు రష్యాలో కొన్ని విప్లవపక్షములు, కొన్ని సంస్కరణ పక్షములు బయలుదేరెను. వీనిలో కార్మిక, కర్షక వర్గమునకు చెందిన సోషల్ డెమోక్రాటిక్ పార్టీ ముఖ్యమైనది. కాలక్రమమున ఇందు రెండు చీలికలేర్పడెను. అధిక సంఖ్యాకులు బోల్షివిక్కులనియు, అల్పసంఖ్యాకులు మెన్షివిక్కులనియు పిలువబడసాగిరి. 1917 మార్చిలో పెట్రోగ్రాడ్ పట్టణము కార్మిక, కర్షక సమూహములతో నిండిపోయెను. ఈ గుంపులను చెదరగొట్టుటకై జారు సైన్యముల నంపెను. కాని వారును విప్లవకారులతో చేయిగలిపిరి. జారు నిస్సహాయుడై రాజ్య పరిత్యాగము చేసెను.

**నవంబరు విప్లవము :—** ప్రభుత్వాధికారము ప్రజల హస్తగత మయ్యెను. మెన్షివిక్కు పార్టీ నాయకుడగు కెరన్‌స్కీ మధ్యతరగతివారికి ప్రాబల్యముగల ప్రభుత్వమును నెలకొల్పెను. ఈ విప్లవ సమయమున కార్మికపక్ష నాయకుడగు లెనిన్ దేశబహిష్కృతుడై యుండెను. విప్లవానంతరము లెనిన్ రహస్యముగ రష్యాచేరెను. కార్మిక, కర్షక ప్రాబల్యముగల ప్రభుత్వము కావలెనని ప్రచారము బయలుదేరదీసెను. 1917 నవంబరులో మరల నొక విప్లవము సంభవించెను. కెరన్‌స్కీ ప్రభుత్వమును కూలద్రోసి బోల్షివిక్కుల నాయకత్వమున లెనిన్ నూతన ప్రభుత్వమును స్థాపించెను. ఈవిప్లవమునకు అండగా 'రెడ్ ఆర్మీ' అను సైన్యమును తయారు చేసెను.

విప్లవమును విజయవంతము జేయుటలో ట్రాట్‌స్కీ లెనిన్‌కు కుడిభుజముగా పనిచేసెను.

రిపబ్లిక్ స్థాపన :— లెనిన్ ప్రభుత్వమును కూలద్రోయుటకై అనేకులు ప్రయత్నింపసాగిరి. వీరికి బ్రిటిషువారును, ఫ్రెంచివారును సహాయపడిరి. దేశమున అంతర్యుద్ధము ప్రారంభమయ్యెను. ట్రాట్‌స్కీ నాయకత్వమున రెడ్ ఆర్మీ విప్లవ వ్యతిరేకుల నందరను తుడిచిపెట్టెను. 'ఛెకా'యను గూఢచారిదళము దేశ నలుమూలల వ్యాపించెను. ప్రభుత్వ వ్యతిరేకు లందరు పరలోకమునకు పంపబడిరి. రష్యాలో కమ్యూనిష్టు ప్రభుత్వమునకు సుస్థిరత యేర్పడెను. లెనిన్ భూమినంతయు ప్రభుత్వాధీనము చేసికొని రైతుల కిచ్చివేసెను. జర్మనీతో సంధిచేసికొని యుద్ధమును ముగించెను. 1923 లో రష్యాయందు సోవియట్ పంచాయతీల పాలనను ప్రవేశపెట్టుచు క్రొత్త రాజ్యాంగమును వెలువరించెను. దీని ననుసరించి రష్యా 'యూనియన్ ఆఫ్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్స్' (Union of Soviet Socialist Republics — U. S. S. R.) అయ్యెను. ప్రారంభమున నందు నాలుగు రిపబ్లిక్కులు మాత్రమే యుండె. 1940 వ సంవత్సరమునకు 16 రిపబ్లిక్కులుగా చేయబడెను. 18 సంవత్సరములు ప్రాయముగల ప్రతి కార్మిక, కర్షకునకు ఓటుహక్కు లభించెను. 1924 లో లెనిన్ మరణింపగా కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శిగనున్న స్టాలిన్ అధికారమును స్వీకరించెను.

స్టాలిన్ (1924 - 1953) :— 1924 లో రష్యాకు నియంతయైన జోసెఫ్ స్టాలిన్ కడు సమర్థుడు. రష్యాను భూతల స్వర్గముగ చేయవలెనన్నదియే ఇతని ఆశయము. అందులకై రష్యాయొక్క వ్యావసాయిక, పారిశ్రామిక ఉత్పత్తులను పెంచవలెనని కాంక్షించెను. దేశ సహజసంపద నంతయు వినియోగములోనికి తేవలెనని కోరెను. లెనిన్ ఏర్పరచిన ఆర్థిక విధానమునకు స్వస్తిచెప్పి నూతన విధానమును ప్రవేశపెట్టెను. దేశసంపదయంతయు ప్రభుత్వపరము జేసెను. స్వంత ఆస్తి యనునది లేకుండ జేసెను. ఉత్పత్తిని పెంచుటకై మూడు సప్తవర్ష ప్రణాళికలను తయారుజేసెను. సహకార వ్యవ

సాయ క్షేత్రములను నెలకొల్పెను. నదుల కానకట్టలు నిర్మించి నీటి పారుదల వసతులను కలుగజేసెను. విద్యుదుత్పత్తి నధికము జేసెను. అనేక కర్మాగారములను నెలకొల్పి దేశమును పారిశ్రామికముగ నభివృద్ధిపరచెను. తన విధానములకు వ్యతిరేకులైనవారిని నిర్దాక్షిణ్యముగ తొలగించివేసెను. దేశమున నిరక్షరాస్యత నిర్మూలించుటకు నిర్బంధవిద్యను ప్రవేశపెట్టెను. శాస్త్రవిజ్ఞానమును పెంపొందించెను.

రెండవ ప్రపంచయుద్ధము రష్యా అభివృద్ధికి గొడ్డలిపెట్టయ్యెను. దేశ ఉత్పాదితశక్తినంతయు యుద్ధమునకే వినియోగింపవలసివచ్చుటచే స్టాలిన్ పథకముల కంతరాయము కలిగెను. అయినను స్టాలిన్ రెండవ ప్రపంచయుద్ధమున తన నైపుణ్యమును ప్రదర్శించి మిత్రమండలి విజయమునకు కారకుడయ్యెను. స్టాలిన్ తన శక్తిసామర్థ్యములచే బ్రిటన్, ఫ్రాన్స్, అమెరికాలను అబ్బురపరచెను.

యుద్ధానంతరము స్టాలిన్ చర్చిల్, ట్రూమన్‌లతో కలసి ఐక్యరాజ్యసమితి నిర్మాణమునకు, ప్రపంచశాంతికి కృషిచేసెను. కాని మిత్రమండలిలో అభిప్రాయభేదము లేర్పడెను. రష్యా ఇతర దేశములలోని కమ్యూనిస్టుపార్టీలకు ప్రోత్సాహమిచ్చుచున్నదనియు, ఆ రాజ్యములలో కమ్యూనిస్టు ప్రభుత్వము లేర్పరచి తన ఆధిక్యతను పెంపొందించుకొన చూచుచున్నదను శంక బయలుదేరెను. మిత్రమండలిలో చీలిక లేర్పడినవి. అమెరికా, రష్యాలమధ్య పోటీ హెచ్చెను. యుద్ధానంతరము రష్యా మారణాయుధముల ఉత్పత్తి యందు పశ్చిమరాజ్యములతో సరిదూగెను. నేడు రష్యా ప్రపంచ రాజ్యములలో ప్రముఖస్థానమును సంపాదించుకొనియున్నది. శాస్త్ర విజ్ఞానమున ఇతర దేశములకంటె ముందడుగు వేసినది. అంతరిక్షమునకు ఉపగ్రహములను పంపగల్గినది. అయినను రష్యా శాంతి కొరకే పాటుబడుచు అణ్వస్త్ర నిషేధమునకై కృషి చేయుచున్నది. పంచశీలయందు విశ్వాసముగల రాజ్యములలో రష్యా యొకటి. రష్యా అధినేతయగు కృశ్చేవ్ అమెరికా యాత్ర, అమెరికా అధ్యక్షుడగు ఐసెన్‌హోవర్ రష్యా సందర్శనము సత్ఫలితముల నీయగలవని ఆశింపవచ్చును.

# 4. చైనాలో కమ్యూనిజము

కమ్యూనిజ వ్యాప్తి :— సన్ యెట్ సెన్ అనంతరము చాంగ్ కై షేక్ చైనా అధ్యక్షుడయ్యెను. 1928 లో ఉత్తర ప్రాంతపు యుద్ధోన్మాదుల నణచి రాజధానిని నాన్ కింగునకు మార్చెను. దేశ అభ్యుదయమునకై అనేక సంస్కరణలను ప్రవేశపెట్టెను. విద్యాభివృద్ధికై పాఠశాలలను స్థాపించెను. విదేశ వస్తువులను బహిష్కరించి స్వదేశ పరిశ్రమలను ప్రోత్సహించెను. కాని యిత డనేక కష్టముల నెదుర్కొనవలసి వచ్చెను. చాంగ్ పాశ్చాత్య రాజ్యములను ఆర్థిక సహాయమునకై అర్థించెను. కాని నిష్ఫలమయ్యెను. కమ్యూనిజమును ప్రపంచమంతయు వ్యాపింపజేయవలెనని కాంక్షించిన లెనిన్ చైనాకు ఆర్థికసహాయమును చేసెను. ప్రజలకు రష్యాపైనను, కమ్యూనిస్టు సిద్ధాంతములపైనను అభిమానము హెచ్చెను. క్యుమింగ్ టాంగ్ పక్షమున చీలికలేర్పడి అతివాదపక్షము కమ్యూనిజమును స్వీకరించెను. చాంగ్ వారిని సమాధానపరచి రాజకీయ ఐక్యత సాధించలేకపోయెను. వారిపై కఠిన చర్యలను తీసికొనెను. కమ్యూనిస్టులు ఉత్తరప్రాంతమునకు తరలి అచట రెడ్ ఆర్మీని తయారుచేసిరి. అంతర్యుద్ధము సాగినది. చాంగ్ ప్రభుత్వము బలహీనమయ్యెను. సింకియాంగ్ రిపబ్లిక్ యయ్యెను. ఫ్రెంచివారు ఇండోచైనా నాక్రమించిరి. టిబెట్ చైనా ఆధిపత్యమును త్రోసిపుచ్చెను. మంగోలియా, ఔటరు మంగోలియాలలో కమ్యూనిజము బలపడిపోయెను. జపాను చైనా భూభాగముల నాక్రమింపసాగెను. మంచూరియా జపాను వశమయ్యెను. 1938 లో జపాను పెకింగ్, షాంగ్ హై, నాన్ కింగ్ ల నాక్రమించెను. చైనాయం దధికభాగము జపాను వశమయ్యెను. రాజధాని చుంకింగ్ నకు మార్చబడెను. చైనా జపాను యుద్ధము రెండవ ప్రపంచ యుద్ధముతో కలసిపోయెను. చాంగ్ కై షేక్ సర్వ సైన్యాధిపతియై యుద్ధమును సాగించెను. చైనీయులు తమలోని రాజకీయ భేదములను విస్మరించి శత్రువు నెదుర్కొనిరి. 1945 లో జపాను మిత్రమండలికి లొంగిపోవుటతో చైనా - జపాను యుద్ధము ముగిసెను.

పీపుల్స్ రిపబ్లిక్ :— యుద్ధము ముగిసిన దేగాని చైనా రాజకీయములు కుదుటబడలేదు. దేశమున కొంతభాగము నేషనలిస్టుల ప్రాబల్యమున, మరికొంతభాగము కమ్యూనిస్టుల ప్రాబల్యమున నుండెను. 1946వ సంవత్సరమున నేషనలిస్టు అసెంబ్లీ నాన్‌కింగ్ నందు సమావేశమై ఒక నూతన రాజ్యాంగమును తయారుచేసెను. ఇందు కమ్యూనిస్టులు పాల్గొనలేదు. నూతన రాజ్యాంగము వారికి నచ్చలేదు. 1947 నుండి నూతన రాజ్యాంగము అమలునకు వచ్చినది. 1948 లో ఎన్నికలు జరిగెను. చాంగ్ అధ్యక్షుడుగా ఎన్నుకొనబడెను. ఈ ఎన్నికతో చైనాలో మరల అంతర్యుద్ధము చెలరేగినది. చాంగ్ కమ్యూనిస్టులతో రాజీచేసికొన యత్నించెను. కాని వారిమరతుల కంగీకరింపజాలక పోవుటచే ఫలితము దక్కలేదు. 1949 ఏప్రిల్‌లో కమ్యూనిస్టులు నాన్‌కింగ్ నాక్రమించుటతో చాంగ్ తన అనుచరులతో ఫార్మోజాదీవి కేగెను. నేషనలిస్టు చైనా ప్రభుత్వమును నిలబెట్టుటకు అమెరికా సంయుక్త రాష్ట్రములు, ఇంగ్లండు, ఫ్రాన్సులు చేసిన ప్రయత్నములు ఫలింపలేదు. దేశము కమ్యూనిస్టుల వశమైనది.

1949 లో కమ్యూనిస్టుల ఆధిపత్యమున పెకింగ్ రాజధానిగ చైనా పీపుల్స్ రిపబ్లిక్ స్థాపింపబడినది. మావ్‌సెటుంగ్ అధ్యక్షపదవిని స్వీకరించెను. చౌఎన్‌లై ప్రధానమంత్రిత్వమున పీపుల్స్ చైనా ప్రగతిని సాధించినది. దేశము వ్యావసాయికముగ, పారిశ్రామికముగ అభివృద్ధి జెందుచున్నది. ఈ ప్రభుత్వమును అమెరికా సంయుక్తరాష్ట్రములు గుర్తించలేదు. కాని రష్యా, ఇండియాలు ఈ ప్రభుత్వమును గుర్తించి ఐక్యరాజ్యసమితిలో చైనాకు సభ్యత్వమిప్పింప ప్రయత్నించుచున్నవి.

నేషనలిస్టు చైనా ప్రభుత్వమున నున్న ఫార్మోజాను పీపుల్స్ చైనా రాజ్యభాగముగ జేసికొనుటకై ప్రయత్నములు జరుగుచున్నవి. చైనాతీరదీవుల విషయమై రెండు ప్రభుత్వములును వివాదపడి యుద్ధమునకు దిగెను. ఐక్యరాజ్యసమితి జోక్యముతో యుద్ధము అంత

మైనది. చైనా రాజకీయములు స్థిరరూపమును దాల్చి, ప్రపంచ శాంతికి భంగము వాటిల్లదని ఆశింపవచ్చును.

## 5. ఇటలీ - ఫాసిజము

ముసోలినీ :— మొదటి ప్రపంచయుద్ధమున ఇటలీ మిత్ర మండలి పక్షమున పోరాడి విజయము గాంచెను. ట్రెంటినో, ఇస్ట్రియా యను ప్రాంతములు ఇటలీకి దక్కెను. కాని ఇటాలియనుల కిది తృప్తి కలిగింపలేదు. దీనికితోడు యుద్ధమువలన ఇటలీ ఆర్థికవ్యవస్థకు దెబ్బ తగిలెను. జీవితావసర వస్తువుల ధరలు పెరిగిపోయెను. దేశమున నిరుద్యోగులసంఖ్య హెచ్చెను. దేశపరిస్థితులను చక్కబరచుటకు విక్టరు ఇమాన్యూలు III ప్రభుత్వ మేమియు చేయలేకపోయెను. ఇట్టి స్థితిలో ముసోలినీ యను ఫాసిస్టుపక్ష నాయకుడు అధికారమును హస్తగత మొనరించుకొనుటకై గడంగెను.

ముసోలినీ మొదటి ప్రపంచయుద్ధమున సైనికుడుగా చేరి పోరాడెను. 1919 లో ఫాసిస్టు పార్టీని స్థాపించెను. ఫాసిస్టు సూత్రములలో నమ్మకము, నాయకునియెడ విధేయత, క్రమశిక్షణ, దేశభక్తి ప్రతివ్యక్తికి అవసరమని ప్రబోధించెను. దేశమున వ్యాపించుచున్న కమ్యూనిజము నణచివేసెను. బ్లాక్ షర్ట్సు (Black Shirts) లను స్వచ్ఛంద సైనికులను తయారుచేసెను. 1922 అక్టోబరునకు ముసోలినీ అనుయాయుల సంఖ్య 3 లక్షల వరకు పెరిగెను.

ముసోలినీ రాజ్యాధికారమును పొందుటకై తన అనుయాయులతో రోమునగరమును ప్రవేశించెను. అంతర్యుద్ధమున కిచ్చగింపక ఇమాన్యూల్ III ముసోలినీకి ముఖ్యమంత్రి పదవినిచ్చి సమాధాన పరచెను. ముసోలినీ క్రమముగా ఉన్నత పదవు లన్నిటియందు ఫాసిస్టులను నిల్పి తుదకు ఇటలీకి నియంత (Dictator) యయ్యెను. ముసోలినీ దేశ ఆర్థిక స్థితిని చక్కబరచుటకై అనేక సంస్కరణలను ప్రవేశపెట్టెను. పరిశ్రమలను పెంపొందించెను. వర్తక వ్యాపారముల నభివృద్ధిచేసెను. బంజరుభూములను సాగులోనికి తెచ్చి వ్యవసాయాభివృద్ధి గావించెను. ముసోలినీ నాయకత్వమున దేశము

పారిశ్రామికముగ, వ్యావసాయికముగ అభివృద్ధి గాంచెను. ప్రజలితనిని ఇల్ డ్యూస్ (నాయకుడు) అని పిలచెడివారు.

ముసోలినీ తన అధికారమున కెదురు జెప్పువారు లేకుండ జేసివైచెను. ప్రజాస్వామ్యము, వ్యక్తి స్వాతంత్ర్యముల త్రోసిపుచ్చి, యుద్ధము, నాయకునియెడ విధేయతలను ప్రబోధించెను. 1935 లో అబిసీనియాపై దండెత్తి జయించెను. ఆల్బేనియాను హస్తగత మొనరించుకొనెను. జపాను, జర్మనీలతో కూడి అక్షరాజ్యములుగ నేర్పడి రెండవ ప్రపంచ యుద్ధమును సాగించెను. కాని ఈ యుద్ధమున ఇటలీకి ఓటమి తప్పలేదు. ప్రజలు ముసోలినీ నిరంకుశత్వమును గర్హించి తిరుగుబాటొనర్చిరి. 1945 ఏప్రిల్ 9 న ముసోలినీ కాల్చి చంపబడెను. ఇతని మరణముతో ఇటలీలో ఫాసిజ మంతరించినది. 1946 లో ఇటలీలో రిఫరెండము (Referendum) జరిగినది. రిపబ్లిక్ ప్రభుత్వము స్థాపింపబడినది. యుద్ధమువలన విపరీత నష్టమునకు గురియైన ఇటలీ అమెరికా సంయుక్తరాష్ట్రముల ఆర్థిక సహాయముతో కోలుకొనుచున్నది.

## 6. జర్మనీ - నాజీయిజము

**యుద్ధానంతరము జర్మనీ :—** పారిశ్రామిక కేంద్రమగు సార్ మండలము పోవుటచే జర్మనీ ఆర్థికముగ దెబ్బతినెను. మిత్రమండలి విధించిన అపరాధమును చెల్లించుకొనలేక పోయెను. నిరుద్యోగుల సంఖ్య హెచ్చెను. ఇట్టిస్థితిలో అమెరికా పెట్టుబడులను పెట్టి జర్మనీలోని పరిశ్రమల నభివృద్ధిచేసెను. కాని 1929 - 32 సంవత్సరములలోని ఆర్థికమాంద్యమువలన అమెరికా తన పెట్టుబడులను తిరిగి తీసికొనెను. ఆర్థిక సహాయ మాగిపోవగనే జర్మనీస్థితి కడు దుర్భరమయ్యెను. ఇట్టి స్థితినుండి దేశము నుద్ధరించినవాడు హిట్లరు.

**హిట్లరు :—** హిట్లరు ఆస్ట్రియాలో జన్మించెను. మొదటి ప్రపంచ యుద్ధమున సైనికుడుగ పనిచేసెను. యుద్ధానంతరము రాజకీయములలో దిగి వర్కర్సు పార్టీని స్థాపించెను. అదియే నేషనల్

సోషలిస్టుపార్టీగ మారెను. దీనినే నాజీపార్టీ యందురు. హిట్లరు కమ్యూనిజము నెదిరించుచు తనపార్టీ కధిక ప్రాబల్యమును కల్గించెను. 1923 లో విప్లవ ప్రయత్నములు జరిపి కారాగారబద్ధుడయ్యెను. తాను జర్మనీ అధిపతి యగుచో తానాచరించు విధానమును తెల్పుచు 'మీన్ కాంఫ్' అను గ్రంథమును రచించెను. ఇది నాజీలకు వేద మనవచ్చును.. మొదటి ప్రపంచ యుద్ధమున యూదులుచేసిన ద్రోహమువలననే జర్మనీ ఓడిపోయెననియు, వర్సెయిల్సు సంధి జర్మనీకి అన్యాయము చేసెననియు, దానికి ప్రతీకార మొనర్చుట ప్రతి జర్మను పౌరుని విధియనియు హిట్లరు ప్రబోధించెను.

కారాగారమునుండి విడుదల కాగనే హిట్లరు 'బ్రౌనుషర్టులు' అను సైనిక దళమును తయారు చేసెను. తన ఉపన్యాసములచే జర్మనుల హృదయమును చూరగొనెను. 1933 వ సంవత్సరపు ఎన్నికలలో నాజీపార్టీ అధిక సంఖ్యా బలమును పొందెను. హిట్లరు ఛాన్సెలరు పదవిని పొందెను. క్రమముగ సంపూర్ణాధికారమునుపొంది 1934 లో నియంతయై ఫ్యూరర్ (Fhuerer) బిరుదు వహించెను.

హిట్లరు నాజీపార్టీకి మిగుల ప్రచారమును కల్గించెను. వ్యతిరేకులైనవారి నందర నణగ ద్రొక్కెను. యూదుల హింసించెను. పరిశ్రమల నభివృద్ధి గావించెను. దేశమున సమస్త వస్తువులు పుష్కలముగా ఉత్పత్తి యగునట్లు చేసెను. నిర్బంధ సైనిక విధానమును ప్రవేశపెట్టి యువకు లందరు యుద్ధకళయం దారితేరునట్లు చేసెను. ఆయుధములను విరివిగా ఉత్పత్తి చేసెను. జర్మనులు ఆర్య జాతికి చెందినవా రనియు, వారు ప్రపంచమంతను ఏలగల సమర్థులనియు ప్రచారముచేసి ప్రజలలో యుద్ధోన్మాదమును రేకెత్తించెను. జపాను, ఇటలీలతో కలసి అక్షరాజ్యములు (Axis Powers) అను కూటమి నేర్పరచెను.

రెండవ ప్రపంచయుద్ధము :— హిట్లరు 1936 లో రైన్ లాండు నాక్రమించెను. 1938 లో ఆస్ట్రియాపై దండయాత్ర జరిపెను. 1939 నాటికి జెకోస్లవేకియా హిట్లరు ఆక్రమణలోనికి పోయెను. పోలెండు జర్మను సామ్రాజ్యమున జేర్చబడెను. 1941 లో హిట్లరు

మాస్కోపై దండయాత్ర చేసెను. బ్రిటన్, ఫ్రాన్సు, రష్యాలు మిత్ర మండలిగా నేర్పడి అక్షరాజ్యముల నెదిరించెను. అక్షరాజ్యములు ప్రథమమున విజయములను గాంచినను 1945 నకు పరాజయమందెను. హిట్లరు ఆత్మహత్య గావించుకొనెను. యుద్ధము సమాప్తమయ్యెను.

జర్మనీ పరిపాలనా విషయమున రష్యాతో అమెరికా సంయుక్త రాష్ట్రములకు అభిప్రాయభేదము లేర్పడెను. తూర్పుజర్మనీ రష్యా ఆధిపత్యమునను, పశ్చిమజర్మనీ అ. సం. రాష్ట్రములు, ఫ్రాన్సు, బ్రిటనుల ఆక్రమణయందు నుండెను. తుదకు దేశము రెండుగ విభజింపబడెను. 1949 లో రష్యా ఆధిపత్యమున తూర్పుజర్మనీ డెమొక్రాటిక్ రిపబ్లిక్‌గ నేర్పడెను. పశ్చిమజర్మనీ ఫెడరల్ రిపబ్లిక్‌గ నేర్పడెను. బెర్లిన్ నగరముపై ఇరుపక్షములవారు అధికారము కలిగి యుండిరి.

ప్రస్తుతము జర్మనీ ఏకీకరణకై ఇరుపక్షములవారు మంతనములను సాగించుచున్నారు. శిఖరాగ్రచర్చలు జరుగుచున్నవి. అగ్ర రాజ్యముల మధ్య అభిప్రాయభేదములు తొలగి మరల జర్మనీ ఏకరాజ్యముగ రూపొందుననియు ప్రపంచశాంతికి బెర్లిన్ సమస్య, జర్మనీ ఏకీకరణ సమస్య భంగము కలిగింపవనియు ఆశింపవచ్చును.

# అధ్యాయము 18

# శాంతి సమస్య

## 1. నానాజాతి సమితి (The League of Nations)

**యుద్ధము-శాంతి :—** చరిత్ర ప్రారంభము నుండియు ప్రపంచమున అనేక యుద్ధములు జరిగినవి. ఎందరో తమ ప్రాణముల నర్పించిరి. గొప్ప విజేతల మనిపించుకొనుటకై అలెగ్జాండరు, సీజరు మొదలగువారు యుద్ధములను గావించిరి. రాజ్యకాంక్షచే కొందరు బలదర్పము గల రాజులు పొరుగు రాజ్యముల కబళించిరి. బలవంతుడు బలహీనునిపై అధికారము చెలాయించవలెనను సూత్రమే అనేక యుద్ధములకు కారణమయ్యెను. మహమ్మదీయమత స్థాపనలో అరబ్బులు మతావేశముతో అనేక యుద్ధములను గావించియుండిరి. పాలస్తీనా కొరకై క్రూసేడులు ప్రారంభమయ్యెను. ఆధునిక యుగారంభమున కేథలిక్, ప్రొటెస్టెంటు రాజ్యముల మధ్య ముప్పది సంవత్సరముల కాలము ఘోరయుద్ధము సాగెను. పారిశ్రామిక విప్లవ ఫలితముగ యూరపు రాజ్యములు వలసల కొరకు, వర్తక సౌకర్యముల కొరకు అనేక యుద్ధములను చేసినవి. యూరపు రాజకీయములలో ప్రాబల్యముకొరకు ఆంగ్లో ఫ్రెంచి రాజ్యకూటములమధ్య అనేక యుద్ధములు జరిగెను. ఈ యుద్ధములవలన కొన్ని కొన్ని క్రొత్త సామ్రాజ్యములు వెలసెను. కొన్ని సామ్రాజ్యములు నామరూపములు లేకుండపోయెను. కాని శాశ్వతమైన ఫలితమేమియు కలుగుటలేదు. ఈ యుద్ధము లన్నింటికి మూలకారణము మానవునిలోని అత్యాశ యనియె చెప్పవచ్చును. యుద్ధము వినాశహేతువని యుగయుగములనుండి మహాపురుషులు ఉద్ఘాటించుచునే యున్నారు. కాని యుద్ధములు మాత్రము సాగుచునే యున్నవి. యుద్ధము మానవునిలోని రాక్షసత్వమును బయల్పరచుచున్నది. శాంతివలన మానవుడు దైవత్వము నొందుచున్నాడు. యుద్ధమువలన ధన, ప్రాణ నష్టములు కలుగుచున్నవి. శాంతిశంఖమును పూరించుటతో దేశము సకల సౌభాగ్యములను

పొందుచున్నది. కళలకు, సారస్వతమునకు వికాసము కలుగుచున్నవి. సాంఘికాభివృద్ధికి యుద్ధనివారణే తరుణోపాయము.

అధునికయుగమున ప్రపంచరాజ్యము లన్నియు పరస్పరాశ్రయములై యున్నవి. ప్రపంచమున నేమూలయందైనను యుద్ధము సంభవించిన దాని ప్రభావము యుద్ధమున పాల్గొనిన దేశములందే గాక ప్రపంచ రాజ్యము లన్నిటియందు కనబడుచున్నది. అధునిక మారణాస్త్రములవలన ప్రపంచవాతావరణ మంతయు విషపూరితము కాగలదు. మరియొక యుద్ధమే సంభవించిన ప్రపంచ రాజ్యముల భవిష్యత్తు శూన్యమై రాజ్యము లన్నియు సర్వనాశనమై పోగలవు. మానవ విజ్ఞానము మానవ నాశనమునకే కారణము కాగలదు.

మానవులు భిన్న స్వభావులగుటచే భేదాభిప్రాయము లుండక తప్పదు. ఇట్లే ప్రపంచ రాజ్యముల మధ్యను ఏర్పడవచ్చును. యూరపునందు మధ్యయుగమున అభిప్రాయ భేదమును తేల్చుకొనుటకు ద్వంద్వయుద్ధము చేసెడివారు. అట్లే వివిధ రాజ్యములును యుద్ధములు చేయుచుండెడివి. వివాద పరిష్కారమునకు యుద్ధ మొక్కటియె మార్గము కాదు. మధ్యవర్తి పరిష్కారము వలనను వివాదముల తీర్చుకొనవచ్చునను సూత్రము ననుసరించియె 1907 లో యూరపునందు అంతర్జాతీయ మధ్యవర్తి పరిష్కార సభ నేర్పాటు జేసిరి. దాని కార్యస్థానము హాలెండు ముఖ్యపట్టణమగు హేగ్ నగరమున నేర్పాటుగావించిరి. వివిధ రాజ్యములవారు తమతమ వివాదములను ఈ సభయందే తీర్చుకొందమని ప్రమాణముచేసిరి. కాని ఏడేండ్లకే మొదటి ప్రపంచయుద్ధము ప్రారంభమైనది.

ఆస్ట్రియా, సర్వియా రాజ్యములమధ్య వచ్చిన చిన్న తగాదా ప్రపంచయుద్ధమునకు నాందియైనది. కాని వివిధ రాజ్యముల సామ్రాజ్యకాంక్షకు ఈ యుద్ధము సాధనమైనది. ఈ యుద్ధమునందు ప్రత్యక్షముగ పాల్గొనిన దేశములు, పరోక్షముగ సహాయము చేసిన దేశములు తీవ్రనష్టమునకు గురియయ్యెను. యుద్ధానంతరము ప్రపంచ రాజ్యములు తమ తమ తప్పిదములను తెలిసికొని ఇకముందు

యుద్ధమనునది లేకుండ జేయుటకై నానాజాతిసమితి (The League of Nations) యను అంతర్జాతీయసంస్థ నేర్పాటు చుగొనెను.

నానాజాతిసమితి :— 1920 లో వర్సెయిల్స్‌సంధి ననుసరించి ఇరువదియారు ప్రాథమిక సూత్రములతో నానాజాతిసమితి వెలసినది. అమెరికా అధ్యక్షుడగు ఉడ్రోవిల్సన్, ఫ్రెంచిప్రధానియగు క్లెమెన్సు, బ్రిటిష్ ప్రధానియగు లాయడ్‌జార్జి కృషిఫలితమె నానాజాతిసమితి. యుద్ధనివారణె సమితి ముఖ్య లక్ష్యము. వివాదములను సామరస్య పూర్వకముగ మధ్యవర్తిత్వముచే పరిష్కరింప జేయవలెనని సమితి ఆశయము. దురాక్రమణదారులనుండి బలహీనరాజ్యములను కాపాడుట సమితి కర్తవ్యము. మానవజాతి వికాసమునకు పాటుబడవలెనని సమితి ఆకాంక్ష.

నానాజాతిసమితి సాధారణసభ సంవత్సరమున కొకసారి సమావేశమగును. సమితి కౌన్సిలునందు 15 సభ్య రాజ్యములకు ప్రాతినిధ్యమివ్వబడినది. ఇందు ఇంగ్లండు, ఫ్రాన్సు, ఇటలీ, జపానులు శాశ్వత సభ్యులు. ఈసభ సంవత్సరమునకు మున్నూరు సమావేశమగును. సమితి కార్యాలయము స్విడ్జర్లాండులోని జెనివా నగరమున నెలకొల్పబడినది. హేగ్ నగరమున అంతర్జాతీయ న్యాయసభ యేర్పరుపబడినది.

నానాజాతిసమితియందు 50 రాజ్యములకు పైగా సభ్యత్వము నొందెను. వర్సెయిల్సు సంధిసూత్రములు, మాండేటరీ రాజ్యపాలనా వ్యవహారములలో అభిప్రాయభేదము కలుగుటవలన అమెరికా సంయుక్తరాష్ట్రము లిందు చేరలేదు. 1926 లో జర్మనీకి, 1934 లో రష్యాకు సమితి సభ్యత్వ మివ్వబడినది.

సమితి విజయములు :— అంతర్జాతీయ రంగమున నానాజాతి సమితి కొన్ని విజయములను సాధించినదని చెప్పవచ్చును. లొకర్నో ఒడంబడిక (Locarno Pact - 1925), కెలోగ్ ఒడంబడిక (Kellog Pact-1928) ల నేర్పరచి యూరపు రాజ్యముల సరిహద్దు సమస్యలను పరిష్కరించి, వివాదములు సామరస్యపూర్వకముగ తీర్మానించుకొనవలెనని ఉద్ఘాటించెను. అంతర్జాతీయ కార్మికశాఖ ప్రపంచములోని

వివిధ దేశముల కార్మికుల సంక్షేమమునకై అనేక సూచనలను చేసెను. సమితి ఆధ్వర్యమున నాన్‌సెన్ కాందిశీకులకు పునరావాస సౌకర్యములను కలిగించుటలో అహర్నిశములు పనిచేసి నోబెల్ బహూమతి నందెను. అంటువ్యాధుల నివారణకై సమితిగావించిన కృషి ప్రశంసనీయము.

**సమితి లోపములు :—** ప్రపంచ రాజ్యములలో ప్రముఖమైన సంయుక్త రాష్ట్రముల కిందు సభ్యత్వము లేదు. చాలకాలమువరకు రష్యా ఇందు చేర్చుకొనబడలేదు. ఈ సమితిలో లేని రాజ్యములపై దీని కెట్టి అధికారము లేదు. దురాక్రమణచేసిన రాజ్యముపై ఆర్థిక ఆంక్షలు విధించుట తప్ప ఈ సమితి చేయగల్గిన దేమియు లేదు. మాండేటరీ రాజ్యపాలనయందు బ్రిటన్, ఫ్రాన్స్‌ల సామ్రాజ్య తత్వము నరికట్టలేక తుదకారాజ్యముల కీలుబొమ్మయి తన ప్రతిష్ఠను కోల్పోయెను.

మొదటి ప్రపంచయుద్ధమున ఓడిపోయిన రాజ్యములపై గెలు పొందిన రాజ్యములు జూపిన దమననీతి ఫలితముగ రెండవ ప్రపంచ యుద్ధము వచ్చినది. అగ్రరాజ్యములు ఆయుధ విసర్జన చేయకపోవుట వలనను, మాండేటరీ రాజ్యములపై యూరపు రాజ్యములు చూపిన సామ్రాజ్యతత్వ విధానమువలనను రెండవ ప్రపంచయుద్ధము సంభ వించుట, నానాజాతిసమితి నశించుట జరిగినదని చెప్పవచ్చును. జపాను మంచూరియాపై, జర్మనీ రైనులాండుపై, ఇటలీ అబిసీని యాపై జరిపిన దురాక్రమణల ఫలితమె రెండవ ప్రపంచయుద్ధము.

## 2. ఐక్యరాజ్యసమితి(The United Nations Organisation)

**శాంతి సమస్యలు :—** రెండవ ప్రపంచయుద్ధము ప్రపంచ ప్రజలకు కనువిప్పయ్యెను. అనేక క్లిష్టసమస్య లేర్పడెను. ఈ సమ స్యలు ప్రపంచమంతటకు సంబంధించినవై యుండుటే విశేషము. యుద్ధమునందు జయించుటకంటె శాంతిని నెలకొల్పుట కష్టసాధ్యమని గుర్తింపబడెను. యుద్ధనివారణే శాంతికాదు. మానవునకు యుద్ధ భయమును తొలగించి, వానిచుట్టును అభ్యుదయ వాతావరణమును

సృష్టించుటయే శాంతి. శాంతివలన మానవుడు సర్వతోముఖాభివృద్ధి గాంచవలయును. కావుననే ఐక్యరాజ్యసమితియందు అనేక విభాగములు నేర్పరచి ప్రపంచ సమస్యల నన్నింటిని పరిష్కరింపబూని యున్నారు.

నేటి ప్రపంచమున వివిధరాజ్యములు తమతమ సంకుచితమైన జాతీయ భావములను వీడలేదు. అగ్రరాజ్యముల ఆశలకు అంతు లేకుండ నుండెను. వివిధరాజ్యములు వర్తక వ్యాపారములందు అనేక ఆంక్షలను, నిబంధనలను పెట్టియున్నవి. నిరుద్యోగసమస్య ప్రతిదేశమును కలవరపరచుచున్నది. ఆటంబాంబు, హైడ్రోజన్ బాంబు మొదలగు అణ్వస్త్రముల ఉత్పత్తి విరమింపబడలేదు. ఈ మారణాస్త్రప్రయోగములు సాగుచునే యున్నవి. శాస్త్రవిజ్ఞానము నానాటికి పెంపొంది అనేక నూతన విషయములు వెల్లడగుచున్నవి. ఈ విజ్ఞానము, ఈ అణుశక్తి మారణహోమమున కాహుతిచేయక మానవ కళ్యాణమునకు వినియోగింపవలయుననియు, ఈ శాస్త్ర రహస్యములను కొన్ని దేశములు మాత్రమే తమ గుప్పిటబెట్టుకొనక ప్రపంచమున కంతకు వెల్లడింపవలయునను భావములు కార్యరూపము దాల్చలేదు. నానాటికి రంగుజాతుల విభేదములు పెరుగుచున్నవి. తెల్ల వారు నల్లవారిపై దమననీతిని ప్రయోగించుచునే యున్నారు. ఈ విభేదమును రూపుమాపుటెట్లు? రాజ్యాంగసిద్ధాంత భేదములు తీవ్రతర మగుచున్నవి. కమ్యూనిజ సిద్ధాంతమును నమ్మిన రష్యా ఉపగ్రహ రాజ్యకూటమికి, పెట్టుబడిదారీ విధానమును నమ్మిన ఆంగ్లో-అమెరికను కూటమికి మధ్యగల అగాధము పూడుటెట్లు? ఇట్టి క్లిష్ట సమస్యల పరిష్కారమునకే ఐక్యరాజ్య సమితి అవతరించినది.

ఐక్యరాజ్య సమితి :— 1945 సంవత్సరము ఏప్రియల్‌లో మాల్టా సమావేశమున రూజ్‌వెల్టు, స్టాలిన్, చర్చిల్ ప్రభృతుల సమావేశ చర్చల ఫలితమే ఐక్యరాజ్యసమితి. ఇది 1945 అక్టోబరు 24 న స్థాపింపబడినది. ఈ సమితి కార్యాలయము శాన్‌ఫ్రాన్సిస్కో నగరమున ఏర్పాటు గావింపబడినది. అంతర్జాతీయ శాంతిని

నెలకొల్పి, అంతర్జాతీయ సహకారమును పెంపొందించుటే ఈ సమితి ప్రధాన లక్ష్యము. నేడు ఈ సమితియందు 82 రాజ్యములు సభ్యత్వము నొందియున్నవి.

**ముఖ్యాంగములు :—** సర్వసభ్య సభ (General Assembly), భద్రతా సంఘము (Security Council), కార్యదర్శక మండలి (Secretariat) అంతర్జాతీయ న్యాయస్థానము (International Court of Justice), ధర్మ కర్తృత్వ సంఘము (Trusteeship Council), సాంఘిక, ఆర్థిక సంఘము (Social and Economic Council) అనునవి ఐక్యరాజ్య సమితిలోని ముఖ్యాంగములు.

**సర్వసభ్య సభ :—** సమితిలోని సభ్యరాజ్యము లొక్కొక్కటి అయిదుగురు సభ్యులను సర్వసభ్యసభకు పంపును. అయిదుగురు సభ్యులు ఒక్క ఓటును మాత్రమె కలిగియుందురు. ఈ సభ ఏటేటా కనీస మొకసారియైనను సమావేశమగును. ఐక్యరాజ్యసమితి విధానములను నిర్ణయించుట, భద్రతాసంఘమున కవసరమైన సిఫార్సులు చేయుట, వివిధశాఖల నివేదికలను పరిశీలించుట ఈ సభ నిర్వర్తించు ముఖ్య కార్యములు.

**భద్రతా సంఘము :—** ఐక్యరాజ్యసమితి కిది ముఖ్యాంగము. ప్రపంచ శాంతిభద్రతలను రక్షించుట ఈ సంఘ ముఖ్యబాధ్యత. సామరస్య పూర్వకముగ వివాదములు పరిష్కరింపబడకపోయినచో అవసరమైన సైనికచర్యను తీసికొనుటకును ఈ సంఘమునకు అధికారము గలదు.

భద్రతా సంఘమున అగ్రరాజ్య పంచకము శాశ్వత సభ్యత్వమును కలిగియున్నది. రెండేండ్ల కొకసారి సర్వసభ్యసభచే నెన్నుకొనబడిన ఆర్గురు ఇతర సభ్యులకును ఇందు స్థానము కల్పించబడినది. అగ్ర రాజ్య సభ్యులకు మాత్రమే వీటో (Veto) అధికారము గలదు.

**అంతర్జాతీయ న్యాయస్థానము :—** ఇందు సర్వసభ్య సభచే నెన్నుకొనబడిన 15 గురు న్యాయాధిపతు లుందురు. ప్రపంచ రాజ్యములు తెచ్చిన వ్యాజ్యెములను విచారించి, తీర్పు చెప్పుట ఈ న్యాయస్థానము ముఖ్య కర్తవ్యము.

**ధర్మకర్తృత్వ సంఘము :—** సర్వసభ్య సభచే నెన్నుకొనబడిన 14 రాజ్య ప్రతినిధుల కింద సభ్యత్వ ముండును. పరరాజ్య పాలనకు లోనై వెనుకబడియున్న రాజ్యములు స్వపరిపాలనార్హములుగ అభివృద్ధి చెందుటకు ధర్మకర్తృత్వ సంఘము పనిచేయును.

**సాంఘిక, ఆర్థిక సంఘము:—** యుద్ధములకు మూలకారణమగు సాంఘిక, ఆర్థిక అసమానత్వమును తొలగించుట ఈ సంఘ ముఖ్య ఆశయము. ఇందు 18 మంది సభ్యు లుందురు. ఈ సంఘము వివిధములగు ఉపసంఘములద్వారా తనపనిని నిర్వర్తించుచున్నది.

విద్యా విషయ పరిశీలనకు విద్యా, శాస్త్ర వైజ్ఞానిక సంఘము (UNESCO) పనిచేయుచున్నది. ఆహార పరిస్థితి, వ్యవసాయము మొదలగువానియందు ఆహార – వ్యవసాయ సంఘము (FAO) శ్రద్ధ జూపుచున్నది. కార్మిక సమస్యల పరిష్కారమునకై అంతర్జాతీయ కార్మిక సంఘము (ILO), ప్రపంచ ప్రజల ఆరోగ్య పరిరక్షణకై ప్రపంచ ఆరోగ్య సంఘము (WHO), ఆర్థికముగ వెనుకబడియున్న దేశములకు ఆర్థిక సహాయము చేయుటకై ప్రపంచ బ్యాంకు (BANK) కృషి చేయుచున్నవి. అంతర్జాతీయ మానిటరీ ఫండ్ (FUND), ఇంటర్నేషనల్ సివిల్ ఏవియేషన్ ఆర్గనైజేషన్ (ICAO), ఇంటర్నేషనల్ ట్రేడ్ ఆర్గనైజేషన్ (ITO), యూనివర్సల్ పోస్టల్ యూనియన్ (UPU), ఇంటర్నేషనల్ టెలి కమ్యూనికేషన్స్ యూనియన్ (ITU), ఇంటర్నేషనల్ ఫైనాన్స్ కార్పొరేషన్ (IFC), ఇంటర్నేషనల్ ఆటమిక్ ఎనర్జీ ఏజన్సీ (IAEA) అను సంస్థలును సాంఘిక ఆర్థిక సంఘమునకు అనుబంధముగ నున్నవి.

**కార్యదర్శక మండలి :—** సమితి కార్యకలాపములను సక్రమముగ నిర్వర్తించుటకు కార్యదర్శక మండలి గలదు. ఇందు దాదాపుగ 3000 మంది ఉద్యోగులు కలరు. డాగ్ హెమర్ షెల్డ్ సెక్రటరీ జనరల్ పదవిని నిర్వహించుచున్నారు.

దురాక్రమణదారులపై చర్య తీసికొనుటకు తగిన సైనికబలము, ఆర్థికబలము కలిగియుండుటచే ఐక్యరాజ్యసమితి నానాజాతిసమితికంటె పటిష్ఠమై యున్నది. కాని ఐక్యరాజ్యసమితి విజయమునకు ఆర్థిక, సైనికబలములకంటె సభ్యరాజ్యముల నైతికబలమే ముఖ్యమైనది.

# ఐక్యరాజ్య సమితి


భద్రతా సంఘము
ధర్మకర్తృత్వ సంఘము
సర్వసభ్య సభ
అంతర్జాతీయ న్యాయస్థానము
ILO
UNESCO
సాంఘిక, ఆర్థిక సంఘము
WHO
BANK
FAO
ITO
IFC
UPU
ITU
ICAO
IAEA
FUND
కార్యదర్శక మండలి

# అభ్యాసము

## మొదటి భాగము

## PART I

1. నైలునదీ లోయలోని ప్రాచీన నాగరికతా విశిష్టతను తెల్పుము.
2. సుమేరియను లెచట నివసించెడివారు ? వారి నాగరికతా విశేషము లేమి ?
3. బాబిలోనియనుల నాగరికతను వర్ణింపుము.
4. "అసిరియనులు ఆసియాఖండపు రోమనులు." ఎట్లు ?
5. సింధులోయలోని ప్రాచీన నాగరికతా విశేషములను తెల్పుము.
6. చీనా ప్రాచీనయుగ నాగరికతలోని ముఖ్యాంశము లెవ్వి ?
7. ఫినీషియనుల నాగరికతను తెల్పి వారు ప్రాచీన నాగరికతా ప్రచారకు (Missionaries of Ancient Civilisation) లెట్లైరో వివరింపుము.
8. మినోవన్ నాగరికతా విశేషములను తెల్పుము.
9. ప్రపంచపటమున ఈ క్రిందివానిని గుర్తింపుము.

   (1) మెంఫిస్ (2) థెబిస్ (3) జెరూసలెమ్ (4) క్రీట్ (5) నినవె (6) ఉర్ (7) బాబిలాన్ (8) నిప్పూర్ (9) డెడ్‌సీ (10) సినాయి (11) సూసా (12) ఫినీషియా (13) టైగ్రిస్ (14) చీనా మహాకుడ్యము (15) గిజా.

10. బౌద్ధమతవ్యాప్తి క్షీణతకు కారణములను తెల్పుము.
11. "జైన, బౌద్ధమతములు వైదికమతశాఖలే!" వ్యాఖ్యానింపుము.
12. మౌర్యుల పరిపాలనా విధానమును వర్ణింపుము.
13. "వేనవేల రాజులలో అశోకుడు ధ్రువతారగ వెల్గొందుచున్నాడు." విశదీకరింపుము.
14. శాతవాహన సామ్రాజ్యవైభవమును వర్ణింపుము.
15. రెండవ అశోకుడని పేర్గాంచినవాడెవరు ? అతనికా పే రెట్లు తగియున్నది?
16. గుప్తయుగమును స్వర్ణయుగమని యెట్లు చెప్పవచ్చును ?
17. సముద్రగుప్తుడు ఇండియన్ నెపోలియన్‌గ నెట్లు పేర్కొనదగి యున్నాడు ?
18. శ్రీహర్షుని గొప్పతనమేమి ?

19. భారతదేశమును దర్శించిన చీనాయాత్రికు లెవరు ? వారి రచనలనుగూర్చి తెల్పుము.

20. భారతదేశపటమున ఈ క్రిందివానిని గుర్తింపుము.

(1) ఆంధ్రసామ్రాజ్యము (2) సముద్రగుప్తుని విజయ యాత్రామార్గము (3) ఉజ్జయిని (4) తక్షశిల (5) నర్మద (6) పురుషపురము (7) పాటలీపుత్రము (8) అమరావతి (9) సాంచి (10) తామ్రలిప్తి (11) విజయపురి (12) మాస్కి (13) కామరూప (14) అజంత (15) నలంద.

21. "గ్రీకులయందు భిన్నత్వమున ఏకత్వము గలదు." విశదీకరింపుము.

22. గ్రీకుల నగరరాజ్యపాలననుగూర్చి తెల్పుము.

23. క్రీ. పూ. 5 వ శతాబ్దమున గ్రీకు పారశీక యుద్ధములనుగూర్చి క్లుప్తముగ వ్రాయుము.

24. పెరికిల్సు యుగము ఎథీనియనుల స్వర్ణయుగమని ఎట్లు చెప్పగలవు ?

25. అలెగ్జాండరు గొప్పతనమును ప్రశంసింపుము.

26. అలెగ్జాండరు ఆశయమేమి ? అందు అతడెంతవరకు సఫలీకృతుడయ్యెను ?

27. హెలెనిస్టిక్ నాగరికతనుగూర్చి క్లుప్తముగ వర్ణింపుము.

28. పటమున ఈ క్రిందివానిని గుర్తింపుము.

(1) క్రీ. పూ. 5 వ శతాబ్దమున గ్రీకుసామ్రాజ్యము. (2) అలెగ్జాండరు విజయయాత్రా మార్గము. (3) డరయస్ కాలమున పారశీక సామ్రాజ్యము. (4) నియార్కస్ నౌకామార్గము.

29. "రోము ఒక్కరోజులో నిర్మింపబడలేదు." వివరింపుము.

30. రోము ప్రజాసత్తాకరాజ్యముగ నెట్లు రూపొందెనో వివరింపుము.

31. రోమను సామ్రాజ్యమున రిపబ్లిక్ పతనమొందుటకు కారణములను తెల్పుము.

32. జూలియస్ సీజరు ప్రతిభను వర్ణింపుము.

33. రోమనుసామ్రాజ్య ప్రథమచక్రవర్తి యెవరు ? అతని పరిపాలనగూర్చి వ్రాయుము.

34. రోమను వారసత్వము (The Roman Legacy) ను గూర్చి క్లుప్తముగ వ్రాయుము.

35. పాగన్ రోము క్రైస్తవరోముగ ఎట్లు రూపొందినది ?

36. బైజాంటైను సామ్రాజ్య మెట్లు వెలసినది ? జస్టినియన్ ఘనత యెట్టిది ?

37. రోమనుసామ్రాజ్య పతనమునకు కారణము లెవ్వి ?

38. రోమనుసామ్రాజ్య విస్తీర్ణమును జూపు పటమును గీయుము.

## PART II

### A

ఈ క్రింది ప్రశ్నలకు ఇవ్వబడిన జవాబులలో సరియైనదానిని గుర్తింపుము.

1. అతిప్రాచీన నాగరికప్రదేశము

   (*a*) సింధులోయ (*b*) నైలునదీలోయ (*c*) మెసపొటేమియా (*d*) యాంగ్ ట్సీ నదీలోయ (*e*) పాలస్తీనా.

2. 'సెరికా' అని పిలువబడిన దేశము

   (*a*) చైనా (*b*) ఇండియా (*c*) జపాను (*d*) ఇటలీ (*e*) ఈజిప్టు.

3. వైదిక, బౌద్ధమతముల ముఖ్యసామ్యము

   (*a*) అహింస (*b*) యజ్ఞయాగాదులు చేయుట (*c*) కర్మసిద్ధాంతము (*d*) వర్ణవిభేదము (*e*) విగ్రహారాధన.

4. ధర్మమహామాత్యులను నియమించిన చక్రవర్తి

   (*a*) చంద్రగుప్తమౌర్యుడు (*b*) కౌటిల్యుడు (*c*) అశోకుడు (*d*) కనిష్కుడు (*e*) హర్షుడు.

5. మగధను జయించిన ఆంధ్రరాజు

   (*a*) గౌతమీపుత్ర యజ్ఞశ్రీ (*b*) కుంతలశాతకర్ణి (*c*) హాలుడు (*d*) గౌతమీపుత్రశాతకర్ణి (*e*) పులిమావి.

6. మహాయాన మత సిద్ధాంతకర్త

   (*a*) అశోకుడు (*b*) కనిష్కుడు (*c*) హర్షుడు (*d*) నాగార్జునుడు (*e*) ఫాహియాన్.

7. హర్షు నోడించిన దక్షిణ హిందూస్థానరాజు

   (*a*) విష్ణుగోపుడు (*b*) పులకేశి II (*c*) పులిమావి (*d*) శశాంకుడు (*e*) భాస్కరవర్మ.

8. గ్రీకుచరిత్రకు ఆధారమగు ఇతిహాసము

   (*a*) భారతము (*b*) రామాయణము (*c*) ఇలియడ్ (*d*) ఏథెన్సు (*e*) హోమరు.

9. పారశీక చక్రవర్తులలో అగ్రగణ్యుడు
(a) హమ్మురాబి (b) నెబుకడ్నజర్ (c) డరయస్ ✓ (d) అలెగ్జాండరు (e) అమెన్‌హాటప్.

10. థెర్మాపొలై యుద్ధముతో శాశ్వతకీర్తినిగాంచిన వీరుడు
(a) లియోనిడస్ (b) అలెగ్జాండరు (c) డరయస్ (d) పెరికిల్స్ (e) జరక్సిస్.

11. కార్తజీనియను విజేత
(a) హన్నిబాల్ (b) జూలియస్ సీజరు (c) పాంపే (d) హస్ద్రుబాల్ (e) స్కిపియో.

12. సీజరు వ్రాసిన గ్రంథము
(a) ఒడెస్సీ (b) కామెంటరీస్ (c) మెడిటేషన్స్ (d) ఏనియడ్ (e) రోముచరిత్ర.

13. రోమనుల ప్రథమ చక్రవర్తి
(a) జూలియస్ సీజరు (b) అగస్టస్ సీజరు (c) టైబీరియస్ క్లాడియస్ (d) నీరో (e) మార్కస్ ఆరిలస్.

14. అలెగ్జాండరు భారతదేశముపై దండయాత్ర
(a) క్రీ. పూ. 327 ✓ (b) క్రీ. పూ. 237 (c) క్రీ. శ. 273 (d) క్రీ. శ. 732 (e) క్రీ. పూ. 723.

15. క్రైస్తవమతమును రాజమతముగ ప్రకటించిన రోమనుచక్రవర్తి
(a) జస్టీనియన్ (b) డయోక్లీషియన్ (c) నీరో (d) థియోడోసియస్ (e) కాన్‌స్టంటైన్. ✓

## B

ఈ క్రిందివాక్యములను పూరింపుము.

1. ఏకేశ్వరోపాసనను ప్రబోధించిన ఫారో — .
2. ప్రపంచమున మొదటి చక్రవర్తినిగ పేర్గాంచిన వనిత — .
3. ప్రపంచమున ప్రథమ శిక్షాస్మృతిని వెలువరించిన రాజు — .
4. తేయాకును కనిపెట్టినవారు — .
5. బౌద్ధుల ముఖ్య మతగ్రంథము — .
6. మెగస్తనీసును రాయబారిగ పంపినవాడు — .
7. అశోకునకు గల బిరుదు — .
8. కనిష్కుడు పెంపొందించిన శిల్పము — .

9. రెండవ చంద్రగుప్తుని ఆస్థానపండితులకు —— అని పేరు.
10. హర్షుని ఆస్థానకవి —— .
11. ఎథీనియనుల ముఖ్యదేవత —— .
12. ఈజిప్టుపై దండయాత్ర జరిపిన పారశీక సామ్రాట్టు —— .
13. ఈజిప్టునందు అలెగ్జాండరు దర్శించిన ఆలయము —— .
14. అలెగ్జాండరు —— నకు శిష్యుడు.
15. అతిక్రూరుడుగ పేర్గాంచిన రోమనుచక్రవర్తి —— .
16. —— చక్రవర్తికాలమున రోమను న్యాయశాస్త్రము పూర్ణస్వరూపమును పొందెను.
17. ఎపిక్యూరియనులకు —— ముఖ్య సిద్ధాంతము.
18. క్రీస్తు శిష్యులను —— అందురు.
19. రోమనుసామ్రాజ్య పతనమునకు —— ముఖ్యకారణము.
20. బైజాంటైన్ చక్రవర్తులలో —— సుప్రసిద్ధుడు.

C

ఈ క్రింది ప్రశ్నలకు క్లుప్తముగ జవాబుల నిమ్ము.

1. పిరమిడ్లనగా నేమి ?
2. గ్రేట్ పిరమిడ్‌ను నిర్మించిన దెవరు ?
3. సుమేరియను నాగరికతయందు ప్రముఖ అంశమేది ?
4. Sun-dial ను కనిపెట్టినవా రెవరు ?
5. ఆకాశవనములు (Hanging gardens) గల్గిన పట్టణమేది ?
6. చీనాదేశమున కాగితపు పే రెట్లు కల్గెను ?
7. ఏవంశరాజుల కాలమున చీనాయందు బౌద్ధమతము ప్రవేశపెట్టబడినది ?
8. చీనాదేశ మహాజ్ఞాను లెవరు ?
9. తుపాకిమందును కనిపెట్టిన దేశమేది ?
10. జైనమత శాఖ లెవ్వి ?
11. అర్థశాస్త్ర రచయిత ఎవరు ?
12. హర్షుడు రచించిన గ్రంథము లెవ్వి ?
13. ప్రభుత్వవిధానముపై స్పార్టనుల అభిప్రాయమెద్ది ?
14. పెరికిల్స్ యుగమున ప్రముఖ చరిత్రకారు లెవరు ?
15. గ్రీకుల ప్రముఖ వేదాంతి యెవరు ?
16. ప్యూనిక్ యుద్ధముల ముఖ్యకారణ మేమి ?

17. క్రైస్తవమతమును స్వీకరించిన మొదటి రోమనుచక్రవర్తి యెవరు ?
18. రోముపై దండెత్తివచ్చిన హూణనాయకు డెవరు ?
19. రోడ్ల నిర్మాణమునకు ప్రారంభకు లెవరు ?
20. తుది టాలమీ ఎవరు ?

D

ఈ క్రిందివానిని జతచేయుము.

| | | |
|---|---|---|
| 1. | (a) ఫినీషియనులు | బంగారు నాణెములు |
| | (b) లిడియానులు | ఇనుప ఆయుధములు |
| | (c) హీబ్రూలు | పట్టువస్త్రములు |
| | (d) హిటైటులు | అక్షరమాలనము |
| | (e) చీనావారు | జుడాయిజము |
| | (f) కాల్డియనులు | |
| | (g) మైసీనియనులు | |
| | (h) మినోవనులు | |
| 2. | (a) కనిష్కుడు | నవరత్నములు |
| | (b) అశోకుడు | కౌటిల్యుడు |
| | (c) శ్రీహర్షుడు | ధర్మమహామాత్యులు |
| | (d) చంద్రగుప్తమౌర్యుడు | హైందవనెపోలియన్ |
| | (e) సముద్రగుప్తుడు | గాంధారరాజు |
| | (f) పోరుడు | |
| | (g) బాణుడు | |
| | (h) చంద్రగుప్త-విక్రమాదిత్యుడు | |

రెండవ భాగము

PART I

1. ఇస్లాంమతోద్భవమువలన అరబ్బుల మత, సాంఘిక, రాజకీయ విషయములం దుత్పన్నమైన మార్పులను తెల్పుము.
2. "ఇస్లాం సంస్కృతి విభిన్న సంస్కృతుల సమ్మేళనము." వివరింపుము.
3. ఇస్లాంమత శీఘ్రవ్యాప్తికి గల కారణములను తెల్పుము.
4. క్రూసేడులనగా నేమి ? అవి జరుపబడుటకు కారణములను తెల్పుము.
5. క్రూసేడుల వలన ఫలితములను పేర్కొనుము.

6. పటమున ఈక్రిందివానిని గుర్తింపుము.

(1) క్రీ. శ. 750 లో మహమ్మదీయ సామ్రాజ్యము (2) డమాస్కస్ (3) కార్డోవా (4) జిబ్రాల్టర్ (5) కెయిరో (6) మక్కా (7) మదీనా (8) బాగ్దాదు (9) గజనీ (10) క్రూసేడుమార్గములు (11) ఖైబర్ (12) ఆక్రి.

7. భారతదేశముపై అరబ్బుల దండయాత్రా ఫలితము లెవ్వి ?

8. బానిసవంశ స్థాపన ఎట్లు జరిగెను ? ఆ వంశమున ప్రసిద్ధులగు ఇద్దరు సుల్తానులను గురించి వ్రాయుము.

9. అల్లాఉద్దీన్ ఖిల్జీ గొప్ప పరిపాలనాదక్షు డని యెట్లు చెప్పగలవు ?

10. మహమ్మద్ బిన్ తుగ్లక్ పిచ్చివాడని చెప్పదగునా ? నీ జవాబునకు కారణములను తెల్పుము.

11. ఢిల్లీసామ్రాజ్యపతనమునకు కారణములను తెల్పుము.

12. బహమనీ రాజ్యాభ్యుదయమునకు మహమూద్ గవాన్ సల్పిన కృషిని సమీక్షించుము.

13. విజయనగరసామ్రాజ్య వైభవమును వర్ణింపుము.

14. శ్రీకృష్ణదేవరాయల ఘనత యెట్టిది ?

15. హిందూసంస్కృతిపై ఇస్లాం ప్రభావమును వివరింపుము.

16. మధ్యయుగమున ఫ్యూడలు వ్యవస్థ యేర్పడుటకు కారణము లెవ్వి ?

17. ఫ్యూడలిజ మనగా నేమి ? దానిలోని గుణదోషములను తెల్పుము.

18. ఫ్యూడలిజ పతనమునకు కారణము లెవ్వి ?

19. పవిత్ర రోమనుసామ్రాజ్య మెట్లు ఆవిర్భవించెను ? షార్లమాన్ ప్రతిభ యెట్టిది ?

20. పోపు, రోమనుచక్రవర్తుల వైషమ్యకారణము లెవ్వి ? ఆ వైర మెట్లు అంత మొందెను ?

## PART II

### A

ఈ క్రింది ప్రశ్నల కివ్వబడిన జవాబులలో సరియైనదానిని గుర్తింపుము :

1. జెహాద్ అనగా

(*a*) ఒకపన్ను (*b*) మహమ్మదీయులు ఇతరమతస్థులపై సల్పు యుద్ధము (*c*) క్రైస్తవ మహమ్మదీయ యుద్ధము (*d*) అరేబియాలోని పట్టణము (*e*) ఒక ఖలీఫా.

2. ఇస్లాం త్వరితగతిని వ్యాపించుటకు ముఖ్యకారణము
(*a*) మతము సరళమై సులభగ్రాహ్యమైయుండుట (*b*) ఆర్థిక సమాన త్వము (*c*) సర్వమానవ సమానత్వ సిద్ధాంతము (*d*) కత్తిబలమును ప్రయోగించుట (*e*) ధనకాంక్ష.

3. అరబ్బులు అధిక ప్రావీణ్యత గడించిన శాస్త్రము
(*a*) వాస్తుశాస్త్రము (*b*) వైద్యశాస్త్రము (*c*) గణితము (*d*) రసాయనిక శాస్త్రము (*e*) నృత్యశాస్త్రము.

4. అబ్బాసిద్ ఖలీఫాలలో సుప్రసిద్ధుడు
(*a*) ఉమర్ (*b*) అల్‌మన్సూర్ (*c*) హరూన్ అల్‌రషీద్ (*d*) అబుల్ అబ్బాస్ అల్‌సఫా (*e*) హాసన్.

5. క్రూసేడులవలని ముఖ్యఫలితము
(*a*) జెరూసలెమ్ క్రైస్తవుల వశమయ్యెను (*b*) ప్రాక్పశ్చిమములకు వర్తకాభివృద్ధి యయ్యెను (*c*) ధననష్టము (*d*) పోపు అధికారము హెచ్చెను (*e*) జాతీయభావము పెంపొందెను.

6. రెండవ స్థానేశ్వర యుద్ధము
(*a*) 1602 (*b*) 1206 (*c*) 1026 (*d*) 1526 (*e*) 1556.

7. బానిసవంశ స్థాపకుడు
(*a*) మహమ్మద్ ఘోరీ (*b*) కుతుబుద్దీన్ (*c*) ఆల్టమష్ (*d*) అల్లాయుద్దీన్ (*e*) బాల్బన్.

8. శ్రీకృష్ణదేవరాయలు రచించిన గ్రంథము
(*a*) భువనవిజయము (*b*) మనుచరిత్ర (*c*) ఆముక్తమాల్యద (*d*) పాండురంగమహాత్మ్యము (*e*) వసుచరిత్ర.

9. భక్తితత్వమును బోధించిన మహమ్మదీయుడు
(*a*) నానక్ (*b*) అక్బరు (*c*) అమీర్‌ఖుస్రూ (*d*) కబీరు (*e*) చైతన్యుడు.

10. ఫ్యూడలిజములోని ముఖ్యలోపము
(*a*) భూస్వాములు బలవంతులగుట (*b*) రైతు బానిసయగుట (*c*) వర్తక వ్యాపారములు క్షీణించుట (*d*) రాజ్యములు చిన్నచిన్న భాగములగుట (*e*) జాతీయభావము క్షీణించుట.

## B

ఈ క్రిందివాక్యములను పూరింపుము :

1. మహమ్మదీయులు మక్కాయందు — పూజింతురు.
2. అబ్బాసీద్ ఖలీఫాలకు — రాజధాని.
3. మహమ్మద్ గజనీ ఆస్థానకవులలో — సుప్రసిద్ధుడు.
4. క్రూసేడులవలన యూరపునందు — వ్యవస్థ పతనమయ్యెను.
5. మూడవ క్రూసేడునందు — బ్రిటిష్ రాజు పాల్గొనెను.
6. మొదటి స్థానేశ్వరయుద్ధమున — విజయమందెను.
7. దక్షిణ హిందూస్థానముపై దండెత్తిన ముస్లింసేనాని — .
8. — కడపటి ఢిల్లీ సుల్తాను.
9. విజయనగరసామ్రాజ్యము — చే స్థాపింపబడెను.
10. — యుద్ధముతో విజయనగరసామ్రాజ్య వైభవ మంతరించెను.
11. హిందూముస్లిం సంస్కృతీ ఐక్యచిహ్నముగ — భాష వెలసెను.
12. యూరపునందు ఫ్యూడలు వ్యవస్థ ఏర్పడుటకు — ముఖ్యకారణము.
13. ఫ్యూడలు వ్యవస్థయందు — అను యోధు లుండెడివారు.
14. — ప్రథమ పవిత్ర రోమను చక్రవర్తి.
15. పోపు చక్రవర్తుల వైషమ్యము — అను చక్రవర్తి కాలమున ప్రారంభమయ్యెను.

## C

ఈ క్రింది ప్రశ్నలకు క్లుప్తముగ జవాబుల నిమ్ము :

1. ఇస్లాం మత స్థాపకు డెవరు ?
2. ప్రథమ ఖలీఫా యెవరు ?
3. స్పెయిన్‌పై దండయాత్ర జరిపిన అరబ్బీనాయకు డెవరు ?
4. కార్డోవా సామ్రాజ్య స్థాపకు డెవరు ?
5. అరేబియన్ నైట్స్ కథలు ఎవరికాలమున వెలువడెను ?
6. క్రూసేడు లనగా నేమి ?
7. క్రూసేడులయందు ప్రతిభజూపిన శారసిన్ నాయకు డెవరు ?
8. భారతదేశముపై అరబ్బుల దండయాత్రవలన ముఖ్యఫలిత మేమి ?
9. భారతదేశము నేలిన ముస్లిం వనిత యెవరు ?
10. అల్లాయుద్దీన్ ముఖ్యసంస్కరణ యెద్ది ?
11. దౌలతాబాదు రాజధానిగ జేసికొని పాలించిన ఢిల్లీసుల్తా నెవరు ?

12. బహమనీ రాజ్యస్థాపకు డెవరు ?

18. ఫ్యూడలు వ్యవస్థ పతనమగుటకు ముఖ్యకారణ మేమి ?

14. రోమను చక్రవర్తియగు హెన్రీ IV తో వైరమునకు దిగిన పోపు ఎవరు ?

15. పోపు - చక్రవర్తి వైషమ్యముల ఫలితమేమి ?

## D

ఈ క్రిందివానిని జత చేయుము.

| | | |
|---|---|---|
| 1. | (*a*) పార్లమాన్ | మొదటి క్రూసేడు |
| | (*b*) గ్రిగరీ | ప్రథమ రోమనుచక్రవర్తి |
| | (*c*) ఫ్రెడరిక్ బార్బరోసా | మొదటి ఖలీఫా |
| | (*d*) అర్బన్ II | కెయిరోపట్టణ నిర్మాత |
| | (*e*) అబు బకర్ | కార్డోవా రాజ్య స్థాపకుడు |
| | (*f*) ఉమర్ | |
| | (*g*) ఉస్మాన్ | |
| | (*h*) అబ్దుర్ రహమాన్ | |
| 2. | (*a*) సింధుపై దండయాత్ర | క్రీ. శ. 622 |
| | (*b*) హిజరా | ,, 1097 |
| | (*c*) తళ్ళికోట యుద్ధము | ,, 712 |
| | (*d*) మంజీకర్ట్ యుద్ధము | ,, 1347 |
| | (*e*) మొదటి క్రూసేడు | ,, 1565 |
| | (*f*) బానిసవంశ స్థాపన | |
| | (*g*) బహమనీరాజ్య స్థాపన | |
| | (*h*) విజయనగర సామ్రాజ్య స్థాపన | |

## మూడవ భాగము

## PART I

1. క్రీ. శ. 15 వ శతాబ్దమున యూరపునందు వ్యాపించిన రినైజాన్స్ ఉద్యమమును గురించి వ్రాయుము.

2. రిఫర్మేషన్ అనగా నేమి ? ఆ ఉద్యమ ఫలిత మేమి ?

3. నవీనయుగారంభమున భౌగోళిక పరిశోధన లేల జరుపవలసివచ్చెను ? వాని కనుకూల పరిస్థితు లేవి ?

4. క్రీ. శ. 15, 16 శతాబ్దములలో గావింపబడిన భౌగోళిక పరిశోధనలనుగూర్చి వ్రాయుము.
5. అక్బరు పరిపాలనా విధానమునుగూర్చి వ్రాయుము.
6. షాజహాను పరిపాలనాకాలము మొగలుల స్వర్ణయుగమని యెట్లు చెప్పవచ్చును?
7. మొగలుసామ్రాజ్య పతనమునకు కారణము లెవ్వి ?
8. మొగలుసామ్రాజ్య పతనమునకు ఔరంగజీ బెంతవరకు బాధ్యుడు ?
9. స్టూవర్టురాజుల కాలమున రాజునకు పార్లమెంటునకు గల వైరకారణము లెవ్వి ?
10. ప్రశాంత విప్లవమనగా నేమి ? దాని ఫలిత మేమి ?
11. ఇంగ్లండునందు పార్టీప్రభుత్వ మెట్లు స్థిరపడినది ?
12. అమెరికా విప్లవకారణము లేవి ?
13. ఫ్రెంచి విప్లవకారణములను సంగ్రహముగ వ్రాయుము.
14. నెపోలియన్ ప్రతిభను వర్ణింపుము.
15. నెపోలియన్ ఎట్లు పతన మొందెను ?
16. "నెపోలియన్ యుద్ధనిర్వహణయందేగాక పరిపాలనయందును ప్రతిభాశాలి" వివరింపుము.
17. ఇంగ్లండులో పారిశ్రామిక విప్లవ ఫలితముల సమీక్ష నిమ్ము.
18. బ్రిటిష్ పార్లమెంటును ఏల సంస్కరింపవలసి వచ్చెను ?
19. బ్రిటిష్ పార్లమెంటు ఆదర్శప్రాయమైనదిగ ఎట్లు రూపొందెను ?
20. 19 వ శతాబ్దమున జర్మనీ ఐక్యత ఎట్లు సాధింపబడెను ?
21. ఇటలీ ఐక్యతకు కృషిచేసిన మహాపురుషు లెవరు ? వారి కృషి యెట్టిది ?
22. టర్కిష్ సమస్య (Eastern Question) యూరపు రాజ్యముల నెట్లు కలవర పరిచెను ? ఫలిత మేమి ?
23. జపాను ఆధునిక రాజ్యముగ ఎట్లు రూపొందెను ?
24. చైనాలో ప్రజాస్వామిక ప్రభుత్వ మెట్లు స్థాపింపబడెను ?
25. భారత స్వాతంత్ర్యోద్యమములోని ముఖ్య ఘట్టములను పొందుపరచుము.
26. బ్రిటిష్‌వారు తమ పరిపాలనాకాలమున భారతీయులకు స్వపరిపాలనాధికార మును ఎట్లు, ఎంతవరకొసగిరో సంగ్రహపరుపుము.
27. మొదటి ప్రపంచ యుద్ధకారణము లెవ్వి ?
28. రష్యాలో కమ్యూనిస్టుప్రభుత్వ మెట్లేర్పడినది? రష్యా సాధించిన విజయము లెవ్వి?
29. చైనాలో కమ్యూనిజ మెట్లు ప్రవేశించెను ?

30. నాజీప్రభుత్వమున జర్మనీ, ఫాసిస్టుప్రభుత్వమున ఇటలీ సాధించిన అభివృద్ధిని సమీక్షింపుము.

31. రెండవ ప్రపంచయుద్ధకారణము లెవ్వి ?

32. శాంతిసాధనకై నానాజాతి సమితి చేసిన కృషి యెట్టిది ? సమితి వైఫల్యమునకు కారణమేమి ?

33. ఐక్యరాజ్యసమితి ముఖ్యాంగము లెవ్వి ? దాని ఆశయమేమి ? ఆ ఆశయము సిద్ధించుటకుగల అవకాశము లెవ్వి ?

34. "ప్రపంచము - ఏకరాజ్యము" దీని సాధ్యాసాధ్యములను చర్చించుము.

## PART II

### A

ఈ క్రింది ప్రశ్నలకు గల జవాబులలో సరియైనదానిని గుర్తింపుము.

1. రినైజాన్సు కవి

   (*a*) హోమరు (*b*) ఇరాస్మస్ (*c*) ప్లినీ (*d*) వర్జిల్ (*e*) కీట్సు

2. మతోద్ధరణ ఉద్యమ మూలకారణము

   (*a*) మతాధికారులలో అవినీతి (*b*) ఇండల్జెన్సు పత్రముల అమ్మకము (*c*) చర్చిభూములను వశపరచుకొనవలెనను ధనకాంక్ష (*d*) రాజుల స్వలాభాపేక్ష (*e*) రినైజాన్సు ఉద్యమము

3. కౌంటరు రిఫర్మేషన్ ఉద్యమకర్త

   (*a*) ఇగ్నేషస్ లయోలా (*b*) థామస్ మోరు (*c*) జాన్ విక్లిఫ్ (*d*) కాల్విన్ (*e*) లూథరు

4. ప్రపంచ ప్రదక్షిణ గావించిన కీర్తిని పొందిన నావికుడు

   (*a*) కొలంబస్ (*b*) మంగోపార్కు (*c*) మార్కోపోలో (*d*) జాన్ కాబట్ (*e*) మాజిలాన్

5. వలసరాజ్యముల స్థాపనలో ప్రథములు

   (*a*) ఫ్రెంచివారు (*b*) పోర్చుగీసువారు (*c*) స్పెయిన్ వారు (*d*) డచ్చివారు (*e*) ఆంగ్లేయులు

6. మొగలు రాజ్యస్థాపన

   (*a*) కణ్వాహాయుద్ధము (*b*) మొదటి పానిపట్టుయుద్ధము (*c*) రెండవ పానిపట్టుయుద్ధము (*d*) గోగ్రాయుద్ధము (*e*) స్థానేశ్వరయుద్ధము.

7. ఔరంగజేబుచే చంపబడిన సిక్కు గురువు

   (*a*) నానక్ (*b*) గోవిందసింగు (*c*) అర్జునసింగు (*d*) తేజ్ బహదూర్ (*e*) బందా

8. మింగ్ వంశ రాజులలో సుప్రసిద్ధుడు
(*a*) హూంగ్ వూ (*b*) యంగ్‌చంగ్ (*c*) యంగ్ లో (*d*) చియన్ లంగ్ (*e*) కంగ్ హి

9. ప్రజలచే శిరచ్ఛేదము గావింపబడిన రాజు
(*a*) ఛార్లెస్ I (*b*) ఛార్లెస్ II (*c*) క్రాంవెల్ (*d*) జేమ్సు I (*e*) జేమ్సు II

10. ప్రథమ బ్రిటిష్ ప్రధానమంత్రి
(*a*) బాల్డ్విన్ (*b*) గ్లాడ్‌స్టన్ (*c*) వాల్పోల్ (*d*) లాయడ్ జార్జి (*e*) వెంట్ వర్తు

11. నెపోలియన్ పతనమునకు ముఖ్యకారణము
(*a*) ట్రఫాల్గర్ యుద్ధము (*b*) చక్రవర్తిత్వమును బడయుట (*c*) కాంటినెంటల్ పద్ధతి (*d*) రష్యాపై దండయాత్ర (*e*) ప్రజలలో జాతీయ భావము నణచుట.

12. జర్మనీ ఐక్యతకు కారకుడు
(*a*) విల్‌హెల్మ్ (*b*) ఇమాన్యూల్ (*c*) కైజరు (*d*) బిస్మార్కు (*e*) కవూరు

13. రాష్ట్రములలో ద్వంద్వప్రభుత్వమును ప్రవేశపెట్టిన చట్టము
(*a*) రెగ్యులేటింగ్ చట్టము (*b*) మింటో మార్లే సంస్కరణలు (*c*) మాంటేగ్ ఫర్డు సంస్కరణలు (*d*) 1935 ఇండియా ప్రభుత్వ చట్టము (*e*) 1892 కౌన్సిల్సు చట్టము

14. మొదటి ప్రపంచయుద్ధ తక్షణ కారణము
(*a*) ఆస్ట్రియా - సెర్వియా కలహము (*b*) జర్మనీ సామ్రాజ్య కాంక్ష (*c*) బ్రిటన్ యూరపునందు ప్రముఖపాత్ర వహింపదలచుట (*d*) వర్తక పోటీ (*e*) ప్రాచీన వలసవిధానము

15. ఐక్యరాజ్యసమితి విజయవంతమగుటకు గల అవకాశము
(*a*) అమెరికా సంయుక్త రాజ్యములు సభ్యత్వము నొందుట (*b*) అగ్ర రాజ్యములందు రష్యా యుండుట (*c*) సైనికబలమును కలిగియుండుట (*d*) ప్రపంచ రాజ్యములు యుద్ధములతో విసిగియుండుట (*e*) యుద్ధమువలన సర్వనాశన మగునని భయము.

## B

ఈ క్రిందివాక్యములను పూరింపుము.

1. ఇండెక్సు అనగా —.
2. బార్తలోమ్యూడయ్యాజ్ దక్షిణాఫ్రికా అగ్రమునకు — అని పేరిడెను.
3. బ్రిటిష్‌వారికి కెనడా — యుద్ధమువలన లభించెను.

4. అక్బరు —— అను మతమును ప్రబోధించెను.

5. జహాంగీరు కాలమున మొగలు దర్బారును దర్శించిన ఆంగ్లరాయబారి ——.

6. ఇంగ్లండులో అంతర్యుద్ధమును దిగ్విజయముగ నడిపిన నాయకుడు ——.

7. అమెరికన్లు మాతృదేశముపై యుద్ధమునకు దిగుటకు —— ముఖ్యకారణము.

8. ఫ్రెంచి విప్లవమునకు ఉత్సాహ ప్రోత్సాహముల నిచ్చిన యుద్ధము ——.

9. నెపోలియన్ —— అను శిక్షాస్మృతి నేర్పరచెను.

10. బ్రిటన్‌లో స్త్రీలకు ఓటుహక్కు నొసగిన ప్రధాన మంత్రి ——.

11. ఇటలీ ఐక్యతనుగూర్చి ప్రచారమొనరించిన తత్వవేత్త ——.

12. ఒకే తెగకు చెందియుండుటచే బాల్కన్ రాజ్యములకు —— సహాయముగ వచ్చెను.

13. జపానునందు పారిశ్రామిక విప్లవమును సాధించిన మికడో ——.

14. క్యుమింగ్‌టాంగ్ పార్టీ స్థాపకుడు ——.

15. ముస్లింలీగ్ స్థాపకుడు ——.

16. —— సంవత్సరమున భారతజాతీయ కాంగ్రెస్ స్థాపింపబడినది.

17. నానాజాతిసమితి ముఖ్య కార్యాలయము —— నందు నెలకొల్పబడెను.

18. ఐక్యరాజ్యసమితి —— తేదిన స్థాపింపబడెను.

19. UNESCO అనగా ——.

20. ఐక్యరాజ్యసమితియందు భారతదేశ ముఖ్య ప్రతినిధి ——.

## C

ఈ క్రింది ప్రశ్నలకు క్లుప్తముగ జవాబుల నిమ్ము.

1. రినైజాన్స్ అనగా నేమి?

2. కౌంటర్ రిఫర్మేషన్ అనగా నేమి?

3. భూభ్రమణ సిద్ధాంతమును కనిపెట్టిన శాస్త్రజ్ఞు డెవరు?

4. ఇంక్విజిషన్ (Inquisition) అనగా నేమి?

5. కొలంబసునకు సాయపడిన రాజదంపతు లెవరు?

6. సముద్రపు దొంగలు (Sea-Dogs) అని పేరుపొందిన నావికు లెవరు?

7. అక్బరునకు లొంగని రజపుత్రవీరు డెవరు?

8. అక్బరునకు రెవెన్యూ విషయములందు తోడ్పడిన మంత్రి ఎవరు?

9. సైనిక విషయములందు అక్బరు అనుసరించిన విధానమేమి?

10. అక్బరు ఆస్థానములోని పారశీక పండితు లెవరు?

11. చీనా జపానులందు క్రైస్తవ మతమును ప్రవేశపెట్ట యత్నించిన మతప్రచారకు డెవరు?

12. నల్లమందుయుద్ధ మెవ రెవరికి జరిగెను ?
13. అమెరికా విప్లవమునకు ముఖ్యకారణ మేమి ?
14. బోస్టన్ టీపార్టీ అనగా నేమి ?
15. అమెరికా స్వాతంత్ర్య యుద్ధనాయకు డెవరు ?
16. ఫ్రెంచి విప్లవమునకు చేయూత నిచ్చిన ఫ్రెంచి విద్వాంసు లెవరు ?
17. ఫ్రెంచి విప్లవ మెప్పుడు ప్రారంభ మయ్యెను?
18. రాక్షసప్రభుత్వము (Reign of Terror) నకు కారకుడయిన జాకొబిన్ నాయకు డెవరు ?
19. నెపోలియన్ నోడించిన ఆంగ్ల సేనాని యెవరు ?
20. కాంటినెంటల్ పద్ధతి అనగా నేమి ?
21. స్పిన్నింగ్ జెన్నిని కనిపెట్టిన దెవరు ?
22. ప్రపంచమున మొదటి రైలుమార్గ మేది ?
23. బ్రిటిష్ పార్లమెంటు ప్రథమ సంస్కరణ శాసనమును ప్రవేశపెట్టిన ప్రధాన మంత్రి ఎవరు ?
24. చార్టిస్టు లనగా నెవరు ?
25. బిస్మార్కు రాజనీతి కేమని పేరు ?
26. గారిబాల్డి ఎవరు ?
27. ఇటలీలో ఫాసిస్టుపార్టీ స్థాపకు డెవరు ?
28. హోమ్‌రూల్ లీగ్ స్థాపకు లెవరు ?
29. నానాజాతిసమితి ఎప్పుడు స్థాపింపబడెను ?
30. ఐక్యరాజ్యసమితి నిర్మాణ కర్త లెవరు ?

## D

ఈ క్రిందివానిని జత చేయుము.

| | |
|---|---|
| 1. (*a*) ప్రముఖ చిత్రకారుడు | లియోనార్డోడవిన్సి |
| (*b*) రినైజాన్సు శిల్పి | మెకైవలి |
| (*c*) వ్యంగ్యరచయిత | జాన్ వైక్లిఫ్ |
| (*d*) భూగోళశాస్త్రజ్ఞుడు | షేక్స్పియర్ |
| (*e*) తత్త్వవేత్త | ఇరాస్మస్ |
| (*f*) ఆంగ్లకవి | |
| (*g*) రాజ్యాంగ శాస్త్రజ్ఞుడు | |
| (*h*) ఆంగ్ల మతసంస్కర్త | |

| | | |
|---|---|---|
| 2. | (a) కాంటినెంటల్ పద్ధతి | బిస్మార్కు |
| | (b) దక్కను విధానము | స్టూవర్టులు |
| | (c) మన్సబ్‌దారీ పద్ధతి | అమెరికా విప్లవము |
| | (d) ప్రాచీన వలస విధానము | అక్బరు |
| | (e) సాంఘిక అసమానత్వము | నెపోలియన్ |
| | (f) Blood and Iron Policy | |
| | (g) ఏకాంతవాసము (Isolation) | |
| | (h) దైవాంశసంభూతత్వము | |
| 3. | (a) బెంగాలు విభజన | 1905 |
| | (b) క్విట్ ఇండియా తీర్మానము | 1920 |
| | (c) సైమన్ కమిషన్ | 1930 |
| | (d) జలియన్‌వాలాబాగ్ హత్యలు | 1939 |
| | (e) ముస్లిమ్‌లీగ్ స్థాపన | 1942 |
| | (f) దండి యాత్ర | |
| | (g) సహాయ నిరాకరణోద్యమము | |
| | (h) వ్యక్తి సత్యాగ్రహము | |
| 4. | (a) కొలంబసు అమెరికా చేరుట | 1688 |
| | (b) మాజిలాన్ ప్రపంచయాత్ర | 1776 |
| | (c) ప్రశాంత విప్లవము | 1492 |
| | (d) బ్రిటిష్ పార్లమెంటు మొదటి సంస్కరణ చట్టము | 1912 |
| | (e) అమెరికా స్వాతంత్ర్య ప్రకటన | 1945 |
| | (f) బాస్టైలు ముట్టడి | |
| | (g) చైనాలో ప్రజాస్వామ్య ప్రభుత్వము | |
| | (h) ఐక్యరాజ్య సమితి స్థాపన | |

